# కుమారభారతి దర్శనం



తెలుగు విశ్వవిద్యాలయంవారి
ఆర్థిక సహాయంతో ముద్రితం



డా॥ ఆదవాని హనుమంతప్ప

కార్తికేయ పబ్లికేషన్స్
అనంతపురం

# కుమారభారతి దర్శనం

తెలుగు విశ్వవిద్యాలయంవారి
ఆర్థిక సహాయంతో ముద్రితం



డా॥ ఆదవాని హనుమంతప్ప

కార్తికేయ పబ్లికేషన్స
అనంతపురం

'Kumaara Bharati Darsanam'' a Part of the
Post doctoral work of Dr. Adavani Hanumanthappa,
Research Associate, Andhra Bharati
Sri Krishnadevaraya University, Anantapur - 515033.

ప్రథమ ముద్రణ : 1993
ప్రతులు : 1000



ప్రతులకు :
కార్తికేయ పబ్లికేషన్స్
**శ్రీమతి ఎ. వెంకటేశ్వరి ప్రసూన**
5-29, ఇంజనీరింగ్ కాలేజి
అనంతపురం - 515 002.

వెల : **రు. 45.00**

ముద్రణ :
‘ముముక్షువు’
పెదముత్తివి.

# సమర్పణం

నిత్యకుమారతారూపుడైన

సుబ్రహ్మణ్యస్వామి

పాదపద్మములకు సమర్పితం

# విషయానుక్రమణిక

# సంకేత వివరణ

| | | |
|---|---|---|
| ప్ర. క | : | ప్రథమ కమలము |
| ద్వి. క | : | ద్వితీయ కమలము |
| తృ. క | : | తృతీయ కమలము |
| చ. క | : | చతుర్థ కమలము |
| పం. క | : | పంచమ కమలము |
| ష. ప్ర | : | షష్ఠకమలము - ప్రథమదళము |
| ష. ద్వి | : | షష్ఠకమలము - ద్వితీయదళము |
| చూ. | : | చూడుు |

# కుమారభారతీ దర్శనం

## మహాప్రసాదం

కవి ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు రచియించిన 'కుమారభారతి' కావ్యం తెరవగానే 'మహాప్రసాదం' పేరిట శ్రీ వేంకటేశ్వరుని ప్రస్తుతిస్తూ రచించిన అయిదు పద్యాలు కనిపిస్తాయి. రచన- భావ దృష్ట్యా అవి చాలా అందమైనవి కావటం వల్ల - ఈ పద్యాలలో ఇమిడిఉన్న మధుర భక్తిభావ సౌందర్యాన్ని వివరించటం ఈ వ్యాసోద్దేశం.

నీలస్నిగ్ధము కాశచామరసమున్మేషంబు, చంద్రార్క నే
త్రాలంకారము, విశ్వనాభి నళినీరమ్యంబు, మాయాజగత్
శ్రీలాంగూలము, చండవామన, మలక్ష్మ్రభావ గాఢాంధకా
రాలుంటాకము, వేంకటాభిధమహస్సైన్ మమ్ము రక్షించుతన్. 1

ఈ పద్యంలో వేంకటేశ్వరుని కొనియాడుతూ ఏడు విశేషణాలు ఉన్నాయి. ఆ విశేషణాలు ఏడూ - ఏడుకొండలకు ప్రతీకలు. విశేషణార్థం ఏడుకొండలవాని స్వరూప స్వభావ ద్యోతకాలైన వర్ణనాత్మక విశేషాలు. (1) నీలస్నిగ్ధము = చిక్కని నీలకాంతిగలవాడు. నీలిరంగు అనంతతత్త్వానికి సంకేతం. అంటే అతడు అనంతుడు. అంతులేనివాడు - అంతటా వ్యాపించిన తత్త్వం. (ఇంకా విస్తృత వివరణకు: చూ. ఎ. హనుమంతప్ప 'మన ఆచారాలు- అంతరార్థాలు' సప్తగిరి : జూన్ 1981). (2) కాశచామర సమున్మేషంబు = స్వచ్ఛమైన రెల్లుపువ్వువంటి తెల్లని శుభ్రమైన కాంతితో ప్రకాశించేవాడు. రెల్లుపువ్వులాగా వికసించింది అని అర్థం. ఇది కుమారస్వామి కథన

వ్యంజిస్తుంది. ఈ కావ్యం కుమారస్వామి కథను తెలిపే కావ్యం కాబట్టి, కవి ఈ విశేషణం ద్వారా ఈ సంగతి చెప్పాడు. సృష్టి అంటే కుమారుడు. రామాయణ మహాభారతాలకంటే కూడా, కుమారస్వామి కథ చాలా పురాతనమైనది. కుమార తత్త్వమనేది సృష్టియొక్క వికాసం. విశ్వనిర్మాణ సూత్రము. కుమారస్వామి కథ నిత్య కథ తప్ప, ఎప్పుడో జరిగిపోయింది కాదు. తండ్రి తాను కుమారుడుగా పరిణమిస్తున్నాడు - ట్రాన్స్‌ఫర్ అవుతున్నాడు (సా. అభిషేకగాథ). జననం అంటే మానవుడు తన్ను తాను విస్తరించుకోవడం. తన్ను విస్తరించుకుంటే కుమారుడు వస్తాడు (సృష్టి వస్తుంది). ప్రతిమనిషీ తనదాకా చాలుతే అనకుంటే ఏమీ లేదు. సృష్టే లేదు. అంచేత కుమారస్వామి కథ అంటే తన కథ - అంటే ప్రతిమానవుడి కథ. అందుకే అది నిత్యకథ అయింది. ప్రకృతికి విస్తరించడం, కుదింపబడడం అనేవి రెండు ధర్మాలు ఉన్నాయి. అవే సంకోచవ్యాకోచాలు. మనకు తెలియకుండా మన తర్వాత వ్యక్తిని నిలుపుతుంది. అందుకని కుమారస్వామి అంటే ప్రిన్సిపుల్ ఆఫ్ క్రియేషన్ (సృష్టిసూక్తం - సూత్రం). సృష్టి అంటే కుమారుడు అని అర్థం. సృష్టిధర్మ రహస్యాన్ని ఏదైనా వంక పెట్టుకొని చెప్పాలి. నెపం పెట్టుకొని చెప్పాలి. నెపం లేకపోతే శాస్త్రం అవుతుంది. ఇదంతా ఎవరికథ ?- అంటే చదివేవాడి కథే. నా తర్వాత ఏమిటి (ఫర్దరెన్స్ ఆఫ్ లైఫ్) ? అంటే నా ప్రతినిధి - కుమారుడు. ఇది విశ్వనిర్మాణ సంబంధమైన సూత్రం కనుక, ఎప్పుడో జరిగిపోయింది అనడానికి వీలులేదు. ఇది నిత్యకథ. నీలస్నిగ్ధమైన ఆదిమ తేజస్సు - బీజం రెల్లుపువ్వులాగా వికసించింది. అంటే సృష్టి జరిగింది - బీజం వృక్షమైనదని భావం. (3) చంద్రార్క నేత్రాలంకారము = విశ్వగమన హేతువులైన రెండు జ్యోతిస్సులు- చంద్ర-సూర్యబింబాలే అతనికి నేత్రాలు - ఇది విరాట్స్వరూప వర్ణన (4) విశ్వనాభి పరిసరమ్యంబు = భగవంతుని శరీరమే విశ్వం.

ఎక్కడో ఒక చోట కేంద్రం (సెంటర్) ఉండాలి. విశ్వ
ృత్తాకార పరిభ్రమణం చేస్తుంది. కనుక కేంద్రం ఎక్కడో
ఉంది. కేంద్రబిందువు (సెంటర్ పాయింట్) దగ్గర కెళ్ళి
ంతా పరికిస్తే ఆ విశ్వమంతా నళినీరమ్యంగా కనిపిస్తుంది.
రవ్వలుగా అందంగా కనిపిస్తుంది. ఆ కేంద్రబిందువు
విశ్వమనే వృత్తం గీయబడింది - మామూలర్థం అలా వ
మలముంది (మణిపూరక చక్రం నాభిస్థానంలో ఉంటుంది).
తాత్విక నిరూపణ. (5) మాయాజగత్ శ్రీ లాంగూలమ =
మాయ అని మామూలుగా అంటూ ఉంటాము. అంటే
? మాయ అంటే కావ్యార్థం వేరు; శాస్త్రీయమైన అర్థం
యా అంటే ఇవ్వాళ శాస్త్రీయమైన భాషలో (సైంటిఫిక్
లో) చెప్పాలంటే క్రియేటివ్ పవర్ - సృష్టి శక్తి. ప్రతిభా
పైతే ఆలంకారికులు చెప్పారో అది. సృష్టికర్త ఎవడో
డనుకోండి. వాడు పరమేశ్వరుడనుకుంటే, వాడి మనస్సులో
భాశక్తి మాయ. అది క్రియేటివ్ ఎనర్జీ. సైంటిస్ట్ యొక్క
ననుంచి ఈక్వేషన్ (సమీకరణం) పుడుతుంది. భావం
న్ని ధరించడం పేరు క్రియేషన్ లేదా సృష్టి అంట ం.
త్రణశక్తి. వడ్రంగి ఉన్నాడనుకోండి. వానిముందు ఒక
ద్దు ఉంది. వడ్రంగి మనోభావన ఒక షేప్ (ఆకారం)లోకి
. అదే బొమ్మగా తయారవుతుంది. శ్రీ లాంగూలము -
మైన తోక. మనకు అతిప్రాచీనమైనది వేదము. వేదంలో
ము' అనే మాట ఉంది. బ్రహ్మము - స్వర్గం వీపుపై
భావం. కోతి చెట్టుకొమ్మమీద కూర్చున్నప్పుడు
గా ఎమోషన్స్ లేవు. ఎమోషన్స్ లేనప్పుడు దాని తోక
ర్చి కుర్చొంటుంది. ఎమోషన్స్ వస్తే దాని తోక పైకి
ఏమీ సృష్టిసంబంధమైన సంకల్పంలేని భగవంతుడు కోతి
ని ఇమేజ్‌గా చెప్పవచ్చు. నాకపృష్ఠము అనే కొమ్మ

మీద సృష్టికర్త కూర్చుంటే వాడికి ఎమోషన్స్ లేవు. సృష్టి చేద్దామని వాడు అనుకోలేదు. అది ఒక ఇమేజ్‌గా తీసుకుంటే అందమైన భావం అవుతుంది. భగవంతుడైన విష్ణువుకు 'వృషాకపి' అనే నామముంది. (6) చండవామనము = తీవ్రమైన వామనావతారము - అంటే క్షణక్షణ ప్రవర్ధమాన త్రివిక్రమమూర్తి. (7) అలక్ష్మీభావ గాఢాంధకారాలుంటాకము = అలక్ష్మి అనే చీకటిని పోగొట్టేవాడు (ఆలుంటాకము అంటే కొల్లగొట్టేవాడు అని అర్థం). వేంకటాభిధమహాస్సు = వేంకటేశ్వరుని పేరు ఉచ్చరించిన తోడనే అది మహాసంపన్నమై మమ్ము రక్షిస్తుంది. 'వేంకటాభిధ' అని అనడంలో మంచి ఔచిత్యముంది. వేం = పాపమును (సంస్కృతంలో, వేం - ద్వితీయావిభక్తి), కట = అంటే అపహరించునది- అనగా పాపమును అపహరించేవాడు అని. వేంకట అన్న నామంలోనే ఈ అర్థం ఇమిడి ఉన్నది. ఆ నామం కల జ్యోతిస్సు - పై ఏడు విశేషణాలూ ఏడు రకాల (ఇమేజెస్) ప్రతిమలు. ఏడు విశేషణాల మీద పైకెక్కి వెళ్ళాడు. అప్పుడు వేంకటాభిధమహాస్సై ఆ జ్యోతి కనిపిస్తుంది. ఈ ఏడు సంఖ్యకు పరమార్థ తత్త్వం (వేదాంతం)లో ప్రాముఖ్యముంది. మానవుడి అనాథ లక్షణాలను లేదా అచేతనా లక్షణాలను పోగొట్టి భగవల్లక్షణాలు మానవుడిలో ప్రవేశించి చైతన్య మిస్తాయి. (భగవంతుని ఏడు లక్షణాల ద్వారా మానవుడు ఎలా చైతన్యవంతుడౌతాడు? - దీన్ని గురించిన సమగ్రమైన వివరణకు : చూ. 'తత్త్వగేయాలు - బ్రహ్మసారం' (స్రవంతి : జనవరి 1981).

శ్రీకన్యకాకుచస్విన్న కస్తూరికా
లాలిత శ్రీవత్సలాంఛనంబు
ప్రాతస్సమాయాత పవనాంకురాలోల
వైజయంతీ గంధవైభవంబు

త్రిజగతీ మోహన శ్రీసుధాపరివాహ
లలితవంశీనాళ లాలనంబు
బృందావనీప్రాంత బంధుర శాద్వల
కాళిందిఖేలనాలోలుపంబు

గో కదంబక గోపికా గోప కలిత
భానుజ తటాంచల తమాల వర్తితంబు
శబలిత శిఖండ భూషణోజ్జ్వలిత హాళి
శరణుగావుత మాకు అచ్చమగు వెలుగు. 2

మహాలక్ష్మి వక్షస్థలంపై పూసుకున్న కస్తూరి ముద్రలున్న శ్రీవత్సమన్న పుట్టుమచ్చ కల తేజస్సుగలవాడు (ఆ కస్తూరిముద్రే శ్రీవత్సమన్న పుట్టుమచ్చగా కనిపిస్తున్నదని అర్థం); ప్రాతః కాలంలో వైజయంతీమాలాగంధంతో కూడిన వైభవం కలవాడు; ముల్లోకాలను మురళీగానంతో మోహింపచేసేవాడు; బృందావన ప్రాంతంలో పచ్చికబయళ్ళలో యమునానదివద్ద అత్యంత ఆసక్తిగా ఆడుకొన్నవాడు; గోసమూహాన్ని, గోపికాసమూహాన్ని ఆనందపు టంచులదాకా ముంచెత్తి తేల్చినవాడు; (శబలిత = చిత్రమైన రంగులు కల) చిత్రమైన నానావిధాలైన రంగులు కల నెమలి పింఛము తలపైన ఆభరణముగా గలవాడు అయినట్టి వాని అచ్చమైన వెలుగు మమ్మల్ని కాపాడుగాక ! (నెమలిపింఛం పలురకాలైన రంగుల ప్రపంచానికి సంకేతం).

వరదాభయముద్రా భ
ద్ర రమాయితమూర్తి సమభిరామము త్రిజగత్
భరణాభరణారమణము
శరణమగు తిరుమలాగ్ర చరదర్చిష్మమై. 3

వరదాభయముద్రా=వరదముద్ర అభయముద్రలచేత భద్రమైన సౌభాగ్యరూపం; సమభిరామము = అందమైన సొగసు కలవాడు; త్రిజగత్ = ముల్లోకాలను; భరణాభరణారమణము = పరిపాలనా భారము వహించి రమణు డయ్యాడు. రమణము అనగా అందం, ఇంపు, సంతోషం. 'వేంకటరమణ' అన్న పేరులో 'రమణ' శబ్దం అందాన్ని తెలుపుతుంది. పాపాలను కొల్లగొట్టి జగత్తును సంతోష పరిచేవాడని కూడా ఇంకో అర్థం. అట్టి త్రిజగత్ భరణాభరణా రమణము - తిరుమలకొండ శిఖరాగ్రాల్లో చరించే మహాగ్ని మాకు శరణు కావాలి.

ద్విపద సంచారశీలమౌ త్రిభువనముల
చలనరహితమై, దేవతాజవన దురధి
గమ్య జవసముల్లంఘనాక్రాంతమైన
ప్రభు తృతీయాంఘ్రి నిత్యశరణ్యమగుత. 4

రెండు పాదాలతో చరించే ముల్లోకాలను ఆక్రమించిన ప్రభువుయొక్క తృతీయాంఘ్రి (మూడో పాదం) మాకు రక్షణ మగుగాక ! ఆ పాదము దేవతలయొక్క వేగాన్ని అతిక్రమిస్తుంది. కనుకనే ఆ పాదం మాకు రక్షణ మవుతుందని భావం.

మలకు పాదుషా, పంగనామాలవాడు
వృజినజంతు సంతానంపు వేటకాని
ఫాలపుంద్రపు పచ్చకర్పంపుతావి
గుబులుకొనుగాత హృత్పద్మ కుహరమందు. 5

మలకు పాదుషా అంటే వేంకటాచలపతి. ఇక్కడ కవి 'పాదుషా' అన్న ఉర్దూపదం వాడటం వల్ల మహమ్మదీయులు కూడా ఈయనకు భక్తులయ్యారు - అన్న సూచన ఉంది. వేంకటేశ్వరుడు బీబీనాంచారమ్మను వివాహమాడిన సంగతి అందరికీ తెలిసిందే.

వృజినజంతు సంతానంపు వేటకాని = పాపసమూహాన్ని, దాని సంతానాన్ని-అంటే పాపానికి సంబంధించిన దుష్టకార్యాలను వేటాడే వాడని భావం. తన నోసట పెట్టుకొన్న పచ్చకర్పూరపు సువాసన మా హృదయపద్మముల లోపల వ్యాపించుగాక ! 'హృదయపద్మ కుహరమందు' అనటంవల్ల ఈ సువాసన బహిరంగంగా గుబులు కునేది మాత్రమే కాదు - హృదయ పరివర్తన కలిగించాలని, శ్రీ వేంకటేశ్వరుని పచ్చకర్పూరపు సువాసనకు ఆ మహిమ ఉన్నదని, మా హృదయాలలో కల్మషాలు పోగొట్టి సువాసనలు- అంటే మంచి నడవడి - మాకు అలవడేటట్టు చేయుగాక అని దాని భావం.

స్వామి పచ్చకర్పూరం, గంధం, మహాప్రసాదమని తిరుమలపై లభిస్తుంది. కనుక మహాప్రసాదమంటే అదీ - అలాంటి పద్యాలు. ఆయన కరుణానుగ్రహమే కర్పూరగంధవాసన.

అట్టి పచ్చకర్పూరపు సువాసనలు మనందరి హృదయాలలో గుబులుకొనుగాక !

(పాఠకులకు మనవి:- పై చెప్పిన అయిదు పద్యాలు ప్రార్థనా సమయంలో చదువుకొని దైవకృపకు పాత్రులగుదురుగాక !)

(సప్తగిరి : జూన్ 1991)

# కావ్యముఖపత్రాల అంతర్యం

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు తమ 30వ యేట రచించిన 'కుమార భారతి' కావ్యం 1981వ సం॥లో ముద్రణ అయ్యింది. ఆ కావ్యం యొక్క ముఖపత్రంపై ఉన్న విచిత్రమైన రేఖాచిత్రం, చివరి పేజీ పాఠకులను ఆకర్షించి ఆలోచింపజేస్తాయి.

ముద్రణాసౌకర్యం వచ్చిన తర్వాత కావ్యానికి గాని, మరేదైనా గ్రంథానికి గాని-దానికి సంబంధించిన ఇతివృత్తంయొక్క తాత్పర్యం, స్థూలంగా గాని సూక్ష్మంగా గాని ఉండేటట్లు బొమ్మలు గాని, రేఖాచిత్రాలు గాని అట్టలపై (ముఖపత్రాలపై) గీయడం ఒక కళగా అభివృద్ధి అయింది. ముద్రణాసౌకర్యం లేని రోజుల్లో ఈ ముఖపత్రాల ప్రసక్తి లేదు. ఎప్పుడైతే ముద్రణాసౌకర్యం వచ్చిందో, ముఖపత్రాల శిల్పం కూడా బయలుదేరింది.

ముఖపత్రాలకు ఉదాహరణగా మగవాని చేతి పెద్దపిడికిలిలో ఆడది ఉన్నట్లు, తాళిబొట్టును ఉరిత్రాడులాగా గీయడం, చావును కల్పించడానికి గొంతుకు సంధించినట్లుగా ఉండడం-నవలలు మొదలైన పుస్తకాల ముఖపత్రాలపై మనం చూస్తున్నాం. ఆ బొమ్మలనుబట్టి ఆ పుస్తకంలో ఇతివృత్తం ఇట్టే పసిగట్టవచ్చు.

అలాగే కుమారభారతి కావ్యానికి కూడా కావ్యంయొక్క ఇతివృత్తాన్ని తెలిపేటట్లుగానూ, ఇతివృత్తంలో దాగి ఉన్న అంతరార్థాన్ని తెలిపేటట్లుగానూ మొదటి ముఖపత్రం (మొదటి అట్ట), చివరి కవరుపేజీపై ముద్రణ ఉంది. అయితే సాధారణ పుస్తకాలలాగా ఈ కావ్య ముఖపత్రాలపై అమర్చి ఉన్న బొమ్మలు అంత సులభంగా బోధపడేవికావు అని మాత్రం ఒప్పుకోవలసిందే.

కాని సూక్ష్మమైన, సుకుమారమైన దృష్టితో పరిశీలించడానికి మొదలుపెడితే మాత్రం అర్థంకాకుండా పోవు. సహృదయ పాఠకుడు దాన్ని గురించి ఆలోచిస్తాడు. ఆలోచించాలి కూడా. వాటి సారాంశాన్ని పాఠకులకు అందించాలన్న దృష్టితో ఇక్కడ ప్రత్యేకంగా పరిశీలించి చెప్పడమైనది.

## ముఖపత్రం

'కుమార భారతి' అన్న కావ్యం పేరునే మొదట పరిశీలిద్దాం. కుమార భారతి అంటే కుమారస్వామిని (సుబ్రహ్మణ్యస్వామి)గురించి తెలిపే కథ. కుమార శబ్దానికి పౌరాణికార్థం వేరే ఉన్నప్పటికీ, కవి బాహ్యార్థమును అంతరార్థంతో సమన్వయపరచి చెప్పడమే ఒక విశేషం. కుమార - శబ్దాన్ని విశ్లేషిస్తే, తండ్రి కుమారుని రూపంలో తన రూపాన్ని ప్రతిబింబించుకుంటాడు. తండ్రి శరీరం నశించినా కుమారుని-లేక కుమార్తె శరీరం ప్రపంచంలో ఉంటుంది. ఇది భౌతికార్థం. అందుకే మానవునికి తన సంతానంపైన ప్రీతి. ఎందుకంటే తాను నశిస్తున్నా తన రూపాన్ని తన సంతాన రూపంలో చూసుకొని తృప్తిగా ప్రాణాలు వదులుతాడు. అంటే తాను పోయినా తన సంతతి ద్వారా శాశ్వతంగా భూమిపైన నిలిచిపోతాడు మానవుడు. కాబట్టి కుమారస్వామి కథ ప్రతి మానవుడి కథ అవుతున్నది. దీన్ని గురించి మహాప్రసాదంలో ఇంకా వివరంగా చెప్పుకున్నాం.

(చూ. మహాప్రసాదం - 1)

భగవంతుడు నిత్య కౌమారంగా ఉంటాడు. భగవత్తత్త్వం ఎప్పుడూ క్రొత్తదిగానే ఉంటుంది. ఏదైనా ఒక వస్తువును మార్కెట్ నుంచి తెచ్చుకుంటే తెచ్చిన కొత్తలో కొన్ని రోజులు తాజాగా, నాణ్యంగా ఉండి చూడ్డానికి ఆకర్షణీయంగా ఉంటుంది. కొద్ది

రోజులకు పాతబడుతుంది. ఆకర్షణ తగ్గుతుంది. అంటే ఆ వస్తువు పాతబడిందని అర్థం. ఇది లోకంలోని వస్తునైజం. కాని భగవత్తత్త్వమన్నది నిత్య కౌమారంగా, ఆకర్షణీయంగా, రమ్యంగా ఉంటుంది. నిత్య కౌమారం అంటే నిత్యనూత్నం. దానికి మార్పు అనే లక్షణం ఉండదు. అంటే కుమార తత్త్వం, కుమార శబ్దం నిత్య నూత్నత్వానికి సంకేతం. కుమార శబ్దానికి సృష్టి అని అర్థం. అది సృష్టికి ప్రతీక. యౌవనం, వృద్ధాప్యం వంటి దశలు దానికి ఉండవు. అది నశించదు. కుమార శబ్దమంటే 'balance'-ప్రకృతిలో సమతౌల్యాన్ని కల్గిస్తుంది. అంటే ప్రకృతిని బ్యాలెన్స్ చేస్తుందన్నమాట. ఎన్ని మరణాలు సంభవించినా కుమార తత్త్వం ఆ లోటును భర్తీ చేస్తూనే ఉంటుంది. నాశనం కావడానికి బదులు ప్రతిసృష్టి చేయడం కుమార తత్త్వ లక్షణం. దీన్నే మనం Creative Principle (సృష్టి మూలసూత్రం) అంటాం.

(వివరాలకు : చూ. 'రాయబార నిర్వహణం' : పం. క. 11)

భారతి శబ్దంలో భా=భాసించునది; రతి=రస్యమైనది, రమించేది-భగవంతుడు భక్తునితో రమించే యోగం ఉంటుంది. ఆ యోగంలో అందమైన సొగసు-రుచి ఉంటుంది. 'ఆత్మా వై పుత్రనామాసి'-తండ్రే భార్య ద్వారా కుమారుడుగా జన్మిస్తున్నాడు. కుమారుడు తండ్రి యొక్క ప్రతి అంగమునుండి పుడుతున్నాడు (చూ. అభిషేకపర్వం : వ. క. 31). తండ్రి తనను తాను కుమారుడుగా బదిలీ (ట్రాన్స్‌ఫర్) చేసుకుంటున్నాడు. కాబట్టి తండ్రీ, కొడుకూ ఒకటే. సృష్టికి ప్రతి సృష్టి చేసే లక్షణం కుమార తత్త్వంలో ఉందని చెప్పుకున్నాం. కాబట్టి పై చెప్పిన అర్థం ఈ సందర్భంగా సరిపోవడం గమనించదగ్గది.

ఒక ప్రతిభాజ్యోతిస్సు 'కుమారస్వామి' అంటే. శస్త్ర శాస్త్రనిధికి దేవత కుమారస్వామి - యుద్ధాలకు అధిదేవత కుమార

స్వామి (War God). విద్యకు దేవత సరస్వతి. శస్త్ర శాస్త్రనిధి కుమారస్వామి. కుమారుడే భారతి అయితే, కుమారభారతి. ఆయనలో రెండూ ఉన్నాయి - శస్త్రమూ ఉంది; శాస్త్రమూ ఉంది. కనుక కావ్యం పేరు 'కుమార భారతి'.

ఈ కావ్యం ముఖపత్రం (మొదటి అట్ట) పై ఉన్న బొమ్మను చూడండి :




చిత్రం - 1

ఈ కావ్యం ఆశ్వాసాలుగా కాకుండా, కమలాలుగా విభజించబడి ఉండటాన్ని మనం గమనించవచ్చు. కావ్యమంతా ఆరు కమలాలుగా ఉంది. ఈ ఆరు కమలాలు ఆరుముఖాలు గల కుమారస్వామికి-అంటే షణ్ముఖునికి- ప్రతీకలు. ఈ ఆరు కమలాలను - ఆరు ముఖాలను సూచించడమే పై బొమ్మలోని పరమార్థం. ఇది షట్కోణ యంత్రం. దీనిలోని వివిధ భాగాలను విడివిడిగా ఒకొక్క దానిని ఫోకస్ చేస్తూ, ఒకొక్క భాగాన్ని గూర్చి పరిశీలిద్దాం.




చిత్రం - 2

చిత్రం - 2 పద్మానికి సంకేతం. ఈ చిత్రాన్ని పుష్పంగా భావిస్తే, ఈ చిత్రానికి ఆరు రేకులు ఉన్నట్టు గమనించవచ్చు. చిత్రంలో 1 నుండి 6 వరకు గల అంకెలు ఆరు రేకులను సూచిస్తాయి. కావ్యం కూడా 6 కమలాలుగా విభజించబడింది. ప్రథమ కమలము, ద్వితీయ కమలము, తృతీయ కమలము, చతుర్థ కమలము, పంచమ కమలము, షష్ఠ కమలము - అని. ఆరు కమలాలూ కుమారస్వామికి ఆరు ముఖాలు. ఈ ఆరు ముఖాలే షట్చక్రాలు. 1. మూలాధారచక్రం; 2. స్వాధిష్ఠాన చక్రం; 3. అనాహత చక్రం; 4. మణిపూరక చక్రం; 5. విశుద్ధ చక్రం; 6. అజ్ఞా చక్రం (వివరాలకు : చూ. యుద్ధవర్ణన-స్పందనం - ద్వితీయదళం - అగ్నిరాయబారం : ష. ద్వి. 33). షష్ఠ కమలం - మళ్ళీ రెండు దళాలుగా విభజించబడిఉంది. ఇలా విభజించటం ఆజ్ఞా చక్ర స్ఫూర్తిని (ప్రక్కన బొమ్మ చూడండి - చూ. అగ్నిరాయబారంలోని ఆజ్ఞాచక్రం) ధ్వనింప చేయటానికే. ఆజ్ఞాచక్రానికి రెండు దళాలు ఉంటాయి. ఆ రెండు దళాల మధ్యభాగంలో - అంటే కేంద్రంలో - స్వామి ఉంటాడు.

ఈ కమలాలన్నీ (చక్రాలన్నీ) మనిషి శరీరంలోనే ఉంటాయి. ఆజ్ఞాచక్రం భ్రుకుటి మధ్య (కనుబొమల నడుమ - కొద్దిగా పైన) ఉంటుంది (తక్కిన వివరాలకు : షష్ఠకమలం - ద్వితీయదళంలో 33 వ పద్యం దగ్గర చూడండి).

పై చిత్రాన్ని బాగా పరిశీలిస్తే- A, B, C అనే త్రిభుజమూ; D అనే వృత్తమూ; 6-1 అంకెలమధ్య స్వామి శక్త్యాయుధ చిహ్నమూ; దానిక్రింద రెండు వైపులా +, – లను గమనించ వచ్చు. వీటిని చిత్రంనుంచి వేరుచేసి ఒక్కొక్కదాన్ని విడివిడిగా ఫోకస్ చేసి పాఠకుల సౌకర్యంకోసం బొమ్మలద్వారా చూప వచ్చు. అంటే A B C అనే త్రిభుజం (చిత్రం - 3), శక్త్యాయుధ చిహ్నం (చిత్రం - 4), D అనే వృత్తము (చిత్రం - 5) - అనే ఈ బొమ్మలను విడివిడిగా చూస్తూ పరిశీలిద్దాం. మొదట A B C అనే త్రిభుజాన్ని చూద్దాం.




చిత్రం - 3

పై బొమ్మను గమనిస్తే, D అనే వృత్తం - A B C అనే త్రిభుజపు అంచులను తాకుతూ పోయినట్టు ఉంది. A = అర్థం, B= కామం, C= మోక్షం, D= ధర్మం. మానవుడు ఆ మూడింటిని సాధించవలసిందే. అర్థాన్ని (ధనాన్ని) పొందవలసిందే; కామాన్ని (కోరికను) కూడా నెరవేర్చుకోవలసిందే; మోక్షమూ పొంద వలసిందే. అయితే ఈ మూడింటినీ (అర్థం, కామం, మోక్షం)

సముపార్జన చేసుకోవడంలో, పొందడంలో ధర్మబద్ధమై ఉండాలన్న సంగతిని మరిచిపోరాదు. D అనే వృత్తం (బొమ్మ చూడండి) అంటే, ధర్మం A B C (అర్థ కామ మోక్షాలు) కోణాలను కలుపుతూ పోవడం ద్వారా, మనం ఆ మూడింటినీ సంపాదించడంలో ధర్మమనేది తప్పక ఉండాలి అన్నదాన్ని D అనే వృత్తం బోధిస్తుంది. *




చిత్రం - 4

D అనే వృత్తాన్ని తాకుతూ శక్త్యాయుధం ఉంది అని చెప్పుకున్నాం. ఆ శక్త్యాయుధపు బొమ్మను (చిత్రం - 4) బయటకు తీసి చూద్దాం. బొమ్మను గమనించండి - ఇది కుమారస్వామి ధరించే ఆయుధం. అందుకే ఆయనను శక్తిధరుడు అన్నారు. అది ధర్మ సంరక్షణార్థమై స్వామి ఉపయోగించాడు. ఆ ఆయుధాన్ని చూస్తే బొమ్మలో మనకు E F G అనే మూడు గీతలు (రేఖలు) కనిపిస్తాయి. E అనే గీత నరుడుగానూ, F అనే గీత భగవంతుడుగానూ, మధ్య గీత G అన్నది గురువుగానూ సూచింపబడింది. అంటే దేవుని లక్షణానికి, మానవుని లక్షణానికి మధ్య అనుసంధానంగా మధ్య (G) గురులక్షణం మనకు కనిపిస్తుంది. అచేతనమైనటువంటి మానవ

* ఈ విషయానికి, నా ఎం. ఏ (1980) తరగతి యొక్క Running Notes ఆధారం- 'Foundations of Indian Culture, Literature and Philosophy' అనే పరీక్షపత్రం కోసం ఇచ్చిన ప్రొ॥ తుమ్మపూడి కోటీశ్వరరావుగారి ఉపన్యాసం మూలాధారం.

లక్షణంలో గురులక్షణం ద్వారా దైవలక్షణం నిక్షిప్తం చేయబడి మానవునిలోని అచేతనత్వం పోయి, చైతన్యం గావింపబడుతుంది. ఉదాహరణకు మానవ లక్షణం ఒకదాన్ని తీసుకుందాం - అది ఎలా గురులక్షణం ద్వారా దైవలక్షణంతో చైతన్యవంత మవుతుందో చూడండి - సులభంగా అర్థమయ్యే ఉదాహరణ ఒకటి చూడండి- మానవ లక్షణం గ్రుడ్డితనం; గురులక్షణం కన్ను; దైవ లక్షణం చూపు (Sight - దృష్టి). 'చూపు' అనే దైవలక్షణం కన్ను అనే గురులక్షణముతో కూడి మానవ లక్షణమైన గ్రుడ్డితనాన్ని పోగొట్టి మానవునికి చూపునిస్తుంది. దానిద్వారా మానవుడు ఈ రంగుల ప్రపంచాన్ని చూడగలుగుతున్నాడు. ఇంకో ఉదాహరణ: శబ్దమనే దైవప్రకాశం చెవిటితనం (చెవుడు) అనే మానవలక్షణాన్ని గురులక్షణమైన చెవితో కూడుకొని చెవుడును పోగొట్టి శబ్దం వినబడేటట్లు చేస్తుంది. ఈ విధంగా మనిషిలో ఉండే అనాథతత్త్వం, అచేతన తత్త్వం పోగొట్టడానికి గురులక్షణం మధ్యవర్తిగా పని చేస్తుంది. కనుక గురువుకు సంబంధించిన రేఖ మధ్యలో (G) ఉంది (దీనిపై సమగ్రమైన వివరణకు: చూ. ఏ. హనుమంతప్ప 'తత్త్వ గేయాలు - బ్రహ్మసారం' : స్రవంతి : జనవరి 1982). పైగా దైవ దర్శనం గురుముఖంగా మానవునకు గలుగుతుంది. అందుకే కబీరు దాసు- 'గురువు, దేవుడు ఒకేసారి నాముందు ప్రత్యక్షమై నిలబడితే, ముందుగా నేను గురువు పాదాలకే నమస్కారం చేస్తా'నంటాడు. ఎంచేత అంటే దైవదర్శనం కలిగించినవాడు గురువే కాబట్టి.

బ్రామ్మ కేంద్రస్థానంలో ఓం - ఉన్నది. Ohm has over hundred meanings- one of them is "welcome to the God." వినాయకుని యొక్క సూక్ష్మరూపం - ఓంకారం. విఘ్నేశ్వరుడు ప్రణవ స్వరూపుడు. ఓంకారంలోని అ - ఉ - మ -

సర్గ లయ స్థితులకు సూచకాలైతే, వినాయకుడు సూక్ష్మమైన ఓంకారంయొక్క వ్యక్తీకృత స్థూలరూపం. అందుచే ప్రతిమంత్రానికీ ముందు 'ఓం' అని పలుకుతాము. కనుక విఘ్నేశ్వరుని యొక్క సూక్ష్మరూపమే ఈ ఓం - ఇది ముఖపత్రంయొక్క వృత్తంలో మధ్య భాగంలో ఉన్నది (ఇంకా ఓంకార స్వరూపంయొక్క పూర్తి వివరణకు : చూ. 'అభిషేకపర్వం' : చ. క. 87). ఈ ప్రసక్తి కావ్యంలో మనకు అభిషేక పర్వం - చతుర్థ కమలంలో వస్తుంది.

వృత్తము :

చిత్రంలో 'D' అనే వృత్తం ఉంది అని చెప్పుకున్నాం. దాన్ని గురించి ఆలోచిద్దాం.




చిత్రం - 5

వృత్తం సూర్యుని అంశమే. విష్ణుచక్రం కూడా వృత్తాకారమే. వృత్తాకారం - వృత్తం- అందానికి ప్రతీక. అందమంటే సుందరతనం, సంపూర్ణత్వం. పూర్ణత్వమే సౌందర్యం. కనుకనే పూర్ణచంద్రబింబం అందంగా కనిపిస్తుంది. అంటే దైవత్వమున్నది మనోహరమైనదీ, అందమైనదన్నమాట. వృత్తాన్ని 4 భాగాలుగా చేస్తే, $90°$ల లంబ కోణాలు నాలుగు ఏర్పడతాయి. $90° \times 4 = 360°$. అంటే సరిగా మన భారతీయ సావన సంవత్సరానికి 360 రోజులు. ఒక్కసారి వృత్తం భ్రమిస్తే (తిరిగితే) ఒక సంవత్సరమన్నమాట. ఇది వృత్తం యొక్క ఆంతర్యం.

ఇక, + (ప్లస్), − (మైనస్)ల సంగతి చూద్దాం. ఇవి బొమ్మలో శక్త్యాయుధం క్రింద అటూ యిటూ (+, −) ఉన్నాయి. ప్లస్ (+) అంటే ధనాత్మకం. మైనస్ (−) అంటే ఋణాత్మకం. పురుషుడు పెళ్ళి కానంతవరకు సగమే. పురుషుడు అంటే మగవాడు అని మాత్రమే కాదు - మనిషి అని అర్థం - ఆడ కావచ్చు; మగ కావచ్చు. మానవుడు (పురుషుడు కాని, స్త్రీ కాని) పెళ్ళి అయిన తర్వాత సంపూర్ణమానవు డవుతున్నాడు. ధనాత్మకం, ఋణాత్మకం కలిసి ఒకటి అవుతుంది. ఈ రెండూ కలిస్తే సంపూర్ణమని అర్థం. పురుషుడు + స్త్రీ = సంపూర్ణమనిషి. శివునికి అందుకే అర్ధనారీశ్వర తత్త్వం చెప్పారు. సగం శివుడు, సగం పార్వతీదేవి ఉండే బొమ్మలు అందుకే మనకు ఉన్నాయి. ఈ కావ్యంలో శివపార్వతుల సంగమం వర్ణించబడింది. అది కుమార జననానికి కారణభూత మవుతుంది (చూ. 'కుమార జననం': స. క : 15). పురుషునికి పాజిటివ్ (ధనాత్మకం) సంకేతమనీ, స్త్రీకి నెగిటివ్ (ఋణాత్మకం) సంకేతమనీ అర్థం. ప్రపంచం ద్వంద్వాత్మకం - ప్రకృతి - పురుషుడు. రామాయణాన్ని తీసుకుంటే సీత ప్రకృతికి సంకేతం. భూదేవినుండి ఉద్భవిస్తుంది. రాముడు పురుషునికి (భగవంతునికి) సంకేతం. ద్వంద్వాత్మకమంటే ఇంకా యిలా చెప్పవచ్చు : భగవంతుడు - భక్తుడు; గురువు - శిష్యుడు; భార్య - భర్త; ఉన్నది - లేనిది; చేతనం - అచేతనం - ఇట్లా రెండు విధాలుగా ఉంటుంది. ఈ ద్వంద్వాత్మకమే సృష్టి మర్మం - ఇదే +, −ల మర్మం (చూ. ఏ. హనుమంతప్ప 'మన ఆచారాలు- అంతరార్థాలు': సప్తగిరి : జూన్ 1983; 'చపల చిత్తులు' ఫుట్‌నోట్స్ - స్రవంతి : ఫిబ్రవరి 1983).

**చివరి అట్ట :**

చివరి కవరు పేజీపై శ్రీ అరవిందులవారు పద్మాన్ని (లోటస్) గురించి చెప్పిన కొటేషన్ ఉంది. ఈ కొటేషన్ ఈ కావ్యం

గొప్ప తత్త్వాన్ని కూడా బోధిస్తుంది. యోగశాస్త్రంతో ముడిపెట్టి వర్ణించినట్టు ఈ కావ్యంలో మనం గమనిస్తాం. కనుక పద్మంలోని తేజస్సును గురించిన కొటేషన్ చివరి అట్టపై ముద్రించారు. అందుకే ఈ కావ్యం కమలాలుగా విభజించబడి ఉందని ముందే చెప్పుకున్నాం.

"-But the foundation of things is above and not below - 'Upari budhna esham' - The Super - Conscient, not the Sub - Conscient; is the true foundation of things.

"The Significance of the lotus is not to be found by analysing the secrets in the mud from which it grows here, its secret is to be found in the heavenly archetype of the lotus that blooms for ever in the Light above."

- '**Sri Aurobindo**'

"-కాని వాస్తవిక ప్రపంచానికి పునాదులు పైన ఉన్నాయే తప్ప, క్రింద లేవు. ఆ పునాది అతీత మానసావస్థ తప్ప, కేవల భౌతిక మానసిక దశ కాదు.

"పద్మమంటే దాని రహస్యం - అది పుట్టిన బురదలో వెదికితే దొరకదు. దాని మూలాలు తేజోలోకంలో నిత్యమూ వికసిస్తూనే ఉన్న ప్రాగ్రూపపద్మంలో దర్శించాలి."

— 'శ్రీ అరవింద'

ఇదంతా తత్త్వానికి సంబంధించింది. ఆధ్యాత్మికతత్త్వం లేదా గొప్ప సంస్కారమైన వాసనలు పద్మంలో ఉంటాయి. అందుకే పద్మం తత్త్వానికి సంకేతమైనది. పద్మంయొక్క మూలము బురదలో ఉండదు. ఈ సకల పద్మాలకూ మూలమైన ఒకానొక పద్మం స్వర్గంలో

ఉంది. కావ్యమంతా చదువుకున్న తర్వాత కావ్య రహస్యమంతా చివర్లో ఉంటుంది. చివరిదాకా చదివిన తర్వాత రహస్యం తెలుస్తుంది. ఇది తెలిసిన తర్వాత కావ్యం మొదటినుంచి మళ్ళీ చదవాలి. అప్పుడు కావ్యం అవగాహనకు వస్తుంది. ఒక కొలిక్కి వస్తుంది (చూ. యుద్ధ వర్ణన - స్యందనం - ద్వితీయదశం : ప. ద్వి. 141, 142 మరియు ప్ర. క : 1; 2).

కావ్యంలో చేయబడ్డ విభాగమంతా కమలమే. మొదట - మధ్య - చివర. ఈ మూడింటికి సమన్వయమే కమలము.

ఈ విధంగా మొదటి, చివరి అట్టలమీద ఉన్న వాటిని గమనిస్తే ఈ విషయాలు తెలుస్తున్నాయి.

## రంగులు:

ఈ కావ్యానికి అట్టల మీద ఉండే రంగులను కూడా భావన చెయ్యవచ్చు; చెయ్యాలి కూడా. ఆ రంగులను పూయించడంలో ఏవో రంగులు ఉండాలి కదా అని ఊరకే పూయించినవి కాదు. రంగులను ఎన్నుకోవటంలో కూడా తాత్త్విక విషయం ఉంది. 'కుమార భారతి' కావ్యానికి- ఎందుకు కొన్ని ప్రతులకు నీలి రంగు, మరి కొన్ని ప్రతులకు ఎరుపు రంగు ఉంది అన్న విషయాన్ని క్రింద చూద్దాం.

## నీలి రంగు:

శివుడికి నీలలోహితుడని పేరు. ఇది నిర్గుణ తత్త్వానికీ, అనంత తత్త్వానికి సంకేతం - పురుషతత్త్వానికి కూడా సంకేతం.

## ఎరుపు రంగు:

ఎరుపు లోహిత వర్ణం. సృష్టికి (క్రియేషన్) సంకేతం. ఇది దేవీతత్త్వ వర్ణం. ఒక్కొక్క తత్త్వానికి ఒక్కొక్క వర్ణం సంకేతంగా

ఉంటుంది. నీలం లేదా తెలుపు అవ్యక్తానికి సంకేతం. ఎరుపు వ్యక్తానికి సంకేతం.

ఎరుపు సృష్టికి సంకేతమైతే, నీలం లోతు (డెప్త్)కు సంకేతం. ఈ రెండు వర్ణాల కలయికే ప్రకృతి - పురుష సమ్మేళనరూపమైన సృష్టి తత్త్వం. సృష్టిని సప్తవర్ణాత్మకంగా ప్రాచీనులు దర్శించారు. ఈ రెండు వర్ణాలు (నీల లోహిత వర్ణాలు) అటు చివర ఒకటి, ఇటు చివర ఒకటి ఉంటాయి. మధ్యలో ఇతర వర్ణాలు ఐదు ఉంటాయి. (అదే ఇంద్రధనుస్సు). అంటే ఈ రెండు వర్ణాలమధ్య సృష్టి తత్త్వ మున్నదని అర్థం. ఈ రెండు రంగుల కలయికచేత సృష్టి ఏర్పడటం పేరే కావ్య నామం 'కుమార భారతి'. ఇదే కౌమార తత్త్వం. కుమారుడంటే నీలలోహిత వర్ణస్వరూపుడైన అర్ధ నారీశ్వరుల కలయిక (చూ. 'కు మా ర జ న న ం' : చ. క : 15). కుమారుడంటే ఇదే అర్థం కనుక, కుమార భారతి కథను ఈ తాత్త్విక దిశను తీసుకొనిపోయి వ్యాఖ్యానించిన ఇతిహాసమే కుమార భారతి. దానికి వర్ణాలు (రంగులు) కూడా సంకేతమే.

ఈ విధంగా ముఖపత్రంమీద ఉన్న బొమ్మలు, రంగులు, మాటలు - అన్నీ కావ్యతత్త్వ వ్యంజకాలుగా, ప్రతీకలుగా - సంకేతాలుగా గ్రహించవచ్చు. ఇదే కుమార దర్శనమంటే. 'కుమార భారతి' అంటే కుమార దర్శన మన్నమాట. దర్శనమంటే ప్రతిభ లేదా Vision- పశ్యంతి (తాత్త్విక దర్శనం). ఇదే ఐతిహాసిక కవితాదృష్టితో 'కుమార భారతి'గా కవి నామకరణం చెయ్యడంలోని రహస్యం. ఈ విధంగా కావ్యముఖపత్రాలు తీర్చడ మనేది మనకు తెలిసినంతవరకు చాలా అరుదుగా కనిపిస్తుంది.

ప్రత్యగ్రమైన కుమార భారతికి ప్రణామాలు.

# కుమారజననం

ఆచార్య శ్రీ తుమ్మపూడి కోటీశ్వరరావుగారు 'కుమార భారతి' కావ్యాన్ని దివ్యమైన శైలిలో రచించారు. విశ్వనాథ సత్యనారాయణగారి మాటల్లోనే చెప్పాలంటే "ఇదొక పరమాశ్చర్య కరమైన రచన. ఇందులో ఎవరో చండప్రచండులైన నాచన సోమన్న - శ్రీకృష్ణదేవరాయలు - తెనాలి రామకృష్ణుడు - విశ్వనాథ సత్యనారాయణ - ఇలాంటివారు కనిపిస్తారు." ఈ కావ్యం అన్ని కావ్యాలలాగా ఆశ్వాసాలుగా కాకుండా, కమలాలుగా విభజించబడిందని, ఇందులో ఆరు కమలాలు ఉన్నాయని యింతకు ముందు చెప్పుకున్నాం. షణ్ముఖుడైన కుమారస్వామి వృత్తాంతాన్ని చెప్పే ఈ కావ్యం ఆరు కమలాలుగా విభజింపబడటం లోనే ఒక ప్రత్యేకతను సంతరించుకొంది. కావ్యం కుమారస్వామికే అంకితం చేశారు కోటీశ్వరరావుగారు. స్వామికి అంకితం చేయడంలో కవికి కుమారస్వామిపట్ల ఉన్న అత్యంత భక్తి తెలుస్తోంది.

కుమారస్వామి జన్మకోసం అగ్నిదేవుడు, గంగాదేవి పడ్డ అవస్థలను ఒక అందమైన వింతపద్ధతిలో కవి చెప్పిన రీతులు, కృత్తికామతల్లులు కుమారస్వామి దగ్గరకు వచ్చి క్షీరమిచ్చే సందర్భం ఈ భాగంలో చూద్దాం.

కథాప్రారంభం శరత్కాలపు వెన్నెలతో ప్రారంభమయింది.

(శ్రీ) శివాతనూజాత విరించిముఖ ప
యోరుహ నిషణ్ణ సిత మృదుజ్యోతి, హంస
పై నధివసించి వాహ్యాళి వచ్చినట్లు
రమ్యచంద్రిక నెక్కి శరత్తు వచ్చె. (ప్ర. క : 1)

పరమేశ్వరునియొక్క శరీరంనుంచి పుట్టినటువంటి సరస్వతి బ్రహ్మదేవునియొక్క ముఖపద్మంలో నివసిస్తోంది. ఆ సుకుమారజ్యోతి హంసను వాహనంగా చేసుకొని ఎక్కి వాహ్యాళి వచ్చినట్లుగా శరత్కాలం - అందమైనటువంటి హంసల్ని రథంగా చేసుకొని - వాహనంగా చేసుకొని (శరత్కాలం) లోకంలోకి అవతరిస్తోంది. ఆ విధంగా శరత్కాలం వచ్చింది.

క్రౌంచపు డొక్కలో శితశరమ్మున స్వామి పొనర్చినట్టి రం
ధ్రాంచిత మార్గముంబడి ప్రయాణములన్ భువికేగుదెంచె రా
యంచ గముల్, శరత్సమయమయ్యె నటంచు వచింపగా మరుత్
సంచలితాప్సరస్సిత ధృతాంశుకముల్ బలె ముగ్ధమూర్తులై.

శరత్సమయ మయిందని చెబుతున్నట్లుగా హంసలు వచ్చాయి. గాలిలో రేగిన అప్సరల చీరల చెంగులులాగా హంసలు గుంపులు గుంపులుగా వచ్చాయి.

చల్లని వాతావరణంతో గంగానది ప్రవాహంలోని సోయగాలతో కావ్యం కొనసాగడం, కవికి ప్రకృతిపట్ల ఉన్న సౌందర్యారాధన ఎటువంటిదో అర్థం చేసుకోవచ్చు.

అద్దరి నిద్దరిన్ గగనమంటెడి దారుముఖోర్విజమ్ములన్
తద్దయు చాషఖంజనవనప్రియమూకలి భృంగ పేచకా
త్యుద్ధత గీతరావములు, హోరుచెలంగగ టిట్టిభాది సం
బద్ధగతి క్రియాసలిల బంధుర గంగ తరంగలించెడున్.

(ద్వి. క : 4)

గంగానదికి ఆ దరిని, ఈ దరిని (ఆ ఒడ్డున, ఈ ఒడ్డున) ఆకాశాన్ని అంటుకొన్నట్లుగా ఉండే దేవదారు వృక్షాలు, అక్కడ ఉండే పాలపిట్టలు, ఖంజన పక్షులు, కాకులు, తుమ్మెదలు,

గుడ్లగూబలు మొదలైన పక్షుల యొక్క అరుపులు, ఏనుగుల యొక్క ఘీంకారరవాలతోనూ; టిట్టిభము (లకుముకి పిట్ట - ఇది టీ - టీ అని కూస్తుంది) మొదలైన పక్షుల శబ్దాలతో కలిసి గంగాప్రవాహం తురంగలిస్తోంది.

చిఱుతలు గుల్కరాలపయి చిన్నరిబంగరుమువ్వ సవ్వడిన్
కరువల దుష్పథమ్ముల నఖండతరంగ జవాగ్రమూర్తియై
బురబుర సైకతస్థలుల పొంగుచు పెన్ శిలలందు దూకుచున్
గరగరనై చకచ్చకితకాంతుల గంగ తురంగలించెడున్.

(ద్వి. క : 5)

చిన్న చిన్న గుల్కరాళ్ళపై చిరుగజ్జెలవంటి శబ్దాలతో కొండల మార్గం గుండా తరంగాలు తరంగాలుగా ప్రవహిస్తూ ఇసుక స్థలాల్లో బురబుర పొంగుతూ, పెద్ద పెద్ద శిలలపై గరగర తిరిగి దూకుతూ ప్రకాశవంతమైన కాంతులతో గంగానది దూసుకుంటూ ముందుకు పోతోంది.

ఈ పద్యాలు (4, 5) దూకుతూన్నట్టుగా ఉన్నాయి. ఈ పద్యాల నడక దూకుతూ ఉన్నట్టుగానే, గంగానది కూడా దూకుతూ ముందుకు పోతోంది అని అవగతమవుతుంది.

ఈ కథలో (కుమారస్వామి పుట్టుకలో) గంగానదికి ఒక పెద్ద పాత్ర ఉంది. గంగానది కూడా కుమారస్వామికి కన్నతల్లి. గర్భ ధారణ చేసిందావిడ. శివుని వీర్యాన్ని అగ్ని భరించలేక గంగలో విడిచాడు. అంచేత కుమారస్వామికి గంగానది మాతృమూర్తి. అందువల్ల గంగకు ప్రత్యేక స్థానముంది - కథలో. అందుకే గంగానది వర్ణన సముచితంగా చేయబడింది.

ఈ గంగానదిలో ఎక్కడబడితే అక్కడ రెల్లులంకలు ఉన్నాయి.

ఎలనీళ్ళవంటి స్వచ్ఛపు
తెలినీళ్ళల నారవిచ్చి తేలుచు నును రే
కుల నల్లార్చుచు నొప్పెడి
తెలితొగవలె, రెల్లులంక తేజోవధియై. (ద్వి. క : 7)

స్వచ్ఛమైనటువంటి తెల్లని నీళ్ళలో తెల్లని కలువలవలె విచ్చుకొని నునురేకులుగల పువ్వులతో రెల్లుచెట్లు రెల్లులంకలో తేజస్వంతంగా కనిపిస్తున్నాయి.

ఆకాశోర్ధ్వమునం దమర్త్యులు విహారార్థంబుగా నేగుచో
ఆకాశప్రసవావళుల్ చిలుకు దీవ్యత్ స్వర్ణకాంతిం గనన్
నాకంబెల్లను గాల్చివైవగ శిఖాసంతజ్వలన్మూర్తియై
పై కేతెంచు నటంచు శాంకరి, భయభ్రాంతిన్ ప్రధావింతురున్.
(ద్వి. క : 14)

ఆకాశంలో వస్తున్నటువంటి దేవతలు, కింద ఉన్నటువంటి ఈ బంగారు రెల్లువనాన్ని చూసి - అగ్నిదేవుడు ప్రజ్వలిస్తూ స్వర్గలోకాన్ని కాల్చివేయడానికి వస్తున్నట్టుగా ఉందని భయంతో పరుగెత్తుతున్నారు. భవిష్యత్తులో కుమారస్వామియొక్క ధనుష్టంకారానికి ఇంద్రాదులు భయపడ్డట్టు కథ వస్తుంది. దాన్ని ముందుగానే సూచించాడు కవి.

తతలయోగ్ర ఝంఝామరుత్తాడితమయి
తిమివలద్వాలపతనవిదీర్ణమైన
ఉత్పతన్మహార్ణవ రవవ్యుష్టివోలె
కలిగె నొకనాడు రెల్లుభీకరరవమ్ము. (ద్వి. క : 16)

ఉగ్రమైన ప్రళయకాలపు గాలుల తాకిడికి మేఘాలు గర్జించినట్లుగా తిమింగిల వాలపు దెబ్బచేత సముద్రంలో ఉద్భవించిన శబ్దంలాగా ఒకనాడు రెల్లుతోటలో భయంకరమైన ధ్వని వచ్చింది.

త్రిపురదాహోగ్రఫాలాక్షు తీవ్రకంఠ
గహ్వరోన్ముక్త భయద హుంకార మనుచు
విష్టపము లెల్ల మిగుల క్షోభించిపోవ
సర్వలోకమ్ములందు ఘోషణము చెలగె. (ద్వి. క : 18)

దృఢతిమింగిల వాలపు దెబ్బతోడ
మొగ ముదధిరాజుకు తిరిగిపోయినట్లు
ఉప్పరమ్మంటు నలలతో నొక్క కెగిరి
సుళ్ళు తిరుగుచు గంగ ఘూర్ణిల్లిపోయె. (ద్వి. క : 19)

త్రిపురాసురసంహార సమయంలో ఫాలాక్షుడు (శివుడు)చేసిన గంభీరమైన, భయంకరమైన హుంకారంలాగా అడవి అంతా క్షోభించి పోయింది. సర్వలోకాలకు ధ్వని వ్యాపించింది (ద్వి. క : 18). పెద్ద తిమింగలపు వాలపు దెబ్బచేత సముద్రమంతా తిరిగిపోయినట్టుగా పైకెగసి వస్తున్న అలలతో గంగానది సుళ్ళు తిరిగిపోయింది.
(ద్వి. క : 19)

స్వర్గలోకంలో దేవేంద్రుడూ, బృహస్పతి కలిసి రహస్య మందిరంలో ఏవో మంతనాలాడుతున్న సమయంలో, ముల్లోకాలు దద్దరిల్లేటట్లుగా ఈ భయంకరమైన ధ్వని ఆకాశాన్ని చీలుస్తూ వచ్చింది. ఈ శబ్దం శత్రువులదై ఉండవచ్చునా? లేక ఎవరిదై ఉండ వచ్చునన్న సందేహం ఇంద్రునికి కల్గింది. తన సందేహాన్ని తీర్చమని బృహస్పతిని అడుగుతాడు ఇంద్రుడు. దానికి బృహస్పతి సమాధానం :

భావము సర్వమూఢమగు పాదు, తదీయము హేతువాదము, కా
ర్యావళి సాగుచున్నది గదా! మరి తద్రవ ముగ్రచండమై

చేవలుదేలి తోల్తగ, కృశించినదేమిటో మెత్తమెత్తనై
భావమదేమి ? యీ కృతికి బాలకృతంబగు చేష్టయందమా !

(ద్వి. క : 31)

"సర్వమూలానికీ మూల భావమే. అదే కారణమై జగత్తులో అన్ని కార్యాలూ సాగుతున్నాయి. మరి ఆ శబ్దం మొదట బలంగా వినిపించి, తర్వాత మెత్తమెత్తగా సన్నగిల్లింది - ఇదేమిటో. ఈ చేష్ట పసివాని చేష్ట అనుకుందామా !" - అన్నాడు బృహస్పతి.

వినవే మంత్రినిగాన చెప్పెదను నీ యాజ్ఞానుసారమ్ముగ త
ద్ధ్వానం బుగ్రముగాగ తోచి తొలుతన్ తర్వాత సౌమ్యమ్ముగా
గానన్వచ్చెడి శత్రువైన వ్యతిరేకంబౌన తద్ధ్వాన సం
ధానుం డాతడు స్నిగ్ధమూర్తి యని ఆత్మందోచెడిన్ చెప్పెదన్.

(ద్వి. క : 32)

బృహస్పతి ఇంకా ఈ విధంగా చెప్తున్నాడు : "అయినప్పటికీ నేను మంత్రిని కాబట్టి చెప్తున్నాను. ఆ ధ్వని తొలిసారిగా ఉగ్రంగా పెద్దగా వచ్చి, ఆ తర్వాత సౌమ్యంగా (సుకుమారంగా) వినవచ్చింది. శత్రువే అయితే ఈ శబ్ద మిట్లు రాకుండా దీనికి వ్యతిరేకంగా వచ్చేది. కాబట్టి నా మనస్సుకు ఆతడు (శబ్దంగావించిన వాడు) స్నిగ్ధమూర్తి - సుకుమారమైన హృదయం గలవాడని తోస్తున్నది."

అది చాపధ్వని, లేదు సందియము రవ్వంతైన, ఎట్లున్నచో
అది గుర్తున్నదో లేదో నీకు మును పా హైమోర్వీభృద్ధన్వి అం
బుధితూణీరుని చాపటంకృతి భయమ్మున్ నేడు కల్పించె స
ద్గది ఇష్వాసమ దేయటందు మరి కాదే ! నాదమిట్లొప్పునే!

(ద్వి. క : 34)

"అది ఖచ్చితంగా చాపధ్వనే. అందులో సందేహమేమీ లేదు. పూర్వము - నీకు గుర్తున్నదో, లేదో!- శివుడు మేరుపర్వత ధనుస్సుచేత చేసిన నారిధ్వనిలాగే ఇప్పటి ధ్వని కూడా ఉంది. ఆ దే ధనుస్సని నేను అనుకుంటున్నాను. కాకపోతే ఈ నాదం ఇట్లా వస్తుందా!" (ఆ ధ్వని తప్ప వేరే ధ్వని ఇట్లా ఉండదని బృహస్పతి భావం).

అంతటి దొడ్డవింటి నహహా! హస్తమునన్ బిగియించి యొత్తకం
బొంతట కాలితోడ ధనురగ్రము ద్రొక్కి- గుణమ్ము నన్య చా
పాంతమునన్ దగిల్చి శ్రవణాంతికవీథికి లాగగల్గు క
ల్పాంతకు డా యనంతుని మహాద్భుత వీర్య మదెంత స్తుత్యమో!

(ద్వి. క : 25)

"అంత పెద్ద విల్లును (మేరుపర్వత ధనుస్సు - మరి!) చేతితో పిడికిట పట్టుకొని, కాలితో ధనుస్సుయొక్క ఒక అగ్రభాగాన్ని తొక్కి, ఇంకొక చివరిభాగానికి నారిని తగిలించి లాగగలిగే ఆ అనంతుని (శివుని) మహాద్భుత వీరత్వం (పరాక్రమం) ఎంత ప్రశంసనీయం!"

"ఇంకొక మాట నీకు చెప్తాను- ఆ గొప్ప ధ్వని అతని ఉజ్జ్వల మైన దశను సూచిస్తోంది. అటువైపునకు - సంధి చేసుకోవడానికి పురుషులను కాని అప్సరసలను కాని పంపడంకంటె (ద్వి. క : 43), సప్తమాతృకలైన ఆ తల్లులను (ద్వి. క : 46) వేడుకొని పంపించడం శ్రేయస్కరం" అని బృహస్పతి ఇంద్రునికి సలహా యిస్తాడు.

ఇంద్రుడు ఆ తల్లులను వేడుకొని అటువైపు పంపిస్తాడు. (ఆ సప్తమాతృకలు- చాముండి, కౌమారి, బ్రాహ్మి, మాహేశ్వరి, వారాహి, వజ్రాణి, వైష్ణవి అనేవారు).

ఇంతలో మళ్ళీ మొదట వచ్చిన ధ్వని రావటంతో, ఇంద్రుడు పటపటమని పళ్ళు కొరుకుతూ వజ్రాయుధం దూసుకొంటూ ఆతని సైన్యంతో ధ్వజమెత్తి పోతాడు. ఆ పెద్ద సైన్యంముందు ఒక చిన్నారి బాలుడిని చూస్తాడు ఇంద్రుడు. శరీరంమీద ఎటువంటి కవచ, వస్త్రాదులు లేనటువంటివాడూ, చేత శివధనుస్సు ఉన్నటు వంటివాడూ అయినట్టి ఆ చిన్నారి బాలుడిని ఇంద్రుడు, బృహస్పతి, దేవసైనికులు మొదలైనవారు చూశారు. అక్కడ బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. ఆ బ్రహ్మదేవుడు పనుకటి సంఘటనలను దృష్టికి తెస్తూ, ఇంద్రుడు మొదలైనవారికి కుమారస్వామి జన్మగాథ వివరిస్తాడు (ఆ విధంగా బ్రహ్మదేవుడు కుమారస్వామి జన్మగాథను వినిపించినట్టుగా చేసిన కవియొక్క కథనం ప్రశంసనీయం).

తారకాసురుడు, వాని తమ్ముడు మహిషుడు వరబలోద్ధతులై కన్ను మిన్ను కానక, మునులను, వారి పత్నులను-యాగాలను భంగం చేసి - నానావిధహింసలకు గురి చేశారు. ఆ కార్యక్రమంలోని భాగంగానే గాలవముని ఆశ్రమంలో యజ్ఞ సామగ్రి అయినటువంటి యూప స్తంభాలను, సమిథలను, దండాలను చెల్లాచెదరు చేసి, మునుల కాళ్ళను పట్టుకొని అటూ యిటూ విదిలించివేసి ఆశ్రమాన్ని సర్వస్వం ధ్వంసం చేశారు - తారకాసుర మహిషాసురులు (చ. క : 11). అప్పుడు గాలవముని ఇంద్రుని దగ్గర చెప్పుకున్నాడు. ఇంద్రుడు చేసేది లేక వారు వరబలోద్ధతులని చెప్పి (చ. క : 13), అగ్నిదేవుణ్ణి శివలోకానికి పంపాడు.

అగ్నిదేవుడు పోయి చూసినపుడు పార్వతీపరమేశ్వరుల యొక్క విహారక్రీడలు ఇలా ఉన్నాయి -

వలిమలశిఖరవీథులనుండి ప్రాచులై
దరులందు జారు నుత్సముల దోగి
యువతి కట్టిన పచ్చ ఉడుపమా పవన పో
తక చలత్ శాద్వలస్థలుల తిరిగి

జడలట్టి తరుశిఖాచయములన్ దిరుగుచు
క్రొక్కారువేళ వంగుళ్ళ దడిసి
శ్యామామనోజ్ఞహాసక్రియ విచ్చిన
లలితనికుంజస్థలాల నల్చి

లోకమెల్ల తమదిగ నేలుకొనుచుండి
లలిత సౌగంధికవనీస్థలమ్ముపైన
విమలకార్తికజ్యోత్స్న వ్యాపించినట్లు
శ్రీశివోత్తరుస్వామి దర్శించె వహ్ని. (చ. క : 15)

హిమాలయపర్వతాలనుండి త్రాచుపాములలాగా కిందకు దూకుతున్న సెలయేళ్ళలో స్నానం చేస్తూ, ఒక స్త్రీ ధరించిన పచ్చని చీరలాగా ఉన్న పచ్చికబయళ్ళలో తిరుగుతూ, జటాజూటం లాగా-అంటే మునులయొక్క జడలలాగా-ఉన్నటువంటి ఊడలు దిగిన మఱ్ఱిచెట్లకింద వర్షాకాల ప్రారంభంలో వంగుళ్ళలో సరదాగా తడుస్తున్నారు (వంగుళ్ళు - వాన వెలిసిన తర్వాత చెట్ల ఆకులపై నుంచి రాలే చినుకులు). ఒక అందమైన స్త్రీ నవ్వినట్లుగా వికసించి నటువంటి పొదరిళ్ళలో దాగి లోకమంతా తమదిగా చేసుకొని ఆడుకుంటున్నారు - శివపార్వతులు. ఎఱ్ఱని కలువతోటపైన కార్తిక జ్యోత్స్న (వెన్నెల) వ్యాపించినట్లుగా పార్వతీదేవిపైన ఉన్న స్వామిని అగ్ని దేవుడు చూశాడు.

ఈ పద్యంలో జగత్తునకు మాతాపితరులైన పార్వతీ పరమేశ్వరులయొక్క శృంగారక్రీడను వర్ణించడానికి వీలులేదు; వర్ణించకుండా ఉండటానికీ వీలులేదు. కనుక శృంగారం ధ్వనించేటట్టుగా కవి చాలా అందంగా వర్ణించాడు.

నాలుగు పాదాల సీసపద్యంలో

1. మొదటి పాదం హిమాలయ శిఖరం.

2. 2వ పాదంలో యువతి కట్టిన పచ్చని ఉపమపంలాగా శాద్వలస్థితి ఉంది.

3. 3వ పాదంలో జడలలాగా ఉన్న ఊడలు.

4. 4వ పాదంలో ఒక అందమైన స్త్రీ నవ్వులాగా నికుంజ స్థలాలు ఉన్నాయి.

పై పాదాలను పరిశీలిస్తే మొదటి పాదంలో పురుషుడు, రెండవ పాదంలో స్త్రీ, మూడవ పాదంలో పురుషుడు, నాల్గవ పాదంలో స్త్రీని గురించి చెప్పినట్టుగా ఉంది.

పార్వతీపరమేశ్వరులని చెప్పకుండా అక్కడ చెప్పబడిన వర్ణనలచేతనే పార్వతీపరమేశ్వరులయొక్క సమైక్యం ధ్వన్యమానమై, సహృదయుడూ, భావుకుడూ అయిన పాఠకుని హృదయంలో ధ్వనిస్తోంది. కనుక వాచ్యంగా చెప్పబడలేదని రసాభాసంగా తీసుకోవడానికి వీలులేదు.

అగ్నిదేవుడు పోయి చూసినప్పుడు ఎఱ్ఱని కలువల పూదోట పైన కార్తికపు వెన్నెల వ్యాపించినట్లుగా పార్వతీదేవిపైన స్వామి (శివుడు) ఉన్నాడు. వారిద్దరి సంభోగం ధ్వనిస్తోంది తప్ప, వాచ్యంగాలేదు. పైగా ఇక్కడ ఉపమానాలు చెప్పబడ్డాయి. దేవి తత్త్వాన్ని చెప్పే ఉపమానమేమో ఎఱ్ఱకలువ. దేవి - ఎరుపురంగు, శివుడు - తెలుపురంగు అని తంత్రశాస్త్రం చెబుతోంది. తెలుపు - సత్త్వగుణం, ఎరుపు-రజోగుణం. తెలుపులో ఎరుపు కలుస్తోంది-అంటే సత్త్వంలో రజోగుణం కలుస్తోంది.అప్పుడు చలనం ప్రారంభమవుతుంది. ఈ విధంగా ఎఱ్ఱని రంగు, తెల్లని రంగు కలుసుకున్నట్లు ఉన్నాయి తప్ప, అదేదో మానవుల సంభోగంలాగా లేదు అని తెలుస్తోంది. పైగా పార్వతీపరమేశ్వరులు వ్యక్తులు కారు. రెండు తేజస్సుల యొక్క సమావేశం - సంగమం. కనుక అది తేజోలోకంలో జరిగిన

శృంగారం. అందుకే ఇక్కడ తేజోరూపంగానే- చెప్పబడింది వ్యక్తుల రూపంలో చెప్పబడలేదు.

ఈ విధంగా కార్తిక జ్యోత్స్నలో హాయిగా ఉన్న శివ పార్వతులను అగ్ని తొందరలో ఆలోచనారహితుడై దర్శించడంతో, వెన్నెల కలగబారిందని కవి అభివర్ణించాడు - కింది పద్యంలో (అగ్ని రాకతో అక్కడ వెన్నెలే విరిగిపోయింది).

> వారల నవేళన్ కాన్పం
> తురా ? ఆలోచన సళించి తొందరగా తా
> నరిగిన వహ్ని స్పర్శకు
> విరిసెనుబో కలగబారి వెన్నెల తొగయున్. (చ. క : 16)

'అసమయంలో మమ్ములను దర్శించావు కనుక, త్రిభువన (ముల్లోకాలు) భయంకరమైన రౌద్ర తేజస్సు, నా మనోభావమయినటువంటి ధాత్వంబువు (ధాతువు = బీజం) భరింపు' మని శివుడు అగ్నియందు తన ధాత్వంబువును నిక్షిప్తం చేశాడు. అది తిట్టో, దీవనో అగ్నికి తెలియదు.

> "అసమయాగమ ప్రాపితేనోఘు మిద్ది
> త్రిభువన భయంకరము రౌద్రరీణమును - మ
> నోవినిర్గతమా ధాత్వంబువు భరింపు"
> మని శివుండనె - తిట్టో? దీవనో ? తెలియద. (చ. క : 17)

సమయం కాని సమయంలో వచ్చిన పాపానికి ఫల మనుభవించమని, భయంకరమైన తన ధాత్వంబువును అగ్నిపై మోపినాడు శివుడు. ఇక్కడ శివుని వీర్యము, రేతస్సులాంటి మాటలు వాడకుండా 'ధాత్వంబువు' అని ప్రయోగించడం చక్కగా ఉంది. సౌమ్యంగా ఉంది.

ఆ శివ ధాత్వంశమును మోయలేక అగ్ని తలకిందులయ్యాడు. తాళలేక "హరనర్తనం" (క్రింది వృత్తం కందా హరనర్తనం) చేశారు. అగ్ని పడ్డ బాధను వర్ణించడానికి యుక్తమైన ఛందస్సు గతిని - అంటే హరనర్తన మన్న వృత్తాన్ని - ఎన్నుకొని వర్ణించటం సముచితంగానూ, సందర్భానుగుణంగానూ ఉంది. ఇలాంటి విశేష ఛందస్సు నెన్నుకోవడంలో విశ్వనాథ సత్యనారాయణగారు ఘటికులు (తిక్కనగారు సరే అనుకోండి). ఆ కోవలోని కొద్దిమందిలో కోటీశ్వరరావుగారు ఒకరు.

**హరనర్తనం :**

శైవమహాతేజసధాతువుజ్జ్వలియించెన్ సూక్ష్మమయూఖమై
పావకుడంతట నిమీలితాంగకుడౌచున్ ఘూర్ణాభ్రమువోలె ఝం
ఝా వికంపిత సౌధకాంచనదీప ప్రోజ్జ్వల దేహుడై
తా పడెన్ భువి సోలిపోన్ తనువుం జొచ్చెన్ దహనాగ్నియై.

(చ. క : 18)

శివతేజస్సు సూక్ష్మాతిసూక్ష్మ కిరణమై ఉజ్జ్వలించింది. పెద్ద సుడిగాలిలో మేడపై బంగారు కలశంలోని దీపం కొట్టు కుంటున్నట్లుగా, అగ్ని దేహం సోలిపోజొచ్చింది. దహనాగ్నివలె ఇతని దేహంలో శివుని తేజము ప్రవేశించింది. ఆ దెబ్బకు తాళలేక అగ్నికి కన్నులు మూతపడుతున్నాయి.

పై పద్యంలో ద్విత్వ 'జ'కారం (ఉజ్జ్వలియించెన్) యతి స్థానంలో ఉండటంవల్ల, శివతేజస్సుయొక్క దహనతీవ్రత వ్యక్తమవు తుంది. అగ్ని మొదటికే అగ్గికదా! అలాంటివాడే శివతేజస్సు అనే అగ్నిని భరించలేకపోయాడంటే, ఆ శివతేజం ఎంత శక్తి మంతమైనదో తెలుస్తుంది. కనుకనే ఈ శక్తి భవిష్యత్తులో

తారకాసురుని చంపడానికి యోగ్యత ఉందని పాఠకులు అర్థం చేసుకోగలుగుతారు.

అగ్నికి అడుగులు ముందుకు పడలేదు. అలాగే తూలి తూలి సోలి సోలి - తూలుతూ సోలుతూ బ్రహ్మదగ్గరకు వచ్చి తాను పడుతున్న అవస్థను చెప్పుకోగా, ఇద్దరూ కలిసి జాహ్నవి (గంగానది) దగ్గరకు వచ్చారు. బ్రహ్మదేవుడు గంగమ్మను శైవతేజ భారాన్ని మోయమని ఒప్పించడానికి ఈ విధంగా అంటాడు :

**మహాస్రగ్ధర :**

నాడు గంగమ్మ తల్లి ! పాపము తన శోభ గోల్పోయినాడు
పరులకై
ఏడె స్వాహాధవుండు గుర్తింతె? చెప్పినను దెలియనంత చెడినాడు
పీడబాప వేరెవ్వరు దిక్కు? నీవేయని పడుచు లేచుచు వచ్చితి
నీడ కేనేదొ పెద్దవాడే తెంచి యిట్లడుగు నటంచు దయచూడవే.
(చ. క : ౬౨)

"ఎవరైనా చెప్తేకాని గుర్తుపట్టనంతగా ఈ అగ్ని మొహం వాడిపోయింది చూడమ్మా ! ఈతని కష్టం తీర్చడానికి నీవు తప్ప వేరే దిక్కు లేదు. ఏదో పెద్దవాడు (బ్రహ్మ) ఇట్లడుగుతున్నాడని దయచూడమ్మా!" అని బ్రహ్మ గంగాదేవితో అన్నాడు.

గంగాదేవి ఎట్టి పరిస్థితులలోనూ తనచేత కాదు అనకుండా ఉండడానికి బ్రహ్మ వాక్పటిగా మాట్లాడినాడు. అగ్ని తన స్వార్థం కోసం కాదు, ఈ బాధపడుతున్నది - పరులకోసమన్నాడు. స్వాహాధవుండు (స్వాహాదేవి భర్త- అగ్ని) అని కవి ప్రయోగించటం వల్ల, ఏదో ఆడుపిల్ల (స్వాహాదేవి) మొహమైనా చూసి ఇతని కష్టం తీర్చాలని చెప్పినట్లయింది. పైగా పెద్దవాడైన బ్రహ్మ స్వయంగా

వచ్చి అడగటంవల్ల, పెద్దవాని మర్యాద కాపాడటంకోసం అయినా గంగాదేవి తిరస్కరించకూడదన్న భావన ఉంది. కవి ఈ సందర్భంలో పై మహాక్కర వృత్తాన్ని ఎన్నుకొన్నాడు. గొప్ప అవసరం కలిగింది కనుక ఇక్కడ మహాక్కర వృత్తంలో వ్రాయడం సమయానుకూలంగా ఉంది. గొప్ప అక్కర కల్గింది కనుక 'మహాక్కర'లో వ్రాశాడు కవి. పైగా తెలుగువాడు మాట్లాడే ధోరణి కది చక్కని వాహికగా ఉపయోగపడింది.

## అల్పాక్కర :

బంగారు చాయ ఇబ్బంగి కమ
లంగా - నరములెల్ల లాగ నన్ గా
నంగా వచ్చె నితడు నన్న కొంచు
నంగద తీర్చునందనుక పోము. (చ. క : 23)

“బంగారుచాయతో మెరిసే ఈ అగ్ని ఈ విధంగా కమలి పోయాడు. అతనికి నరాలన్నీ లాగగా నీ కోసం వచ్చాడు. కాబట్టి ఆతని బాధ తీర్చేవరకు పోము” - అని బ్రహ్మదేవుడు గంగాదేవికి చెప్పాడు.

'అంగద తీర్చునందనుక పోము' అని ముందరి కాళ్ళకు బంధం వేశాడు బ్రహ్మదేవుడు. ఇక ఆమె ఎట్టి పరిస్థితుల్లోనూ వీరి కోరికను కాదనడానికి వీలు లేకుండా చేశాడు - బ్రహ్మ.

ఇట్లు వాకిట గూర్చుండ నేమిచేయు ! ?
అమృతసందోహ శైత్యభంగాభిరామ !
'సరియె' యన్నది - యనుటయే సరి ప్రసవించి
రౌద్రతేజస్సు నగ్ని బిరాన చనియె. (చ. క : 24)

బ్రహ్మదేవు డంతటివాడు చెప్పిన తర్వాత గంగాదేవి కాదంటుంది ? 'సరియె' - సరే అన్నది. ఆ ఒక్కమాట

అన్నదో, లేదో - దుర్ధరణమైన తేజస్సును గంగానదిలో వదిలిపెట్టి అగ్ని వెనుదిరిగి చూడకుండా బిరాన అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

అక్కడ చాలాసేపు ఉంటే ఆ తేజస్సును గంగానది మోయలేక తిరిగి నీది నీవు తీసుకుపొమ్మంటుందేమో అన్న భయం ఉంది కాబోలు పాపం - అగ్నిదేవుడికి. అందుకే వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయాడు. ఆ సమయంలో అగ్నిదేవుడు తాను బ్రహ్మదేవునితో కలిసి వచ్చానన్న సంగతి కూడా మరచిపోయి పరుగు తీశాడన్నమాట. ఆ శివుని వీర్యం ఎంత శక్తిమంతమైనదో అడుగడుగునా మనకు తెలుస్తుంది.

ఇక గంగాదేవి పడ్డ అవస్థ చూడండి :

అడుగున బ్రోయి మండగ - తదగ్నికి కుండికలోని నీరముల్
ఉడుకుచు తెర్లుచున్ పొంగల నుగ్రముగా పెనుచుట్లు కట్టుచున్
బుడబుడమంచు చప్పుడుల పొర్లెడు తీరుగ శైత్యమూర్తి తా
కడు సుడు చుట్టుకొంచు మెలికల్ తిరిగెన్ గను నాకు భీతిగా.

(చ. క : ౨౫)

గంగానది ప్రవాహంలో దుర్ధరణం ఎప్పుడైతే పడిందో వెంటనే అడుగున బాగా తీవ్రంగా మండుతున్న పొయ్యిమీద ఉన్న కుండలోని నీళ్ళు కుతకుత ఉడుకుతూ బుడబుడమనే చప్పుళ్ళతో పొంగి పొర్లుతూ తెర్లుతూ ఉన్నట్లుగా, గంగానదీప్రవాహం కూడా అదేవిధంగా సుడికట్టుకొని మెలికలు తిరుగుతూ చూసేవాళ్ళకే భయంగా ముందుకు సాగిపోయింది.

తరువాత గంగానదీప్రవాహం విషమావస్థకు గురి అయింది. ఆ అవస్థను వర్ణించడానికి కవి ఇక్కడ విషమగీతులైన ఎత్తుగీతి, కమలనగీతులలో వర్ణించాడు.

## విషమగీతులు

**ఎత్తుగీతి :**

వడ తాకుడునకు వల్లి
వడలి చన్నట్లు వాడి
కడు మ్లానమూర్తి గాగ
జడత కృశించి చనుచు. (చ. క : 26)

వడదెబ్బకు తీగ (వల్లి) అడలిపోయినట్లుగా వాడిపోయింది గంగ. చాలా నీరసించిపోయి కృశించిపోయింది.

**కమలనగీతి :**

ప్రళయవాయు తీవ్రవేగవశముచేత చెదరి
న లత మిగుల దూలి ముందునకును బడినయట్లు
అలఘు విషము నాని కాడల నడచినట్లు లాల
గళితఫేన యగుచు సుడులు కట్టి తూలి చనుచు. (చ. క : 27)

ప్రళయకాలపు గాలియొక్క తీవ్రవేగంచేత విరిగిపోయిన తీగలాగా, మిక్కిలి తూలుతూ ముందుకు పడినట్లుగానూ, విషంలో నాని బయటకు నడచినట్లుగా, చొంగలు చొంగలుగా స్రవిస్తూ నురుగు సుళ్ళు కట్టి తిరుగుతూ ముందుకు తూలుతూ పోయింది - గంగ.

అంత బాధపడ్డప్పటికీ గంగాదేవి బ్రహ్మను పల్లెత్తిమాట అనలేదు. చూసేవాళ్ళకే కడుపు తరుక్కుపోయేటట్లు ఉంది - ఆమె అవస్థ. తన బాధ తనలోనే పడిందికాని, ఈ అవస్థకు కారణభూతుడైన తనను ఒక్కమాట కూడా అనలేదని బ్రహ్మదేవుడు ఇంద్రునికి చెప్తున్నాడు. ఈ భావాన్ని కింది పద్యంలో చూడండి :

## మం జ రీ ద్వి ప ద :

కలుగు బాధలనెల్ల కడుపులో దాచి
గంభీరముద్రతో కదలిపోవుచును
ఘనతుషారచ్ఛన్న కంజమై యుండ
మాచువారల కడుపు చుమ్మ చుట్టెడిని
తన బాధ తనయందె దాల్చెనే గాని
నోర్విప్పి యనెనె నన్ను నొకింత మాట ?
కలుషౌఘపావని గంగాభవాని
ఆ తల్లి నడవడి అఖిల మ్మొరవడి. (చ. క : 28)

చనియె సమల్ సహస్రము - నిశాటకులేంద్రుడు తారకుండు పె
ట్టిన ఘనబాధకున్ సుడివడెంగద త్రైదివ మెల్ల దానికం
టెను త్రిగుణంబుగాగ శివనిర్భరవీర్యపటుత్వదాహ ధా
రణమున తల్లి వడ్డది చిరమ్ము జగమ్ము హితమ్ము కోసమై

తారకాసురుడు ముల్లోకాలను పెట్టిన గొప్పదైన బాధకంటే మూడింతలు ఎక్కువగా బాధపడ్డది గంగాదేవి - 'శివనిర్భరవీర్య పటుత్వదాహ ధారణమున తల్లి పడ్డది చిరమ్ము జగమ్ము హితమ్ము కోసమై' అన్నదానిలో 'మ'కారం ముమ్మారు ఆవృతమైనందువల్ల, గంగానది పడ్డ కష్టం ఎంతటిదో పాఠకుడు అర్థం చేసుకోవచ్చు. మూడు రెట్లు ఎక్కువ కష్టపడింది - అని చెప్పడానికి 'మ'కారావృత్తి మూడుసార్లు కవి చెప్పాడు.

చాలాకాలం శివుని మహావీర్యాగ్నిని మోసుకుంటూ వెళ్ళి గంగానదీదేవత కాశవనం(రెల్లుతోట)లో విడిచిపెట్టింది. ఆ కాశవనంలో పరమాద్భుతమైనటువంటి శైవకాంతి గడ్డకట్టి (అంటే జైగోట్ - సంయుక్తబీజం ఏర్పడిందన్నమాట) అత్యంత దివ్యమైన తేజస్సు

కలిగిన శిశువై పుట్టినాడు కుమారస్వామి. చంద్రుడు, సూర్యుడు, అగ్ని - వీరి ముగ్గురి తేజస్సులు కలిసిన శక్తినే 'సోముడు' (స + ఉమ) అంటారు. ఈ తేజాన్నే బంగారు కాశ (స్వర్ణకాశ) మంటారు. దీనికే పృథుగర్భమని పేరు. ఈ భావాన్ని కింది పద్యంలో గమనించవచ్చు.

> త్రిగుణమూర్తి, గంగ దినమణి చంద్రాగ్ని
> వపుష, చంద్రు డగ్ని బ్రధ్నుడనగ
> సోము డతని తేజమే మరి బంగరు
> కాశ మందురు పృథుగర్భ మదియె. (చ. క : 39)

కవి ఇక్కడ సోముడు (స + ఉమ = ఉమాసహితుడు) అన్న ప్రయోగం చేసినందువల్ల పార్వతి తేజస్సు కూడా అందులో ఉందని అర్థం. ఈ పృథుగర్భాన్నే మహాయోని అని తంత్రం చెప్తోంది. అదితి అని, ఋతమని వేదాలు వక్కాణిస్తున్నాయి. దేవి అని పురాణాలు, మూలప్రకృతి అని సాంఖ్యం దీన్నే వర్ణిస్తున్నాయి (చూ. కుమారభారతి : పుట. 45). కనుకనే కుమారస్వామి కాశవనంలో ఉద్భవించడం రెల్లువనం పార్వతీగర్భం. కనుకే అక్కడ శిశువై పుట్టాడు కుమారస్వామి. ఇంత మహత్తరంగా శక్తిమంతంగా పుట్టినవాడు కనుకనే, పుట్టిన మూడు దినాలకే క్రౌంచపర్వతానికి శివధనుస్సు చేత పట్టుకొని రంధ్రం చెయ్యగలిగాడు అని కవి ఈ కావ్యంలో ప్రత్యక్షంగా చెప్పకుండా పరోక్షంగా సూచించాడు. ఇంత మర్మగర్భితమైన కవిత్వముంది కనుకనే, విశ్వనాథవారు ఈ కావ్యాన్ని ప్రౌఢకావ్య మనక తప్పటం లేదన్నారు (ప్రౌఢ కావ్యమనటానికి నిఘంటువుల కతీతంగా ఉన్నటువంటి పదాలు, పదబంధకల్పనలు, ప్రకృష్టమైన భాష, అందమైనట్టి సుదీర్ఘమైన సమాసాలు, ఉచితపదజాలం, సౌమ్యపదాలు మొదలైన పదాలతో

పాటు, వేదాంతసారం, యోగపరంగా మర్మగర్భితమైన కవిత్వముండటం కూడా ఒక కారణం).

కుమారస్వామి క్రౌంచపర్వతానికి శివధనుస్సు చేత రంధ్రం చేసిన శబ్దానికి ఇంద్రుడు భయపడి సప్తమాతృకలను వేడుకొని భయంకరమైన ధ్వనికి కారణమెవ్వరో కనుక్కొరావడానికి పంపించాడని ఇంతకుముందు చెప్పుకున్నాం. వారు మాట్లాడుకుంటూ వచ్చి హిమవత్పర్వత ప్రాంతంలో సమావేశమయ్యారు.

ఆ శబ్దం వచ్చినచోటు ఎక్కడ ఉండవచ్చునని ఆలోచిస్తున్న సమయంలో - తెల్ల తామరపూలతోను, మకుటదళాలతోను (కేసరాలను చుట్టి ఉండే పూరేకు) కదలి దూకుతున్నట్టి గంగ కృత్తికల పాదాలకు అర్ఘ్యములొసగింది. సహజంగానే గంగాప్రవాహంలో తామరపూలు, ఆకులు మొదలైనవి కలిసి ఉంటాయి. దాన్నే కవి వక్రీకరించి చెప్పారు. ఈ భావాన్ని కింది పద్యంలో గమనించవచ్చు.

హరు జటాజూటమున సుధాకర శకలము
పుండరీక సంవర్తికముం బొనర్చ
అల్లలాడించి దుమికినయట్టి గంగ
అలరి భగినుల కర్ఘ్యపాద్యము లొసంగ. (తృ. క : ౩౨)

ఆ కృత్తికామతల్లులు గంగానదిని చూశారు. అప్పుడు ఆ గంగాదేవి బాలెంతరాలుగా ఉన్నది. ఆ బాలెంతరాలి వర్ణన చాలా అందంగా సహజమైన పద్ధతిలో ఉంది - అది చూడండి :

(శ్రీ) సితవారికాంతుల కృశించిన మేనును - ఫుల్లకైరవో
ద్భాసిత వక్త్రమండలము - పంకజపాంసు నిశావిలిప్తమై
భాసిల తెల్లవాలుగల స్వచ్ఛవిలోచనముల్ చలింప గం
గాసతి అర్ధు క్రీగడుపునన్ గల చారలు చూచి నవ్వుచున్.
(తృ. క : ౩౩

ఇక్కడ కృశించిన మేను అంటే, కాన్పు తర్వాత బాలెంత చిక్కిపోతుంది. మొహం తెల్లకలువలు ప్రకాశించినట్లుగా (ఫుల్లకైరవోద్భాసిత వక్త్రమండలము) ఉన్నది. అనగా బాలెంత మొహం తెల్లబడటం సహజం. అలాగే కన్నులు కూడా (తెల్లవాలు గల స్వచ్ఛవిలోచనముల్) తెల్లగా ఉన్నాయి. కన్నులు పాలిపోయినట్లుగా బాలింతకు ఉండడం మనం చూస్తుంటాం. కాన్పు తర్వాత - అంటే బిడ్డ కలిగిన తర్వాత- పొత్తికడుపు (క్రీగడుపు)పై ముడతలు చారలలాగా బాలింతకు చాలాకాలం ఉంటాయి. ఈ విషయాన్ని కవి 'గంగాసతి అడ్డు క్రీగడుపున్ గల చారలు' అని చక్కగా ఛందోబద్ధం చేశాడు. ఇలా ఒక మానవ స్త్రీకి ఏ విధంగా అయితే బాలింత లక్షణాలు ఉంటాయో, ఆ లక్షణాన్ని గంగాదేవిపై ఆరోపించాడు కవి. ఇక గంగానదిని జడపదార్థంగా తీసుకున్నా కూడా అర్థం సహజంగానే ఉంది. 'పంకజపాంసు నిశానిలిప్తమై' అన్నందువల్ల పసుపుపచ్చనిపూలు (పాంసు = పొడి, రజం, ధూళి), వాటి పుప్పొడిచేత గంగాజలం కప్పబడి (విలిప్తమై = కప్పబడి) ఉండడంచేత నదీప్రవాహం అడుగున చారలలాగ కనిపిస్తాయి. అంతేకాక నది అడుగున ఇసుకపొరమీద ఉండే చారలు కూడా గమనించదగ్గవే. పసుపుపుప్పొడి అన్నందువల్ల బాలింతలకు శరీరాన్నంతా పసుపుతో పూస్తారు. దీన్ని పసుపుపుప్పొడి, పూలచేత కప్పబడినట్లు వర్ణించడం ద్వారా కవి బాలింత లక్షణాన్ని గంగానదిపై ఆరోపించాడు. ఇది ఒక చక్కని భావన. భావించగల సహృదయుడైన పాఠకుడు ఈ పద్యంలో అందాన్ని గ్రహించలేకపోడు.

ఆ విధమైన గంగాదేవిని చూసి ఇక్కడ ఎవ్వరో 'బెట్టిదపు మోత కావించెనంట' నీ కేమైనా తెలుసునా అని అడుగుతారు. సప్తమాతృకలు. ఆమె ఉత్తరదిక్కును చూపిస్తుంది. వారందరూ

గంగతో కలిసి 'ప్రమోదతరంగ సంగతోజ్జ్వల జలజాత చిత్తులయి వాహనయుక్తులయి' ముందుకు సాగిపోయినారు. కొంత దూరం పోయిన తర్వాత గంగాదేవి కృత్తికలను ఆగమన్నది. అప్పుడు వారందరూ గంగ ప్రక్కకు చలించే దిక్కుగా చూశారు. అప్పుడే వారికి 'మహోజ్జ్వల మంజుల శుభకీర్తి చంద్రికవలే ఉన్న ఒక ప్రతిలేని వీరుడు' - కుమారస్వామి - కనపడ్డాడు (తృ. క : 37). ఈ సందర్భంగా గంగాదేవి కుమారస్వామి ఉన్నవైపు - చేతితో చూపినట్లుగా కాకుండా గంగానది కుమారస్వామి ఉన్నవైపు- ఒక చిన్న పాయగా ముందుకు కదలగా సప్తమాతృకలు చూశారని("గంగ అంగుళి చలించెడు దిక్కుగ చూచిరందరున్" - తృ. క : 36) చెప్పడంతో కవికి ప్రకృతిపట్ల గల గౌరవం, మమకారం, ఆరాధన మనకు సుబోధకమవుతాయి.

'శివభవ్యతేజమ్ము భద్రమైన చిరుత రూపము దాల్చినదో' (తృ. క : 41) అన్నట్లుగా ఉన్న బాలుని చూసి, ఆ మహోగ్రరవాన్ని కలుగజేసినవాడు ఇతడా అని ఆశ్చర్యపడ్డారు సప్తమాతృకలు.

వారికి ఆ శిశువును చూసిన తర్వాత భయం పోయింది. తన కడకు వచ్చే మాతృసప్తకాన్ని గాంచి ఆ కుమార శిశువు ఎదురు రాగా ఎత్తుకొని ముద్దాడి చలిపడుతుందేమో అని ఆ తల్లులు పయ్యెదలు కప్పినారు (తృ. క : 47).

"అఖిల లోకాలకు తల్లి అయిన గంగామూర్తిలోని చిరు భాగాలమే మేము కాబట్టి, నీవు మాకు బంగారుబిడ్డ వౌతావు" (తృ. క : 49) అని వారు కుమారస్వామితో అంటారు. "నీ జననం కోసం దేవతలందరూ ఎదురుచూస్తున్నారు. దేవేంద్రునిపై

(6)

చెప్పుకున్నాం. ఆ వజ్రాయుధపు తాకిడికి కుమారస్వామి శరీరంనుంచి విశాఖుడు పుట్టాడు. ఈ విషయం ఈ సందర్భంలో చెప్పకుండా పంచసుకవులంలో విశాఖ రాయబారఘట్టంలో విశాఖునిచే చెప్పించడం ద్వారా, విషయం పునరుక్తం కాకుండా కవి జాగ్రత్తపడ్డాడు.

**మధ్యాక్కరలు ;**

రాయబారిగ వచ్చినాడ రాక్షసాధిప ! దేవసైన్య
నాయకు నిశితాజ్ఞ చేత నను విశాఖుండందు రెల్ల.

ప్రకృతి ఛందోగమనమ్ము రమణీయ ధర్మమ్మటందు
సుకవులు మునులు తద్ధర్మ సుందరగమన రక్షకమ
చకిత వజ్రమ్ము తత్రోకధ సంహతి స్కందుని మేను
నకు తాక పుట్టితి స్కందునకు నాకు భేదమ్ము లేదు

(పం. క : 10, 11)

విశాఖుడు స్కందుని (కుమారస్వామి) శరీరంనుంచి పుట్టినవాడు కావటంవల్ల, కుమారస్వామికి, విశాఖునికి భేదం లేదు - అభేదం చెప్పబడింది. మనం ఎప్పుడైతే కుమారస్వామి జననం గురించి చెప్పుకుంటామో, అప్పుడు విశాఖుని పుట్టుక కూడా చెప్పుకోవాలి. అలా చెప్పకపోతే కుమారస్వామి జన్మ పూర్తి అయినట్లుకాదు. ఇంద్రుడు వజ్రాయుధాన్ని, నాశనం కావాలని వేస్తే దానికి బదులుగా కుమారస్వామి తనలాంటివాడిని ఇంకొకడిని సృష్టించుకోవడం ఇక్కడ గమనించదగ్గది. ఈ విధంగా కుమార విశాఖులు జన్మించారు.

భారతి : ఏప్రిల్ 1989.

# అభిషేక పర్వం

ఈ భాగంలో బ్రహ్మదేవుని ఆజ్ఞ ప్రకారం ఇంద్రుడు దేవతల సైన్యాధిపతిగా నియమించే సమయంలో జరిగిన సుందరమైన అభిషేక ఘట్టాన్ని ప్రదర్శించడమైనది.

కుమారస్వామి తాను పుట్టిన మూడు దినాలకే క్రౌంచ పర్వతాన్ని శివధనుస్సుతో తొలిచి రంధ్రం చేశాడని, దాని కారణంగా ఉద్భవించిన బ్రహ్మాండమైన శబ్దం ముల్లోకాలూ దద్దరిల్లేటట్లు వచ్చిందని, ఆ శబ్దం శత్రువుదేమో అన్న భయంతో ఇంద్రుడు తన సైన్యం తీసుకొని వచ్చాడని ఇంతకుముందు భాగంలో చెప్పాము. ఆ దేవతల సైన్యాన్ని కుమారస్వామి ఓడించాడు. అంతలో అక్కడ బ్రహ్మ సాక్షాత్కరించాడు. బ్రహ్మ ఇంద్రాదులకు కుమార జననం గురించిన కథ చెప్పాడు. కుమారస్వామి జన్మవృత్తాంతం బ్రహ్మదేవుని ద్వారా విన్న ఇంద్రునికి షణ్ముఖుడు ఎలా కనిపించాడో కింద చూడండి :

నయనద్వాదశకమ్ము - దేహము మృగాంకస్నిగ్ధముల్గా - శుచి
స్మయ తేజోధికదీప్తి సంయతభుజాస్తంభమ్ములందోప తై
క్ష్ణ్యయుతంబౌ నిటలంబు నీ ప్తమగు బ్రధ్నప్రౌఢి చిక్కన్ - శిలో
చ్చయ కోదండకిణాంకవక్షుడు మహేశస్ఫూర్తి గాన్పింపగన్.

(చ. క : 43)

పన్నెండు నేత్రాలు కలిగి శరీరం చంద్రమండలంలాగా ఉంది. పొడవైన భుజాలలో అగ్నిదీప్తి ఉంది. విశాలమైన ఫాలస్థలం సూర్య బింబంలాగా మండిపోతోంది (ఫాలస్థలంలో సూర్యదీప్తి ఉంది). మేరు పర్వత ధనుస్సుయొక్క నారిని లాగటంచేత కాయకాసిన రొమ్ము గల కుమారస్వామి ఈశ్వరుసలాగా కనిపించాడు.

ఈ పద్యంలో మూడు ఉపమానాలు ఉన్నాయి. 1. చంద్ర మండలంలాగా శరీరమున్నది. 2. భుజాల్లో అగ్ని తేజస్సు ఉంది. 3. నిటలమునందు సూర్య తేజస్సు ఉంది. కుమార జననంలో గంగను గురించి చెప్పినపుడు, దినమణి, చంద్రాగ్నివపుష (చ. క : 33) అని సూర్యుడు, చంద్రుడు, అగ్ని మూడు విషయాలు వచ్చాయి. ఈ మూడూ కలిస్తే ఈయన పుట్టాడు. అందుచేత ఆయన శరీరంలో మాతాపితృ లక్షణాలు ఉన్నాయి. కనుక సూర్యచంద్రాగ్ని తేజస్సులు ముద్దకట్టి కుమారస్వామి అయినాడు. ఈ మూడు తేజస్సుల విషయమంతా కూడా యోగశాస్త్రంలో వస్తుంది. మేరుదండంలో - వెనుపాములో - కేంద్రనాడి సుషుమ్న. ఎడమ ప్రక్క ఇడానాడి. కుడి ప్రక్కన పింగళానాడి. ఈ మూడూ త్రిగుణములని, గంగా యమునా సరస్వతులని, సూర్యచంద్రాగ్నులని చెప్పబడ్డాయి. కాబట్టి ఈ మూడు మాటలు (సూర్యచంద్రాగ్నులనే మూడు మాటలు) దానికి సంబంధించినవి. పైగా కొన్ని కొన్ని సహస్రనామాల్లో - లక్ష్మీ, లలితా సహస్రనామాల్లో - దేవి యొక్క తేజస్సు ఒక్కొక్క స్థానంలో ఒక్కొక్క రకంగా ఉంటుందని చెప్పబడింది. ఉదాహరణకు : లలాటంలో ఆమె సూర్యకాంతి వంటిదని చెప్పబడింది. (అందుచేత సూర్యుణ్ణి లలాటంలో ధ్యానం చెయ్యాలి.)

కుమారస్వామి ఎవరికీ విధంగా కనిపించాడు అంటే - దేవసేనకు. దేవసేన ఆయనను పురుషునిగా చూసింది. ఎందుకంటే బ్రహ్మదేవుడు ఇంద్రునితో కుమారస్వామిని దేవసేనానాయకునిగా చేయమన్నాడు. కనుక దేవసేన ఆయనను పురుషునిగా చూసింది. దేవసేనను ఈయన ఎలా చూశాడు - అనేది కింద చెప్పబడుతుంది. దేవసేన అంటే దేవతల సైన్యం. దేవసేనను ఈయన స్త్రీగా చూశాడు. దేవసైన్యంలో స్త్రీత్వ ఆరోపణ చెయ్యటానికి అందమైన

ఈ క్రింది పద్యంలో చూడవచ్చు. దేవసైన్యంలో ఉండే వివిధ సామగ్రి, వాహనాలను వివిధ అవయవాలుగా భావించటం ద్వారా సుందరమైన వర్ణన చేయబడింది.

రథనేమిపృథుకుంభ రమణీయ వక్షోజ
ధ్వజపటాంత చల దపాంగతరళ
పేచకిఘనశీర్ష వితత కటీతటి
గజదంతపాటల గండయుగళ
మండలీకృత ధనుర్దండ చారుభ్రువు
అశ్వవాలభర కైశ్యాభిరామ
తీవ్ర కుంతనిశాత దృక్ప్రంజ విభ్రమ
ఘన కేట సన్నిభ జఘన ఫలక

పరమపతిదేవతా దివ్యభావమొంది
కర్కశయుగోరు గజయానగా స్ఫురించె
చిత్రశిఖివాహు కమల విచిత్రచారు
తా విభవనిధాన 'మహిత' దేవసేన. (చ. క : 44)

దేవతల సైన్యంలోని రథ చక్రాల కుండలు దేవసేన వక్షోజాలు. రథానికి గల కేతనాలే అవయవాలు. ఏనుగు కుంభస్థలమే స్త్రీ నితంబం (కటి). యుద్ధాలకు పోయేటప్పుడు రక్తపుమరకలు కనిపించకుండా ఏనుగు కుంభస్థలాలకు కుంకుమను పూస్తారు. కనుక ఆమె (దేవసేన) కటిమీద ఎఱ్ఱని వస్త్రం కట్టుకొని ఉన్నది. గజదంతాలే ఆమె గండస్థలాలు (చెక్కిళ్ళు). ఎక్కుపెట్టిన ధనుస్సే ఆమె భృకుటి. (మండలాకారంగా - వలయాకారంగా చేయబడ్డ ధనుస్సు - భృకుటితో పోల్చబడ్డది. భృకుటి = కనుబొమ్మలు). గుఱ్ఱపుతోక ఆమె జడ. ఈటె మొనవంటి చూపులు గలది. అంటే తన ప్రియుణ్ణి (భర్తను) నిశితంగా చూసినప్పుడు ఈటె మొనవంటి

చూపులు వస్తాయి. ఆమె డాలువంటి జఘనం (మొల) కలది. (జఘనం, నితంబం అనే మాటలు రెండు వస్తాయి సాహిత్యంలో. 1. జఘనమంటే ముందుభాగం - నాభిస్థానంనుండి తొడల మూలం వరకు గల భాగం. 2. వెనుకభాగం నితంబం - కటి. ఇలా ఈ రెంటికీ తేడాలున్నాయి.) ఈ విధంగా పతివ్రతారూపం ధరించినటువంటి దేవసేన - యౌవనంలో ఉన్న స్త్రీ - యొక్క- ఊరువులు (తొడలు) రథానికి కట్టిన కాడిలాగా కర్కశంగా ఉన్నాయి. గుఱ్ఱాల మెడ మీద ఉండే కాడి ఊరువులతో పోల్చబడింది. ఆ కాడివంటి ఊరువులే గజయాన (స్త్రీగా) స్ఫురించింది. (ఇక్కడ దేవసేనలో నిజంగా కూడా గజాలున్నాయి. గజగమనములూ ఉన్నాయి). స్ఫురణ అనేది Imagination కి సంబంధించినది. విచిత్రమైన సౌందర్యమునకు నిధానమైన ఆ దేవసేన పేరు 'మహిత' (మహిత - అంటే మహత్తర మైన సేన అని కూడా తాత్పర్యం). ఈ విధంగా కుమారస్వామికి దేవసేన కనబడింది.

బ్రహ్మదేవుడు ఇంద్రునితో కుమారస్వామిని దేవసేనాపతిగా (సైన్యాధిపతిగా) చేయమన్నాడు. కనుక ఆయనకు పై విధంగా దేవసేన ప్రియురాలిగా (భార్యగా) కనబడింది.

ఇక ఈవిడకు (దేవసేనకు) ఆయన ఎలా కనబడ్డాడో కింద చెప్పబడుతున్నది.

ద్వాదశ దీర్ఘ బాహుఘనదండకములందు పరాక్రమస్ఫురత్
దీధితులొప్ప - హస్తితలదీప్త మహేశ్వరిచాపదండముల్
ఆదృత భర్తృభావుడయి అందముగా కనుపించె లోచన
స్వాదు మనోహరాంగకుడు శైవకుమారుడు దేవసేనకున్.

(చ. క : 45)

నేత్రాలకు ఆస్వాదయోగ్యంగా ఉన్న శరీరం గలవాడైన కుమారస్వామి ఆదరింపబడిన భర్తృభావం కలవాడై (ఆదృత భర్తృభావుడై) అంనంగా కనిపించాడు. అంటే ఆయన భర్తృభావాన్ని తనమీద ఆరోపించుకొన్నాడు [పాపం, అది (దేవసేన) కోరుకుంటోంది గదా - సరే లెమ్మనట్టు]. పన్నెండు బాహువులలో పరాక్రమ దీప్తులు విరజిమ్ముతున్నటువంటి, మేరుపర్వత ధనుస్సు ధరించినటువంటివాడైన కుమారస్వామిని దేవసేన చూసింది.

ఎప్పుడైతే పురోహితుడైన బ్రహ్మ 'మీరిద్దరూ భార్యాభర్త' లన్నాడో, వారిద్దరూ (దేవసేన - కుమారస్వామి) ఒకరి నొకరు చూసుకున్నారు.

బ్రహ్మ ఇంద్రునికి కుమారస్వామి క్రౌంచ పర్వతాన్ని తన శక్తితో ఎందుకు గండిపెట్టాడో చెపుతున్నాడు :

క్రౌంచము నల్లుగా గాని సురద్విషయూథము మేరువాసులన్
గాంచును హానులన్ సురలగాంచు భుజింపగ గామరూపులై
కాంచి మహాస్త్రశక్తి గిరిగర్భము చీల్చెను కొల్వగాగ - వీ
క్షించిన బాలచాపలపు కృత్యమునా రణనీతిచండతన్.

(శ. క : 55)

క్రౌంచపర్వతాన్ని శక్తి బాణంతో తొలిచాడు కుమారస్వామి. ఎందుకు చేశాడంటే ఏదో బాల్యచేష్ట అనుకుంటావేమో!- అలాకాదు - క్రౌంచపర్వతాన్ని ఆశ్రయంగా చేసుకొని, మునులను, ఆశ్రమాలను పాడుచేస్తున్నారు రాక్షసులు. వాళ్ళకు ఆశ్రయాన్ని నాశనం చేయడానికోసం దానికి రంధ్రం పెట్టాడు. అంటే దొంగలు దాక్కోవడానికి వీలు లేకుండా ఆ చివరినుంచి ఈ చివరివరకూ

స్పష్టంగా కనబడుతుంది. అందుచేత ఇది రాజనీతికి సంబంధించిన విషయం.

> షష్ఠి నేడు సరస్వతీ సైకతముల
> సోమతీర్థాన దేవసేనా మనోజ్ఞ
> ప్రభుతకున్ - వీని కషిల శివంకరముగ
> నిర్వహింపుము - అభిషేక పర్వగాథ. (చ. క : 56)

శరీరంపై కవచం లేకుండా శివధనుస్సు చేత పట్టుకొని ఉన్న చిరుప్రాయంగల—కుమారస్వామిని - చాలా విస్తారమైన ఇంద్రుని సైన్యంముందు నిలబడి ఉన్నట్టి షణ్ముఖుని - అభిషేకించమని ఇంద్రునికి బ్రహ్మ చెప్పున్నాడు (చ. క : 4). "నేడు షష్ఠి. సరస్వతీ నదీతీరానగల సోమతీర్థంలో ఈ అభిషేక కార్యాన్ని నిర్వహించ"మని బ్రహ్మ నిర్దేశించాడు.

బ్రహ్మదేవుని వాక్కులు ఇంద్రుని మనస్సులో భక్తిని ప్రేరేపింపగా, ఆర్ద్రితాక్షస్థితో అధిక తేజోమయుడైన కార్తికేయుని చూసి ఈ విధంగా ప్రార్థిస్తున్నాడు : (చ. క : 57)

**కవిరాజ విరాజితము :**

> జయజయ రత్నసుసంగతకంకణ ! స్వర్ణకిరీట ద్యుమత్ప్రసరా !
> జయజయ కుండల సంఘటితారుణ సాంధ్యకటస్థల చారుతరా !
> జయజయ స్వర్ణవిశాల నగేష్వస శక్తివిదారిత శత్రువరా !
> జయజయ హేంబుతశాసన కారణజన్మ ! జగద్ధిత శాంతికరా !
> (చ. క : 58)

ఇక్కడ ఇంద్రునిచేత స్కందుని కవిరాజ విరాజితంలో స్తుతింపజేయడం అందంగా ఉంది. కవిరాజ విరాజితమైతే స్తుతి చేసుకోవడానికి వీలున్న నడక - ఈ ఛందస్సులో ఉంది. ఇలాంటి

చోట్ల పద్యం పాడాలి తప్ప, చదువకూడదు. పద్యం పాడినప్పుడే ఎఫెక్ట్ కమ్యూనికేట్ అవుతుంది (భావం సరిగా అభివ్యక్త మవుతుంది). ఈ పద్యంలో ఒక అంతర్లయ వి(శ్రుగతిలో ఉంది (తాత్పర్యంకోసం: చూ. యుద్ధ వర్ణన - స్యందనం: ద్వితీయదళం మ. ద్వి : 12

తల్లి జగత్ప్రసూత మరి తండ్రి జగత్పతి నీవు పుట్టి మూ
న్నాళ్లును కానులేదు భువనత్రయ దీవ్యదుదార ధర్మ సం
పల్లత కూతకోల యగు వజ్రము కుంఠితమయ్యె త్వద్భుజా
పల్లవితోగ్రశక్తి - త్రిభువమ్ములకున్ బతి నీవ కాదగున్.

(చ. క : 5

"మీ తల్లిదండ్రులు జగత్తుకే తల్లిదండ్రులు. మరి నీవేమో పుట్టి మూన్నాళ్ళు కూడా కాలేదు. ముల్లోకాలలో ధర్మాన్ని సంరక్షించడానికి ఊతకోలయైన వజ్రాయుధం ప్రస్తుతం అశక్తమయింది (శక్తిలేనిదయింది). నీ గొప్ప భుజపరాక్రమం చూస్తే నిజంగా ముల్లోకాలకూ పతి అయ్యే తాహత్తు నీకుంది - " అని కుమారస్వామిని మనసారా ఇంద్రుడు వేడుకున్నాడు.

దేవసమూహమంతా నిశ్శబ్దంగా ఉంది. ఇంద్రుడు అంజలి ఘటించి భక్తితో త్రిదివలోకాధినాథుడైన స్వామివైపే చూస్తూ ఉన్నాడు. శివరూపాన్ని ధరించినటువంటి కుమారుని ఆత్మ ప్రసవించి శబ్దరూప మయింది.

అంజలి ఘటించి భక్త్యాత్ముడైనవాని
త్రిదివలోకాధినాథుని తీరు గాంచి
ధృత కుమారతా శివకృపార్ద్రీకృతాత్మ
పైకి ప్రసవియించె శబ్దరూపమ్ము దాల్చి. (చ. క : 

ఇక్కడ శివరూపం ధరించినటువంటి కుమారునిముందు ఇంద్రుడు ఎంత వినయంగా భక్తిగా ఉన్నాడో ఈ పద్యంలో తెలుస్తుంది. తప్ప, వాక్యంలో చెప్పడానికి వీలు పడదు. 'శబ్ద రూపమ్ము దాల్చి' అని కవి వాడటం ఇక్కడ గమనించదగ్గ విషయం. శబ్దం కూడా భగవంతుని లక్షణమే అవుతుంది. అంటే భగవంతుడు శబ్దరూపాన్ని దాల్చబోతున్నాడు అని చెప్పడం భౌతికంగా మాత్రమే కాదు - శబ్దమన్నది భగవల్లక్షణాలలో ఒక ప్రముఖమైన లక్షణం. దేవుడు శబ్దస్వరూపుడై జిహ్వాతో (గురువుతో) కూడుకొని మూగవానిచేత ఇహపర వాక్కులను పలికిస్తున్నాడు - అనే మర్మగర్భితమైన వేదాంత రహస్య మొకటి మనకు ఉంది. మానవుని లక్షణం మూగతనం. భగవంతుని లక్షణమైన శబ్దం గురు లక్షణంతో కూడుకొని మానవునిలో ఉన్న మూగతనాన్ని పోగొట్టి శబ్దం ద్వారా పలికింపజేస్తోంది - అంటే అచేతనత్వాన్ని చైతన్యం చేయడం భగవల్లక్షణం.* అందుకే ఇక్కడ శివరూపం శబ్దరూపంగా మారిందని చెప్పడం. కవి ఒక శబ్దంద్వారా ఎంత సత్యాన్ని చెప్పాడో జాగ్రత్తగా చూసుకోవాలి. ప్రతి పదాన్నీ భావుకుడైన వ రకుడు మొలకువతో చూసుకోవలసి ఉంటుంది. ముఖ్యంగా ఇలాంటి ప్రౌఢకావ్యాలలో శబ్దం వెనుక రెండు శబ్దాలను కూర్చడం ద్వారా ఎన్ని లోతులు దాగి ఉంటాయో తెలుస్తుంది. ఇదే మాట రెండు రకాలుగానూ చెప్పవచ్చు. ఇంద్రుని చూసి కు రస్వామి 'ఈ విధంగా చెప్పెను' - అంటే పాఠకునికి మామూలు మాట అయిపోతుంది. కుమారరూపం శబ్దరూపం దాల్చింది అని ఎప్పుడైతే కవి అన్నాడో, మనం కూడా కవి స్థానంలోకి పోయి ఆలోచించక తప్పదు.

---

* ఇంకా పూర్తి వివరాలకు : చూ. 'తత్త్వగేయాలు - బ్రహ్మసారం' స్రవంతి : జనవరి : 1982.

కుమారస్వామి ఏమి చెప్తాడో అని దేవసైనికులందరూ ఎంతో ఆసక్తిగా నిశ్శబ్దంగా ఎదురుచూస్తున్నారు. (చ. క : 62)

మధ్యాక్కర :

"కట్టా మహామృతాంధ స్సకల పూజ్య సామ్రాజ్య ధర్మ
ఘట్టాంక పరిపాలనా విఘటిత నిర్మల కీర్తి వీవు
పుట్టి మూన్నాళ్లు కాని పసిప్రాప నినుగను నేనెడ ?
ఇట్టి లోకత్రయీభారధృతి యేడ? పాడియే నీకు !

మహాక్కర :

శశికళాస్నిగ్ధకోమలాత్ముండు - క్ష్మాధరధనుఃపాణి
పశుపతికృపాలవమ్ము చే పట్టగల్గుదు విల్లింత
వశపడిన కయ్యమున పాయపడగలనేమో కాని,
ప్రసృమరబ్రహ్మవాక్కుండె పై శిరోధార్యమ్ముగా"
(చ. క : 63, 64)

మధ్యాక్కర, మహాక్కరలు సంభాషణకు అనుకూలంగా ఉంటాయి. అందమైన తెలుగు నుడికారాలతో చెప్పడం పై పద్యాల్లో కనిపిస్తుంది. అంత మహాభుజబల పరాక్రమశాలి అయికూడా, ఈ క్రింది నుడికారాలతో ఎంత చక్కగా వినయంగా కార్తికేయుడు ఇంద్రునికి చెప్పాడో చూడండి. మరి దేవేంద్రుడంటే సామాన్యుడు కాడు కదా, స్వర్గాధిపతి ! అటువంటివానితో ఎల్లా వినయం ప్రదర్శించాలి ! అందుకే ఈ మధ్యాక్కర, మహాక్కరలు.

"విశాలమైన మహాసామ్రాజ్యాన్ని ధర్మంగా పరిపాలించి నిర్మలమైన కీర్తి పొందిన మహారాజువు నీ వెక్కడ! పుట్టి మున్నాళ్ళు కూడా కాని పసిబిడ్డను నేనెక్కడ ! ఇటువంటి ముల్లోకాలను పరిపాలించే భారమెక్కడ ! (దీన్ని ఆధారంగా చేసుకునే ఇటీవలి

ఆధునిక నుడికారం - 'నా సర్వీసంత లేదు నీ ఏజ్' అంటూ ఉండటం మనం చూస్తుంటాం. కాకపోతే ఈ ఆధునిక నుడికారంలో తన ఎక్స్‌పీరియన్స్ తానే చెప్పుకుంటాడనుకోండి. కుమారస్వామి వినయ శీలుడు కనుక ఇంద్రుని అనుభవ కాలాన్ని - ఎక్స్‌పీరియన్స్‌ని, గొప్ప తనాన్ని గురించి చెప్పాడు).

"శశికళా స్నిగ్ధ కోమలాత్ముడు, కొండను విల్లుగా చేసుకున్న వాడు అయినట్టి శివుని కృపచేత విల్లు చేపట్టగల్గి, యుద్ధంలో సయితే సాయపడగలనేమో కాని, ఈ లోకత్రయీభారమన్నది నాకు సాధ్యమా ? ఆపైన బ్రహ్మవాక్కు ఎట్లా ఉంటే అదే శిరోధార్యం మవుతుంది." అంతటి నీవెక్కడ? పుట్టి మూణ్నాళ్ళు కాని నేనెక్కడ?- అనటంలో చక్కని తెలుగు నుడికారం ఇక్కడ అందంగా అమరింది. 'ఏదో శివుని దయచేత విల్లు చేపట్టగల్గుదునేమో కాని' అనడంలో చక్కటి తెలుగు నుడికారంతో పాటు వినయమూ ఉంది. ఈ వినయ సంపద అన్నది పాత్ర వ్యక్తిత్వాన్ని ఎలివేట్ చేస్తుంది (ఉన్నత స్థాయికి తీసుకుపోతుంది). అంతటితో వదలకుండా 'ప్రస్ఫుమర బ్రహ్మవాక్కులండె పై శిరోధార్యమ్ముగా' అనటంతో ఈ వినయం పరకాష్ఠకు చేరుకుంది.

బ్రహ్మ ఆనతి ప్రకారం దేవసైన్య రథాలు సరస్వతీ సోమతీర్థ సైకతముల దగ్గరకు బ్రహ్మ ముందు పోతూ ఉండగా త్వరత్వరగా వెళ్ళాయి. (చ. క : 66)

**ఉత్సాహ :**

హైమకుధర దక్షిణాధ్వమందు సాగిపోవు గం
గా మహాపగాంశు వలకనంద పాయ వట్టుచున్
హేమకూట రుచక హిమమహీధరోర్వి మీదుగా
స్వామి లరిగి రుత్తర కురువర్షముల్ హుటాహుటిన్.

గంగానదియొక్క ఒక ముఖ్యమైన పాయ అయిన అలక నందానది మేరుపర్వతాన్ని దాటిపోయే మార్గం గుండా దేవసైనికు లందరూ హేమకూట పర్వతం మొదలైనవాటిమీదుగా ఉత్తర కురుదేశాన్ని చేరుకున్నారు. (కవి ఇక్కడ ఒక Mythological geography ఇచ్చాడు).

సైన్యం ఉత్సాహంగా ముందుకు సాగిపోవడంలోనూ, అభిషేకాన్ని చూడటానికి ఉత్సాహపడుతున్నట్టుగానూ ఇక్కడ కవి 'ఉత్సాహ' వృత్తాన్ని ఎన్నుకున్నాడు.

మా ని ని :

అందు వితస్తను దాటి - యసిక్నికి నావల బాహ్లిక దహ్యకముల్
చెంది - పరుష్ణి శతద్రువు చేరి తురుష్కపథోపరిగా చనుచున్
ఛందచతుష్కమునందలి యాద్యము స్పష్టపడం గనినట్టి భువిన్
పొంది సరస్వతియొడ్డు సుపర్వసమూహము డిగ్గె వసుంధరికన్.
(చ. క : 68)

ఈ మానినీ వృత్తపు నడక రథభ్రమణాన్ని వర్ణించడానికి చక్కగా ఉంటుంది. ఈ ఛందస్సులో రథగమనం ధ్వనిస్తుంది. కనుక మానినీ వృత్తాన్ని ఎన్నుకున్నాడు కవి.

ఈ దేవతాసైన్యం వితస్తను దాటి, అసిక్ని అనే నదిని దాటి, బాహ్లిక దేశాన్ని చేరి, పరుష్ణీశతద్రువును (పంజాబు దేశంలోని ఒక ప్రకృతి భాగం - గంగానది) చేరి, తురుష్క అన్న దేశం మీదుగా చతుర్వేదాలలో ఆదిమ వేదమైనట్టి, ఋగ్వేదం స్పష్టపడినట్టి భూప్రాంతానికి - సరస్వతీనది ఒడ్డుకు - దేవతాసమూహమంతా చేరుకున్నది. వేదం సరస్వతీనది ఒడ్డుననే స్పష్టపడినదని ప్రాచీన వాఙ్మయం, ఆధునిక పాశ్చాత్య పండితులు చెప్పిన సత్యము.*

* కుమారభారతి : పుట 52

ఉ. శ్రీత్రివిక్రమమూర్తి చాచిన మహాహస్తంబునన్ బారు దా
న లసద్ధారవలెన్-విశాల పులినాంతస్ఫూర్తి మహాకావ్య సం
జాలశబ్దాంతర సూక్ష్మ సూత్రము రసస్రోతస్వినీమూర్తి త
త్సలిలోదార సరస్వతిం గని అజస్వారాట్ కుమారాను గా
ములు నాకౌకసు లెల్లరున్ విడిసి రామూలంబులన్ గుంపులై.

(చ. క : 70)

త్రివిక్రముడు తన మహాహస్తాన్ని చాచి లసద్ధారవలే పోతున్నట్టుగాను, విశాలమైన మహోన్నతమైన ఒక మహాకావ్యము యొక్క మనోజ్ఞమైనటువంటి శబ్దాల లోపలి సూక్ష్మరససూత్రం వంటి సీటిధారతో ఉన్న సరస్వతీనదిని చూసి, ఇంద్రుడు, ఇంద్రుని సైనికులు-అందరూ గుంపులు గుంపులుగా ఆ ప్రాంతంలో విడిది చేశారు.

ఇక్కడ సరస్వతీనది పవిత్రతను చెప్పడానికి రెండు పోలికలు చెప్పాడు కవి. ఒకటి - త్రివిక్రముడు తన మహాహస్తాన్ని చాచినట్టుగా సరస్వతీనది ఉంది అని చెప్పటం. రెండు - మహాకావ్య వాక్కులోని సూక్ష్మమైన రససూత్రంతో సరస్వతీనదిని పోల్చటం. ఇక్కడ పవిత్రతను నొక్కిచెప్పడానికి మహాహస్తమని, మహాకావ్యమని రెండుసార్లు 'మహా'విశేషణాన్ని చెప్పటంతో, సరస్వతీనది పవిత్రత ఎంత ఉన్నతమైనదో తెలుస్తోంది. అట్టి ప్రాంతాన్ని అభిషేకానికి ఎన్నుకొన్నారు. పై పద్యం పంచపాది. వృత్తానికి నాలుగు పాదాలు. ఇందులో మిగులు పాదం నాలుగు పాదాల చివర బిందువుల్ని కలుపుతూంటుంది.

ఆకాశంలో రాజహంస రెక్కలు రాల్చినట్టుగా జాబిల్లి నుంచి వచ్చే వెన్నెల కిరణాలలో దేవతల సమూహం ఆర్ద్రభావాన్ని పొందింది(చ. క : 72).

తడిసిన సైకతస్థలి నుదారసుధాంశువు వెల్గువెల్లిలో
కడిది సుషుప్తి చెందినటు కన్పడు వంక సుదీర్ఘ భోగి తా
నడువక నిల్చినట్లుగ గనంబడు భావ చమత్కృతంబుగా
విడిసిరి బ్రహ్మ శక్తిధర వృత్రహ గీష్పతు లప్సరోయుతుల్.

(చ. క : 73)

ఆ నది ఎలా ఉందంటే - వెన్నెల్లో ఒక పెద్ద బ్రహ్మాండమైన ఆదిశేషునివంటి పాము వేగంగా నడుస్తూనడుస్తూ ఒక్కసారి ఆగిపోతే ఎలా ఉంటుందో, ఆ సరస్వతినది- శరత్కాల స్రవంతి కనుక, ప్రవాహం లేదు కాబట్టి - అలా ఉంది. పైవిధమైన సరస్వతీనదిని దేవతలు చూసి అక్కడ విడిది చేశారు.

జిలిబిలి కంకణ ధ్వనులు చేసెడి శ్రీ కెరటాల వంపులన్
పలిత సితోత్పలావళులు నవ్విన పోలిక గాగ స్వచ్ఛ కాం
తులు గిలకొట్టి చంద్రుడు మనోజ్ఞముగా,సుకుమార మారుత
మ్ములు పొలిసెన్ దివౌకసుల మొత్తముపై చలువల్

ప్రసవించుచున్. (చ. క : 74)

చంద్రుని కిరణాలు ఆ సరస్వతీనదియొక్క కెరటాల(తరంగాల) వంపులమీద తెల్లని కలువపూలు నవ్వినట్లుగా వ్యాపించాయి.అంటే కలువపూలు కూడా ఉన్నాయక్కడ. వెన్నెల కిరణాలు వాటిమీద పడి మరీ తెల్లగా ప్రకాశిస్తున్నాయి. ఆ వెన్నెల్లో సుకుమారమైన చల్లని గాలులు దేవతలపై వీస్తున్నాయి.

ఆ వెన్నెల ఇంకా ఏమి చేస్తోంది అనేది చాలా అందంగా కింది సీసపద్యంలో చెప్పబడుతున్నది.

బాహులేయ మయూర బర్హ కిర్మీర వ
ర్ణములందు స్నిగ్ధతల్ రంగరించి
భవసుతాంగములందు బడి ధనుస్సును దూచి
కడుభీతి తళ్కుతో గంతులేచి
అప్సరోగణ మృదులాధరారుణకాంతి
సితసుధారోచులు చిలుకరించి
పరమేష్ఠిదగు వారువపుచట్టుపలయందు
జిలుగు వన్నెలతోడ జీరువారి

దృప్త సురహయమ్ము పయి పేరెములువారి
శితశతారక్రకచధార ఛీలి వెలిగి
అఖిలదేవతామణి కిరీటాంగదముల
తళతళలు చిందె నందు కాంతులు జ్వలించి (చ. క : 75)

కుమారస్వామి నెమలిపింఛపు రెక్క రంగులపై వెన్నెల రంగరించింది. కుమారస్వామియొక్క శరీర భాగాలమీద, ధనుస్సు మీద పడి పరావర్తనం చెందిన ఆ వెన్నెల కిరణాలు భయంతో ఎగిరి దూకినట్టుగా ఉన్నాయి. అప్సరలయొక్క మృదువైన ఎఱ్ఱటి అధరాలపై చిలుకరించినట్టుగా తెల్లటి వెన్నెల కిరణాలు పడ్డాయి. బ్రహ్మయొక్క వాహనమైన హంస రెక్కలపై జిలుగు వన్నెలతో దువ్వినట్టుగా ఉంది. (హంస రెక్కలు- తెలుపు. తెలుపుమీద తెల్లని కిరణాలు పడేటప్పటికి దువ్వినట్లు కనబడుతుంది. మరింత ప్రకాశవంతంగా హంస రెక్కలు కనిపిస్తున్నాయని భావం). బలిసిన ఉచ్చైశ్రవం మీద సవారిచేసి, నూరు అంచులుగల వజ్రాయుధం మీద పడి ఖండఖండములైపోయి ఛీలి ప్రకాశిస్తూ, సకలదేవతల యొక్క కిరీటాల మణులపై వెన్నెల కాంతులు పడి తళతళలుగా ప్రకాశిస్తున్నాయి.

రవరవలాడు గాడ్పు పెరల్ సృజియించెడి నీటివంపు తె
ల్లి నిరిసి సైకతాంగణములన్ పవనాశన శాబక క్రియన్
సవసవలాడుచున్ బుసబుసల్ ప్రసరించెడి సద్దు తక్క ఏ
రవమును లేని శాంత మధురంబగు బ్రాహ్మ ముహూర్త వేళలో.

(చ. క : 77)

దూరమున జలజంతువేదో ప్రశాంత
వారి నెగిరిపడ్డట్టి సవ్వడి విధాన
ప్రకృతిశాంతత చీల్చుచు వచ్చె సాగి
వృషభవాహుఁ డంతఃపురాన్వితుఁ డగుచు. (చ. క : 78)

ఇక్కడ సైనికులు విడిది చేసినటువంటి సరస్వతీనది సైకత స్థలం, ఆ వాతావరణము ప్రశాంతంగా, నిశ్చలంగా ఉంది. ఏదో రవరవలాడు గాడ్పులు, నదిలోని నీటి అలలు ఒడ్డునందలి ఇసుకను తాకినపుడు పాముపిల్లలవలె సవసవలాడే నీటి అలల శబ్దం, ఇలాంటి బుసబుసల మోత తప్ప ఏ శబ్దమూ లేని ప్రశాంతమైన మధురమైన బ్రాహ్మముహూర్త వేళలో (తెల్లవారుజామున) (చ. క : 77), ప్రశాంతమైన సముద్రంలో ఎక్కడో దూరాన జలజంతువు ఎగిరి పడ్డప్పుడు వచ్చే శబ్దంలాగా, ప్రశాంతమైన ప్రకృతిని ఛేదిస్తూ శివుడు కుటుంబ పరివార సమేతంగా అక్కడికి వచ్చాడు (చ. క : 78).

లోకాల కన్నతల్లి పార్వతీదేవి, అగ్నిదేవుడు - అందరూ అక్కడికి వచ్చి చేరుతున్నారు.

తనయుని మూర్ధముం బుణికి తారకలందు ముదశ్రుబిందువుల్
చినుకగ లుప్తదృష్టియయి శ్రీ శివతేజము మూర్తిగొన్న స్కం
దుని నునుమార్దవ కుంతలము దువ్వుచు ముద్దిడు, కోత్రిలో
చనుడు నిజాకృతిం గనిన చాప్పన సద్దమునన్ సుతుం గనెన్.

(చ. క : 81)

పార్వతీదేవికి కుమారుని చూసి కనులలో ఆనందబాష్పాలు పొర్లగా దృష్టి కొంచెం లుప్తమయింది(లోపించింది). శ్రీ శివతేజమును మూర్తిగొన్నటువంటి (ఆకృతి దాల్చినట్టి) కుమారస్వామి యొక్క తలను నిమురుతూ (దువ్వుతూ) ముద్దు పెట్టుకున్నది. అప్పుడు శివుడు తన నిజరూపాన్ని అద్దంలో చూసుకొన్నట్లుగా కుమారుణ్ణి చూసు కున్నాడు. ఇక్కడ ఒక తండ్రి తన రూపాన్ని అద్దంలో చూసినట్లుగా కుమారుణ్ణి చూసుకున్నాడు - అనటం ఒక అందమైన పోలిక. చాలా సహజమైన పోలిక కూడా.

నన్నయ్య భారతంలోని ఈ అంశం ఈ భావననే చెప్తోంది :

“......పురుషుండు భార్యయందు ప్రవేశించి గర్భంబున బుత్రుండై తాన యుద్భవిల్లు గావున‘అఙ్గా దఙ్గా త్సమ్భవసి’యను నది మొదలుగా గల వేదవచనంబులయందును జనకుండును బుత్రుండును నను భేదంబు లేదు.”

(నన్నయ - శ్రీమదాంధ్ర మహాభారతము : ఆది : 4-85)

పురుషుడు భార్యలో ప్రవేశించి గర్భంలో పుత్రుడవు తున్నాడు. అంటే తండ్రి కుమారుడుగా ట్రాన్స్‌ఫర్ అవుతున్నాడు. కనుక కుమారునికి, తండ్రికి భేదంలేదు. తండ్రి అంగాంగమునుండి కుమారుడదేవిధంగా పుడతాడు.

అందుకే ఇక్కడ శివుడు అద్దంలో తన నిజరూపాన్ని చూసు కున్నట్టుగా కుమారస్వామిని చూసుకున్నాడని కవి అనటం.

అగ్ని అక్కడికి వచ్చి చేరుకున్నాడనుకున్నాం కదా! అగ్ని రాకతో అక్కడి వాతావరణం ఎలా అయింది అంటే -

అవిరళ చంద్రికా మృదు సితాంశువు స్వర్ణభమై చితస్త దు
గ్ధ విధిగగా సుధా తుహినకాంతి కవోష్ణము గాగ వచ్చె తే
జవని ముఖంబుగా నమరు వెల్లరు తృప్తుల దృప్తి తాదు రా
ప్రవిమల యజ్ఞికాకృతియు - వైదిక తేజమునైన వహ్నియున్.

(చ. క : 82)

మృదువైన తెల్లని ప్రకాశవంతమైన వెన్నెల - మరగబెట్టిన పాలపొంగులాగా అమృతంవంటి మంచు వెన్నెల కాంతులు అగ్ని రాశుల్లో కలగలిసినాయి.

ఈ వాతావరణాన్ని - కుమారస్వామికి జరుగుతున్న వైభవోత్సవాల్ని అగ్ని చూస్తున్నాడు. చూస్తూ తనలో ఈ విధంగా అనుకుంటున్నాడు :

ఈ మృదుశైవతేజమును నేన భరింపడి నేటిదాక ఎ
ట్టో మరి తాల్చియుండిన నహో! ద్రుహిణాండము వెల్వకాశర
శ్మిమయంబు క్షపాకర ప్రసన్నకళాసిత చంద్రికాయశ
శ్రీమహితుండ నౌదు నను చింత కుమారుని జూచె వహ్నియున్.

(చ. క : 83)

ఇక్కడ అగ్నిదేవుని మనఃప్రవృత్తిని కవి చక్కగా వర్ణించాడు. సాధారణంగా మనిషి ఫలితం దగ్గరకు వచ్చేటప్పటికి, మనస్సులో కొంత వ్యాకులపడతాడు. కష్టపడి అందరూ ఒక కార్యాన్ని సాధించలేరు. కాని ఎవరైనా తన శక్తిమేరకు లేదా తన శక్తిని మించి ఆ కార్యాన్ని సాధిస్తే, ఆ వచ్చిన ఫలితాన్ని చూసి, అరే - ఆ కార్యం నేనే చేసి ఉంటే బాగుండేదే! - అని అనుకుంటాడు. కష్టం దగ్గర, కృషి చేయటం దగ్గర అనుకోడు కాని, ఫలితం దగ్గర మాత్రం అనుకుంటాడు. ఆ ఫలితం తాను పొంది ఉంటే

బాగుంటుందే అని అనుకుంటారు మానవులు. అంటే మంచి రిజల్టు మాత్రం ఆశిస్తారు కాని, కృషిని గురించి మాత్రం ఆలోచన చెయ్యరు. అదే ఆ కష్టం నేను పడలేను; ఆ ఫలితమూ నాకు రాలేదు లే అనుకోరు మనిషి (సాధారణంగా). ఇదీ మనిషి మనః ప్రవృత్తి. అదిగో, అలాంటి మనఃప్రవృత్తినే - అగ్ని దేవుడు తన మనసులో అనుకున్న విధానాన్ని కవి చాలా చక్కగా అందించాడు.

కుమారుని ప్రసవించటంలో గంగ పడ్డ బాధ అంతా ఇంతా కాదు. గర్భధారణ సమయంలో ఆమె ఎంత విషమావస్థకు గురి అయిందో 'కుమార జననం'లో చూశాము కదా! అలాంటి బాధ - బరువు - మోయలేకనే అగ్ని ఆనాడు గంగాదేవిని వేడుకొని తన మీద మోపబడ్డ ఆ మహావీర్యాంశువును గంగలో విడిచాడు. ఆ మహావీర్యాంశువునుంచి ఉద్భవించినవాడే ఇప్పుడు అభిషేకం చేయించుకుంటున్న కుమారస్వామి.

ఆ ఘట్టాన్ని చూసి 'చివరిదాకా ఆ శివ వీర్యాన్ని ఎట్లో కష్టపడి మోసి ఉంటే, ఇప్పటి ఘనకీర్తి అంతా నాకే దక్కి ఉండేది కదా!' అని కుమారుని చూసి తనలో అగ్ని అనుకుంటాడు.

ఈ భావన 'ఎట్లో' అన్న దగ్గర పద్యపాదం తెగిపోయింది. 'ఎ' పైన ఊనిక ఉంది. 'ట్లో' పైన దీర్ఘంకూడా ఉంది. దీని ద్వారా ఎట్లో ఒకలాగా కష్టపడి కొంతకాలం కళ్ళుమూసుకొని కష్టాన్ని భరించి ఉంటే ఎంత బాగుండేది! అన్న అగ్నిదేవుని మనోభావన 'ఎట్లో' అన్న పదంద్వారా అభివ్యక్తమవుతుంది.

అగ్ని తర్వాత గంగాదేవి వచ్చింది. గంగ ఎలా వచ్చింది అంటే -

బంధురశీతల శ్వసనసంసక్త కరశ్మి కరశ్మి గాగ - సౌ
గంధిక నూత్న పంకజ సుగంధులమూల్ గనుదేర ముందు - స్వ
చ్ఛందు సుధాఖనిం గొనగొనగ నడుచు రత్నపాదుకా
సుందరభూష - సత్కవి విశుద్ధ వచోదృశ వచ్చె గంగయున్.
(చ. క : 84)

ఎఱ్ఱ కలువలు, నవనూత్న పద్మాల సువాసనలతో కూడుకొని చిక్కనైన శీతలమైన శీతగాలులు కరుళ్ళుకరుళ్ళుగా స్వచ్ఛమైన చంద్ర కిరణాలు మెరుగుపరిచినట్లుగా - ఒక సత్కవియొక్క పరిశుద్ధమైన వాక్కులాగా గంగ వచ్చింది.

ఇంక కొంతసేపటికి గంగ అక్కడికి చేరుకుంటుండగా ముందుగా పూలవాసనలతో కూడుకొని శీతలమైన శీతగాలులు వస్తాయి. ఇక్కడ చాలా సహజమైన వర్ణన ఉంది. గంగాదేవి చల్లగా ఉంటుంది. ఆమె వస్తున్నప్పుడు ఆమె ముందుగా పిల్లగాలులు వీచేటప్పుడు నదిలోని నీటిని తాకుతూ ఆ గాలులు రావటంవల్ల గాలి ఇంకా చల్లబడుతుంది. ఇది సహజం. ఇక పోతే, చంద్రకిరణాలు మొదటనే చల్లగా ఉంటాయి. దానికితోడు గంగ అక్కడికి వచ్చినప్పుడు ఆ వెన్నెల యింకా ఎంత చల్లబడుతుందో మనం ఊహించుకోవచ్చు. గంగానది అంటే పరిశుద్ధం చేసే గుణం కలది అని అర్థం. పరిశుద్ధతకు మారుపేరే గంగ అనవచ్చు. ఈ గంగ ఎంత స్వచ్ఛంగా పరిశుద్ధంగా ఉందంటే, ఒక సత్కవివాక్కులాగా ఉందనటంలో ఎంత మధురమైన భావన ఉంది ! సాధారణంగా సత్కవివాక్కు గంగలాగా పరిశుద్ధంగా ఉంది అని చెప్పటం ఒక పద్ధతి. ఇక్కడ సత్కవివాక్కులాగా గంగ పరిశుద్ధంగా ఉంది అని చెప్పటంవల్ల, సత్కవివాక్కు కూడా అంత స్వచ్ఛంగా ఉంటుంది అని చెప్పడమే కాకుండా, గంగ పవిత్రత ఇక్కడ ఎలివేట్ అయింది. భవభూతి, తన నోటి నుంచి వచ్చిన మాట గంగలాగా పరిశుద్ధంగానూ, లక్ష్మిలాగానూ

ఉంటుందని తన వాక్కును గంగతో పోల్చాడు. కవి వాక్కు ఎంత స్పష్టంగా, స్వచ్ఛంగా ఉంటుంది. ఇక్కడ కవి ఏమి చేశాడంటే - ఉపమానంగా ప్రసిద్ధమైన దాన్ని ఉపమేయంగా కల్పించి చెప్పాడు. కనుక దీన్ని ప్రతీపాలంకారంగా చెప్పవచ్చు. ఈ కావ్యమంతా అక్కడక్కడ విచిత్రమైనట్టి, విలక్షణమైనట్టి, అందమైనట్టి మధుర భావనతో కూడిన పోలికలు మనకు అగపడతాయి. వాటిని పాఠకులు ప్రత్యేకంగా జాగ్రత్తగా పరిశీలించుకోవాలి.

పై రెండు పద్యాలను (అగ్ని రాకను తెలిపేది - 82, గంగ రాకను తెలిపేది- 84) పరిశీలిస్తే, అగ్ని రావడానికీ, గంగ రావడానికి గల తేడా కనిపిస్తుంది. అది స్త్రీ, పురుష స్వభావంలోని తేడా. పైగా ఆమె గంగ (చల్లని తల్లి), ఈయన అగ్ని (అగ్ని - వేడిమి నిచ్చే దేవుడు). వారి ప్రకృతి లక్షణాలనుబట్టే తేడా ఉంటుంది మరి.

అక్కడకు వచ్చిన దేవతలందరూ పరస్పర క్షేమ సమాచారాలతో కూడుకొన్న సంభాషణలు జరుపుకొన్న తర్వాత, గంగను, అగ్నిని రత్నాసనములమీద ఆసీనులను గావించి చిరత్నాలతో వారిద్దరికీ పూజ చేశారు (చ. క : 85).

కార్తికక మాస తుహిన శీకరచయమ్ము
తెలది వెన్నెల వెల్లులో కలిసి కరిసి
దేవసేనాధిపాభిషేకావసరము
నైన పన్నీటి చిరుపెల్లియై రహించె. (చ. క : 86)

అది కార్తికమాసం. మంచుబిందువుల సమూహం నిర్మలమైన తెల్లని వెన్నెల వెలుగులో కలిసి చిన్న పన్నీటి ప్రవాహంలాగా దేవసేనాధిపాభిషేకం కోసం (దేవసైన్యాధ్యక్షునికి అభిషేకం చెయ్యడానికోసం) ప్రవహించింది. కార్తికమాసపు వెన్నెల ఎంత నిర్మలంగా

ఉంటుందో, ఎంత తెల్లగా స్వచ్ఛంగా ఉంటుందో అందరికీ అనుభవంలో ఉన్నదే. ఈ అభిషేకం జరుపడంకోసమే ఈ వెన్నెల మంచు బిందువుల నీటి సమూహంతో కలిసి కురిసింది అనడంవల్ల యిది హేతూత్ప్రేక్ష.

దేవతలు కుమారస్వామికి అభిషేకం చేయటానికి ముందుగా విఘ్నాధిపతి - వినాయకుడిని పూజించారు. ఆ విఘ్నాధిపతి వర్ణనా శిల్పం ఇక్కడ చూద్దాం :

ఊర్ధ్వశుండాన సర్గ మథోవనత క
రాన లయము, ద్విధాభూతమైన దాన
స్థితిని - సూచించు భంగిమాత్రితయ హస్తి
ప్రణవమూర్తిని విఘ్నాధిపతిని గొల్చి. (చ. క : 87)

విఘ్నేశ్వరుని తొండము మూడు రకాలుగా శిల్పించబడి ఉంటుంది. ఒకటి - తొండం పైకెత్తినట్లుగా ఉండటం - ఇది ఊర్ధ్వ ముఖం. రెండు - తొండం క్రిందికి దించుకొన్నట్లు ఉంటుంది - ఇది అధోముఖం. మూడు - నడుమ రెండుగా కనబడేటట్లు తొండం యొక్క చివరిభాగం పైకెత్తబడి కొద్దిగా దించినట్లు ఉంటుంది - ఇది ద్విధావృత్తము. ఇట్టి ఓంకారస్వరూపుడైన విఘ్నేశ్వరుణ్ణి దేవతలు పూజించారు.

ఊర్ధ్వముఖం సర్గమును సూచిస్తుంది. అంటే సృష్టిని సూచిస్తుందన్నమాట. అధోముఖం ప్రళయాన్ని సూచిస్తుంది. ద్విధావ్యావృత్తం సర్గ, ప్రతిసర్గల లయాన్విత స్థితి నిర్వహణకిది సూచకం. అంటే పరిపాలనానిర్వహణాన్ని సూచిస్తుందని తాత్పర్యం. ఓంకారంలోని అ - ఉ - మ - సర్గ - లయ - స్థితులకు సూచకాలైతే, వినాయకుడు సూక్ష్మమైన ఓంకారంయొక్క వ్యక్తీకృత స్థూల

స్వరూపము.[1] అందుకే ప్రతి మంత్రానికి 'ఓం' అని ముందు పలుకుతాము. త్రిభంగిమ - కాలిదగ్గర, హస్తము లేదా మెడవద్ద స్త్రీ నాట్యశిల్పం చెక్కబడి ఉంటుంది కొన్నిచోట్ల. ఈ త్రిభంగిమ అందాన్ని సూచిస్తుంది. చిన్న పిల్లలకు డ్యాన్సు పాజిటివ్ - అనుకూలం. వాళ్ళలో, అదే ఎక్కువగా కనిపిస్తుంది. ఏ పని చేసినా నాట్యాయమానంగా వారి చేష్ట ఉంటుంది. సర్వకళలలోనూ కళాతత్త్వాన్ని కల్గింపజేస్తుంది నాట్యం. ఓంకారానికి ఆకారమిస్తే అదే వినాయకుడు. అందుకే మొదటిపూజ విఘ్నేశ్వరునికి చేయటం. కనుక ఇలాంటి సంప్రదాయసోపానాలు తెలిస్తేనే, అందులోని భావసౌందర్యం తెలుస్తుంది (కనబడుతుంది).

కుమారస్వామికి అభిషేకం చేసే సమయంలో ఎవరెవరు ఏయే పనులను ఎట్లా నిర్వహించారో కింద చూడవచ్చు.

గంధాంబువులు చల్లి - ఘనసారమృగమదో
    జ్జ్వల రంగవల్లు లచ్చరలు దీర్ప
ఔదుంబరమయ మృగాంకపీఠిక కుశా
    స్తరణముతో హిమగిరి రచింప
కృత్తికల్[2] సప్తమాతృకలు సేసలువెట్ట
    పుణ్యాహఘోషంబు మునులు పలుక
హోమకార్య మమరేజ్యుడు నిర్వహింపగ
    గంధర్వ బంధురగాన మెసగ

1. కుమారభారతి : పుట 57
2. సప్తమాతృకల ప్రస్తావన ఋగ్వేదంనుండి జానపదగాథల దనుక విశ్వవ్యాప్తమైనదిగా నున్నది. అగ్ని రథమునందు సప్తమాతృకలున్నట్లు అస్యవామీయ సూక్తమందు 3వ మంత్రము చెప్పుచున్నది.
"సప్తస్వసారో అభిసంనవంతే"- సప్తభగినులు ఏకకంఠముగా స్తోత్రపాఠము చేయుచున్నారని అర్థము. వీరు అగ్నికి చెల్లెళ్ళుగా చెప్పబడుచున్నారు. వీరే మానవశరీరమున సప్తప్రాణవాహినులు.

కుమారభారతి పుట. 58

శంఖతూర్యాది మంగళస్వాన మెసగ
శాతకుంభకుంభానీత జాహ్నవీ ప
విత్ర సారస్వతాంబువుల్ విబుధగణ చ
మూధవోత్తమాంగమునందు పోసె గురువు. (చ. క : 88)

గంధము, పన్నీరు చల్లి, కస్తూరి, పునుగులతో అప్సరలు రంగవల్లులు (ముగ్గులు) తీర్చారు. మేడిచెట్టు కలపతో చేసిన పీఠంపై మంచి దర్భలతో కూడుకున్న చాప పరిచారు. సప్త మాతృకలైన కృత్తికలు అక్షతలు పెట్టారు. పుణ్యము, పవిత్రమైన ముహూర్తాన్ని మునులు నిర్ణయం చేశారు. హోమకార్యాన్ని బృహస్పతి నిర్వహించాడు. మేలైన రసవత్తరమైన గానం గంధర్వులు చేశారు. శంఖతూర్యము మొదలైన మంగళవాద్యాలు మ్రోగాయి. బంగారుకుండలతో తెచ్చిన పవిత్రమైన జాహ్నవీ, సరస్వతీ నదీ జలాలు దేవసేనానాయకుడైనటువంటి కుమారస్వామిపై దేవగురువైన బృహస్పతి పోశాడు.

అభిషేకము = వైదికకర్మ . . . దైవశక్తులను అతనిలో నిక్షిప్తం చేయడం- అభి=చక్కగా; షేకము = తడపడము. పై సీసపద్యం నన్నయశైలిలో, ఎక్కడా విరగకుండా పోతుంటుంది.

స్ఫటికమూర్తిపై వెన్నెల పారినట్లు
పశుపతి కుమారు తనువునన్ బ్రాకులాడె
చిరుతరగ కట్టి దివ్యాభిషేక సమయ
స్వర్గగంగా సరస్వతీ స్వచ్ఛవారి. (చ. క : 89)

సకలత్రైలోక్య ధర్మసంస్థాపనమున
బూనియున్నట్టి కొమరు నామూర్ధపదము
విమలజలనేత్ర తల్లి చుంబించినట్లు
తరళజలమూర్తి శ్రీగంగ దబకలాడె. (చ. క : 90)

పాలరాతిపై వెన్నెల పరచుకున్నట్లు చిన్న చిన్న తరంగాలు కట్టి స్వర్గగంగా సరస్వతీ స్వచ్ఛజలములు కుమారస్వామి తనువు నంతటినీ ప్రాకులాడాయి (చ. క : 89). ముల్లోకాలలోనూ ధర్మ సంస్థాపనం చేయబూనినట్టి తన కుమారుడిని ఆమూర్ధపదమూ తల్లి చుంబించినట్లుగా గంగాదేవి జలరూపంలో కుమారుని తనువు దబకలాడింది.

ఇక్కడ అభిషేకంతోపాటు, ఒక తల్లి ప్రేమానురాగాను భవాన్ని కూడా కవి చక్కగా చెప్పాడు. తలమీద పుణికి నడినెత్తి మొదలు పాదంవరకు చెయ్యిపెట్టి నిమరడం - దీన్ని గంగాదేవి ఎట్లా చేసిందంటే ఆమె జలరూపమయిపోయిందన్నమాట (గంగ - అంటే - వాస్తవంగా జలరూపమేకదా !). తలమీద పోయబడ్డ ఆ గంగ నీరు పాదంవరకు స్పృశిస్తూ దబకలాడింది. ఆమె ఆ విధంగా కుమారుడిని ఆమూర్ధపదమూ ముద్దులాడింది. జలరూపంలో ముద్దులాడినందువల్ల స్వామి శరీరాన్ని ఇంచుక కూడా వదలకుండా తనివితీరా ముద్దుపెట్టుకుందని చాలా అందమైన భావంతో కవి వర్ణించాడు. పైగా జలబిందువులో కూడా చైతన్య ముంటుంది.

> అమరగురు హస్త.కనకా లుకాంబు ధార
> తో చమూపతి తనువుపై తోచు జలజ
> నవదళమ్ములు - దేవసేనా విచిత్ర
> ప్రణయ సిక్తాక్షమాలికా భ్రాంతి గొలిపె. (చ. క : 91)

దేవగురువు బృహస్పతి బంగారు చెంబుతో స్వామిపై పోసిన నీరు తనువుపై తామరపూల కొత్తరేకులలాగా తోచి దేవసేనతో విచిత్రప్రణయం (వివాహం) జరిగినట్లుగా భ్రాంతి గొలిపింది.

కుంచిత దేహుండై గుహుండు - గోత్రభిదర్పిత దివ్యకాంతిమత్
కాంచనసన్మణీమకుట ఖడ్గధృతిన్ - మృగపీఠి వీడుచున్
ప్రాంచితభక్తి నీశ్వరశివానలగాంగనమస్క్రియార్థ మే
కొంచెను నాల్గుమూర్తుల దిదృక్షు దివౌకసు లద్భుతం పడన్.

(చ. క : 92)

దివ్యమైన ప్రకాశంతో భాసిస్తున్న మణులతో కూడుకున్న బంగారు కిరీటమూ, ఖడ్గమూ ధరించిన గుహుడు (కుమారస్వామి) వినమ్రభావంతో తన ఆసనాన్ని విడిచి అత్యంత భక్తితో శివునికి, పార్వతికి, గంగకు, అగ్నికి నమస్కారం చెయ్యడానికి నాలుగు రూపాలుగా చీలి ఆసక్తిగా చూస్తున్నటువంటి దేవతలందరూ అద్భుతం పడేటట్లుగా వచ్చాడు.

ఇక్కడ కుమారస్వామి తన తల్లిదండ్రుల దగ్గరకు - నలుగురిదగ్గరకూ ఒకేసారి నాలుగు రూపాలతో పోయి వారికి కొరత లేకుండా చేశాడు. ఇక్కడ తన జన్మకు కారణభూతులైన వారందరినీ ఒకేసారి నాలుగు రూపాలతో కలుసుకొని నమస్కరించాడన్నది మనం గమనించవలసిన విషయం (యోగశక్తుల్లో అనేక మూర్తిధారణ చెయ్యటం ఉందట).

శివపార్వతులకు, మరియు అగ్నిదేవునికి, గంగాదేవికి నమస్కరించి వారి ఆశీర్వాదాన్ని పొంది; బ్రహ్మకు, కృత్తికలకు నమస్కరించి; ఇంద్రుని చూసి 'ప్రభూ, ఆజ్ఞ!' అన్నాడు బాల సుబ్రహ్మణ్యం (చ. క : 93). ఏమి ఆజ్ఞ యిస్తారో ఇవ్వండి - మీ ఆజ్ఞను పాటిస్తానన్నాడు.

కుమారస్వామి ఎప్పుడైతే వినయంతో 'ప్రభూ ఆజ్ఞ' అన్నాడో, ఇంద్రుని కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

కన్నుల గిఱ్ఱునన్ దిరుగగా జలముల్ "ప్రభు ! వచ్చి నేటి కీ
నన్నను విష్టపత్రయము - నాకము గావక తారకాసుర
చ్ఛిన్న సమస్తవీర్యు నను జేరి 'ప్రభూ!' యన నీకు న్యాయ్యమా?
అన్న ! ప్రభుండ నీవు - భటుడై పని విందున ఏలుకో ప్రభూ !"

(చ. క : 94)

కుమారస్వామి 'ప్రభూ మీ ఆజ్ఞ' అన్న వెంటనే ఇంద్రుని కళ్ళలో నీళ్ళు గిఱ్ఱున తిరిగాయి. "తారకాసురుని చేత దెబ్బతిని ఎదుర్కొనలేక, ముల్లోకాలను, స్వర్గలోకాన్ని సరిగా పరిపాలించ జాలక ఉన్న నన్ను పట్టుకొని 'ప్రభూ !' అనడం నీకు న్యాయంగా ఉందా ! ప్రభువు నీవు, నేను భటుడై పని వింటాను" అని ఇంద్రు డన్నాడు.

అను మఘవుం గనుంగొనుచు నార్ద్రమనస్కుడు కార్తికేయుడున్
ఘనసురవాహినిం గనుచు - కర్బురపర్వత చాపలంబమౌ
గుణము స్పృశించుచున్ శివునకున్ పితృదేవునకున్, మనోబ్జమం
దుననె నమస్కరించి కని దుశ్చ్యవనున్ 'సరి యట్లె' యంచనన్.

(చ. క : 95)

ఆ విధంగా అన్న ఇంద్రుని చూసి ఆర్ద్రమనస్కుడై కార్తికేయుడు గంగాదేవిని చూస్తూ శివధనుస్సు యొక్క వింటి నారిని స్పృశిస్తూ - మీటుతూ పితృదేవుడైన శివునికి మనస్సులోనే నమస్కరించి 'సరే! అట్లే కానీలే' అన్నాడు. 'సరి అట్లే' అనే మాట ఇంద్రుడిని చూసి అనలేదు. తల్లిదండ్రులను చూస్తూ అన్నాడు. కళ్ళు తిప్పకుండా చూడటం సిగ్గులేనితనాన్ని చెబుతుంది. తల్లిదండ్రులను చూస్తూ, నారిని మీటుతూ ఆ మాట అనటంలో అతని వినయం వ్యక్తమవుతుంది.

తెల్లవారింది. సూర్యోదయం కావచ్చింది. సూర్యోదయం కావడం ఎలా ఉందంటే - ఈ అభిషేకం వేడుకను చూడాలని సూర్యుడు ఎంతో ఆసక్తితో తూర్పుకొండను దాటుకొని వస్తున్నాడు.

నందిత హృత్సరోజులగు నాకనివాసుల మౌళివీథిపై
సిందురధూళి పుంజముల శ్రీరుచిమత్సురలోక వాహినీ
బంధుర రక్తతామరసపంక్తులలో పిహితమ్ములైన - తత్
స్కందు పదాబ్జముల్ కన వికర్తను డెక్కెను ప్రాఙ్నగాగ్రమున్.
(చ. క : 96)

ఆనందం పొందినట్టి దేవతలయొక్క శిరస్సులమీద కుంకుమ రాలినట్లు - గంగానదిలో ఉన్నటువంటి తామరపూలచేత కప్పబడిన కుమారస్వామి పాదాలు చూద్దాము అన్నట్లుగా, తూర్పు కొండపైన సూర్యుడు ఉదయించాడు. మనం ఏదైనా కనిపించకపోతే ఎత్తైన ప్రదేశం ఎక్కి చూస్తాం కదా ! ఆవిధంగా దీన్ని చెప్పటం - 'వికర్తను డెక్కెను ప్రాఙ్నగాగ్రమున్' సూర్యుడు ఈ అభిషేకాన్ని చూద్దామని కొండెక్కి చూశాడన్నమాట.

సూర్యుడు ఈ సంబరాన్ని, ఈ పండుగను చూడాలని తొందరపడుతున్నాడు. ఆతని ఆదుర్దా ఎలా ఉందో కింద చూడండి :

పిచ్చుకకుంటు సారథిగ పెట్టుకొనంగ గడు మోస మిట్లుగా
వచ్చెనటన్ త్వరన్ సవిత సారథి రథ్యచయమ్ము తోలుమన్
హెచ్చరికం బొనర్చుకొను చిందుని చూచి క్రుధావ్యధాత్ముడై
వచ్చిన తన్మహస్సు నిశి వచ్చినదేయని కుత్స సేయుచున్.
(చ. క : 97)

'సామర్థ్యం లేని ఈ కుంటివాణ్ణి రథసారథిగా పెట్టుకోని ఇట్లా మోసం జరిగిపోయింది. రథం వేగంగా పోని కారణం చేతనే కదా నేను స్కందుని అభిషేకం చూడలేకపోయాను!' అని మనస్సులో క్రుంగిపోయాడు సూర్యుడు. తొందరగా గుఱ్ఱాలను తోలుమని అప్పుడప్పుడు దారిలో సారథిని హెచ్చరిస్తూనే వచ్చాడు. తీరా అక్కడికి చేరుకుందామని అనుకున్నంతలో చంద్రుడిని చూసి వ్యథపడుతూ 'ఈ ఉత్సవం రాత్రిపూట వచ్చిందేమిటి? పగటి పూట వస్తే ఎంత బాగుండేది!' అనుకుంటూ వస్తున్నాడు సూర్యుడు.

ఇక్కడ సూర్యుడి మనస్సును స్పష్టంగా విశదపరిచాడు కవి. ఎవరైనా ఒక సంబరాన్ని చూడాలనుకున్నప్పుడు, చూడలేక పోతే ఆ మనస్సు ఎట్లా ఉంటుంది మరి! అంతేకాకుండా సూర్యోదయం కూడా కాబోతోంది అని మనకు తెలుస్తుంది. దీనికి పై వర్ణన బహుసుందరంగా జోడించాడు కవి.

సూర్యుని రథగమనంలో ఉన్న అగచాట్లు ఇంకా కింద చూడండి :

దివిజగంగా స్రవంతీ సైకతమ్ముల
        ప్లుతవల్గితమ్ములు లుప్తిచెంద
ఉదయాద్రి కటకగండోపలమ్ములయందు
        రింఖాగ్రముల్ నిల్వరింపకున్న
స్యందనాగ్రస్థల స్వచ్ఛాయలం జూచి
        పరఘోటక భ్రాంతి పరుగు నిల్వ
అద్రిశీర్షోపరివ్యాప్తహరిత తరు
        చ్ఛదకాంతి ఆహారశంక నాగ

గుఱ్ఱముల మూపులన్ ములుకోల వ్రేయ
రథికు మనసు నెరిగిన సారథి క్రుధాత్మ
పసిడిమువ్వల సవ్వడుల్ పరిఢవిల్ల
రథము రివ్వున మింట తురంగలించె. (చ. క : 98)

ఇసుక పొరలమీద రథం వస్తోంటే గుఱ్ఱాల కాళ్ళు దిగిపోయి రథం వేగంగా పోవటంలేదు. ఉదయపర్వతపు ఎత్తునుంచి కిందికి దిగి వస్తోంటే గుఱ్ఱాల గిట్టలు జారిపోతున్నాయి. (అంటే గుఱ్ఱాలకు గ్రిప్ - పట్టు చిక్కడంలేదు.) గుఱ్ఱాలు రథంముందున్న తమ నీడలను తామే చూసుకొని శత్రువులని భయభ్రాంతిపడి నిలిచిపోతున్నాయి. కొండశిఖరంమీద పచ్చని సూర్యకిరణాలు పడినందువల్ల అవి పచ్చగడ్డి ఏమో అనుకొని ఆగుతూ గుఱ్ఱాలు నడుస్తున్నాయి. దీన్ని చూసి రథసారథి - రథికుడైన సూర్యుని మనస్సు తెలుసుకొని గుఱ్ఱాల మూపులపై చెర్నాకోల దెబ్బ వేయగా బంగారు గజ్జెల చప్పుళ్ళతో రథం ఆకాశంలో దూకుతూ వేగాన్ని పుంజుకున్నది. (మయూరుడు, శ్రీనాథుడు ఇలాంటి రచనలు చేశారు).

అప్పుడు ప్రాతఃకాల సూర్యకాంతి కిరణాలు ఎలా వ్యాపించాయి అంటే -

దేవసేనాధిపతి దివ్యాంఘ్రిసీమల
సిందూరకాంతులు చిలుకరించి
పార్వతీపతి పదపద్మ ద్వయమ్మున
కుముద కింజల్కముల్ కుప్పవోసి

స్వర్గా ర్గమున సాగు చౌదంతి సితదంత
శిఖరాగ్ర సీమలన్ శితమొనర్చి
సకల దైవత పదాబ్జ స్పర్శపూతమౌ
సోమతీర్థము శిరస్సున నమించి

స్కందవాహన పింఛముల్ సవదరించి
ద్యుపథగామరాక్షులకు సూదులయి గ్రుచ్చి
ప్రాతరభ్యంచితోష్ణగభస్తిచయము
సకలలోకోర్ధ్వగామియై సాగివచ్చె. (చ. క : 99)

దేవసేనాధిపతి అయిన కుమారస్వామి యొక్క దివ్యమైన పాదాలపై ఎఱ్ఱటి కాంతి చిలుకరించింది. పార్వతీపతి శివుని పాద ద్వయంపై ఎఱ్ఱకలువలు కుమ్మరించినట్లుగా కాంతి పడింది. స్వర్గ మార్గంవైపు పోతున్నటువంటి ఐరావతంయొక్క దంతాగ్రములపై (దంతముల చివరికొనలపై) పదును పెట్టినట్లుగా కాంతి వెదజల్లింది. సోమతీర్థములోని దేవతలందరి పాదాలకు పూత పూసినట్లుగా కాంతి విరజిమ్మింది. స్కందుని వాహనమైన నెమలిపింఛములపై కాంతి తళుక్కుమన్నట్లుగా పడింది. ఆకాశంవైపు వెళుతున్న అమరులపై ప్రాతఃకాల సూర్యకాంతి కిరణాలు పడి సూదులలాగా గ్రుచ్చు కుంటున్నాయి. ఈ విధంగా సకలలోకాలకు ఊర్ధ్వగామియై సాగి వచ్చాడు సూర్యుడు. ఇక్కడ సూర్యకాంతి వర్ణన అందంగా చేయ బడ్డది. ఈ వర్ణన కథలో లీనమవుతున్నది. వర్ణన వేరు, కథ వేరుగా ఉండదు. 'ఊర్ధ్వగామియై సాగివచ్చె' అనటంవల్ల అమరులు కూడా అభిషేక కార్యాన్ని పూర్తి చేసుకొని ఊర్ధ్వలోకానికి పోతున్నారు అనే భావనను సూచించినట్లయింది. ఆకాశంవైపు వెళుతున్న అమరులపై ప్రాతఃకాలపు సూర్యకాంతి కిరణాలు పడి సూదులలాగా గ్రుచ్చుకున్నాయి ('ద్యుపథగామరాక్షులకు సూదులయి గ్రుచ్చి') -

అని అనటంవల్ల గూడా దేవతలందరూ అభిషేక కార్యాన్ని పూర్తి చేసుకొని స్వర్గలోకానికి పోతున్నారని తెలుస్తుంది. ఈ విధంగా ఈ సూర్యకాంతి వర్ణన కథాపరంగా లీనమవుతున్నది.

అమరులందరూ వెళుతూ వెళుతూ ఈ సరస్వతీనదీతీర ప్రాంతానికి 'సోమతీర్థ' మనే పేరు ఎట్లా వచ్చిందో అని మొదలైన మాటలు మాట్లాడుకుంటూ స్వర్గసీమ చేరుకున్నారు.

'ఇది సోమతీర్థమన్ ప్రథ ఎట్లు వడసెనో ?!
'అత డిందు రాజసూయమ్ము చేసె'
'ఇచటకే రా నానతిచ్చె నేమి యాజించు ?'
'మనస్వామి నముచి చంపం దగిలిన
పాప మీ శైవలవారియో క్షాళించె
ఈ తల్లి నడవడి కెడదమెచ్చి
మును వసిష్ఠ మహర్షి పొగడె సద్భక్తి త
త్పరత నాంగిరస మంత్రములయందు

మంకణ ప్రముఖ మహర్షి మండలమ్ము
లీ నదీతీర్థములనే తరించె మున్ను
ఓహో ! యేమి సరస్వతియో!' యటంచు
చెప్పుకొంచు సురల్ స్వర్గసీమ జనిరి. (చ. క : 101)

'సోమతీర్థమనే పేరు ఈ ప్రాంతాని కెట్లు వచ్చిందో !' అని కొందరన్నారు. మరికొందరు 'చంద్రు డిక్కడ రాజసూయం చేశాడు కనుక' అని అన్నారు. 'మన స్వర్గాధిపతి అయిన ఇంద్రుడు నముచి అన్న రాక్షసుని చంపగా తగిలిన పాపాన్ని ఇక్కడే సరస్వతీనదిలో ప్రక్షాళనం చేసుకున్నాడు. పూర్వం వశిష్ఠ మహర్షి ఆంగిరసమంత్రాల్లో (వేదాల్లోని భాగాలు) సరస్వతీ స్తుతి చేశాడు. పూర్వం మంకణ

మొదలైన మహర్షుల సమూహమంతా ఈ నదీతీర్థాలనే సేవించి తరించింది. ఓహో, ఎంత పవిత్రమైన సరస్వతీనది ఇది !' అని మాట్లాడుకుంటూ దేవతలందరూ స్వర్గలోకాన్ని చేరుకున్నారు. ఇంత పవిత్రమైన స్థలం కాబట్టే బ్రహ్మ ఇక్కడ అభిషేకం జరపాలని ఆజ్ఞాపించాడు.

కావ్యంలోని కథనంతా పూర్వాపరాలను సమన్వయించిన అభిషేకమన్న నామం కల చతుర్థకమిది. ఈ విధంగా కవి సద్భావంతోనూ, సద్భక్తితోనూ ఎంతో మెలకువగా ఈ గ్రంథాన్ని ఆద్యంతమూ పవిత్రంగా మలిచాడు.

— 'భారతి' : అక్టోబరు 1989

# రాయబార నిర్వహణం

కావ్యంలో పంచమ కమలం మొత్తం రాయబార ఘట్టమే. ఈ కమలంలో విశాఖుడు రాక్షసేశ్వరుడైన తారకాసురుని సభలోకి వెళ్ళి రాజనీతిని, ధర్మసూత్రాలను, యుద్ధంవల్ల కలిగే అనర్థాలను గురించి తారకాసురునికి చెప్తాడు. విశాఖుడు చెప్పిన ఈ విషయాలు - తారకాసురునికే కాదు, ప్రతిమనిషికీ - వారు జీవితంలో చేసే పొరపాట్లను ఎత్తి చూపినట్లుగా ఉండి, వాటిని సరిచేసుకోవడానికి చెప్పే ఆప్తవాక్యాలలాగా ఉంటాయి. ఇక యుద్ధ ప్రసక్తికి వస్తే, ఈ రోజుల్లో ఆటంబాంబులను మించి న్యూక్లియర్ బాంబులు (న్యూట్రాను బాంబులు) వచ్చాయి. ఒక్కసారి దాన్ని భూమిమీద ప్రయోగిస్తే, మొత్తం భూభాగమంతా శ్మశానం అవడమే కాకుండా, దాదాపు అర్థశతాబ్దిదాకా సక్రమంగా పంటలు పండవట. అసలు మనుషులే మిగలకపోవచ్చు కూడా. ఒకవేళ మిగిలినా మిగిలినవారి ఆరోగ్య పరిస్థితి ఎలా ఉంటుందో అందరికీ తెలిసిందే. అలాంటి నష్టాల నూహించుకుంటే ఊహామాత్రానికే భయంకరంగా ఉంటుంది. అందుకనే ప్రపంచమంతా శాంతియుతంగా మెలగాలంటూ అన్ని దేశాలూ మిత్రత్వంతో ఉండాలన్న నినాదం బయలుదేరింది. అయినప్పటికీ ఒక దేశానికి తెలీకుండా ఇంకో దేశం స్వార్థంతో అణ్వాస్త్రాలపై పరిశోధనలు జరుపుతూనే ఉంది. తయారు చేస్తూనే ఉంది. ఆ స్వార్థం ఎలాంటి పరిణామాలకు దారితీస్తుందో, దాని వల్ల నష్టమేమిటో మనస్సుకు హత్తుకునేటట్లు కవి విశాఖునిచేత రాయబారపు పలుకులలో చెప్పించాడు.

ఆయా సందర్భాలలో రాయబారి ఏ విధంగా మెలగాలో, ఏ విధంగా సంభాషణ చేయాలో, ఏ విధంగా ప్రవర్తిస్తే తన పలుకులు అవతలివాళ్ళను ఆకట్టుకుంటాయో, ఆయా రీతులుగా కవి

విశాఖునిచేత రాయబారాన్ని చక్కగా నిర్వహింపచేశాడు. ఈ ఘట్టాన్ని నిర్వహించడంలో కవి పూర్తిగా సఫలీకృతుడైనాడు.

విశాఖుడు ఒకరోజు అకస్మాత్తుగా తారకాసురుని సభలో ప్రత్యక్షమవుతాడు. అతనిని చూసి తారకు డీ విధంగా అనుకుంటున్నాడు :

సిరులొల్కు రుదురాక శ్రీశ్రవస్సుల లేదు
మొసలివాపోగులు మురువు చూపు
చిలువలయెకిమీని స్నేహమ్ము రోసెనో
అరుత వన్నెల బన్న సరము తూగు
ముమ్మొనవాలు హస్తమ్మున లేదేమి ?
మొనదేలు శితకుంతమును ధరించె
వన్నెల మెకముతోల్ పసనించ దనియొ మొ
జిలుగుదువ్వలువ చుంగులుగ దాల్చె

జ్వలనసన్నిభ శైవతేజమ్ము విడిచి
చంద్రసన్నిభ మధురవేషమ్ము దాల్చి
నందివాహనుడు శిఖివాహనమ్ము నెక్కి
వచ్చెనో నన్ను కరుణింప బాలు డగుచు. (పం. క : 1)

'చెవులలో రుద్రాక్ష లేదు - మకరకుండలాలు ఉన్నాయి. ఉరస్స్థలంమీద పాముకు బదులుగా ముత్యాలహారముందేమిటి? చేతిలో త్రిశూలం లేదేమి? దానికి బదులు పదునైన కుంతం (ఈటె) ఉన్నది. మృగచర్మం బాగులేదు కాబోలు - జిలుగు వన్నెల వస్త్రం కట్టుకున్నాడు. అగ్నిరూపంవంటి శివతేజాన్ని వదలి - చంద్రస్వరూపంలాగా మధురవేషం దాల్చి, నంది వాహనం వదలి నెమలి వాహనాన్ని ఎక్కి నన్ను కరుణించ

దానికి బాలుడై వచ్చాడేమో శివుడు' - అని అనుకున్నాడు తారకాసురుడు.

తారకుడు శివభక్తుడు కనుక, 'సాక్షాత్తు శివుడే కాని, రూపం మారిపోయిందేమిటి !' అనుకున్నాడు. శివుడు అగ్నిస్వరూపంలాగా ఉంటాడు. భగ్గుమని మండుతూ ఉంటాడు. ఆగ్నేయమైన శక్తి అది. కాని ఇది చంద్రస్వరూపం - చంద్రునిలాగా మధురంగా ఉన్నాడేమిటి - అనుకున్నాడు వాడు. శివతేజంనుండి కుమారస్వామి పుడితే, పార్వతితేజంనుండి విశాఖుడు పుట్టాడు అని కథలో చెప్పబడుతుంది. అందుచేత ఇతను (విశాఖుడు) 'చంద్ర సన్నిభ తేజమ్ము దాల్చి' పుట్టాడు. తంత్రగ్రంథాల్లో అగ్ని అంటే శివుడు, చంద్రుడు అంటే పార్వతీదేవి అని ఉంది. అందుకని ఆ మాట అన్నాడు తారకుడు.

అనుకొన వీలుగా గలిగినట్టి స్వరూపము కాని నన్ను ధ
న్యుని బొనరింప నాత్మ తలపుండిన నే దహరాభ్రమందునో
కనుపడునట్టి స్వామి పదకంజము లీ సభ దోప నేటికో
మసలను మోసగింపగ కుమారశివుండయి వచ్చె నెవ్వరో ?

(పం. క : 2)

'నన్ను ధన్యుని చేయాలని తలంపే ఉన్నట్లయితే, ఎక్కడో అంతరాకాశంలో కనిపించే స్వామి పాదాలు ఇక్కడ కనబడ్డాయేమిటి! మనలను మోసగించడానికి కుమారశివుని వేషం వేసుకొని వచ్చాడెవ్వడో' అనుకున్నాడు తారకుడు.

ఒకప్రక్క శివుడనుకుంటున్నాడు. మరోప్రక్క ఎవ్వడో మోసగించడానికి ఈ వేషం వేసుకువచ్చాడనుకుంటున్నాడు తారకుడు. అంటే వ్యక్తి స్వభావం చెప్పడమన్నమాట. వ్యక్తిలో ఈ రెండు

భావాలూ ఏకకాలంలో పుడుతుంటాయి. ఒకటేమో దైవభావన; రెండు - రాక్షసభావన. (ఇది రాక్షసునికే కాదు - మనుష్యులలో వ్యక్తి స్వభావం కూడా చెప్పినట్లయింది.)

తారకుని మంత్రి అయిన శూలి అనేవాడు రాజుతో "ఈ శిశువు (పిల్లవాడు) అక్కడికక్కడే పుట్టిన వెంట్రుకలు తామరలాగా పుట్టాడు. నా కిలా తోస్తుంది స్వామీ" అని (పం. క : 7), ఇంకా చెపుతున్నాడు :

నిన్ననె వేగు వచ్చినది నీరజజన్ముని యానచేత చె
ప్ప న్నగవా చమూపతిగ బాలుని నొక్కని చేసెనంట యా
నెన్నడియున్న వేడు తన నెన్నను చూపెనొ దైత్యరాజు కా
నిన్న జయింప ఆ శిశువు నేడిట వచ్చె నటంచు నెంచెదన్.

(పం. క : 8)

"చెప్పకుంటే నవ్వు వస్తుంది - బ్రహ్మదేవుని ఆజ్ఞచేత ఆ ఇంద్రుడు ఒక బాలుడిని (కుమారస్వామిని) దేవతల సైన్యాధిపతిగా చేశాడట. ఒకప్పుడు ఏ ఇంద్రుడు నీకు వెన్ను చూపాడో, ఆ నిన్ను జయించడానికి వచ్చిన ఈ శిశువు వీడేనని నేను భావిస్తున్నాను".

రాక్షసరాజు, మంత్రి అయిన త్రిశూలి భావాలను వారి మొహాలను చూసి మనసులోనే పసిగట్టాడు విశాఖుడు. వారి భ్రమలను తొలగిస్తూ ఈ విధంగా అంటున్నాడు- విశాఖుని మాటలు రాజనీతికి సంబంధించినవిగా ఉంటాయి.

**మధ్యాక్కరలు :**

ఓయి ! రక్షోనాథమంత్రి ! ఊహించినట్లేవు, నేను
ఆ యమేయ పరాక్రమనిధి అమరచమూపతిం గాను
రాయబారిగ వచ్చినాడ రాక్షసాధిప ! దేవసైన్య
నాయకు నిశితాజ్ఞచేత నను విశాఖుండందురెల్ల.

ప్రకృతి ఛందోగమనమ్మె రమణీయ ధర్మ మ్మటంద్రు
సుకవులు మునులు తద్ధర్మ సుందర గమనరక్షకమ
చకిత వజ్రమ్ము త్రోక్క-ధసంహతి స్కందుని మేను
సకు తాక పుట్టితి స్కందునకు నాకు భేదమ్ము లేదు.

(పం. క : 10, 11)

"ఓయీ రాక్షసమంత్రీ ! నీవు ఊహించినట్లుగా నేను ఆ అమేయ పరాక్రమనిధి అయినటువంటి అమరసేనాధిపతిని కాను. నేను ప్రస్తుతం ఆ సైన్యాధిపతి ఆజ్ఞచేత రాయబారిగా వచ్చాను. నను అందరూ 'విశాఖు'డని పిలుస్తారు. (పం. క : 10)

"ప్రకృతి అంతా ఛందోగతిలో ఉంటుంది. అంటే ఒకవిధమైన నియమానికి లోబడి గమిస్తూ (చలిస్తూ) ఉంటుంది. (ప్రకృతిలో Rhythemic movement ఉంది.) ఆ విధమైన ప్రకృతి ఛందో గమనాన్ని సుకవులు, మునులు-అంటే విజ్ఞానులు 'రమణీయ ధర్మము' అంటారు. ఆ ధర్మాన్ని రక్షించే సాధనం వజ్రం (వజ్రాయుధం). దాన్ని ఇంద్రుడు ఒకసారి స్కందునిపై ప్రయోగించాడు. అది తాకినప్పుడు అతని శరీరంనుండి నేను ఉద్భవించాను (పుట్టాను)" అని విశాఖుడు రాక్షసమంత్రికి చెప్పాడు. (పం. క : 11)

కుమారస్వామి తాను పుట్టిన మూడు రోజులకే శివధనుస్సు నెత్తి ధనుష్టంకారం చేస్తాడు. ఆ శబ్దం త్రిభువనాలూ దద్దరిల్లేటట్లుగా

వచ్చి ఇంద్రుని చెవి తాకింది. ఎవరో శత్రువేమో అని ఇంద్రుడు వజ్రాయుధాన్ని ఉపయోగిస్తాడు. ఆ వజ్రాయుధపు తాకిడికి స్కందుని (కుమారస్వామి) శరీరంనుండి విశాఖుడు పుట్టాడు. (దీన్నే Creative Principle అనవచ్చు - నాశం కావడానికి బదులు సృష్టి జరగటం - ఈ ధర్మం ప్రకృతిలో ఉంటుంది. ఉదాహరణగా ఒక విషయం చెప్పుకుందాం: రైతు తన పొలంలో పైరుపై పట్టిన పురుగులను చంపడానికి ఏదైనా క్రిమిసంహారక మందు కొడతాడు - అయితే ఆ పురుగులు చస్తాయి కాని, ఇంకో కొత్తరకం పురుగులు తయారవుతాయి. వాటిని చంపడానికి మళ్ళీ శాస్త్రజ్ఞులు కొత్త మందును కనుక్కోవలసి వస్తోంది - సారాంశమేమంటే - సృష్టిలో Creative Principle ఉంది అని చెప్పటం. ఇంకా ఒకటి ఉదాహరణగా చెప్పుకోవచ్చు. మనుషులకు సోకే మశూచిని టీకాలవల్ల పూర్తిగా ప్రపంచంలోనే లేకుండా చేశారు జీవశాస్త్రజ్ఞులు. అయితే మశూచి నాశనమయింది - ఇంకా కొత్త కొత్త రోగాలు మనిషిలో పుట్టుకొస్తున్నాయి - పోలియో, AIDS ఇలాంటివి. పోలియోకు టీకాలు కనుగొన్నారు కాని, ఇంకా AIDS కి కనుగొనలేదు.)

విశాఖుడు ఇంకా ఈ విధంగా అంటున్నాడు - రాక్షస రాజుతో.

**మ ధు రా క్క ర :**

ఆ మనోహరచ్ఛందోమయప్రవృత్తి నడ్డితివి
శ్రీమధురరసానందమ్ము చెడ నసంస్కృతశబ్దమ్ము
గా మృదుమనస్కతన్ వినగా నిచ్చగింతువేని
నా మనస్సున తోచెడి నాల్గుమాటలు చెప్పెద. (పం. ౬ : 12)

"అలాంటి మనోహరమైన ఛందోమయ ప్రవృత్తిలో ఉన్న ప్రకృతిని - బాగా మధుర రసానందంలో తేలుతున్న అనుభవ తాదాత్మ్యాన్ని ఒక్క అసంస్కృత శబ్దంతో (సంస్కారహీనపు మాటతో) చెడగొట్టినట్లుగా - దాన్ని నీవు ఆక్షేపించి చెడగొట్టను. మంచి మనసుతో వినడానికి ఇష్టపడేటట్లయితే, నా మనస్సుకు తోచే నాలుగు మాటలు చెప్తాను".

పై మధ్యాక్కరలు, మధువాక్కర సంభాషణకు చక్కగా ఉపయోగపడ్డాయి. 'శ్రీ మధుర రసానందమ్ము చెడ నసంస్కృత శబ్దమ్ము'గా అని పోల్చడంతో, కవి కున్న సుకుమారమైన భావాన్ని మనం గ్రహించవచ్చు. 'వినగా నిచ్చగింతువేని నా మనస్సున తోచెడి నాల్గు మాటలు చెప్పెద' అనటంవల్ల, ఏదో నా బుద్ధికి తోచే నాలుగు మంచిమాటలు చెప్తానన్నట్టుగా ఉంది. తెలుగు మాట, తెలుగు పలుకుబడి ఆ విధంగానే ఉంటుంది.

రాక్షస ప్రభువు చూపిన సింహాసనంపై ఆసీనుడై విశాఖుడు తన ముఖంవైపే చేష్టలుడిగి చూస్తున్న సర్వసభ్యుల నుద్దేశించి రమ్యమైన వాక్కులతో (సం. క : 13) తారకాసురుని రాజనీతిని, నగర నిర్మాణాన్ని, ప్రభుత్వాన్ని మెచ్చుకుంటూ ఈ విధంగా అన్నాడు :

జనపదసీమలన్ నగరసంతతి వీధులు లక్ష్యశుద్ధి గ
ల్గిన విలుకాని బాణమువలెన్ ఋజుమార్గమ్ములై తనర్చ సౌ
ధ నిచయముల్ సమున్నత సుధాధవళంబులు నిర్జర ప్రపం
చ నిభృత వైభవమ్ము కని నవ్వెడు పోల్కిగ నుండ జూచితిన్.

నలు దెసలందు దుర్గములు నాల్గిటి చూచితి తావకాప్రఘే
ద్య లలిత పాలనమ్మునకు నచ్చెరువయ్యెను వప్రసంతతుల్

సలిల ప్రపూర్ణముల్ పరిఖలన్ గగనాపగ లీడనాడు వే
నలి కని నవ్వుకొంటి బరువయ్యెను చూడ్కికి వప్రయంత్రముల్.

(పం. క : 16, 17)

"లక్ష్యశుద్ధి కల్గిన (చక్కగా గురిపెట్టగలిగిన) విలుకాని బాణము ఏ విధంగా ఋజుమార్గంలో పోతుందో ఆ విధమైనటువంటి వీథులు నగరంలో ఉన్నాయి. సువాసనలతో కూడుకున్నటువంటి ఎత్తైన మేడలు, నీ భవనాలు రాచఠీవితో నవ్వుతున్నాయి.

(పం. క : 16)

నాలుగు రకాల దుర్గాలు - స్థల దుర్గాలు (నేలమీద కట్టేవి), నగదుర్గాలు (కొండలమీద కట్టేవి), మరుదుర్గాలు (ఎడారుల్లో కట్టేవి), జలదుర్గాలు (నీటిలో కట్టేవి) మొదలైన వాటిని నేను చూశాను. నీ అందమైన పరిపాలనచూసి నాకు ఆశ్చర్యమైంది. చుట్టూ కైవారపు గోడలు, గగనాన్ని అంటుకునేటట్లుగా ఉన్న అగడ్తలు, ఫిరంగుల యంత్రాలు మొదలైనవి చూడటానికే కంటికి బరువయ్యాయి."

తారకాసురుడి నగరనిర్మాణ వ్యూహం (city plan) అతడి పరాక్రమానికి ప్రతిబింబం. 'నగరవీథులు విలుకాని బాణమువలెన్ ఋజుయానములై' అన్నాడంటే, నగరవీథుల్లో తారకుని పరాక్రమం చూశాము. అతని గర్వం వాని భవనాల్లో కనిపిస్తోంది. ఏ వ్యక్తిలోనైనా సరే తనలో (Personality) పెరిగేకొద్దీ, పరిసర వాతావరణంలో **reflect** అవుతుంటుంది (ప్రతిబింబిస్తుంటుంది).

గడితలముల్ విషాక్త విశిఖమ్ముల పోలిన పార్వతీయు లె
ల్లెడ కనువిప్పి కాచెదర ఎట్టి భయమ్మును లేని వేళలం

దడవులు జంతుభీకరములై భువి పెట్టని కోటలై దహిం
చెడు మరి అంత పాలకులచే పురసీమలు నిత్యభద్రముల్.

(కుం. క : 18)

"విషం పూసిన బాణాలవంటి పర్వతప్రాంతపు మనుష్యులు (కొండజాతివారు) జాగ్రత్తతో రాజ్యపు సరిహద్దులను కాస్తున్నారు. మీ రాజ్యంలో దట్టమైన అడవులు ఉన్నందువల్ల అందులో ఉండే భీకరమైన క్రూరమృగాలు మొదలైనవి నీ రాజ్యానికి పెట్టని కోటలు. సరిహద్దుల్లో రక్షకులచే పురసీమలు నిత్యమూ భద్రంగా ఉన్నాయి." (రాజనీతి ప్రకారం పొలిమేరల్లో సైనికుల మోహరింపు ఉండరాదు.)

ఈ రాజనీతి అంతా కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఉంది. అడవులు పెట్టని కోటలుగా ఉండాలని రాజులు సరిహద్దుల్లో అదే పనిగా అడవులు పెంచేవారు.

"వేదశాలలు కల్గిన నీ పరిపాలన ప్రశంసనీయం" అని మెచ్చుకుంటూనే, తారకాసురుని ప్రవర్తనను ఈ విధంగా ఖండిస్తున్నాడు విశాఖుడు :

వార్తాన్వీక్షకి దండము
వర్తించు త్రయీముఖాధ్వభాక్కులుగా నీ
వర్తన తచ్ఛ్రుతికిన్ వ్యతి
రిక్తముగా నుండె సూ! అరిప్రకరమెడన్.

"రాజనీతిలోని 'వార్త, ఆన్వీక్షకి, దండము' అన్న ఈ మూడు శాఖలు (ఇవి కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఉన్నాయి) వేదాలలో పవిత్రమైన అంశాలుగా (మాటలుగా) ఉన్నాయి. శత్రువులపట్ల నీ ప్రవర్తన ఆ శ్రుతికి వ్యతిరేకంగా ఉంది.

1. వార్త = దీనిద్వారా లాభాలాభాలు తెలుసుకోవచ్చు.

2. అన్వీక్ష= ప్రత్యక్షాగమముల చేత దృష్టమైన విషయాన్ని మరల ఆలోచించటం; వెదకడం.

3. దండము= రాజు శత్రువులయెడ ప్రయోగించే చతు రుపాయాలలో నాల్గవది (ఇది మూడు విధాలుగా ఉంటుంది. 1. వధించటం, 2. ధనమపహరించటం, 3. పీడించటం),

ఏ మాటకు ఆ మాటే చెప్పుకోవాలన్నట్లుగా, తారకాసురుని పరిపాలనను మెచ్చుకున్నాడు. అయితే ఇతరులపట్ల తారకుడు ప్రవర్తించే తీరు మంచిది కాదని బుద్ధి చెప్పాడు. అట్లా కాకుండా ప్రత్యక్షంగా అతని ప్రవర్తనపై మాత్రం విరుచుకుపడితే, రాయబారం చెడిపోతుంది.

"ధర్మము నాలుగు పాదాల నడిచేటట్లుగా, మీ అందరి సమక్షంలో ఇంద్రుడు రాజు చేయబడ్డాడు కదా ! ఇప్పుడు దానికి వ్యతిరేకమైన ప్రవృత్తి తగునా ?" (సం. క : 22) అంటూ ఇంకా కింది విధంగా అంటున్నాడు :

నిన్నును నిందసేయుటకు నేను వచింపనుగాని చూడుమా
ఎన్నగ తస్కరాది జనులెల్లరు పైకిని లోకభీకరుల్
పన్నుగ శాంతయింట మృదుభావులు నీదగు రాజనీతి ఈ
తెన్నున బోవు ఆత్మభువి దేవళి మన్యము ప్రేతభూమిగా.

"నిన్ను నిందించాలని నేను అనటంలేదు కాని, తస్కరులు ఇతరుల విషయంలో క్రూరంగా ప్రవర్తిస్తారు. ఆ తస్కరులే తమ ఇంట్లో వాళ్ళతో అయితే, మృదుస్వభావంతో నడుచుకుంటారు. అంటే మెత్తని హృదయంతో ఉంటారు. నీవు నడిచే రాజనీతి కూడా అచ్చం ఈ రీతిగానే ఉంది. తమదైతే దేవాలయం;

ఇతరులనైతే ప్రేతభూమిగా భావించి ప్రవర్తించడం న్యాయమా ? !"

"నీ సమస్త రాజనీతినీ వెచ్చించి జగద్భయంకర మహోన్నత వీరుడ వనిపించుకోవాలన్న కీర్తికోసం దానవాదులపై దండెత్తి వారిని హింసించడం అచ్ఛమైన శాంతికి దారి అనిపించుకుంటుందో లేక విప్లవంకర మనిపించుకొంటుందో నీ అంతరాత్మను విచారించి చూడు."
(పం. క : 24)

"ఇంద్రుడు అష్టదిక్పతులలో ఒకడైనప్పటికీ మిగతావారి కంటే ప్రధానుడవడం వల్ల, నీవు - కుబేరునికీ, నైఋతి మొదలైనవారికీ ఇంద్రునితో భేదమార్గం కల్పించావు. నీవు చెప్పిందే నిజమని నమ్మి వారు ఇంద్రుని స్నేహం మానేశారు (పం. క : 26). అదే అదనని నీవు ఇంద్రుని ఏలు గాలి పొరలు (ఆకాశంలో వాతావరణపు పొరలు ఉంటాయి) అయిన ప్రాంతం ఆవలివైపుదాకా గదిమినావు. అది మంచి పద్ధతి కాదని ఇంద్రుడు దౌత్యం పంపిస్తే, నీవు ఏ మాత్రమూ పాటించక యుద్ధనీతి విరుద్ధంగా సాత్త్వికుడైన స్వర్గాధిపతిని వరశక్తితో గెలిచావు (పం. క : 27). ఇంద్రుడు చేసేదేమీ లేక కశ్యపుని దగ్గరకు పోయి చెప్పుకోగా, అప్పుడు నిన్ను పిలిచి కశ్యపుడు ఏమి చెప్పాడో జ్ఞప్తికి తెస్తాను - 'మరుద్గణము వీడును నీవును నాది నాదటంచును కిరిగాగ వీడు వది చూతును యాజ్ఞిక దీక్ష వీడి పై' (పం. క : 28) [మీరిద్దరూ నాది నాదని తగవులాడక, అది సరిహద్దుగా వదలండి. యజ్ఞదీక్షానంతరం నేను విచారిస్తాను - అందాకా ఎవరూ దాని జోలికి పోవద్దు] అని చెప్పలేదా!" అని విశాఖుడు తారకునికి గుర్తు చేశాడు.

సతవదనుండవ వాజ్ఞ యనినాన్ప పదంపడి సంధిదేశ సం
భృత భవదుగ్రనీతి మతిస్ప్రత సుస్మిగ గోపురమ్ముపై

తత పరిఖావృతంబు లయి తాల్చెను సూ గడి దుర్గ రూపముల్
పితృవచనావమాన మని పిల్తురొ ? నీతికి బాహ్యమందురో !
(పం. క : 29)

“మీ తండ్రిగారి ఆజ్ఞను పాటిస్తానని చెప్పావు. కాని నీ అతి తీవ్రమైన ఆలోచన, నీ ఉగ్రనీతి సుళ్ళుగా గోపురాలై గడి దుర్గ రూపాల చుట్టూ అగడ్తలయి రూపుదాల్చింది. దీన్ని తండ్రి మాట ధిక్కారమంటారో, నీతిబాహ్యం (నీతి మాలిన పని) అంటారో నీవే యోచన చేసుకో.”

తారకాసురుని ఆలోచన - మతి తీవ్రత సుళ్ళు తిరిగింది. ఆలోచన సుళ్ళు తిరిగి గోపురాలు కట్టింది. సుళ్ళు తిరగటం వరద లక్షణం. సమాసాలు, శబ్దాల కూర్పు బరువైనది. మాటలు తేలికగానే ఉన్నా మాటల్లో బరువు ఉంది. సంబంధం పటిష్ఠంగా ఉంది.

గెలిచినయట్టి రాజు తన గెల్పున లోగినవాని స్త్రీలకున్
తొలగును గాని తానయి విఘూర్ణిత పట్టి హరించి తెచ్చుటల్
విలులిత రాజధర్మపథనిస్తృతి కాదొ ? మరౌనొ ? త్వత్సభా
స్థలుల చెలంగె నాకవనితాచరణాంగద కింకిణీ ధ్వనుల్.
(పం. క : 30)

“ఏ రాజైనా తాను గెలిచినప్పుడు తనకు లొంగిన శత్రు రాజుల స్త్రీలను విడిచిపెట్టడం రాజనీతి. అట్లు చేయకపోగా తానే వంచనతో పరస్త్రీలను అపహరించి తేవడం లోపించిన రాజధర్మనీతి మార్గమనిపించుకుంటుందో, లేదో - నీవే ఆలోచన చేసుకో.”

శ్రీకృష్ణదేవరాయలు రాజనీతిని గురించి చెప్తూ, శత్రురాజులను జయించినప్పుడు వారి స్త్రీలను - ఆడపడుచులను ఆదరించినట్లు ఆదరించి పంపాలన్నాడు.

'రాష్ట్రి మెరయింపు కొనుము దుర్గములు, తదవ
రోధ మగపడ్డ పుట్టింటి బూధి నెరపు
పరుసములు తద్రిపుల రాయబారు లెదుట
పలుకకుము'...... (ఆముక్తమాల్యద : 4-267)

రాజనీతి మొదలైన విషయాలు విశాఖుడు చెప్పినపుడు రాక్షస రాజు, సామంతరాజుల మొహాలు కోపంచేత ఎఱ్ఱబడ్డాయి.

...రాజు సచివులు సామంతరాజ మొగము
లందు జేవురుల్ కురిసె సంధ్యాతపములు.

దేవసేనామనోనాథు దీప్తమైన
రాయబార తాత్పర్యమ్ము రవ్వలుకొలుప
చిటచిటారవ మాలికా శిఖలు లేచి
క్రోధతీవ్రాగ్ని రాక్షసుల్ కొలుములైరి.

(పం. క : ౩౭, ౩౮)

దేవసేనానాయకుడైన కుమారస్వామి తలపెట్టిన రాయబార తాత్పర్యమంతా రాక్షసులమందు పనికిరాకుండాపోయింది. తీవ్రమైన క్రోధాగ్నిచేత మంటలు విశృంఖలాలై లేచి రాక్షసులు అగ్నికొలుము లయ్యారు. ఇక్కడ రాక్షసులను కొలిమిలో ఉండే అగ్నితో పోల్చడంవల్ల, వాళ్ళకోపం ఎంత పరకాష్ఠకు పోయిందో అర్థమవుతుంది. సామాన్యంగా వ్యవహారంలో, బాగా ఎఱ్ఱబడ్డ కళ్ళను 'కళ్ళు చింతనిప్పులయ్యాయి' అంటూ ఉంటారు. మామూలు నిప్పుకంటే చింతనిప్పు ఎరుపు ఎక్కువగా ఉండి, వేడిని కూడా ఎక్కువగా ఇస్తుంది. కొలిమిచేత ఊదబడినటువంటి అగ్ని ఎఱ్ఱదనంలోనూ, వేడిమి నివ్వటంలోనూ అన్నిటికంటే ఎక్కువే అన్నది అందరి అనుభవంలో ఉన్న విషయమే.

విశాఖుడు తారకాసురునికి ఇంద్రునితో సంధి చేసుకోమని ఎన్నో ధర్మసూత్రాలు చెప్పాడు. అవన్నీ పెడచెవిని పెట్టిన రాక్షసులను చూసి విశాఖుడు తనలో ఇలా అనుకుంటున్నాడు :

అకటా ! ఎంతటి చిత్రజాతి ఇది ! అత్యాశ్చర్యమౌ ధర్మమున్
ప్రకటింపన్ విని సంతసింపుటకు తీవ్రక్రోధముం బొందు వ్య
క్తికి ధర్మంబు నిరాశ్రయానుభవమై పెన్నుల్ ప్రకాశించు నై
హిక తాదాత్మ్యులు వ్యక్తిలుప్తి కిట తావేలేదు నక్తంచరుల్.

(పం. క : 34)

'ఈ రాక్షసజాతి ఎంత విచిత్రమైనది ! అమితాశ్చర్యకరమైన ధర్మసూక్ష్మాన్ని చెప్తే విని సంతోషించడానికి బదులుగా తీవ్రమైన కోపం పొందింది. దేహతాదాత్మ్యబుద్ధి ఉన్నవారికి ధర్మము నిరాశ్రయ మవుతుంది (అంటే వీరివద్ద ధర్మానికి తావు ఉండదు). వ్యక్తిత్వలోపానికి అసలు తావులేదు.'

ఇక్కడ 'నైహిక తాదాత్మ్యులు' అనటం సముచితంగా ఉంది. ఆత్మ తాదాత్మ్యం ఉన్నవారికైతే ఏదైనా ధర్మసూత్రం చెప్తే ధర్మాన్ని తమ అనుభవంలోకి తెచ్చుకుంటారు. 'వ్యక్తిలుప్తి' అనే పదబంధం ఇంకా అందమైనది. వ్యక్తిత్వలోపం అన్నమాట. ఒక వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని లోపింపజేసుకుంటే ఆ వ్యక్తి గౌరవం పెరుగుతుందే కానీ, తరగదు - తగ్గదు. 'తన్ను తాను హెచ్చించు కున్నవాడు తగ్గింపబడతాడు. తన్ను తాను తగ్గించుకున్నవాడు హెచ్చింపబడతాడు' (గౌరవం పెరుగుతుంది) అని బైబిలు కూడా చెప్తోంది. వ్యక్తిత్వం లోపింపజేసుకోవడం ద్వారానే అవతలి మనిషిని ప్రేమించగలుగుతాడు. తిరిగి అవతలి వ్యక్తి ప్రేమను పొందగలుగుతాడు. ఉదాహరణకు చిన్న విషయాన్నే చూద్దాం : ఒకతల్లికి లేదా తండ్రికి తమ బిడ్డలపై ప్రేమ సహజంగా ఉంటుంది.

వారు తమ బిడ్డలకోసం తాము తినేది కూడా వదులుకొని దాచి పిల్లలకు పెడతారు. ఒక స్నేహితుడు తన స్నేహితుని కోసం తన అభిరుచిని కూడా మానుకొని అవతలి వ్యక్తి ఏ అభిరుచి అయితే కల్గి ఉంటాడో, ఆ అభిరుచిని (మంచి అలవాటును) తాను అలవాటు చేసుకుంటాడు. అదే ప్రకారంగా ఇవతలివాడు కూడా ఆ స్నేహితుని అభిప్రాయంతో ఏకీభవిస్తాడు. అంటే వాళ్ళు తమ తమ వ్యక్తిత్వాలను లోపింపజేసుకోవడం ద్వారానే మంచి స్నేహితులుగా దగ్గరవుతున్నారు. అదేవిధంగా ఒక భార్య కాని, భర్త కాని- వారిరువురూ తమ తమ వ్యక్తిత్వాలను లోపింపజేసుకొని ఒకరికొకరు ప్రేమను పంచుకోగలుగుతారు. అట్లా కాకుండా "నా వ్యక్తిత్వమేమి కావాలి? నా వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోను"అని ఇద్దరూ పోటీ పడితే, వారి వ్యక్తిత్వం మాట అటుంచి చివరికి సంసారం పోగొట్టుకుంటారు. ఈ విధంగా వ్యక్తిత్వలోపం ద్వారా మహావ్యక్తి అవుతాడు తప్ప, తన గౌరవమేమీ తగ్గదు. ఇక ప్రస్తుత సందర్భానికి వస్తే, తారకాసురుడు తాను మహావీరు డనిపించుకోవాలని దాయాదులపై నే దండెత్తినాడు (పం. క : 24), అంటే వీనది దేహాత్మాదాత్మ్యబుద్ధి అన్నమాట. ఇక్కడ 'నక్తంచరుల్' అనే ఇంకో మాట ఉంది. అంటే రాత్రిపూట సంచరించేవాళ్ళు అని అర్థం. రాత్రి అధర్మానికి, అజ్ఞానానికి సంకేతం. అధర్మం చేయడానికి రాత్రి బాగా ఉపయోగ పడుతుంది. ధర్మాన్ని ఒప్పుకుంటే వాని ఉనికి దెబ్బతింటుంది. ఇది లోకం పోకడ. తమకు ఉపయోగపడేదైతే ధర్మం - లేకపోతే అధర్మం. ఇది లోకంలో కుమతుల తీరు. దేహాతాదాత్మ్యబుద్ధి ఉన్నవారంతా, మనుష్యులైనా సరే-రాక్షసుల కిందే లెక్క. అందుకే రాయబారం రాక్షసులకు ఉద్దేశించిందే అయినా, ప్రతి వ్యక్తికీ సంబంధించిందిగా ఉన్నట్లుంటుందని వ్యాసం మొదట్లోనే చెప్పటం.

సృష్టి సకలమ్ము తనకే
స్రష్ట వినిర్మించెనని బుజాలెగుర నహం
స్పష్టత వర్తింతురు స్వా
భీష్టము దైవమనుచు గొనివేసినటుల్ గా. (పం. క : 36)

'ఈ తారకాసురుడు సృష్టికర్త తనకోసమే ప్రపంచాన్ని సృష్టించాడనుకొని అహంకారంతో భుజాలెగరేసుకుంటూ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నాడు - తన ఇష్టమే దేవుడన్నట్లుగానూ, దేవుణ్ణి మొత్తం తానే కొనేసినట్లుగానూ ప్రవర్తిస్తున్నాడు.'

తన మెచ్చిన యది ధర్మవు
తన లౌకికవాంఛ యెల్ల ధర్మవు కొలతౌ
కనబడు వీరలకటా ! ధ
ర్మ నిత్యతను రాయబారి మాటగ వినుతున్. (పం. క : 37)

'తాను ఏది మెచ్చితే అదే ధర్మం. తన లౌకికవాంఛే ధర్మానికి కొలబద్ద అయి కనబడుతుంది. అంటే తన ఇష్టమేదైతే ఉందో అదే ధర్మ మవుతుందనుకుంటాడు వీడు' (పం. క : 37) అని విశాఖుడు మనసులో అనుకుంటూ, తారకాసురునికి ఇంకా ఈ విధంగా సందేశమిస్తున్నాడు :

"కోపం విడిచిపెట్టకుంటే సూక్ష్మమైన ధర్మం చెవికెక్కదు. కోపంతో ఉన్నవాడికి ఏది చెప్పినా వ్యర్థం (అర్థంకాదు). అందు కని మనస్సును శాంతంగా పెట్టుకో" మంటున్నాడు విశాఖుడు.

(పం. క : 38)

దైవపదద్వయీ మృదుల తామరసారుణ చిక్కణ ప్రభల్
భావన చేసి చేసి మృదుభావుల రాదురు సర్వ లీ మహా

శైవ విభాస్ఫుర ద్వదనసంపగ అచ్చపు ధర్మ భావనా
దైవతపాళి చత్రపుసితచ్ఛవియైన యదెంత లగ్గగున్.
(పం. క : 39)

"సర్వజనులూ దైవతత్త్వాన్ని వారి వారి మనసుల్లో భావన చేసి చేసి, వారంతా మృదుస్వభావులుగా మారిపోతారు. నీలో మహాశివతేజస్సు ఉంది (తారకుడు శివభక్తుడు కనుక). ఈ శివ తేజస్సు ధర్మదేవతకు తెల్లగొడుగు అయిఉంటే ఎంత బాగుండేది !"

"నీ వరశక్తి చాలా గొప్పది. అలాంటి వరసంపద నీ తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు నీ వశం చేశాడు. ఇది నిజంగా శ్లాఘనీయం (మెచ్చుకోతగ్గది). కాని సర్వమూ నా చేతిలో కీలుబొమ్మ అయిందన్నట్లుగా, 'బ్రహ్మ నా వశమయ్యా'డని నీవనుకుంటున్నావే - ఇది సమంజసమా!" అని అడుగుతున్నాడు విశాఖుడు (పం. క : 40)

తావకమైన ఈ తలపు తప్పు నిశాచరరాణ్మహేశ్వరా !
ఈవహహో ! ఎంతగా పెరుగు దంతకు రెట్లుగ పైకిపోయెడిన్
దైవము - పూర్వరాక్షసులు దారుణమౌ వరశక్తి పొందియున్
బోవరె! యీ వృథాస్మయము పుట్టుట చెట్ట సుమీ సురాగ్రజా!
(పం. క : 41)

"నీ యీ తలంపు తప్పు. నీ వెంత పెరిగినా, దైవము అంతకు రెట్టింపు పెరుగుతుంది. నీవు వృథాగర్వం పడవద్దు. ఆ గర్వం పుట్టడమే నీకు చేటు. పూర్వం (నీకంటే ముందు) రాక్షసులు గొప్ప వరశక్తి పొంది ఉండి కూడా, వారంతా చివరికి నశించలేదా !"

ఇక్కడ 'తప్పు' అనే పదం యతిస్థానంలో ఉంది. తప్పు అని ఖండితంగా చెప్తున్నాడు. వాడు మరీ నిజం చెబుతాడనేదే లోకం కోపం. నిజం చాలా ఖండితంగా ఉంటుంది. 'ఈవు ఎంతగా పెరుగు

దింతకు రెట్టుగ పైకి పోయెడిన్ దైవము' అంటే, నీ తెలివి ఎంత పెరిగినా, దైవ మంతకు రెట్టింపు పెరుగుతుంది. తెలియని విషయాలు పెరుగుతాయి. విజ్ఞానం పెరిగే కొద్దీ ప్రకృతి పెరుగుతుంది. తెలియని కొద్దీ అంతా తెలుసుననిపిస్తుంది. తెలిసినకొద్దీ చాలా తెలియదని పిస్తుంది. విద్య పెరిగినకొద్దీ వినయం వస్తుంది. మిడిమిడి జ్ఞానమే వృథాగర్వానికి కారణమవుతుంది. వృథాహంకారం అంటే అహంకారం - వేరు చుట్టూ ఉన్న చెదలులాంటిది. అది నశింప జేస్తుంది. గర్వం అధఃపతనం చెందిస్తుంది. వినయం ఉన్నత స్థానానికి మోసుకుపోతుంది.

నీవ తలంచి చూడుము మది నింద్యమొ వంద్యమొ తేలిపోవు - నీ
వా విధి నంత బెట్టిదములౌ వరముల్ దయసేయుమంటి త
ద్భావనలో రజోగుణవివర్ధత తీవ్రత ఎంత చెట్టయా
ఆ వరవాంఛరోం జగతి కంతకు వెట్ట పొనర్చునట్టిగా.

(సం. క : 42)

"నీవే ఆలోచన చేసి చూసుకో! నిందింపదగిందా? గౌరవింప దగిందా? బ్రహ్మను గొప్పవరాలు ఇమ్మంటివి. ఆ భావనలో రజోగుణం ఎంత తీవ్రమైందో, దాన్నుంచి అంత చెఱుపు ఉంది." (ఈ వరవాంఛను ఈ కాలంలో అణ్వస్త్ర పరిశోధనలు సాగించాలనే ఆకాంక్షతో పోల్చవచ్చు. పరమాణు బాంబు, హైడ్రోజన్ బాంబు లను మించి న్యూట్రాను బాంబులు తయారు చేసుకోవాలనే తలంపు- వాటి కోసం పరిశోధనలు చేయాలనే తలంపు ఉండరాదని లోక శ్రేయస్సును కోరే విజ్ఞానులు చెప్తుంటారు.)

వతము లానంగునట్టి తతి వారిజనాభుడు లో దలంచియే
వరబలు నిమ్ము నోర్వగల వానిని మ్మునున్నగ - నీ కొసంగ త

ద్వరములు తద్విధాత - విధి తప్పదు సూ ఎట్లైన రాక్షసే
శ్వర ! పగలైన రేయియగు చంద్రిక చీకటి తెన్ను తప్పునే!

నీ వరశక్తి సర్వమును నిన్నటితోడ సమాప్తి చెందెడిన్
దేవచమూమనోహరపతిత్వము నెత్తిన దాల్చినాడు తా
నై వడి శూలపాణి మరి యష్ట హరిత్పతు లుజ్జ్వల యుధ
శ్రీ వెలుగంగ ఉగ్రరణసీమకు రా నెదురింప సాధ్యమే ?
(పం. క : 43, 44)

"నీకు విధాత (బ్రహ్మ) వరప్రదానం చేసేటప్పుడు, పరబలుడైన నిన్ను గెల్వగలవానిని ముందుగా తన మనస్సులో చూసుకునే వరము లిచ్చాడు. కనుక ఏది ఏమైనా విధాత విధి తప్పించుకోవడానికి వీలులేదు. ఇప్పుడు పగలు అయిందీ అంటే, రాత్రి వెంటనే వస్తుంది. వెన్నెల, చీకటి వాటిదారి నవే రెండూ ఉంటాయి (పం. క : 43). నిన్నటి దినమున శక్తిధరుడైన కుమారస్వామి దేవసేనానాయకత్వం నెత్తిన దాల్చినప్పుడే నీ వరశక్తి అంతమైపోయింది. ఉజ్జ్వలాయుధాలు కల్గిన అష్టదిక్పాలకులతో కూడి అతను ఉగ్రమైన యుద్ధభూమికి వస్తే నీకు ఎదురించడానికి సాధ్యమవుతుందా ?" (పం. క : 44) అన్నాడు విశాఖుడు.

నీతి యనంగనేమొ మరి నేను వచింపగ నేల దైత్యరా
జ్యాతతపాలనా విభవ మంతగ దాల్చిన నీకు - బాలుడేన్
నీ తరువాత స్వర్గపతి నీ యడుగుంబడి వచ్చు వాహినీ
నేత కుమారధూర్జటియు నిన్నిను - దిక్పతులెల్ల గొల్తురున్.
(పం. క : 47)

విను త్రైలోక్యము నిన్ను గొల్చెను భవద్వీర్యప్రతాపాగ్ని కిం
ద్రునిదా సాత్త్వికబుద్ధి తోడయున ఎంతో లగ్గు గాదా ! తలం

చిన - నిన్నున్ మరి వేడెదన్ సుమి జగచ్ఛ్రీభద్రతాకాంక్షినై
ఘనదైతేయమహీవధూత్పలదళాక్ష స్నిగ్ధజైవాతృకా !

(పం. క : 48)

సువిశాలమైన దైత్యరాజ్య పరిపాలనాభారం వహించిన నీకు బాలుడైన నేను నీతి అంటే ఏమిటో చెప్పాలా ! నేను చెప్పేది నీవు వింటే, స్వర్గాధిపతి అయిన దేవేంద్రుడు, దేవసేనానాయకుడైన కుమారశివుడు, దిక్పతులు, త్రిలోకాలకు చెందిన ప్రజలు నిన్ను కొలుస్తారు (పం. క : 47). నీ వీరప్రతాపానికి ఇంద్రుని సాత్త్వికబుద్ధి కూడా తోడయితే ఎంతో మేలు చేకూరుతుంది కదా ! అందుకే నీతోపాటు జగత్తంతా భద్రంగా సురక్షితంగా ఉండటంకోసం నిన్ను నా మాట వినుమని వేడుకుంటున్నాను."

ఇక్కడ (47, 48లలో) రాయబారి చూపవలసిన మెలకువలన్నీ విశాఖుడు చూపాడు. 'మాట వింటే త్రిలోకాలూ నిన్ను కొలుస్తాయి' అన్నాడు. వెన్నెళ్ళకు చన్నీళ్ళు తోడైనట్లుగా ఇంద్రుని సాత్త్విక బుద్ధి కూడా కలిస్తే ఎంతో మేలు అవుతుంది. జగద్భద్రతకోసం తారకాసురుని వేడుకొని మరీ చెప్పాడు. ఈ పద్యాల్లో రాయబారికి ఉండవలసిన చక్కటి మృదువైన సంభాషణ ఉంది.

ఇక యుద్ధంవల్ల సంభవించే నష్టాలు, దీనావస్థలను గురించి తారకాసురునికి వివరిస్తున్నాడు :

అని యనిసంత ఎంతటి ప్రయాస ? జయాపజయమ్ము లెట్టివో
కనుటకు నిశ్చయించుటకు గాద అహో ! వసుధాధిపాళిలా
గ్రణి ! ధర మాడి బొగ్గగును గాని మరొక్కటి యౌనె! కాన ప్రాం
దొనరిచి లోకమెల్ల విభవోజ్జ్వలతన్ జిగురింపచేయవే.

(పం. క : 49)

"యుద్ధం అంటే ఎంత ప్రమాద? జయాపజయాలు ఎవరికి నిశ్చయించడానికి వీలు అవుతుంది? భూమి అంతా మాడి మసి అయి పోతుంది తప్ప అంతకంటే ఏమి సాధిస్తావు? పొందు చేసుకుని లోక మంతా చిగురించేటట్లు చెయ్యవయ్యా!"

ఇక్కడ మూడవ పాదంలో యుద్ధంవల్ల 'ధర మాడి బొగ్గగును' అని, నాల్గవ పాదంలో పొందువల్ల 'లోకమెల్ల చిగురింపచేయు' అని లాభనష్టాలను బేరీజువేసి చూపినట్లుగా ఉంది. (యుద్ధంలో ఆగ్నేయాస్త్రం లాంటి అగ్ని అస్త్రాలవల్ల సైన్యంతోపాటు యుద్ధభూమి కూడా మసి అయిపోతుంది - అదే విశాఖుడు చెప్పింది.)

మదదంతుల్ తురగంబు లెక్కుచు నొరుల్ మాద్యద్గతిన్ నిత్య స
మ్మదమగ్నుల్ మణిహారముల్ మసుగులున్
మాల్యంబులం దాల్చి స్వే
చ్ఛదు రిచ్ఛానువిహారముల్ తగిలి ఆ ముగ్ధాత్ము లుగ్రాజిలో
మృదుగాత్ర ప్రవిదీర్ణులై పడుట ఇస్సీ! దుస్సహంబౌ గదా!

(పం క : 50)

"ఏనుగులు, గుఱ్ఱాలనెక్కి మణిహారాలు, పట్టువస్త్రాలు, పూలదండలు, వివిధ రకాలైన మాల్యాలు ధాల్చి హాయిగా స్వేచ్ఛావిహారాలు చేసే దొరలు భయానకమైన యుద్ధంలో చీలిన గాయాలతో కళేబరాలై పడటం - ఇస్సీ! తలచుకుంటే హృదయ విదారక మవుతుంది కదా!"

'ఇస్సీ' అన్నది యతి స్థానంలో ఉండటంతో ఊనిక (Stress) ఉంది. ఎంత హృదయ విదారక మవుతుందో అన్న సంగతిని ఊనిక (ఇస్సీ) యతి స్థానంలో ఉండటంవల్ల నొక్కి చెప్పుతుంది. అందులోనూ ప్లుతం (ఇస్సీ) పైన యతి.

శాంతికి - యుద్ధానికి గల తేడాలతో మరికొన్ని వివరణలు ఇస్తున్నాడు :

మహనీయ మణిహైమమకుట మూనిన తల
పచ్చిపుచ్చ విధాన పగిలి చెదర
నవవధూతరళకుంతలబద్ధహస్తమ్ము
ఛిద్రమ్ములై దూపరి చెదరిపోవ
అహరహాజ్ఞావచోవ్యాహృతాక్షి యుగమ్ము
గ్రుచ్చి కాకములు ముక్కునను బొడువ
కమనీయ నాట్యరంగస్థలుల్ నగరులన్
గూడ్లగూబల పెంచు గూళ్ళు కట్ట

సస్యకల్యాణజనయిత్రి శ్యామలజగము
అతిభయానకప్రేతభూతాదు లాడు
పోలికలను గాగ మారిపోవును గదయ్య!
అట్టి ఊహయే మిగుల భయంకరమ్ము! (సం. క : 51)

"వైభవోపేతమైన వజ్రాలు పొదగబడిన బంగారు కిరీటాన్ని ధరించిన తల పచ్చిపుచ్చకాయ పగిలినట్లు యుద్ధంలో పగిలిపోతుంది. కొత్త వధువుయొక్క కొప్పుపై నిమిరినట్టి చేతులు ముక్కలై చెదరిపోతాయి. ప్రతిదినమూ సేవకులను సైగలతో ఆజ్ఞాపించిన మహారాజుల, అధిపతుల యొక్క కన్నులు యుద్ధం జరిగితే ఏమవు తాయి అంటే ఆ కనుగ్రుడ్లను కాకులు వాటి ముక్కుతో పొడుచుకు తింటాయి. అందమైనటువంటి నాట్యరంగస్థలాలలోనూ, నగరాల లోనూ గుడ్లగూబల గుంపులు గూళ్ళు పెట్టుకుంటాయి. నిత్య వైభవంగా పచ్చగా ఉండే భూమాతపై అతిభయంకరమైన భూత ప్రేతాదులు ఆడతాయి. ప్రపంచమే పోలికలుగా మారిపోతుంది. ఈ విధమైనటువంటి ఊహ, ఊహమాత్రానికే భయంకరంగా ఉంది".

(నిజంగా జరిగితే ఇంకెంత భయంకరమో అన్న ధ్వని ఉంది. ఊహాకే అంత భయంకరంగా ఉంటే, వాస్తవంగా జరిగితే ఇంకెంత భయం కరంగా ఉంటుంది !)

ఈ పద్యంలో ప్రతి పాదంలోనూ - అర్ధపాదంలో యుద్ధం జరగకముందు ఉండే వైభవాన్ని, మిగిలిన అర్ధపాదంలో యుద్ధం జరిగిన తర్వాత ఉండే వికారాన్నీ చూపించి ఉండటంవల్ల, యుద్ధానికీ-శాంతికీ గల భేదాలను ప్రక్క-ప్రక్కనే పెట్టి చూపించాడన్నమాట విశాఖుడు.

ఇక స్త్రీల గతి ఎల్లా ఉంటుందో కింద చెప్తున్నాడు :

సొగసా గుమ్మడి దోసగింజలగుచున్ - సోమార్ధఖండమ్ములౌన్
నగుచున్ - చిక్కని మల్లెపంచు లగుచున్ - నారీలలాటస్థలీ
స్థగితంబై చెలువొందు సిందురపు సౌందర్యంబు విధ్వస్తమై
పోగులన్ దృష్టివికారహేతులు రణంబుల్ చేట్పసూ తారకా !
(పం. క : 52)

రకరకాల అందమైన కుంకుమబొట్లు స్త్రీల నొసటిపై ఆచ్ఛాదితమై ఉంటాయి. అలాంటి అందమైన కుంకుమబొట్లు స్త్రీల నొసట లేనప్పుడు సౌందర్యరహితమంటూ చెప్తున్నాడు- విశాఖుడు.

"గుమ్మడిగింజ, దోసగింజలవలె ఉన్న బొట్లు, చంద్రరేఖాకారంతో ఉన్న బొట్లు, చిక్కని మల్లెపంచులాంటి బొట్లు స్త్రీల నొసటులపై ఆచ్ఛాదితమై అందంగా ఉంటాయి. యుద్ధాలవల్ల వారి భర్తలు మరణిస్తే, వారి కుంకుమబొట్ల సౌందర్యమంతా విధ్వంసమై పోవటానికి వారి మొహాలు వికారంగా కనిపిస్తాయి. కనుక యుద్ధమంటే ఎంత చెడ్డదో చూడు తారకా!"

ఇక్కడ వివిధరకాల కుంకుమ తిలకాలను వర్ణించడంవల్ల, ఆ వివిధ రకాల తిలకాల సౌందర్యాన్ని ఒకేసారి చూపటం ద్వారా వాటి అందం ద్విగుణీకృత మయింది. అన్ని రకాల కుంకుమబొట్లు ఒకేసారి ధ్వంసమయితే ఎంత అందవిహీనమో ఎంత హృదయ విదారకమో పాఠకుడు ఊహించుకోగలుగుతాడు.

'మదదంతావళ తురగంబు లెక్కుచు' (50) అన్న పద్యంలో భర్తలను గురించి చెప్పి ఈ పద్యంలో స్త్రీల (భార్యల) దుస్థితిగురించి చెప్పాడు. ఈ రెండు పద్యాల భావాలు శాంతికి - యుద్ధానికి గల భేదాలను స్పష్టం చేస్తాయి. ప్రస్తుత పద్యంలో ఒకరకమైన కారుణ్యాన్ని మానవీయ దృష్టితో కవి పాఠకునికి అందించడం ఇక్కడ గమనించవచ్చు.

విశాఖుడు తారకునికి శైవభావపరంగా నచ్చచెప్ప ప్రయత్నిస్తున్నాడు.

"ఇన్నిరకాలుగా నష్టం కల్గించే యుద్ధమెందుకు ? లేదయ్యా, మరి ధర్మగ్లాని కలిగినప్పుడు అవతరిస్తానన్నాడు భగవంతుడు - ధర్మమునకు దెబ్బతగిలితే అప్పుడు యుద్ధం చెయ్యవచ్చు అంటావా ? అంతవరాలు పొంది నీవు చేసిందేమిటి-ఏమిఘనకార్యం సాధించావు! - పొలిమేర కొట్లాటా ? సరిహద్దుల తగాదాలకోసమా - ఇంత తపస్సు చేసింది ! ఎంత వ్యర్థమైన తపఃక్రియ నీది ! నీవు చేసినపనిలో అర్థమేమిటి ? (కుం. క : 53) అలాకాదు, ఇంద్రుడు మా వంశాన్నంతా నాశనం చేశాడు. నా పూర్వీకులను నాశనం చేశాడు కనుక వాణ్ణి నాశనం చేస్తానంటావా ? ఎంతయోచన చేసి చూసినా కూడా కారణం కనబడటంలేదే ! (కుం. క : 54) మునుపు మీ ఇద్దరిమధ్య స్వర్గలోక సిరిసంపదలన్నీ ఛిన్నాభిన్న మయ్యేటట్లు ఎన్నో యుద్ధాలు జరిగిపోయినాయి కదా, మరి ఇంద్రుని ఎందుకు చంపలేకపోయినావు ?

ఇంద్రుని మీద కత్తికట్టి ఎన్ని యుద్ధాలు చేసినప్పటికీ ఇంద్రుని చంపలేకపోయినావు ఎందుకు అని ప్రశ్న వేసుకో.!" అని విశాఖుడు తారకుని సూటిగా ప్రశ్నిస్తున్నాడు. (సం. క : 55)

దైవంబున్నది నిత్యమై సకలదైత్యేష్ఠా మహామండలా !
దైవంబున్నది సర్వసాక్షి యగుచున్ త్వత్ శ్రీ వికాసంబుగా
దైవంబున్నది సర్వగమ్యమగుచున్ త్వత్ శ్రీ నిరాసంబుగా
దైవంబున్నది రక్షణ క్షమ పరిధ్వస్త క్రియాహేతువై.

(సం. క : 56)

"రాక్షసరాజా ! దైవమనేది నిత్యంగా ఉంది (నిత్యమూ ఉంది). నీ వైభవానికి సాక్షీభూతంగా దైవమే ఉన్నది. నీ సిరి అంతా నాశనమైపోతున్నప్పుడు గూడా చూసి ఆనందిస్తూ దైవమలాగే ఉంది. రక్షించేది, శిక్షించేది - సృష్టించేది, నాశనం చేసేది దైవమే. కనుక దైవమనేది నిత్యంగా ఉంది."

ఈ దైవంబు విచిత్ర మార్గములలోనే వ్యక్తమగా చూడుమా
నీకా రాజ్యము భద్రతావధిగదా ! నే కొల్వుకూటంబునన్
పాదద్వంద్వము మోపునంతవర కెవ్వాడైన నన్ జూచెనే !
నీ దుర్దాంతతపో మహత్త్వమును నన్ వీక్షింపగా జాలదో !

(సం. క : 57)

"ఈ దైవ మెప్పుడూ విచిత్రమార్గాల్లోనే వ్యక్తమవుతుంటుంది. భద్రమైన సరిహద్దులుగల నీ రాజ్యంలో నీ కొల్వుకూటంలో నేను పాదాలు మోపేటంతవరకు (అడుగుపెట్టేవరకు) ఎవ్వడైనా నన్ను చూశాడా ! కనుగొన్నాడా ! నీ మహోదాత్తమైన తపశ్శక్తిచేత కూడా నన్ను చూడజాలకపోయినావే - దాని కేమంటావు ?!"

నీ మంత్రిప్రభుఁ డాఁగె నన్ గనుచు నిన్నే వచ్చి వేఁగెదియో
నా ముఖ్యంబగు దాని నేఁడు? సభను నన్ జూచియా చెప్పుటల్!
పరమాశ్చర్యము నిన్నె చెప్పినను నేఁ జొచ్చుటకున్ గష్టమౌ
నేమో అప్పుడు వచ్చి టిట్లు జరిగెన్ చిత్రంబు దైవక్రియల్.

(పం. క : 58)

బ్రహ్మదేవుని ఆజ్ఞచేత ఇంద్రుడు కుమారస్వామిని దేవతల సైన్యాధిపతిగా చేశాడన్న ఆ ముఖ్యమైన వార్త ఇప్పుడు సభలో నీ మంత్రి నన్ను జూచి చెప్పటమా! ఒకవేళ నిన్ననే కనుక ఆ వార్త చెప్పి ఉంటే అప్పుడు నేనిక్కడకు రావడం కష్టమయ్యేదేమో! మొత్తానికి నేను ఇట్లా రావటం జరిగింది. దైవక్రియలు విచిత్రంగా ఉంటాయనడానికి ఇదే ఋజువు - రాజా!"

"మరొక్క మాట నీకు చెప్తాను - రాజా: నీ నగరాన్ని గురించి, పట్టణవీథుల గురించి, నీ దుర్గములు మొదలైనవాటి గురించి ముందు నీకు చెప్పాను (చూ. పం. క : 16, 17). దాన్ని గురించి, దాని ప్రయోజనాన్ని గురించి విమర్శ చేశావా? నీ పరిపాలనాపద్ధతి అంతా తెలుసుకున్నాను. సందుసందులూ రహస్యమార్గాలన్నీ నాకు హృద్గతంబుగా (సంపూర్ణంగా) తెలిసిపోయాయి (పం. క : 59). [1]కనకజలావలిప్తంగా విద్యుత్ సంబంధమైన భస్మరాశిచేత కట్టిన జనపద దుర్గ వప్రములు (ప్రహరీ గోడలు - కోటగోడలు), రాజధాని మొదలైనవన్నీ నేను చూశాను. ఒక శత్రువు సర్వాన్నీ నీకు తెలియకుండా చూడటమన్నది దైవచేష్ట కాదా! కాబట్టి సంధి చేసుకో - నీకు శుభం కలుగుతుంది" అన్నాడు విశాఖుడు.

1. కనకజలావలిప్తము - అనేమాట కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఉంది. ఈ రకంగా కోటగోడలు కట్టబడి ఉండటంవల్ల శతఘ్నులకు, ఫిరంగులకు గోడలు పగిలిపోకుండా ఉంటాయి.

ఇంతవరకు రాజనీతిపరంగానూ, ధర్మపరంగానూ, కుమార స్వామి పరాక్రమపరంగానూ, దైవపరంగానూ చెప్పాడు విశాఖుడు. ఇప్పుడు బంధుత్వపరంగానూ చెప్తున్నాడు. అన్నిరకాల కోణాలనుంచీ రాయబారి అయినవాడు చెప్పవలసి ఉంటుంది. మహాభారతంలో శ్రీకృష్ణుడు రాజనీతిపరంగానూ, దైవపరంగానూ, బంధుత్వపరంగానూ, భీమార్జునాదుల బలపరాక్రమాలపరంగానూ చెప్పి రాయబారాన్ని నిర్వహించాడు. అలాగే ఇక్కడ కూడా కవి విశాఖునిచేత అన్నిరకాల దృక్కోణాలనుంచీ రాయబారాన్ని నిర్వహింపచేశాడు. ఇప్పుడు బంధుత్వపరంగా చెప్తున్నాడు విశాఖుడు - తారకునితో.

"అన్నదమ్ములై ఉండి కూడా మీరు ఒకరికొకరు కాలు త్రవ్వుకోవడంవల్ల ఎవరికి సుఖం కల్గుతుంది ? ఏమి శుభం కలుగుతుంది ? అయ్యో, మీరు ఒక ఇంటివారయి కూడా ఇలా చేయడం మేలా ? (పం. క : 61). మీ వంశానికంతటికీ కుదురులాంటివాడు కశ్యపుడు. రెండు మొక్కలలాంటివారైన మీరు ఈ రీతిగా పెనుగులాడకుండా ఉండి, గట్టిగా పెనవేసుకుంటే (ఏకమత్యంగా ఉంటే), వేరొకరు మీమధ్య దూరి గోష్ఠిలిపెట్టి పెట్టి ఆ కుదురును చెదరగొట్టగలరా ? (పం. క : 62) కాబట్టి అన్నివిధాల మీకు మేలు కలగాలంటే సంధి చేసుకోండ"ని పరిపరి విధాల నచ్చచెప్పాడు విశాఖుడు. ఇంత చెప్పినా కూడా ఈ నీతి సూత్రాలు తారకాసురునికి పట్టలేదు. తారకాసురుని వాలకం పసిగట్టి విశాఖు డీ విధంగా అంటున్నాడు :

నవ్వుటకేమి దేనినయినన్ మరి నవ్వగవచ్చు ధర్మమున్
చివ్వటి మేల్మి తీసితిని చెప్పితి నింతగ నింత చెప్పుటల్
నవ్వులకయ్యెనా ? సరియె నాకచమూపతి మాట చెప్పితిన్
పువ్వుగ దాల్తువో తలను, పొమ్మని కాళుల మట్టగింతువో ?

(పం. క : 65)

“నవ్వడానికేముంది ! దేనినయినా అపహాస్యం చేసి నవ్వటం చాలా తేలికైన పని. ధర్మాన్ని చివ్వి చూపించాను. సారాంశం తీసి చెప్పాను. నవ్వడానికేనా ఇంతగా చెప్పింది ! సరే. దేవసేనాపతి మాట చెప్పాను. తలలో పువ్వులాగా దాలుస్తావో, లేక కాల రాస్తావో నీ యిష్టం.”

ఈ పద్యం చిత్రమైనది. నాటకీయతను గుర్తు చేస్తుంది. పై మాటలంతే విని రాక్షసుడు నవ్వాడు. ఎందుకు ? అదంతా అసమర్థ ప్రలాపమని. దానికి పద్యం సమాధానం. శ్రోత కదలికను పసిగట్టి మాట్లాడినమాట.

ఆతడు నీవు తేల్చుకొనరో సమరమున్ శిశువైన మాత కే
లా ? తగవందు తోచినదె పల్కితి ఈ తుది కొక్కమాట నీ
వై తెగజెప్పు గెల్చినది యాతని దాతని కిమ్ము ఇట్టి నీ
చేత జగత్ప్రియంకరము చెప్పుము కాదని నేను పోయెదన్.

(పం. క : ౬౮)

“దేవసేనాపతి మాట చెప్పాను - పువ్వులాగా తలలో దాలుస్తావో, లేక కాలరాస్తావో నీ యిష్టం. అతడూ (కుమారస్వామి), నీవూ రేపు యుద్ధంలో తేల్చుకోండి. నేను చెప్పిన దానికి నవ్వుతావా నీవు! ఏదో నాకు న్యాయమని తోచిందే నేను చెప్పాను. కట్టకడపటికి నీవు తేల్చి తెగజెప్పు. నీవు ఇంద్రుని దగ్గర గెల్చుకున్నది - అతని దాతనికి ఇచ్చెయ్యి. అల్లా చేస్తే జగత్తు కంతా ప్రియం జరుగుతుంది. కాదంటే నేను వెళతాను” అని విశాఖుడు చివరి మాటగా తారకాసురుణ్ణి నిలవేసి ప్రశ్నిస్తాడు.

అన విని రాక్షసేశ్వరుడహా ! యిత డేమి శిశుండు ! నీవు చె
ప్పిన విషయమ్ము సూక్ష్మమగు వేదో మహాప్రభు డౌను నానతి

చ్చిన గతి చెప్పె పైకి కనజేయుచునున్ వినయమ్ము నింత నా
మనసున నవ్వకో నదియు మాయురె చూచె పరేంగితజ్ఞుడై.

(పం. క : 67)

రాక్షసరాజు తారకుడు విశాఖుడు చెప్పినది విని విశాఖుని ప్రతిభను గురించి ఇట్లా అనుకుంటున్నాడు- "ఇతడేమి శిశువు! ఇతను చెప్పినది ఏదో సూక్ష్మమైన ధర్మమని తోస్తుంది. ఒక మహాప్రభువు ఆజ్ఞాపించినట్టుగా ఇతని వాక్యాలు ఉన్నాయి. ఏదో కొంత - కొద్దిగా నా మనస్సులోనే నవ్వుకుంటే - దాన్ని కూడా పరేంగితజ్ఞానంతో తెలుసుకోగలిగాడు."

తారకాసురుడు తన నవ్వును పైకి ఏమాత్రం కనిపించనివ్వ లేదు. మనస్సులో నవ్వుకొన్న దాన్నికూడా విశాఖుడు పసిగట్టాడు. ఇది విశాఖుని నిశితబుద్ధికి నిదర్శనం. పరేంగితజ్ఞత అంటే ఇదే.

వీడొక ప్రేలెడంత - వినిపించెను సర్వము లోకబాంధుడై
వీడు జగత్ప్రభుండె మరి వించుట నాకు నటో! గజేంద్రదిరాట్
ఘోటమదాంధ ఖేలన విపాటిత పంకజవాటి యయ్యె నీ
రేడు జగమ్ము లెవ్వనికి ఈ నను వీడు తిరస్కరించునే! . . .

(పం. క : 68)

తారకునిలో ఉండే అహంకారం మళ్ళీ వెల్లుబికేటప్పటికి తిరిగి ఈ విధంగా అనుకుంటున్నాడు - "వీడొక ప్రేలెడంత లేడు. లోకనాథునివలే సర్వమూ వినిపించాడు. జగత్ప్రభువైన నన్ను పట్టుకొని వీడు వినిపిస్తాడా! ఒక మదించిన ఏనుగు సరోవరంలోకి పోయి తామరపూల తీగలను పీకివేసి నాశనం చేసినట్లు ఈ పదునాలుగు భూభువనముల జగత్తైనా నాశనం చేసినట్టి నన్నుపట్టుకొని వినిపిస్తాడా వీడు! అలాంటి నన్ను తిరస్కరిస్తాడా వీడు!"

పైమాటా (పం. క : 67), - ఈ మాట (పం. క : 68) - రెండూ ఒకే వ్యక్తివి. అంతగా తాను చీలిపోయి మాట్లాడుతాడన్నమాట.

విశాఖుడు తన మనసులో ఈ విధంగా అనుకుంటున్నాడు :

"ఒకవంక తరపి వెన్నెల
ఒకవంక భయంకర నరకాంధ తమస్సుల్
ప్రకటిత మనస్సు ద్విధా
వికటితము జగత్తు చిత్రవృత్తి నటించున్." (పం. క : 69)

"ఒకప్రక్క మంచి వెన్నెల. మరోప్రక్క భయంకరమైన గాఢమైన చీకటి. ఒకప్రక్క మంచి ఆలోచన చేస్తారు. మళ్ళీ వెంటనే అహంకారంతో కుళ్ళుకొన్న ఆలోచనలు చేస్తారు. ఒకప్రక్క జ్ఞానం. మరో ప్రక్క అజ్ఞానం - ఈ విధంగా రెండు ఆలోచనలూ ఉన్నాయి. ఈ విధంగా జగత్తంతా ఈ చిత్రమైన ప్రవృత్తితో ఉండెందుకో" అనుకున్నాడు విశాఖుడు.

అలా అనుకొంటూ విశాఖుడు తారకుని కట్ట పసిగట్టాడు. తారకుని కన్నుబొమ నాజ్ఞగ్రహించి తన్ను బంధించడానికి వస్తున్న ఉక్కువంటి శరీరం గల సేనానాయకుడిని చూసి విశాఖుడు తాను కూర్చున్న మణిమయాసనాన్ని విడిచి, చటుక్కున లేచి ప్రళయాగ్ని చండకోపోద్రిక్తుడైనాడు. (పం. క : 70)

## మధ్యాక్కర :

పరమ పతివ్రతాలోక పారిజాత పవిత్రతైకైశ్య
భరము జాల్మ్రుడు కామవశత పట్టుకొన్నట్టి దృశ్యమ్ము
దురితము ధర్మమున్ తొలగద్రోసెడు దృశ్యమ్ము కనుల
నరసెడు ధర్మవీరు జ్వాలదగ్గిన కోపవిశిఖ యగుచు.

(పం. క : 71)

ఒక దుర్మార్గుడు కామంతో పరమపతివ్రతయొక్క కొప్పును పట్టుకొన్నట్టి దృశ్యము, ఒక రాక్షసుడు ధర్మమనే చెట్టును నరికి వేసే దృశ్యము ధర్మవీరునికి కనబడినప్పుడు అగ్నిజ్వాలలాగా మండినట్లు కోపోద్రిక్తుడయ్యాడు విశాఖుడు. ఇది కోపానికి ప్రమాణం.

ఇక్కడ కోపానికి రెండు కారణాలు: తారకుడు తన్ను తిరస్కరించాడన్నది - ఒకటి; రెండోది ధర్మాన్ని తిరస్కరించాడన్నది - కనుక విశాఖుడు ధర్మవీరుడై పోయాడు. విశాఖుడు, తన్ను బంధించడానికి వస్తున్న రాక్షసునితోనూ, ఆ పనికి ఆజ్ఞాపించిన రాజుతోనూ ఈ విధంగా అంటున్నాడు:

ఓరీ దుష్టనిశాట ! దుష్కుపథగవ్యూహాగ్రగా ! ఆగు ఓ
యీ రక్షోధిప ! సాత్త్విక ప్రభువు కానెవ్వాడును దూతనున్
నీ రీతిన్ బొనరింప నీ పనికి నిన్ శిక్షింతు ధర్మావన
శ్రీరమ్యంబుగ త్వత్కిరీట మవనిన్ వ్రేల్చించి - రక్షించుకో !
(పం. క : 72)

"ఓరీ దుష్టరాక్షసుడా ! దుష్టవ్యూహ పథకం వేసేవారిలో అగ్రేసరుడైనవాడా! ఆగు !" అన్నాడు. మళ్ళీ తారకునివంక తిరిగి - "సాత్త్విక ప్రభు వెవ్వడూ ఒక దూతను బంధించడు. నీవు చేసిన ఈ పనికి నీ కిరీటాన్ని నేలపై పడేటట్లు చేసి నిన్ను శిక్షిస్తాను" అని విశాఖుడన్నాడు.

ఇక్కడ 'కుపథగ వ్యూహాగ్రగా' అన్నా చాలు; లేదా 'దుష్పథగ వ్యూహాగ్రగా' అన్నా చాలు- కాని 'కు', 'దుస్' అని రెండు వ్యతిరేక ప్రత్యయాలు ఎందుకు వేసినట్టు? - అంటే వాడు అంత దుర్మార్గుడు అని చెప్పడానికి. రెట్టింపు దుర్మార్గుడు కనుక - ఇది రెండు వ్యతిరేక ప్రత్యయాల ద్వారా ధ్వనిస్తున్నది.

మెరపు మెరసినట్లు లురలినట్లు పిడుగు
కనదమోఘ చాపగుణ విముక్త
మార్గణమ్ము చనుట మకుటమ్ము మహిని డొ
ల్లుటయు వాని మాటలోన జరిగె. (పం. క : 73)

ఒక మెరపు మెరిసి, పిడుగు ఉర్లిపడినట్లుగా అమోఘమైన వింటినారినుండి బాణం విడివడి తీవ్రమైన వేగంతో వెళ్ళడమూ, రాక్షసరాజు తారకునియొక్క కిరీటం నేలపై పడి దొర్లటమూ విశాఖుని మాటల్లోనే జరిగిపోయాయి.

'ఈ పనికి నిన్ను శిక్షిస్తా'నన్నాడు - వెంటనే కిరీటం తారకుని శిరస్సునుంచి కింద పడటం కూడా జరిగింది. మాటకు, క్రియకు వ్యవధిలేదు. కిరీటాన్ని కిందపడేటట్లు దొర్లిస్తానని మాట చెప్పటమూ, క్రియ జరగటమూ వ్యవధి లేకుండా వెంటవెంటనే జరిగిపోయాయి. 'డొల్లుటయు' అన్న పదంలో 'డొ' దగ్గర పాదం తెగిపోయింది. తారకుని శిరస్సునుంచి కిరీటం తెగి కిందికి పడింది అని చెప్పడాన్ని 'డొల్లుటయు' లోని విరుపు ధ్వనిస్తున్నది. రాజకిరీటాన్ని కింద పడేటట్లు పడగొట్టడం భావి యుద్ధంలో తారకాసురుడు తెగి పడతాడన్న సూచన ఉంది. కిరీటం తలనుండి విడివడటం ప్రభుత్వం పడిపోవడానికి సూచన.

దురితపు టాకృతుల్ ! వినుడు : ధూర్తుడ! - వీరుడు స్కందు తమ్ముడన్
తరమిడి ఎల్లి కయ్యపుమొనన్ మిము నందర త్రవ్వి పాతెదన్
బిరుదులు రండు రండనెడి బీరపు పల్కు నభోంతరమ్మునన్
తిరుగగ సుళ్ళుసుళ్ళగుచు తీక్ష్ణవిశాఖు డదృశ్యుడై చనెన్.

(పం. క : 74)

"పాపాత్ములారా వినండిరా! ధూర్తుడా! నేనెవ్వడనను కున్నావు? నీరుద్రైన స్కందుని తమ్ముడని తెలియదా! నేను మీరందరూ యుద్ధానికి రండి. మీరు పరాక్రమవంతులంటారు గదా! నేను ఒంటి - మిమ్ములనందరినీ త్రవ్వి పాతిపెడతా'ను" అని కోపోద్రిక్తుడైన విశాఖుడు ఆకాశంలో వీరత్వపు పలుకులు పలుకుతూ సుళ్ళుసుళ్ళుగ తిరుగుతూ అదృశ్యుడై వెళ్ళిపోయాడు.

ఈ విధంగా రాయబార ఘట్టం చిత్రితం కావటం విశేషం. తిక్కన రాయబార ఘట్టాలు, కల్పవృక్షంలో అంగదాదుల రాయబార ఘట్టాల తర్వాత, ఆంధ్ర సారస్వతంలో తృతీయఘట్టమిదే.

— 'తెలుగు' : జూన్ 1989

# యుద్ధవర్ణన - స్యందనం

కుమార - తారకాసురుల యుద్ధం, విశాఖ - మహిషాసురుల యుద్ధం షష్ఠకమలంలో వర్ణించబడింది. కుమార విశాఖులు తారకాసుర, మహిషులను చంపి ధర్మసామ్రాజ్య స్థాపనం చేశారు. ఇది ఎప్పుడో ఏ యుగంలోనో జరిగిన కథ కావచ్చు. కాని ఇది ప్రతి ఒక్క మనిషిలో జరిగే నిత్య సంఘర్షణ. మనిషి తన ఆత్మ శత్రువులను-అంటే అంతర్గత శత్రువులైన అరిషడ్వర్గాలను (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను) జయించి ఆత్మ సామ్రాజ్య స్థాపనం చేసుకోవాలి. కుమారస్వామి తారకాసురుణ్ణి చంపి ధర్మ సామ్రాజ్య స్థాపనం చేశాడు. మనం అరిషడ్వర్గాలను జయించి ఆత్మ సామ్రాజ్య స్థాపనం చేసుకోవాలి. అందుకే ఈ కుమారస్వామి కథ నిత్య కథ. ఏదైనా చెడు తలంపు వచ్చినప్పుడు లేదా చెడ్డపని చేయబోనుకొన్నప్పుడు ప్రతి మానవునిలోనూ ఒక సంఘర్షణ జరుగుతుంది - వద్దని ఒకటీ, చేయాలని ఇంకోటీ. ఇదే - మనిషిలో జరిగే యుద్ధం. ఇక్కడ కావ్యంలో కుమార - తారకాసురుల యుద్ధం లాగా కనబడినా, అది మనిషిలో జరిగే యుద్ధమే. ఆ యుద్ధంలో ఆత్మ శత్రువులను జయించాలి. అదే ఆత్మ స్థాపనం.

ప్రస్తుతం యుద్ధవర్ణన ప్రస్తావితమవుతున్నది. యుద్ధంలో వాడే రథాదుల వర్ణనలూ చూడదగ్గవి. కవి ప్రత్యేకంగా స్యందన మని యుద్ధరథానికి వాడిన శబ్దం. స్యందనమంటే జారిపోయేది పాదరసంలాగా - కనుక వీటి వర్ణనలు చాలా గొప్పగా చేయబడినవి. విశాఖుడు నిర్వహించిన రాయబారం తారకాసురుని దగ్గర విఫలమవుతుంది. దాని ఫలితంగా యుద్ధం జరుగుతుంది. 'కుమారభారతి'లో షష్ఠకమలం మొత్తం యుద్ధవర్ణనకు నియుక్తమైనది. ఇది ప్రథమ దళమని, ద్వితీయ దళమని రెండు భాగాలుగా ఉంది.

ప్రథమ దశము

## దేవసేన - చతురంగబల వర్ణన

దేవసేనాపతి అయిన స్కందుని రథము ఆకాశంనుంచి అవతరిస్తున్నది. ఈ చిత్రణ చాలా పవిత్ర గంభీరంగా జరిగింది. దైవం పదార్థ ప్రవృత్తిలోకి ప్రవేశించడం వైదిక వాఙ్మయంలో అద్భుతంగా చిత్రించబడినది. మనకు ప్రసిద్ధమైన పార్థసారథి రథవర్ణన తిక్కన గారు భారతంలో అనేక స్థలాల్లో మహాద్భుతంగా వర్ణించినతీరు ఈ క్రింది పద్యంలో కనపిస్తున్నది :

కాంచనరథనేమికాదీర్ణజలద గ
ర్భములు సర్ఘోష ఘోషములు సెలగ
సురగణేశ క్షత్రు కరకశాపలనముల్
శరదంబుధర తటిల్లత సృజింప
వాయుకర్తనోజ్జ్వల ఖడ్గధారా ధ్వ
జ పటచ్ఛటలు నభస్థలిని చీల్ప
స్యందనాగ్రక్వణత్ స్వర్ణకింకిణీస్తోత
పతితబుక్కైక దిశాధ్వముల పాగ

దితిరుహాశ్రవాలోచనోద్వేజకముగ
ఆదితేయాంబక శ్రవస్స్వాదు వగుచు
దేవసేనాధిపు రథమ్ము తిరుగు బ్రధ్న
బింబ మహాచును రథ్యాగ్రవృత్తి సాగ. (ప : ప్ర : 1)

జలపూరితమైన మేఘాలు బంగారు రథచక్రాల కమ్మీలచే చీల్చబడిన కారణంగా ఆకాశంనుంచి పెద్ద పెద్ద ధ్వనులు వ్యాపించాయి. సురసేనాపతియొక్క సారథి చేతిలోని చెర్నాకోల దెబ్బకు మేఘాల్లో విద్యుత్ తీగలలాగా మెరుపు మెరిసింది. రథంయొక్క

ధ్వజపటము, ఖడ్గధారలు, ధ్వజపట సమూహాలు వాయుమండ లాన్ని కోసుకుంటూ వస్తున్నాయి. స్యందనాగ్రాన అలంకృతమైన బంగారు చిరుగజ్జెల మ్రోత పఠిస్తున్న వేదమంత్రాలై సర్వ దిక్కులకూ వ్యాపించింది. ఈ రకమైన ధ్వని దైత్యులకు భయంకరం గానూ, దేవతలకు మధురంగానూ వినిపిస్తూ, దేవసేనాపతి అయిన కుమారస్వామి రథము ఆకాశంనుంచి గుండ్రంగా తిరుగుతూ భూమి మీదికి సూర్యబింబంలాగా దిగింది.

పైన వర్ణించిన భగవంతుడు (కుమారస్వామి) నడచివచ్చేటప్పటి వర్ణన-మంత్రం చదివినట్లు ఉంది. అది దేవతలకు మాత్రమే తెలుసు. సూర్యమండలం గిరగిర కిందికి దిగినట్లు ఉంది. మనం దాన్ని కింది నుంచి చూస్తున్నాం. అది ఒక శిల్పం. కవిత్వంలో దృక్కోణాలు (ఆంగిల్స్) ఉంటాయి. ఈ బొమ్మకు ఫలానా దృక్కోణం ఉందని కళాకారుడే సూచిస్తాడు. రథచక్రం మేఘాన్ని చీల్చుకురావడం, మెరుపు మెరవటం, సమాసపుకూర్పులో ఉరుము ప్రభావాన్ని (ఎఫెక్ట్ను) చెప్పటం, సూర్యరశ్మి ఖడ్గపు మొనలపై పడ్డ ధారలు పరావర్తనం చెందటం, ఆ పరావర్తన కిరణాలు నభోమండలాన్ని (ఆకాశమండలాన్ని) చీల్చడం, తర్వాత మంత్రాలు ధ్వనించడం - ఇలా పద్యం క్రమక్రమంగా భావవివర్తన పొందుతోంది. 'బ్రధ్న' అని వాడటంవల్ల బరువు వచ్చింది. దానికి బదులు 'సూర్య' అని వాడి ఉంటే అంత బరువు వచ్చేది కాదు. బ్రధ్న శబ్దం ఇక్కడ సార్థకమైనది. కవి వస్తుగుణాన్ని అనుభవించి వ్రాస్తాడు. తాదాత్మ్యం చెందుతాడు. పాఠకుడు కావ్యవర్ణనను-అందులోనూ యుద్ధవర్ణనను- అనుభవించడానికి సంసిద్ధుడు కావాలి. అందుకే వాల్మీకి 'శ్రోతవ్యం అనసూయయా' 'అసూయ లేకుండా కావ్యాన్ని వినండి' 'అంటాడు. కావ్యం చదివేటప్పుడు మన హృదయాన్ని నిండుగా కావ్యానికి అర్పించాలి - అప్పుడే కావ్యాన్ని మనం అనుభవించగల్గుతాం.

కనుక ఆరంభం శత్రువుల కళ్ళకు భరింపరానిది; మిత్రులైన దేవతలకు అందమైనది.

హరిదంతద్విరదాళి మ్రొగ్గతిల నుద్యన్మాద్యకుంభస్థలో
పరి సిందూరమహారుణచ్ఛవి దవజ్వాలోగ్రమై పర్వ తీ
క్ష్ణ రదాబద్ధనిశాతఖడ్గము మద స్తంబేరమశ్రేణి రా
నరిగెన్ మున్నుగ వజ్రి రుట్చలిత సర్వాంగుండు చౌదంతిపై.
(ప : ద్వి : 2)

మోకరిల్లిన ఏనుగు సమూహం మదించిన కుంభస్థలాలపై ఆచ్ఛాదింపబడిన మిక్కిలి ఎఱ్ఱటి కుంకుమకాంతిశోభ దావాగ్నిలాగా కనిపింప - వాడిఖడ్గాలు ధరించిన సైన్యము మదించిన గజాలపై వస్తుండగా, అలాంటి గజశ్రేణికి ముందు ఇంద్రుడు కోపంతో ఐరావతంపై వస్తున్నాడు. గజబలానికి ఇంద్రుడు నాయకత్వం వహించి వస్తున్నాడని భావం. 'రుట్చలిత' (కోపంచేత)అనే ప్రయోగం ప్రయత్నపూర్వకంగా వాడబడ్డట్లు తెలుస్తోంది. ఇంద్రుడు ఇంతకు పూర్వం తారకుని చేతిలో చాలా బాధలు అనుభవించాడు. కనుక ఆ పూర్వవిషయ స్మృతిచేత ప్రస్తుతం కోపవివ్హలుడై వస్తున్నా డన్న అర్థస్ఫూర్తితో ఈ శబ్దం వాడబడిందన్నమాట.

రింఖోట్టంకిత పావనాభ్రపథపారీణమ్ము జ్యానిర్ఘోషత్
పుంఖోల్లంఘితపుంఖ తీవ్రవిశిఖవ్యూహమ్ము హేషాఢ్యసత్
కంఖాణోగ్ర చమూలయాంబుధి పొంగెన్ మున్ దరంగంబుగా
శంఖోచ్చైశ్రవవల్గనమ్ము చెలగెన్ సాత్రాము సాముగ్ర్యమై.
(ప : ప్ర : 3)

గుఱ్ఱపు గిట్టలచేత మేఘాలను దున్నుతుంటగా ధనుస్సునుంచి విడువబడ్డ తీవ్రమైన పుంఖానుపుంఖ బాణసమూహంవలె

ఉగ్రమైన అశ్వసైన్యము తరంగాలుగా ముందుకు దూసుకుంటూ వస్తోంది. ఈ అశ్వసైన్యానికి సాత్రాముడు (సుత్రాము కొడుకు జయంతుడు) సమర్థమైన నాయకత్వం వహించి శంఖంవలె స్వచ్ఛమైన ఉచ్చైశ్రవంమీద ముందుకు దూకుతూ వస్తున్నాడు. ఇక్కడ ఒకే అంగతో అంతరిక్షాన్ని దాటినట్లుండటం కనిపిస్తుంది. 'పుంఖాను పుంఖంగా ప్రయోగింపబడ్డ బాణం' అనే అశ్వసైన్యపుపోలిక ఇక్కడ గమనించదగ్గది.

శంభాక్రాంతి కిరీంద్ర మూర్ధవిధి సాక్షాన్నరసింహాకృతిన్
పరితోధావన చండ చంక్రమణ నిస్పారాభ్యహంపూర్వమై
పరిఘ ప్రాస కుఠార పట్టిస గద ప్రక్ష్వేడనంబై చనెన్
పరిసమ్మర్దిత దండధృత్పతికమై పాదాతి మత్యుగ్రతన్.

(ప: ప్ర: 4)

కెల్లు పువ్వు ప్రకాశించగా ప్రకాశిస్తూ సాక్షాత్తు నరసింహావతారమా అన్నట్టుగా ఉండే పదాతి దళము (సైనికులు) వింటి నారిధ్వనులతో నేను ముందు నేను ముందు ఉండాలనుకుంటూ పరిఘ (ఇనుపగుది), ప్రాసం (ఈటె), కుఠారం (గండ్ర గొడ్డలి), పట్టిసం (ఒకవిధమైన ఆయుధ విశేషం), గద, ప్రక్ష్వేడనం (కొసలో ఉక్కు తునక ఉండే ఆయుధం) మొదలైన ఆయుధాలను చేతబట్టుకొని శత్రువులను సమ్మర్దించడానికి (మర్దనం చేయడానికి) మిక్కిలి వేంగగా పరిగెత్తుకుంటూ అత్యుగ్రులైన సైనికులు ఒకర్ని మించి మరొకరు ముందుకు దూసుకుపోతున్నారు. (ఈ కాల్బలానికి యముడు నాయకత్వం వహించాడు.

పై నాలుగు పద్యాలు చతురంగబల వర్ణన. రథ, గజ, అశ్వ, కాల్బలం వర్ణన వరుసగా ఉంది. చతురంగబలాలను వర్ణించడం ఒక పద్ధతి, సేనాగ్రభాగంలో ఉన్న సేనానాయకుని శీసపర్యంతో

వర్ణించటం, సేనానాయకుని వర్ణనతో సేన వర్ణన ప్రారంభించటం- ఈ మూడు పద్ధతులు తిక్కన శిల్ప మార్గం. అదే ఇక్కడ అనుసరింపబడినది. ఇందులో ఒక క్రమపరిణామం కనిపిస్తూనే ఉన్నది కదా!

తపనీయశోణరత్నచ్ఛాగకేతన
　　　జ్వాలోగ్రగతిస్ఫూర్తి ఉషర్బుధుండు
మరకతమణిమయ మకరచిహ్నాంశుకో
　　　చ్ఛలితధ్వజంబున యాదసాంవిభుండు
కనకమానుషచిహ్నఘనకాంతికాంత స
　　　మాచ్ఛాదితాభ్రుఁడై ఐలబిలుండు
గోమేధికఖరప్రభామేయకాంతి వి
　　　ఘూర్ణితధ్వజుఁడైన కోణపుండు

చటులనేమిస్వనద్దిశాపటువులైన
స్యందనమ్ముల పై స్వర్గమును చుట్టి
బద్ధగోధాంగుళిత్రాణవర్మలగుచు
నాయుగీసులు దిక్పతుల్ సాగిరంత. (ష: ప్ర: 5)

బంగారు కెంపులతో కూడి మేక చిహ్నం కలిగి జ్వాలలుగా ఆడుతున్న పతాకం కలిగిన ఉషర్బుధుడు (అగ్ని); మరకతమణి (నవరత్నాలలో ఒకటి) పొదిగించినట్టి మొసలి చిహ్నం కల్గిన జండా పై కెగసిపడుతున్న వరుణుడు; కనకమానుష చిహ్న కేతనం కల్గి అధికమైన కాంతితో మనోజ్ఞమైన మేఘాలతో ఆచ్ఛాదింపబడ్డ కుబేరుడు; అమేయకాంతిగల గోమేధికముతో (ఇది నవరత్నాల్లో ఒకటి) రెపరెపలాడుతూ తిరుగుతున్న గాడిదచిహ్నం పతాకం గల నైఋతి తమ తమ రథాలపై ప్రకాశిస్తూ వస్తున్నారు.రథపు కమ్మీల ధ్వని ధనస్సుల చప్పుడులాగా దిక్కులకు వ్యాపించింది. యుద్ధవీరులైన ఈ నలుగురు దిక్పాలకుల స్యందనాలను (రథాలను) స్వర్గసైన్యం

చుట్టి ఉండగా యుద్ధరక్షణకవచాలైన గోధాంగుళిని ధరించిన వీరు ముందుకు సాగిపోతున్నారు.

ఇక్కడ అగ్ని యొక్క పతాకాన్ని వర్ణించే సందర్భంలో 'శోణరత్నచ్ఛాగకేతనం' అనటం సముచితంగా ఉంది. అగ్ని మొదటికే ఎఱ్ఱగా ఉంటాడు. కనుక ఆతని పతాకం శోణరత్నంతో పొదిగించబడింది అనే పోలిక బాగుంది. శోణమంటే ఎఱుపు. 'శోణరత్నచ్ఛాగకేతన జ్వాలోగ్రమూర్తి' జ్వాలలాగా అగ్నిదేవుడు వస్తున్నాడని అర్థం.

ఈ పై చెప్పిన నాలుగు రకాల సేనలూ ఒకదాన్ని మించి ఒకటి ఉత్సాహంతో రాగా కార్తికేయుడు వగాసి 'కాశ్యపి' ప్రాంతభూమిని దేవసైన్యానికి విడిదిగా చేసుకుని రథాన్ని ఆపినాడు (ష : ప్ర : 6).

**మేఘవిస్ఫూర్జితము :**

గళన్నీలాంభోజమ్ములు కుముద సంతాన సౌగంధికంబుల్
జ్వలత్ స్నిగ్ధంబుల్ హల్లకతతుల సత్సౌరభమ్ముల్ సుగాళిం
చి లక్ష్మీ సౌరభ్యంబు లురలి సురశ్రీసరిత్ స్వచ్ఛవాశ్శీ
తలంబుల్ గాలుల్ వీచె చమువు సుఖార్థమ్ము సేనాని యాగన్.

(ష : ప్ర : 7)

పద్మములు, తెల్లకలువలు, ఎఱ్ఱకలువలు, కలువపూలు వెదజల్లిన సువాసనలను కలుపుకొని ఆకాశగంగ మీదుగా శీతలమైన గాలులు దేవతల సేనలపై హాయిని గొలిపేటట్లు వీచాయి.

భావాన్ని శబ్దాచ్ఛాదనంచేత కప్పుతాడు కవి. చమత్కారం అర్థంతోనే కాక, శబ్దం చేత కూడా చెయ్యవచ్చు. ఛందస్సు చట్రంలాంటిది. విశేషఛందస్సు మరికొంత ఖరీదైన చట్రం - అంటే

నిలుపైన చిత్రం. ఇది చాలా ప్రియమైనది. ఇక్కడ వాడబడ్డ విశేష ఛందస్సు, సామ్రాజ్యభావాన్ని కూడా కవి విశేషంగా ఆవిష్కరిస్తున్నా డని సూచిస్తోంది.

## వెన్నెలవర్ణన

చంద్రశ్రీ :

> కసరెత్తే శ్వేతాంభోజాంతము । శ్లక్ష్ణక్రమములై సా
> గు నవ్యంబుల్ కింజల్కతతులొచు గ్రొంజిలుగుల్ గా
> దినాంత శ్రీసాంధ్యద్యుతి నిశాగ్ర దీప్తులలో నె
> జ్జినై తెల్లై వీటన్ సుమరజస్సు రాల్చె సుధాంశుల్.
>
> (ప : ప్ర : 8)

సాయంకాల సమయంలో ఆకాశంలో చంద్రబింబం మొదట్లో ఎఱ్ఱగా కనబడి, తర్వాత తెలుపై కనిపించింది. పువ్వుల పుప్పొడి రాల్చినట్టుగా వెన్నెల వచ్చింది. ఈ వెన్నెలకు తెల్లకలువపూలు మరింత అందమై పుష్పకేసరాలకు కొత్త జిలుగులు వచ్చాయి.

ఇక్కడ వెన్నెల వచ్చింది అని చెప్పవలసిన సందర్భం. అది సుకుమారమైన భావన. కార్తీకపున్నమి చాలా హాయిగా ఉంటుంది. కవి సత్యజీవితంలోని అనుభవవిశేషాన్ని చెప్పాడు. పూర్ణిమరోజు మొదట కనిపించే చంద్రబింబం పెద్దగా ఎఱ్ఱగా ఉంటుంది. తర్వాత రానురాను ఎరుపుపాలు తగ్గి తెలుపు అవుతూ వస్తుంది. ఇది సహాజమైన వర్ణన. 'సుమ - రజస్సు రాల్చె సుధాంశుల్' - వెన్నెల పుప్పొడి రాలుస్తున్నట్టుంది అనే ఈ పోలిక 'వెన్నెల పిండి ఆరబోసినట్లు కాస్తోంది' అనే లోకోక్తికి దగ్గరగా ఉంది. అలంకారం వాడకపోతే అనుభవంలోకి రాదు. అందుకే సందర్భోచితంగా కవి చంద్రశ్రీ వృత్తాన్ని వాడుకున్నాడు.

చంద్రరేఖ:

ఇందు స్వచ్ఛాంశుపాళుల్ హీరప్రభాస్నిగ్ధ మూర్తిన్
స్కందున్ సేవింపగా శ్రీగంధంబు ప్రాహారకంబై
స్కందావారాంబుధిన్ రక్షామూర్తియై తిర్గుచున్ త
మ్ముం దన్వెన్నంటు వానిన్ ముగ్ధంబుగా చూచి చెప్పెన్.

(ప : ప్ర : 9)

ముత్యపుకాంతిలాగా ప్రకాశిస్తున్న స్నిగ్ధమూర్తి అయిన స్కందుడు విడిది చేసిన దేవసైన్యంచుట్టూ రక్షణార్థమై తిరుగుతున్నాడు. అలా రక్షణార్థమై తిరిగే స్కందుని సేవించడానికి చంద్రకాంతి కిరణాలు- అంటే వెన్నెల మంచిగంధపుపూత పూసినట్టు పూసింది. చిరుచలికి వెన్నెల దుప్పటి అయిందన్నమాట. విశాఖుడు అన్న వెంబడి తిరుగుతున్నాడు. తనవెంబడి తిరుగుతున్నట్టివాడూ, ముగ్ధంగా ఉన్నట్టివాడూ అయిన తమ్ముని చూసి స్కందుడు చెప్తున్నాడు (తరువాతి పద్యంతో అన్వయం).

విచిత్ర ఛందస్సు వచ్చినప్పుడు మనం ప్రత్యేకించి చూసి ఆలోచించాలి. మనం ఒకటి గమనించవచ్చు. ఈ భావానికి గీతపద్యం అయినా వ్రాయవచ్చు. కాని కవి ప్రత్యేకమైన అనుభవం కోసం అలా వ్రాయకుండా ప్రత్యేక ఛందంలో వ్రాశాడు. దీనివల్ల పాఠకుడి దృష్టినుండి పద్యం తప్పిపోకుండా ఉండటానికి అవకాశ మేర్పడుతుంది. ఎప్పుడైతే ప్రత్యేకఛందంలో ఉందో, అప్పుడు పాఠకుడు దానిపై దృష్టి మళ్ళిస్తాడు. అందుకే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ "శిల్పము వేయి విధములు. అది ఇట్లుండవలెనని ఎవరు చెప్పగలరు! దీనిని కవులే చూచుకొనవలె" నన్నారు. భావసాంద్రత, శ్లిష్టత ఉండాలి రచనలో. వృత్తం అర్థంచేత సమర్థింపబడాలి కాని, శబ్దంచేత కాదు. ఇది ఇతిహాసశైలి. వర్ణన కథను అలంకరించాలి తప్ప,

దెబ్బతీయకూడదు. ఇక్కడి వర్ణన కథకు తగినట్లుగా సందర్భానుగుణంగా ఉంది.

## కుమార - విశాఖుల సంభాషణ

(మొదటిరోజు యుద్ధానికి ముందు)

**మధురాక్కర :**

ఈ అనంత సైన్యాంభోధి ఈ నిశాకరుని అత్యం
తాయత శిశిరాంశువులలో నాదమరచె విశ్రాంతిచే
నాయనా ! విశాఖా ! దీని నా నెత్తినన్ బెట్టెనా
డోయి ! స్వర్గాధిపుం డెట్టులో మోయుట? అని ఎల్లి"

(ప : ప్ర : 10)

"సముద్రంవంటి ఈ అనంత సైన్యమంతా ఈ చంద్రుని అత్యంత దీర్ఘమైన చల్లని వెన్నెల కిరణాలలో అలసటతో ఆదమరచి విశ్రాంతి తీసుకుంటోంది. నాయనా విశాఖా! రేపు యుద్ధం. స్వర్గాధిపతి అయిన ఇంద్రుడు దీన్ని నాపై పెట్టాడు. ఈ భారం ఎట్లా మోయాలో !" అని కార్తికేయుడు విశాఖునితో అన్నాడు.

మధురాక్కర, మధ్యాక్కర మొదలైనవి - సంభాషణకు దగ్గరగా ఉండి ఉచితంగా ఉంటాయి. 'నాయనా!' అనే సంబోధన పెద్దరికాన్ని చూపుతోంది. వయస్సు చిన్నదైనా బాధ్యత పెద్దది. ఇక్కడ ఛందస్సు ఆగుతూ పోతుంది. తూగు ఉండదు. ప్రవాహంలా ఉండదు. దాని లయ (రైమ్) అలాంటిది. వితర్కాన్ని ధ్వనిస్తుంది. 'అని ఎల్లి' అన్నచోట విరిగిపోతుంది. ప్రవాహానికి బదులుగా వితర్కం, సందేహం, ఏదీ తేల్చుకోలేని అగమ్యగోచర స్థితి, జవాబు దొరకని స్థితి - ముగింపు లేదు. తునిగి పోతాయి. నన్నయ పద్యాలు గానయోగ్యంగా ప్రవాహంగా ఉంటాయి. కాని, ఇక్కడ,

విశ్వనాథ సత్యనారాయణ, కోటీశ్వరరావుగార్ల పద్యాలు ప్రవాహంగా ఉంటవు.

**మదనదర్పణము :**

సన్నని శిబిరాంబరమ్ము ఓషధీశకాంతులై
పొన్నురతనముల్ తదంచలమ్ములన్ జ్వలింపగా
ప్రసన్నని పటకోటి హీరహారముల్ చలింపగా
క్లిన్నత గని స్వర్గరాజు గార్లైనన్, వచించెశిన్.

(మ : ప్ర : 11)

వెన్నెలకాంతులు బంగారు రత్నాలపై పడుతుంటే రత్నాల అంచులు జ్వలింపగా సన్నని పిల్లగాలులకు హీరహారములు (రత్న హారములు) చలింపగా, మన్మథుడు ఆర్ద్ర మనస్సుతో స్వర్గరాజు అయిన ఇంద్రుని అందమైన శిబిరాన్ని చూసి ఈ విధంగా అంటున్నాడు : (తరువాతి పద్యంతో అన్వయం) -

ఒక దృశ్యాన్ని చూస్తుంటాడు - ఒక పాట అంటాడు. ఈ పద్యంలో గేయలక్షణం (లిరికల్ ఎలిమెంట్) ఉంది. లయ - పాడుకోదగినట్టుగా ఉంది వృత్తం. ద్విత్వ 'న'కార ప్రాస దీనికి మరింత ఉపయోగపడింది. ఆ ఇంద్రుని శిబిరాన్ని చూడగానే ఆతనిలో కలిగిన స్పందన మదనదర్పణం. అంటే మన్మథుని అద్దం. వృత్తానౌచిత్యం పద్యరచనా సౌందర్యంచేత ధ్వనిస్తున్నది.

**మధ్యాక్కర :**

"పాప మీ సురరాజు ఎన్ని బాధలు పడినాడో ? తెలియ -
మా పుణ్యజనపతి తారకాఖ్యుడేమో బలోద్ధతుడు
ఆ పరాక్రమ మస్త్రబలము లాఖ్యాతపూర్వముల్ మనము
పూపవయస్సువారము చమూరక్ష ఎట్లో ? తెలియద !"

(మ : ప్ర : 12

'ఆ తారకుని రాక్షసకృత్యాలవల్ల పాప మీ సురేంద్రుడు ఎన్ని బాధలు పడ్డాడో ?! తారకుడేమో వరబలోద్ధతుడు. ఆతని పరాక్రమం, అస్త్రబలం చెప్పనలవికాదు. మనమా, పసి(ప్రా-ప) వయస్సువారము. సైన్యరక్షణ ఎట్లా చెయ్యాలో తెలియదు.'

తర్కం ఒక సంభాషణ (డైలాగ్). భావం ఎంతవరకుంటుందో పద్య మంతవరకుంటుంది. వాక్యనిర్మాణ కౌశలం తిక్కనశైలి. ఇక్కడ 'చమూరక్ష ఎట్లో' అని ఉంది. 'ఎట్లో' (సంయుక్తాక్షరం) అంటే తేలిపోతుంది. 'ఎట్టో' (ద్విత్వాక్షరం) అంటే బరువుగా ఉంటుంది.

## మదనదర్పణం:

చారుమృదులలోహితాధరాంచలమ్ము చంద్రికా
పూరకిరణపాళి పాటలమ్ముగా వితాపిత
క్షీరము పయి మండఖండముల్ సృజింప చెన్నుగా
కోరకనుల చూచుచున్ విశాఖు డన్న కిట్లనెన్. (ప : ప్ర : 13)

చంద్రకాంతులవలె అందమైనట్టి మృదువైనట్టి ఎఱ్ఱని (పింక్ కలర్) పెదవులపై చంద్రకాంతికిరణ సమూహం పడి, గులాబి-ఎఱుపు రంగు (రోజ్ - రెడ్ కలర్)గా మారి, బాగా మరగకాగిన పాలమీద మీగడతరగలు ఏర్పడ్డట్టు అందంగా ఉంది. వెన్నెల్లో విశాఖుడు నిశితమైన పక్కచూపులతో చూస్తూ తన అన్నతో ఈ విధంగా చెప్తున్నాడు (తరువాతి పద్యంతో అన్వయం) :

అన్న 'మదనదర్పణం'లో చూశాడు. తమ్ముడు కూడ మదనదర్పణంలో చూశాడు. ఈ వృత్తాలద్వారా ఇద్దరియందునూ సమత్వం చెప్పినట్లయింది. ఇది ఎడబాయని జంట. అన్నగారిని జాగ్రత్తగా గమనిస్తున్నాడు తమ్ముడు. పెదవులు (అధరాలు) లైట్

పింక్ కలర్ (చారుమృదులలోహిత)గా ఉన్నాయి. చంద్రుని కొన్నెల పడి గోజ్ - రెడ్ కలర్ (పాటలమ్ము)గా మారాయి.

**మ ధు రా క్క ర :**

"తల్లి ఉత్సాహమ్ము పితృపాదపరమశాంతమ్ముతో
నుల్లసించెడి నీవు కృపోద్భాసివై వీరత
నెల్ల వీటిబుచ్చి పలికెదేమిట్లు ? దృష్టాదు
లెల్ల కెరుగరే నీ శక్తి మృడధనుర్విద్యానిధీ !" (ష. ప్ర : 14)

"శివధనుర్విద్యానిధీ ! కరుణామయుడవై తల్లి అయిన పార్వతీ దేవి ఉత్సాహము, తండ్రి అయిన శివుని శాంతస్వభావాల కలయికతో ఉల్లాసంతో ఉండే నీవు వీరత్వాన్నంతా వదలిపెట్టి ఇట్లు పలుకుతున్నావేమి ? సకలదేవతలకు నీ శక్తి తెలియదా ?" అని అన్నను అడుగుతున్నాడు విశాఖుడు.

అన్న ప్రశ్న వేసిన వృత్తమైన 'మధురాక్కర'లోనే తమ్ముని సమాధానం. లక్ష్మణునిలాగా తమ్ముడు రజోగుణ సంపన్నుడు. అన్న శాంతస్వభావుడు. 'మృడధనుర్విద్యానిధీ' అనటంవల్ల, 'శివ ధనుస్సును చేతపట్టడమే కాకుండా ఆ ధనుర్విద్యలో నేర్పరి అయిన వాడా ఈ మాటలు మాట్లాడుతున్నది !' అని విశాఖుని భావం.

**మ ధ్యా క్క ర :**

ఆ పుణ్యజనపతి తారకాఖ్యుని వరబలోద్ధతులు
శ్రీ పరాక్రమఖనీ ! నీవ చెప్పకోనేమి ? వాడేమి
ఆ పుణ్యజనపతి తాతయైనట్టి వాడాగునేమి ?
ఆ పురాతను డీవు నిద్దరె మహామేరుధానుష్కులందు.

(ష : ప్ర : 15)

విశాఖుడు ఇంకా అంటున్నాడు - "ఓ పరాక్రమ సంపన్నుడా ! తారకాసురుని వరబల పరాక్రమాలను గురించి నీవు చెప్పుతున్నావేమి ? వాడు, వాని తాత అయినా కూడా నీముందు ఆగగలరా ? మేరుపర్వతాన్ని విల్లుగా ధరించినవారు ఆ పురాతను డైనట్టి శివుడు, నీవు - ఇద్దరే కదా !"

ఇక్కడ 'మహామేరుధానుష్కులు' అన్న ప్రయోగంద్వారా 'మేరుపర్వతాన్ని విల్లుగా ధరించిన నీముందు తారకాసురు డెంత తక్కువ !' అనే భావం కల్గుతోంది. 'శ్రీపరాక్రమఖనీ !' అన్న సంబోధనద్వారా, వాని పరాక్రమాన్ని మించినది నీకున్నది అనే భావం ద్యోతకమవుతోంది. 12వ పద్యంలోలాగా దీంట్లో కూడా 'హ'కారప్రాసే (రెండూ మధ్యాక్కరలే). అన్న అయినట్టి షణ్ముఖుడు పై 10, 12 పద్యాల్లో మధురాక్కర, మధ్యాక్కరలలో సంభాషించగా సరిగ్గా తమ్ముడు కూడా 14, 15 పద్యాలు మధురాక్కర, మధ్యాక్కరలలోనే సమాధానం చెప్పాడు. అన్న మదనదర్పణం (11)లో నగాసి, మధురాక్కర, మధ్యాక్కర (10,12)లలో చెప్పాడు. తమ్ముడు కూడా మదనదర్పణం (13)లో నగాసి మధురాక్కర మధ్యాక్కర (14, 15)లలో సమాధానం చెప్పాడు. దీనివల్ల తమ్ముడు ఎంత చురుకుదనం (ఎక్టివ్)గా ఉన్నాడో మనం అర్థం చేసుకోవచ్చు.

**తరళ :**

గిరిశిఖాగ్రమునుండి త్రాచుల తీరుచున్ వలయమ్ములై
ఝరులు దూకి సహస్రరుణోపల సంఘశీర్ణములౌచు తు
వ్వరలు చిందినయట్లు కెంపులపై శిపోగుల జంటపై
తొరగి చిందెను చంద్రికాంశు మృదుత్వసూచిక మాచుచున్.

(మ : ప్ర : 16)

స్కందుడు విశాఖుని చెవిపోగులయొక్క వింత కాంతిని చూస్తున్నాడు. కొండ అగ్రభాగాలపైనుంచి త్రాచుపాములవంటి సెలయేరులు వలయాకారాలై సుళ్ళు సుళ్ళు తిరుగుతున్నట్లుగా దూకుతున్నాయి. ఆ సెలయేళ్ళక్రింద బండలమీద చెల్లాచెదురై తుంపురులు చిందినట్లు విశాఖునియొక్క రత్నఖచితములైన బంగారు చెవిపోగుల జంటపై మృదువైన వెన్నెల కిరణాలు పడి పరావర్తనం చెందుతున్నాయి. ఈ వింతకాంతిని స్కందుడు చూస్తున్నాడు.

చెవిపోగులయొక్క రత్నాలపైబడి వెన్నెలకిరణాలు పరావర్తనం చెందాయన్నమాట. 'తొరగించెడు' అనే ప్రయోగం వల్ల ఇది అర్థమవుతుంది. అంటే లైట్ రిఫ్లెక్షన్. వృత్తము 'తరళము'. అంటే తారళ్యం - light reflection. వృత్తంలో కూడా ఒక లయ ఉన్నది.

తమ్ముడు చెప్పినదాన్ని చూసి గుహుడు (కుమారస్వామి) ఆశ్చర్యపడి విశాల నేత్రాంచలములనుంచి ప్రసరిస్తున్న సోదర ప్రేమతో కూడిన అందమైన తెల్లని చూపులందు వెన్నెలకాంతి కిరణ సమూహానికి మరింత అందం వచ్చి కనువిందుగొలిపేటట్లుగా కనిపిస్తున్న విశాఖుని చూసి కౌగిలించుకున్నాడు (ప: ప్ర : 17).

తెల్లని చూపులపై వెన్నెల పడి మరీ తెల్లగా కనిపిస్తున్నాయి కన్నులు. అందువల్ల ఇక్కడ తెల్లకలువపూలు వికసించినట్లుగా విశాఖుని కన్నులు వికసించాయి అనటం మంచి ఉపమానం.

తమ్ముని కౌగిలించుకొని ఇలా చెప్తున్నాడు షణ్ముఖుడు : "సరే అట్లయితే నడు - జాబిల్లి నెత్తిమీదికి వచ్చింది. అరె విశాఖీ ! అవే, చూడు - విశ్వకర్మ తయారుచేసిన రమణీయమైన నిశితాయుధాలు. స్వచ్ఛమైన వెన్నెలకాంతి కిరణాలు ఈ ఆయు

ధాలపై పడటంతో మెరుపులాగా మెరుస్తూ సర్పాలు కిరలు లున్నట్లుగా ఉన్నాయి" (ష : ప్ర : 18) అని చెబుతూ తమ్ముళ్ళతో పాటు తన శిబిరానికి వెళ్ళి, కొంతసేపు విశ్రాంతి తీసుకునేటంతలోనే తూర్పునుంచి వెలుగులు ప్రసరించాయి. వందిమాగధులు మేలు కొలుపు పాడసాగారు. (ష : ప్ర : 19)

7 వ పద్యంనుంచి 48 వ పద్యం దాకా ప్రత్యేకమైన ఘట్టం. కథకు ఒక అద్భుతమైన వాతావరణ చిత్రణ కల్పిస్తున్న ఘట్టం. ఇట్లా సన్నివేశాల ద్వారా కథానిర్మాణం చేయటంలో నాటకీయ శిల్పం ఉందనవచ్చు.

## మే లు కొ లు పు

దేవసేనాశిబిరమంతా షణ్ముఖ, విశాఖులు తిరిగి వచ్చి విశ్రాంతి తీసుకుంటున్నంతలోనే తూర్పు తెల్లవారింది. వందిమాగధులు మేలుకొలుపు పాడసాగారంభించారు.

**మా లి ని :**

"జయ విజయ కుమారా ! స్వామి ! రాజాధిరాజా !
జయ విజయ విశాఖా ! స్వామినీమంజుమూర్తీ !
జయ విజయ త్రిలోకస్వామి ! అవ్యక్తతేజా !
జయ విజయ పురారంభ స్తంభనాగ్నేయమూర్తీ !

**వం శ స్థ ము లు :**

శరత్సరోజాంత తుషారహారముల్
సరత్న నీగాఢ దశత్ స్మితమ్ముపై
పరాక్రమించున్ ప్రభు ! ప్రాజ్ఞగాగ్రక
స్థ రోచి షట్పంకజపత్రి మేలుకో !

సరస్వతీ సైకతశాయి హంస శ
ర్వరీ హిమాంబుస్రుతి వాపి రెక్కలన్
గిరీంద్ర నిర్భేదనకీర్తి ! తత్కథా
చరద్రమాలిన్ క్రేంకృతి సల్పు మేలుకో !

ఘనాంధకారచ్ఛట గాంచి పారగా
ఇనాంశురేఖావళు లేగు వైవడిన్
వినింద్యదైత్యుల్ కను వే మొగుడ్పగా
స్వనత్సరోజాంత భుజంగ మేలుకో !

హరిచ్ఛటాంతమ్ముల సంచరెక్కలై
శరద్దినాగ్రమ్ము ప్రసన్న మయ్యెడిన్
వరోన్నమత్ ప్రభాగత బర్హిచిత్ర పిం
ఛరుజ్మనోజ్ఞాకృతి ! స్వామి మేలుకో !

**పృథ్వి :**

ఒహో ! యిక భవత్సుషుప్తి యగునో ! సుషుప్తుల్ ప్రభూ !
అహో ! ఇటు వహించు శబ్ద మది యానె శబ్దంబుగా
స్పృహాపమధుర మీ కృపాక్షి మొకటే నిజంబై సదై సర్వమున్
లీలయా
సహస్రదళ పంకజామృత రససస్వరూపా ! మేలుకో !

నీవు శస్త్రశాస్త్రనిధివి భవద్ఘను
ర్దండ మూంత యగుత ధర్మమునకు
శబ్దభువన మెల్ల సంస్కారవంతమా
స్వామి ! మేలుకో శివంకరముగ." (మ : ప్ర : 20-26)

రణభూమిలో యుద్ధవ్యూహాల గురించి నిరంతరమూ ఆలోచనా పరులైనట్టి, అనిమేషాక్షులైనట్టి స్కంద, విశాఖులు వైతాళిక గానంతో లేపారు (మ: ప్ర : 27). ఇక్కడ అనిమేషాక్షులు (అంటే కన్నులు మూయనివారు) అనటంవల్ల, భగవంతుడు నిద్రపోవడ క్షేముంటుందని కూడా సమర్థించడం.

## యుద్ధం :

శంఖం, ఢక్క, పటహము మొదలైన వాద్యాల మహోగ్ర నాదాల ధ్వనికి చెవులు చిల్లులుపడి చెవుడు వచ్చేటట్లుగా ఉంది. అష్టదిగ్గజాల చెవులు చిల్లులు పడేట్లుగా వాద్యాలు మ్రోగాయి. సముద్రాలు పొంగి చలిస్తున్నట్లుగా వచ్చే రాక్షస సైన్యానికి స్కంద, విశాఖులు సైనికులతో ఎదురేగారు. (ష : ప్ర : 28)

చతురంగబలం వస్తోంటే దాని తాకిడికి ప్రకృతిలో కలిగిన పరిణామం ఇక్కడ కింది పద్యంలో వర్ణించబడింది.

ఇభపదక్షుణ్ణ మహీరేణు పటలి ది
    విజ కాంతలకు లోధ్రరజము గూర్ప
వారువమ్ముల పాదవర్తులాకృతి క్షమా
    తన్వీకటిని గల్వదళిము పేర్ప
రథనేమి చటుల ఘర్షణపద్య తామ్రకస్య
    కకు స్వర్ణరత్న మేఖల రచింప
దడముల గర్వోక్తి ధావనల్ ధర్మదే
    వత భీతికిని హేతువై చెలంగ

ఒక విచిత్ర హేలాదర్ప ముప్పతిల్ల
రాక్షసానీకిని మహోగ్రరూక్ష చండ
రౌద్రభావ పరీత తీవ్రతర సూచు
వచ్చుటను గాంచె దేవతాధ్వజిని భర్త. (ష : ప్ర : 29)

ఏనుగు పాదాల తొక్కిడికి బాగా నలగకొట్టబడ్డ భూమిమీద ఉండే మట్టి ధూళి దేవతాస్త్రీలకు పుప్పొడి పూసినట్టుంది (అంటే ఫేస్ పౌడర్ కొట్టినట్టుగా ఉంది). గుర్రాల పాదాల తాకిడివల

భూదేవి మెడపై వర్తులాకారంగా కలువపూలు పోసి తీర్చినట్టుగా ఉంది. రథచక్రాల కమ్మీల ఘర్షణవల్ల ఏర్పడ్డ జాడలవల్ల భూదేవికి రత్నాలతో పొదిగించిన బంగారు ఒడ్డాణంలాగా ఉంది. పదాతిదళం వడిగా (స్పీడుగా) చేస్తున్న పరుగులవల్ల ధర్మదేవత భీతికి హేతువు (కారణం) అయింది. ఈ విధంగా ఒక విచిత్రమైన లీల తటస్థపడి రాక్షససైన్యం మహోగ్రమైన కోపంతో రౌద్రభావం తీవ్రమవుతూ వస్తూండటాన్ని దేవతాసైన్యాధిపతి (కుమార స్వామి) చూశాడు.

మొదట్లో చేసిన దేవతాసైన్య వర్ణన, ఈ రాక్షససైన్య వర్ణన ఎదురెదురుగా తారసపడ్డాయి. ఇలా చిత్రించడం ఒక కావ్య శిల్ప విశేషం - ఈ వర్ణనలను మధ్యలో వచ్చిన సభా వర్ణన ఎడపెడుతున్నది. కాని భావుకుడైన పాఠకుడు ఈ రెంటినీ (ప : ప్ర : 1, 29) అన్వయించుకోవాలి.

ఈ కింది పద్యంలో తారకాసురుడు తన సేనతో గర్భవ్యూహం పన్నిన రీతిని చూడండి :

గోమాయు సింహలాంగూల కేతను లంధ
కుడు బాణుడును కనుల్ కొమరు దాల్ప
వ్యాఘ్రనాగధ్వజుల్ పాతాళకేతువు
జ్వాలాముఖుడు కాగ పక్షయుగము
తాళధ్వజులు సహోదరులు దంతుడు ముండు
డనువారు తీర్పగా నంఘ్రియుగళి
గర్భపార్శ్వముల లుఖ్యారేభ చిహ్న వి
ద్యున్మాలి పృథువక్త్రు లోలి నిగుడ

తోకమై లోహజంఘు డస్తోకకుంత
కేతనుడు నిల్వ కంఠమై కేరల తార
కాక్షుడు రథాంగలాంఛనుం డతిసుదీర్ఘ
తుండమై మహిషుడు బలోద్ధురుడు సెలగె. (ష : ప్ర : 30)

నక్క, సింహం కేతనాలుగా కల్గిన అంధకుడు, భానుడు కన్ను లయ్యారు. పులి, నాగుబాము జండాలుగా కలిగిన పాతాళకేతువు, జ్వాలాముఖుడు అనేవారు రెండు రెక్కలలాగా ఏర్పాటయ్యారు. తాటి సిడము (జండా) కలిగినట్టి దండుడు, ముండుడు అనేవారు రెండు పాదాలుగా తీర్చి నిలబడ్డారు. విద్యున్మాలి, పృథువక్త్రుడు- ఇద్దరూ పార్శ్వము లయ్యారు. పొడవైన బల్లెం గుర్తు జండా కలిగిన లోహజంఘుడు తోక అయి నిలబడ్డాడు. తారకాసురుడు కంఠమై నిలబడ్డాడు. మహిషాసురుడు ముక్కుగా అయ్యాడు. ఈ విధంగా రాక్షసులు అత్యంత చాకచక్యంతో గద్దవ్యూహాన్ని పన్నినారు.

అసిలోముడు, కూర్మకంఠుడనేవారు వారికి తగ్గ స్థలాల్లో నిలిచారు. విద్యుజ్జిహ్వుడు, కపికర్ణుడనేవారు చక్ర రక్షకులుగా నియమితులయ్యారు. దేవతల చూపుకు బరువయ్యేటట్లుగా తారకుని రథం ఈ సేనావ్యూహానికి విలయాగ్ని పరిధిగా తిరుగుతున్నది.

(ష : ప్ర : 31)

దీనిని దిక్పాలకులందరూ చూశారు. దివిజ యోధులకు కనులకు పట్టరాని గద్దవ్యూహంతో కూడిన సైన్యం ఆశ్చర్యం గొలిపేటట్లు నిలువగా, దివిజసేనానాయకుడైన షణ్ముఖుడు రాక్షస సేనా విధానాన్ని తమ్మునికీ, తక్కినవారందరికీ చూపినాడు.

(ష : ప్ర : 32)

చాపవ్యూహము పన్నె లక్ష్యకమునన్ స్వారాట్టు కోట్యగ్రగ
క్ష్మాపృష్ఠంబుగ అగ్ని దండధరులున్ జ్యారూప మన్యుల్ కనన్
చాపాగ్రమ్మ శిలీముఖాగ్రగతుడై స్కందానుజుండున్ ధను
ర్శ్రీపాండిత్య మనోజ్ఞమూర్తి పాలిచెన్ సేనాసునాసీరుడై.

(మ : ప్ర : 33)

ధనురగ్రమ్మన నిలుచున్
ధనుర్గుణమ్మన చరించు ధనురంతస్థుం
డును మధ్యస్థుండై శ్రీ
ధనురాకృతిరై చరించె ధ్వజనీపతియున్. (మ : ప్ర : 34)

షణ్ముఖుడు అత్యంతమైన నేర్పుతో చాపవ్యూహాన్ని పన్నినాడు. ధనుస్సు పిడివద్ద ఇంద్రుడిని, వింటి రెండు చివరి కొన భాగాల దగ్గర అగ్నిదేవుడిని, యమధర్మరాజును నియమింపచేసి, తక్కిన వారిని నారి రూపంగా నియమించాడు దేవసేనాపతి. వింటి శిఖరాగ్ర భాగాన బాణముయొక్క కొనభాగంలో తన తమ్ముడైన విశాఖుడిని నిలబెట్టాడు. ఈ విధంగా ధనుర్విద్యలో పాండిత్యమనోజ్ఞమూర్తి అయిన కుమారుడు చాపవ్యూహాన్ని మిక్కిలి ప్రతిభతో మలిచాడు (మ: ప్ర: 33). తాను- అనగా కార్తికేయుడు- ధనురగ్రభాగంలోనూ ఉన్నాడు; వింటినారియందూ సంచరిస్తున్నాడు; ధనురంతర్భాగం లోనూ తిరుగుతున్నాడు; మధ్యస్థుడై తిరుగుతున్నాడు. మొత్తం ధనుస్సు ఎలా వ్యాపించుకొని ఉందో, అలాగే ధ్వజనీపతి (సేనాపతి) అయిన కుమారుడు చాలా చురుకుగా ధనుస్సు అంతటా తిరుగు తున్నాడు.

పై పద్యం (34)లో కుమారుడు ధనుస్సు ఆకారమంతటా మధ్యస్థుడై తిరుగుతున్నాడు అని ఉంది. ఇది చక్కటి భావం. దేవతల సైన్యానికి నాయకత్వం వహించినటువంటి కుమారుడు ఈ పెద్ద భారాన్ని మోయటం అనేది సమంజసంగా ఉంది. ఇది జానపదులు ఆడుకునే 'చెర్నాట' అనే ఆటను గుర్తు చేస్తున్నది. దీన్నే 'ఉప్పా తెన్నే ఆట' అని కూడా అంటారు.[1]



చెర్నాట - పటం

చెర్నాటకు బొమ్మలో చూపిన విధంగా దీర్ఘ చతురస్రాకారం కల్గిన గీతలు ఉంటాయి. మధ్యలో అడ్డంగా మూడు

1. చూ. కాటమయ్య, జానగాని - 'ఉప్పరఆట' : జానపద ప్రాయోగిక విశ్లేషణ

కాని, అంతకంటే ఎక్కువకాని అడ్డగీతలు [A, B, C] ఉంటాయి. మధ్యన ఒక నిలువుగీత [D] ఉంటుంది. ప్రతి అడ్డగీత వద్ద ఒక్కొక్క వ్యక్తి కాపలా ఉంటాడు. ఉప్పు తెచ్చేవాడు వానికి చిక్కకుండా దాటుకొని పోవాలి. కాపలావాడు మాత్రం ఆ అడ్డగీతమీద మాత్రమే నడవాలి. అలా నడుస్తూ ప్రతిపక్షపు ఆటగాడిని గీతను దాటిపోనివ్వకుండా చూసుకోవాలి. అంటే తన గీతమీద తాను నడుస్తూ ప్రతిపక్షపు ఆటగాడిని ముట్టుకుంటే వాడు ఆటనుంచి తొలగిపోతాడు (ఔట్ అవుతాడన్నమాట). ఆటలో ఒక పెన్న ఉద్ది (క్యాప్టన్) ఉంటాడు. ఇతను అన్ని గీతలమీదా తిరగవచ్చు. అంటే అడ్డ గీతల మీదా, నిలువుగీతలమీదా కూడా తిరగవచ్చు. అన్ని గీతల మీదా తిరిగి ప్రతిపక్షపు ఆటగాడిని అవుట్ చెయ్యవచ్చు. కాని ఆయా అడ్డగీతలమీద నిలబడ్డవాడు మాత్రం వాటిమీద మాత్రమే తిరుగుతూ అవతలివాడిని అవుట్ చెయ్యాలి. అలాగే ఇక్కడ కుమారస్వామి కూడా వింటి పిడియందూ, పృష్ఠభాగాలమీదనూ, అగ్రభాగాలమీదనూ, వింటినారిమీదనూ, బాణంమీదనూ సంచరిస్తున్నాడని భావం.

సైన్యాన్ని ఈ విధంగా తీర్చటాన్ని చూసి దైత్యసైన్యపతి (మహిషాసురుడు) - ముందరా, వెనుక వైపూ చూసి - ఈ విధంగా అనుకున్నాడు : సంగరాంగణము (యుద్ధభూమి) విచిత్రమై కనిపిస్తోంది. పిల్లలిద్దరు - ఒకడు ముఖస్థుడు, మరొకడు చుట్టేవాడు. పిల్లలిద్దరినీ పెట్టుకొని అమరేంద్రుడు యుద్ధాని కెట్లు వచ్చాడో తన కర్థం కాలేదని మహిషాసురుడు ఆశ్చర్యపడుతున్నాడు. (ప : ప్ర : 35)

ఆ మహాదీర్ఘమైన (పెద్ద వైశాల్యంతో కూడిన) సైన్యాన్ని రక్షించటంలో నిమగ్నుడై ఉత్సుకతతో విరాజిల్లుతున్న దివ్యశక్తి గల కుమారుడు సేనను తేజస్సుచేత గోడకట్టి రక్షిస్తూండటాన్ని

చూసి తారకాసురుడు తనలో 'వీనితోనా, యుద్ధం చేయవలసినది ! ఇంకొకడెందుకు చావవలసినదే' అనుకున్నాడు. చేస్తే వీనితోనే చెయ్యాలి, లేకుంటే లేదని తాత్పర్యం (ప : ప్ర : 36). మహావీరుని పరాక్రమాన్ని ఒక మహాపరాక్రమవంతుడే గుర్తిస్తాడు. వీరుణ్ణి వీరుడే గుర్తిస్తాడు. అన్యుడు ఆ పనిచెయ్యలేడు.

వాహినికిం జే వీచెను
కాహళ భేరీ పటహ ముఖధ్వని తుములం
బై హేషాఘీంకృతి శం
ఖాహత రవములను గప్పె క్ష్మా సుడివడగన్. (ప : ప్ర : 37)

పై విధంగా (36) అనుకుంటూ, సైన్యానికి చెయ్యి ఊపినాడు తారకుడు. ఢక్కా, బాకా, తప్పెట మొదలైన శబ్దాలతో పెద్ద సందడి అయి, గుఱ్ఱపు సకిలింపులు, శంఖారవములతో సుడివడేటట్లుగా భూమి దద్దరిల్లింది.

**పద్మకము :**

కనియె వేల్పుబడవాలు నికామచమూమనో
ఽగణితదర్పము చమూపుని కన్నుల న్యక్కృతిన్
కనియె తారకు రణాంగనైకశాత దృ
ష్టిని నమస్కృత శివుండయి చేగొనె చాపమున్.(ప: ప్ర: 38)

దేవసేనానాయకుడైన షణ్ముఖుడు చూశాడు. అగణితమైన దర్పంతో కూడుకున్న తిరస్కార(న్యక్కృతి) భావం రాక్షససేనానాయకుని కన్నులలో తొణికిసలాడటం కుమారస్వామి గమనించి, తారకుని, తారకసైన్యాన్ని ఎదుర్కొనడానికి శివునికి నమస్కరించి విల్లు నందుకున్నాడు.

శి ఖ రి ణి :

త్వరాకృష్టోర్వీభృ ద్ఘన ధనురుదాత్తధ్వని నభో
తర క్ష్మోణీ దిక్సీమ చెలగె ఫణీంద్ర శ్వసన భీ
కరంబై ప్రాక్ క్షీరోదధిమథన సంఘట్టన రవ
స్ఫురత్ చండంబై శక్తిధరుడు గుణంబుం దివిసినన్.

(ష : ప్ర : 39)

మేరుధనుస్సును (ఉర్వీభృత్ ఘనధనుస్సును) శక్తిధరుడు వేగంగా నారిని లాగి విడిచినపుడు గొప్ప బ్రహ్మాండమైన ధ్వని భూమ్యాకాశాది అన్ని దిక్కులకు వ్యాపించింది. మేరు ధనుస్సుకు నారి ఆదిశేషుడు కనుక, ఆ ధనుస్సుయొక్క గుణాన్ని (నారిని) లాగినపుడు ఆదిశేషుని (పాము) బుసలతో కూడుకొని పాల సముద్రం చిలికే టప్పుడు వచ్చిన శబ్దంలాగా ప్రకంపితమై ప్రచండమైన ధ్వని చెలరేగింది.

ఇది చాలా బరువైనవృత్తం. భవభూతి చేతిలో బాగా నడుస్తుంది. వర్ణింపబడే విషయం క్రొత్తదైతే విశేషవృత్తం వాడ బడుతుంది. విచిత్రదృష్టిని సమర్థించడానికి విశేషవృత్తం బాగా పనికి వస్తుంది.

ధ ర ణి ధ ర గ తి :

కరయుగళి వడక ప్రహరణములు గళితములయి తొరగి చనన్
చరణములు వడి జనగ సుడిసి చమువు గుడుసు వడుచు చెదరన్
హరులు బెదరి రయమున రథముల నవల విడుచుచును బరవన్
కరులు బెడిదముగ నరచుచు జనగ దడములు చెదరి విరిసెన్.

(ష : ప్ర : 40)

రాక్షససైన్యం చెల్లాచెదురయింది. చేతులాడక (నియంత్రితం కాక = కంట్రోల్ కాలేక), ఆయుధాలు చేతులనుంచి విడిపడి జారి పోయినాయి. పాదాలు వడిగా కదలినాయి. సేన పాదం కొద్దీ చెదరిపోయింది. గుఱ్ఱాలు బెదరి వేగంగా రథాలను ఆవలకు నెట్టి విడిచి పారిపోయినాయి. ఏనుగులు భయంకరంగా అరుస్తూ అటూ ఇటూ పోవగా, సేనలన్నీ దిక్కులను చెదరిపోయినాయి.

ఈ వృత్తంలో ప్రవాహ ముంటుదు. అక్కడికక్కడే తిరుగుతూ నిర్వీర్యతను చెప్పటం. రాక్షససేనలో జరిగిన ఎఫెక్ట్‌ను పద్యంలో చెప్పడం. 'ధరణిధరగతి'లో అన్నీ లఘువులే (పాదం చివరి అక్షరం తప్ప). అందుకే వదులుగా ఉంటుంది. రాక్షససేన చెల్లాచెదు రయిందని చెప్పడానికి ఈ వృత్తాన్ని బాగా ఉపయోగించు కున్నాడు కవి.

రాక్షససేన వ్యూహం గద్ద ఆకారమని ఇంతకుముందు చెప్పుకున్నాం. వ్యూహముఖస్థుడు, వ్యూహాధిపుడైన మహిషా సురుడు, కుమార విశాఖులను చూసి శిశుద్వయమ్మటన్న తిరస్కార భావం చూపాడు. గుఱ్ఱాలు కూడా బెదరి, రథం వచ్చినదారి పట్టుకొని పోయింది. రథంతో పాటు వాడి తిరస్కార భావం కూడా పరిగెత్తింది.

(ష : ప్ర : 41)

తారకుడు ఇది త్రిపురాసుర సమూహాన్ని చంపేటప్పుడు వచ్చిన చాపధ్వని అని తలచుకుంటూ మండిపడి తన వింటెని ప్రయోగించాడు. (త్రిపురాసురుణ్ణి చంపిన విషయం రాక్షస కుటుంబంలో పరంపరగా చెప్పుకుంటూ వస్తున్నారు.) (ష : ప్ర : 42)

కాలస్వైర విహార భీకరకళో గ్రస్ఫీతదీప్తాంశుకో
న్మీల న్నీలమహాంబుధృత్పటలికిన్ మేలై శతారచ్ఛటల్

జాలుల్ వార్చునో యన్న భీతి గను ద్యోసైన్యంబు రక్షోధిప
జ్యాలీలాలులితచ్యుత ప్రదరధారాచ్ఛన్న మయ్యెన్ పడిన్.

(ప : ప్ర : 43)

యముడు స్వైరవిహారం చేస్తున్నట్టుగా భయంకరంగా ఉగ్రంగా ప్రకాశించే కిరణాలుగల మేఘాల సమూహంనుంచి పిడుగుల సమూహం పడుతుందో అన్నంత భీతికరంగా తారకాసురుడి నారినుంచి వెలువడ్డ వాడిగల బాణసమూహం ధారావాహికంగా పడిగా వెలువడి ద్యోసైన్యాన్ని (దేవసేనను) కప్పేశాయి.

నారిధ్వని రెండువైపులా వర్ణించబడింది. నాయకుడూ (39, 40), ప్రతినాయకుడు (43)- ఆ వృత్తం వేరు, ఈ వృత్తం వేరు. ఆ ఎఫెక్ట్సు వేర్వేరు. అక్కడ మహావీరుడు కనుక విశేషవృత్తాలు. ఇక్కడ సామాన్యంగా ఉంది. మొత్తంమీద తారకుడి నారిధ్వనీ, వాని ప్రతాపమూ కుండా తక్కువేమీ కాదు.

తారకాసురుడు విజృంభించడాన్ని చూసిన ఇంద్రుడికి తన వేయి కన్నులనుంచి చింతనిప్పులు కురిశాయి. అగ్నిదేవుడు ప్రజ్వలించాడు. దండధరుడు (యముడు) వాడికోరలు పటపట కొరుకుతూ రటరట ధ్వని చిందిస్తూ విజృంభించాడు. వరుణుడి కవచము ఊడిపోయింది. తక్కిన ముగ్గురూ ఒళ్ళు తెలియకుండా విజృంభించారు (ప: ప్ర : 44). అష్టదిక్పాలకులు పరాక్రమంతో వాడిగల మహాయుధ సమూహాలు వారిపై విసిరారు. ఎక్కుపెట్టిన వింటినారినుంచి అస్త్రాలు ప్రబలమైన వర్షధార పడినట్లుగా దిక్పాలకుల బాణాలను మధ్యలోనే ఖండఖండాలుగా చెరలాడి బూడిద అయ్యేటట్లు చేశాడు తారకుడు. అవి గాలికి ధూళికణాలై రాలిపోయినాయి.

(ప : ప్ర : 45)

మహిషుడు విక్రమించె విబుధానముగా ద్యుచమూ
సమూహమున్
నిహితశరమ్ములన్ విదిచె నెత్తురు చేరులు నాంత్రవల్లికల్
మహితపు బొమ్మ ప్రోవులును మావులు తేర్లలు స్యందనావళీ
సహితము గాగ పారెను విశాఖుడు చూచెను చూచినంతటన్.

(ప : ప్ర : 46)

మహిషుడు పరాక్రమించి దేవసేనాసమూహంపై నిశిత శరాలను వేశాడు. నెత్తురుచేరులు పారింది. ఆంత్రవల్లికలు (ప్రేగుల ప్రోవులు)- ఎముకల సమూహం బయటపడినాయి. గుఱ్ఱాలు, ఏనుగులు స్యందన సమూహ సహితంగా పారిపోయినాయి. ఇది విశాఖుడు చూశాడు.

ఈ పద్యంలో చూచెన్, చూచినంతటన్ అని క్రియ రెండు సార్లు వచ్చింది. ఈ పునరుక్తి ఒక తీవ్రకోపాన్ని ధ్వనింపజేస్తుంది. తెలుగువాడి కోపవిన్యాసం, ఆ కోపపరిణామం, ఎఫెక్ట్ తరువాతి పద్యంలో కనిపిస్తుంది. విశాఖుడు రాక్షసుడు చేసిందంతా చూశాడు. చూసి విశాఖుడు ఏమి చేశాడో కింది పద్యం చెబుతుంది.

రాక్షసాధముడో దున్న రక్కసుండు
ఖండితశరాసనుండు నిహతసూత రథ వి
హీనుడై తోచె ఇంద్రు వేయియగు కనులు
లలితనళినమ్ములై - తన్నలంకరింప. (ప : ప్ర : 47)

రాక్షసాధముడైన దున్న (మహిషుడు) విశాఖుని దెబ్బకు తన విల్లు ఖండింపబడటమే కాకుండా రథంలో సారథి గతిలేని వాడయ్యాడు. ఈ దృశ్యాన్ని చూసిన ఇంద్రుని వేయికన్నులు లలితమైన తామరపూలలాగా వికసించి విశాఖుని అలంకరించాయి.

విశాఖుని ఎంత సంబరంగా చూశాడని భావం. వేయి తామర పూలతో అలంకరించినట్లు విశాఖుణ్ణి ఇంద్రుడు చూశాడు. దీనికి ముందు పద్యంలో మహిషాసురుడు తన సైన్యానికి చేసిన గతిని విశాఖుడు చూశాడు, చూసినంతటనే ఏమి జరిగిందో ఆ ఫలితం చేయుగిరి.

దీన్ని గమనించిన జ్వాలాముఖుని ముఖం ప్రజ్వరిల్లింది. రాక్షససేనాపతిని తన వాహనంపై ఎక్కించుకున్నాడు. అంతలోన తారకుడు మిక్కుటమైన కోపంతో వచ్చాడు (ప : ప్ర : 48). తారకుడు పెదవి కొరుకుతూ బాణాన్ని ఎక్కుపెట్టి విడిచాడు. అది దివ్య ప్రచండమైన అగ్నిలాగా వస్తోంది. దాన్ని అగ్ని దేవుడు మార్గ మధ్యంలోనే తెగిపడ నరికాడు. అగ్నిలాంటి బాణాన్ని అగ్ని నరకడం ఇక్కడి విశేషం. (ప : ప్ర : 49)

అంతలో ఉభయసైన్య సమూహంలోనూ వీరులు ఒకరినొకరు ఉసికొల్పుకుంటూ తలపడ్డారు. జ్వాలాముఖుడు జయంతునిపై తలపడి శస్త్రసమూహంతో కప్పినాడు. (ప : ప్ర : 50)

దెబ్బతిన్న త్రాచుపాములాగా, జూలు (మీసాలు) పీకిన సింహంలాగా పెద్దగా గర్జిస్తూ మిక్కుటమైన కోపంతో హద్దూపద్దూ తెలియక జయంతుడు బాణాలతో జ్వాలాముఖుని కప్పేశాడు. వాడు రేగిపోయి వేగంగా వేసిన బాణంతో జయంతుని ధనుస్సు త్రుంచివేసి నవ్వుతూ ఇట్లంటున్నాడు : (ప : ప్ర : 51)

"ఓరీ, బాలకా! ప్రచండమైన యుద్ధభూమిని మృదువైన అప్సరల ఒడి అనుకున్నావేమిరా! నా జోలికి రాకు పోరా!" అని తిరస్కరించాడు. అప్పుడు యముడు జ్వాలాముఖుని వింటినారిని త్రెంచి మహాస్త్రసమూహంతో వాడి నొంచినాడు (ప: ప్ర : 52). తాళ

కేతుఁడు యమునిపై తలపడి "అరే, మహాబలశాలివిరా నువ్వు! నాతో పోరు గెలువమంటే అది చాలక పోటుబంటువై వడిగా ఇక్కడికి బయలుదేరి వచ్చావేమి? ఇప్పుడే నీ శరీర మింత ముక్కలు ముక్కలుగా తీవ్రమైన బాణపరంపరలతో నరుకుతాను, నిల్వరా." అంటూ (ష: ప్ర: 53), ఆయసము, భిండి, వాలములనే ఆయుధాలను విసిరివేశాడు. అవి మంటలు పొందుకుంటూ (కనలుచు) వస్తోంటే, యముడు దండాయుధాన్ని పంపించాడు. అది కాలాగ్నిలాగా బయలుదేరి, ఆయుధాలన్నింటినీ నసుమనే సమసింపజేయడమే గాక, కాళకేతుని రథాన్ని కూడా బూడిద చేసింది (ష: ప్ర: 54). వాడు పక్కనే ఉన్నట్టి బాణుని రథంపైకి వెళ్ళాడు. కుబేరుడు - బాణుని తోనూ, నైఋతి - అంధకులతోనూ, గంధవహుడు - మహావక్త్రుడితోనూ పోరాడుతున్నారు. దండ ముండులు - ఇంద్రునిపై తలపడి పోరాడుతున్నారు. (ష: ప్ర: 55)

పోరు నడుమింటి చండాంశువున్ సమనుక
రింప దివిజచమూపతిన్ గృత్స్నకోపి
తారకుడు తాకి దివ్యాస్త్రతతులు గుప్ప
చిర్నగవుతోడ నన్నింటి జెండివైచి. (ష: ప్ర: 56)

సూర్యుడు నడుమింటికి వచ్చాడు. పోరు కూడా అనుసరించింది. మధ్యాహ్నమయింది. సూర్యుడు మండుతున్నాడు. పోరు కూడా సూర్యుడు మండుతున్నట్టుగానే ప్రబలమయింది. దివిజ సేనాపతి అయిన కార్తికేయునితో కృత్స్నకోపి తారకుడు తలపడి దివ్యాస్త్ర సమూహాల నెన్నింటినో గుప్పించాడు. చిరునవ్వుతో వాటి నన్నింటినీ త్రుంచివేశాడు కుమారుడు.

తారకు దీర్ఘ చాప ఘనదండము చెండఁదలంచి గైకొనన్
నార్భటమొందు దైత్యపతి నవ్వుచు దానిని వాని చాపమం

దే రయమార ద్రుంప కని నిర్జరసైన్యనిభుండు చాప వి
ద్యా రమణీయ వైఖరికి నా సురనాయకు మెచ్చుకుంచునున్.
(ష : ప్ర : 54)

రథము రథమును గడియించి 'రాక్షసేంద్ర !
హృదయతర్పణం బయ్యె సుమీ ! భవ ద్ధ
ను ష్కళా ప్రౌఢి' నాన్ వాఁడు నొసలు ముడిచి
'నీదు మెప్పెంత? నీవెంత? నిసుగ!' యంచు. (ష : ప్ర : 58)

కుమారస్వామి తారకునియొక్క పొడవైన చాపాన్ని త్రుంచి వేయాలనే తలంపుతో ఒక బాణాన్ని తీసుకొని విల్లు ఎక్కుపెట్టే సమయంలోనే అంతకంటే వేగంగా తారకుడు ఆ బాణాన్ని చాపం లోనే టుంచేశాడు. దాన్ని చూసి దేవసేనాపతి ఆ రమణీయమైన చాపవిద్యావిధానానికి మెచ్చుకుంటూ "రాక్షసరాజా ! నీ ధనుష్కళ, నీ నేర్పరితనం మెచ్చుకోదగ్గవి సుమా !" అన్నాడు. వాడు దానికి నొసలు ముడిచి - "నీ వెంత, నీ మెప్పెంత - నిసుగా (పసివాడా)!"అన్నాడు.'నిసుగా' అన్న సంబోధనలో ఎగతాళి ఉంది. 'కుఱ్ఱకుంక మెచ్చుకుంటే ఎంత, మెచ్చుకోకపోతే ఎంత!' అనే భావం ఉంది.

ఇక్కడ మన మొకటి గమనించవలసి ఉంది. యుద్ధ మంటే అంతా calculation - గణన - మీద ఆధారపడి ఉంటుందన్న సంగతిని గుర్తుంచుకోవాలి. అవతలి వ్యక్తి బాణం వేగమెంత ? ఇవతలి వ్యక్తి ఆ బాణాన్ని టుంచడానికి తన బాణాన్ని ఎంత వేగంతో పంపాలి ? అని మనస్సులో గణన చేసుకొని బాణాన్ని పంపించాలి. ఇదంతా ఆటోమ్యాటిక్ గా జరిగిపోయినట్లు ఉన్నా, ఖచ్చితంగా గణనంమీద ఆధారపడి ఉంటుంది. ఆధునిక కాలంలో శత్రువిమానాలను పడగొట్టడానికి వాని వేగమెంతో

చూసుకొని, రాడార్లను ఎంత వేగంతో పంపితే వాటిని ఢీకొని ధ్వంసం చేయగలవో లెక్క-వేసి, రాడార్లను పంపి ధ్వంసం చేస్తారు. అలాగే ధనుర్విద్య కూడా. ఆ రోజుల్లో అవి missiles (క్షిపణులు) లాంటివే. శక్తిమంతమైన అస్త్రానికి భూమిని బొగ్గు చేసే గుణం కూడా ఉంటుంది. అందుకే అవి missiles లాంటివి. ఆ విధంగానే ఇక్కడ తారకుడు కుమారుని బాణం విల్లుమీద ఉన్నట్లుగానే ధ్వంసం చేశాడంటే, అతని క్రియావేగం - కుమారుని క్రియావేగంకంటే ఎక్కువగా ఉందన్నమాట. అందుకే దివిజసేనాపతి (కుమారస్వామి) తారకుడి నేర్పరితనాన్ని మెచ్చుకున్నాడు.

తారకుడు కుమారుడిని 'నీ మెప్పెంత, నీ వెంత !' అంటూ, మహారాక్షసుడై బాహుబల సంపన్నుడై బాణపంక్తుల్ని దివిజసేనా సమూహంపై తెగిపడేటట్లుగా వేశాడు. ఆ ధాటికి తట్టుకోలేక దేవ సైనికులందరూ పాయలు పాయలై పారిపోయారు. ఇది, దండముండులనే రాక్షససోదరులతో పోరాడుతున్న సురనాథుడైన ఇంద్రుడు చూసి, వారిద్దరినీ విదలించుకొని (ష: ప్ర : 59), అసురపతి అయిన తారకుని అడ్డుకున్నాడు. "ఇన్నాళ్ళు పోనిచ్చాను. నేను నీపై నీవే మృత్యువును వెదక్కుంటూ నా ముందుకు వచ్చావు, నిలువుమురా" అంటూ తారకుడు ఆయసదండాన్ని ఇంద్రునిపైకి వేశాడు (ష : ప్ర : 60).

విశాఖుడు మహేంద్రునికడ కేగి విజృంభించసాగాడు. లోహజంఘు క్రవ్యాదుడనే రాక్షసుడు కోపోద్రిక్తుడై నడుమ దారి తడవు లేకుండా కర్పణం అనే ఆయుధాన్ని విసిరాడు. దాన్ని విశాఖుడు మధ్యలోనే నరికాడు (ష : ప్ర : 61). కణపత్రము, అసికము, తోమరము, హాటకము-, పోత్రము, కర్ణము, ప్రాసము (ఈటె) మొదలైన నిశితాయుధాలు వాడు విశాఖునిపై వేశాడు. వాటి నన్నింటినీ విశాఖుడు అవలీలగా కూల్చివేసి, వాని కేతనాన్ని

తుంచేశాడు (ష : ప్ర : 62). పతాకాన్ని తుంచిన తర్వాత క్రవ్యాదుడు రథాన్ని వేగంగా తోలి విశాఖునిపై అసాధారణమైన మహాస్త్రాలు పందిరిలాగా కట్టినాడు. వాటి నన్నింటినీ లీలగా విదిలించేశాడు. ఆ విధంగా అస్త్రాల పందిరిని విదిలించివేసి, వాని బలమెంత ఉందో చూడదలచి విశాఖుడు ధనుస్సు వంచక కొద్దిసేపు ఊరకే ఉన్నాడు. వాడు ఊరకే ఎగరేసుకుంటూ తీవ్రకోపం చెంది (ష : ప్ర : 63), నిశితాస్త్రాలతో విశాఖుడి రక్షకకవచాన్ని కత్తిరించడంకోసం వింటినారిని సంధించగానే, విశాఖుడు దాన్ని (వింటినారిని) తెగ్గొట్టాడు. వాడు తిరిగి మరొక వింటినారిని తగిలిస్తున్నంతలోనే, మళ్ళీ దాన్ని కూడా తెగ్గొట్టాడు. ఇక లాభంలేదనుకొని ఈ తుంటరిని ఖడ్గంతో మొడ త్రుంచుతానని రథంపై విశాఖునివైపు ఏతేరుతున్నాడు (ష : ప్ర : 64). క్రవ్యాదుని కత్తిని పిడిని నరికివేసి వాణ్ణి చూసి "ఓరీ దుష్టనక్తంచరా (రాక్షసుడా)! నీకు యుద్ధమెందుకు! ఛీ! పోమ్మ అవతలకు. నిన్ను విడిచిపెడుతున్నానురా అకృతాస్త్రా! నాకు మీ రాజుతో పని ఉన్న"దని అటువైపు వెళ్ళాడు విశాఖుడు (ష : ప్ర : 65). 'అకృతాస్త్ర' అనే సంబోధన సమంజసంగా, సందర్భోచితంగా ఉంది. 'అకృతాస్త్ర'-అంటే 'అస్త్రవిద్యయందు నిపుణుడు కానివాడా' అని.

పోవుచు చూచె నల్ల సురపున్ విదళింపగ బోవు దండమున్
ద్రోవు కణమ్ములై చెదరిపో నొక బాణము వైవ వాహనీ
దేవు శరమ్ముతో చని విదిల్ప సురాధిపు నన్న మీరుచున్
పోవ నిశాటుపై గుహుడు పోయె రణక్షితి రక్షణార్థమై.

(ష : ప్ర : 66)

విశాఖుడు పోతూ పోతూ ఈ దృశ్యాన్ని చూశాడు - ఇంద్రునిపై దూసుకువస్తున్న (ఇక్కడ-ష : ప్ర : 60తో అన్వయం)

ఆయుస దండంపై అన్న బాణంతోపాటు విశాఖుడు వేసిన బాణం కూడా కలిసిపోయి, ఆయసదండాన్ని పిండిపిండిగా చేసి కణాలు కణాలుగా చెదరిపోయేటట్లు చేసింది. తర్వాత గుహుడు (కుమారస్వామి) సురసేన రక్షణార్థమై వెళ్ళాడు. (ఇక్కడ ఇంద్రుడిపైకి వస్తున్న ఆయసదండాన్ని చూసి ఒకరికి తెలియకుండా ఒకరు-అన్నదమ్ములిద్దరూ బాణాలు వేశారని అర్థం చేసుకోవాలి.) ఆ తర్వాత ఎవరి పనులలో వాళ్ళు నిమగ్నులయ్యారు.

తారకుడు విశాఖుడిని చూశాడు. చూశాక వానికి సభలో జరిగిన అవమానపు సంఘటన గుర్తుకొచ్చింది. ఆ నాటి సభలో తారకుని సైగను గ్రహించి రాక్షసులు విశాఖుడిని బంధించబోయే టప్పుడు తన కిరీటాన్ని క్షణాల్లో భూమిమీద పడి దొర్లేటట్లు చేసిన (చూ. పం : క : 73) వాడు వీడేనని గుర్తుకు తెచ్చుకున్నాడు (ప: ప్ర : 67). పన్నెండు సూర్యమండలాల సదృశంగా మండిపోతూ విశాఖుడిపై కోపించిన తారకుడు అగ్నినామక మహాస్త్రం వేశాడు. ఆ అస్త్రాన్ని చూసి విశాఖుడు ఆజ్యం పోసిన అగ్నిలాగా అయ్యాడు. అస్త్రం నాశనం చెయ్యడానికి బదులుగా ప్రజ్వలింపచేసింది. అది మహావీరుని లక్షణం. విశాఖుడు అత్యంత ధనుష్పాండిత్యంతో ఉగ్రమూర్తి అయి వర్ష బాణం వడిగా వేశాడు (ప : ప్ర : 68). నిప్పుల వాన కురిపిస్తూ ఉండే ఆ అస్త్రం అంతటితో బొగ్గుముక్కై చెదరిపోయింది (ప : ప్ర : 69). ఆ అగ్నిబాణం తిరిగి రాక్షసరాజు దరి చేరలేదు. ఆతడాశ్చర్యపడుతూ 'ఇదేమి మాయ శక్తి ! ఈ రీతిగా బొగ్గు అవుతూ నాశనమయింది' అనుకున్నాడు (ప: ప్ర : 70). అస్త్రం తిరిగి ప్రయోగించినవాడి దగ్గరకు చేరాలి. అస్త్రం మంత్రంద్వారా ప్రయోగించబడుతుంది. ఇక్కడ విశాఖుడు వీరుడే కాక, దైవశక్తి కూడా అని చెప్పినట్లయింది.

ఆగ్నేయశక్తి నాశనమయిందని ప్రళయకాలాంతరుద్రుడై కళ్ళకొసలు ఎఱ్ఱగా చేసుకొని ఇంటెనారినుంచి కోపమనే బాణ సమూహాన్ని మిక్కిలి వడిగా వేసి దేవసేనను బాధిద చేశాడు. అది విశాఖుడు చూసి వాని ధనుస్సును రెండు ముక్కలుగా నరికి వాని శరీరాన్ని తూట్లు పొడిచి గాయపరిచాడు (ష : ప్ర : 71). "ఛీ, పసివానితోనా దెబ్బతినటం!" అని కోపోద్రిక్తుడైన తారకుడు బ్రహ్మదత్తమైన పసిడిగదాయుధాన్ని విసిరాడు. అది రౌద్రాకృతి అయి వస్తోంది (ష : ప్ర : 72). విశాఖుని స్యందనంపై పెద్దకొండ పడినట్లు పడింది. అశ్వాలూ, రథమూ భూమికి ఒరిగిపోయాయి. విశాఖుడు తత్క్షణమే ఇంద్రుని రథంపైకి దూకినాడు. ఎప్పటిలాగానే తారకుడి చేతిలోకి తిరిగి ఆ పసిడి గదాయుధం వచ్చేసింది. ఈ దృశ్యాన్ని ఇంద్రుడు చూశాడు (ష : ప్ర : 73). "పిరికిపందా ! అసురా ! ఆ పసివానితోనటరా కలహం ? రా, నీ రొమ్మును శరమ్ములతో పత్తెలు వేస్తాను" అంటూ స్వర్గపతి ఇంద్రుడు బాణాలతో ముంచెత్తాడు. తారకుడు ఇంద్రుడి బాణాలన్నింటినీ విదలించివేసి శెలవులు (పెదవిమూలలు) పెడల్పుగా చేసి సవ్యాపహా వజ్రిని తూలనాడుతూ ఈ విధంగా అన్నాడు : (ష : ప్ర : 74)

"నీకంటే వాడే నయం. కాలు మోపి యింతమట్టుకైనా అతడు నిలదొక్కుకున్నాడు. యుద్ధం వద్దని నీకెన్నిసార్లు చెప్పానురా!" (ష: ప్ర : 75) అంటూ తారకుడు ఇంద్రుని గాయపరచి రథాన్ని కూల్చివేశాడు. ఇంద్రుని తోడ్పాటుకై వచ్చిన అగ్ని, వాయువులను కూడా అలాగే చేసి వికటాట్టహాసం చేసి తారకుడు అరిచాడు.
(ష : ప్ర : 76).

బ్రహ్మ చెప్పిన కథలోనివాడూ (చూ. కుమార జననం), ఎల్లప్పుడూ మునులను వేలెండ్లు వేపుకు తిన్నవాడూ, ధర్మస్వరూపిణీ

అయిన యోగధేనువుని కాల్చుకొని తిన్నవాడూ (ష : ప్ర : 77), రాక్షససేనానాయకుడూ అయినమహిషాసురునికోసం నక్తంచరవ్యూహం (రాక్షసవ్యూహం)లో సంచరిస్తూ శక్తిధరుడైన కార్తికేయుడు తన స్యందనాన్ని రెట్టింపు వేగంతో ముందుకు దూకించాడు. ఆ వేగానికి రథచక్రాల కుండలు ఉద్రిక్తవేగంతో తిరుగుతున్నాయి. పద్యం గమనించండి : (ష : ప్ర : 78).

నక్తంచరానీకినీ నాథుకోసమై
నక్తంచరవ్యూహమునన్ చరించుచున్
శక్తిప్రభుం డుగ్రత స్యందనప్లుతో
ద్రిక్త భ్రమీహుండనదృప్తవేగుడై. (ష : ప్ర : 78)

కుండలమీద దృష్టిని కేంద్రీకరించటం, ఆయన కోపాన్ని దానితో పోల్చటం - కోపం పెరిగింది. దాని ప్రభావం, ఫలితమే కుండల వేగం. మహావీరుడు కనుక, అతని వేగమంతా చక్రంమీద ఆరోపించి చెప్పటం. రథం ఎగిరిదూకినట్లుంది. జంప్ చేసినట్లుంది - 'శక్తిప్రభుం డుగ్రత స్యందనప్లుతోద్రిక్తభ్రమీహుండనదృప్త వేగుడై'. ఆ వేగాన్ని వాక్యంలో ధ్వనింపచేయటం. వాచ్యార్థంతో పనిలేదు. ముఖ్యంగా నాల్గవ పాదం నడక వేరు. 'స్యందనప్లుతోద్రిక్త భ్రమీహుండనదృప్తవేగుడై' - ఇక్కడ శబ్దం నడకే జంప్ చేసినట్లుంది.

కరుల తుండమ్ములు బిరుదల హస్తముల్
పెనగొని త్రాచులై తునిగి పడగ
వంగిన బొమలతోడం గొననో తల
లిష్వాసములతోడ నెగసిపోవ
కార్చిచ్చులో కాలి కమరు జంతువు లట్లు
మహితాస్త్రముల సేన మాడిపోవ
తల డుస్సి పోగబంధమ్ములై ధృత ఖడ్గ
ముష్టియై భీకరమ్ముగ చరింప

తలలు వ్రస్సిన కరులు హృదయ విదార
కమ్ముగా ఘీంకరింప రాక్షస చమువును
జంత వట్టిన చేనుగా చాళ్ళు దున్నె
అమర సేనాధిపస్యందనావలనము. (ప : ప్ర : 79)

అమితమైన వేగంతో అమరసేనాపతి కుమారస్వామి రాక్షస సేనపై జంటెలు పట్టిన చేనులాగా దున్నుతూ తన స్యందనాన్ని వలయాలు వలయాలుగా చుట్టినాడు. ఏనుగుల తొండాలు, శత్రువీరుల హస్తాలు ఒకదాని కొకటి త్రాచుపాములలాగా పెనవేసుకొని తెగి కింద పడ్డాయి. ధనుస్సును వంచి, ముడిచిన కనుబొమలతోటి అంబులు గురి పెట్టినపుడు శత్రువుల తలలు వారి ధనుస్సుతోపాటు ఎగిరిపోయాయి. అంబు ఎక్కుపెట్టేటప్పుడు కనుబొమ్మలు ముడి చేసేది లక్ష్యం (గురి) కోసం. కనుబొమలు గురి చూడటం సహజం. మహోత్తరమైన అస్త్రాలచేత కార్చిచ్చులో పడి కాలి, కమరిపోయే జంతువులలాగా రాక్షససేన మాడిపోయింది. తలలు ఖచ్చితంగా తెగి పోగా మిగిలిన మొండెములు చేతులలోని ఖడ్గాలను పట్టుకొని ఆ వేగా నికి కొంత దూరం అట్లే భీకరంగా నడుస్తున్నాయి.తలలు బ్రద్దలైన ఏనుగులు హృదయ విదారకంగా ఘీంకారం చేస్తున్నాయి. అమర సేనాధిపతి స్యందనావలనంవల్ల రాక్షస సేనకు ఈ గతి పట్టింది. (వలనంవల్ల వీరరసపుష్టి కలుగుతుంది.)

అడ్డం వచ్చిన వీరుల నందరినీ ఎడ్డిగా అమ్ములతో (బాణాలతో) నరక్కుంటూ పోతున్నాడు షణ్ముఖుడు. రథం తీవ్రవేగంతో ఎగురుతూ వ్యూహంలో ఎక్కడ చూసినా మెరుస్తూ కనిపిస్తోంది (ప. ప్ర : 80). దీనికి రాక్షససేన గగ్గోలుపెట్టి "ఓయీ మహోప సేనాధిపతీ ! రాక్షసకులం పాలిటి మృత్యువు రంపపుపళ్ళు తెరచు కొని, భయంకరమైన ముఖం పెట్టుకొని వస్తోంది. మమ్మల్ని రక్షించు

ప్రభూ !" అని అరుస్తోంది (ష : ప్ర : 81). ఇది చూసి మహిషాసురుడు తీవ్రవేగంగా వచ్చి నిశితాస్త్రములతో కుమారస్వామిని ఎదుర్కొన్నాడు. వాటినన్నింటినీ చెండుతూ ఈ విధంగా అంటున్నాడు కుమారస్వామి : (ష : ప్ర : 82)

ఓరీ రాక్షస ! నాస్తికాగ్రణి ! మునివ్యూహమ్మురా నీకు నా
హారం బీ నిను కాకగృధ్రములః కాహారంబు కావించెదన్
శ్రీరమ్యంబగు ధర్మరక్ష కనుచున్ శింజాపటుధ్వాన సం
ఘారాక్రామితసర్వదిక్కుహరుడై భల్లంబు లేసెన్ వడిన్.

(ష : ప్ర : 83).

"ఓరీ రాక్షసా! మునిసమూహమటరా నీకు ఆహారం ? అట్టి నిన్ను ధర్మరక్షణకోసం కాకులకు, గద్దలకు అహారంగా వేస్తాను" అంటూ షణ్ముఖుడు వింటినారిని సంధిస్తూ బాణాలు వడిగా వేశాడు. ఆ బాణాలను వింటినారినుంచి సంధించి లాగినపుడు వచ్చిన ధ్వని సర్వదిక్కులకూ సమృద్ధిగా భయంకరంగా వ్యాపించింది.

రాయబారం పోయినపుడు విశాఖుడు కూడా (చూ. పం. క : 72) 'ధర్మావనశ్రీరమ్యంబుగ' అన్నాడు. ఇక్కడ కుమారస్వామి అదే మాట అంటున్నాడు - 'శ్రీరమ్యంబగు ధర్మరక్షకు'. అన్నదమ్ములిద్దరిమనస్తత్త్వం ఒక్కటే. పూర్వాపరసమన్వయం ఇక్కడ గమనించవచ్చు. చాపధ్వని చాలా విశిష్టమైనది. విశిష్టమైనవాడి చేతిలోనే ప్రతిధ్వని (రీసౌండ్) వస్తుంది.

అరె ! నీవు ధర్మరక్షా
ధురీణుడవు మేము పట్టి దూర్తులమున్ నె
త్తురు త్రావెద నిలుమని యసు
ర రయమ్మారగ శితతురప్రము లేసెన్. (ష : ప్ర : 84)

"అరే ! నీవు ధర్మరక్షాపరుడవు, మేము వట్టి ధూర్తులమా ! నెత్తురు తాగుతాను, గెలువు"మని నిశితశస్త్రాలు వేశాడు తారకుడు.

'నెత్తురు'లో 'త్తు' మీద వత్తాలి. పూర్వవాక్య బలం తర్వాతి పాదంమీద పడుతుంది. ఇది శిక్కానశిల్పంలాంటిది. 'త్తు' వత్తుచేత పూర్వపాదం చివరి అక్షరం గురువవుతుంది. Stress (ఊనిక) వస్తుంది. నెత్తురు తాగడం అలవాటు వీనికి. 83వ పద్యానికి, 84వ పద్యానికి కార్యకారణ భావం ఉంది- ధర్మస్వభావం (ప: ప్ర: 84).

తారకుడు వేసిన బాణాల నన్నింటినీ నడుమనే త్రుంచివేసి తీవ్రతరమైన పావనాస్త్రం (వాయుబాణం) వేశాడు. అది ప్రళయ కాలపు గాలులు రేపుకుంటూ వచ్చి రాక్షసస్యందనాన్ని గాలిలో ఎండుటాకు లేలి కొట్టుకుపోయినట్లుగా చేసింది (ప: ప్ర: 85). ఇది విద్యుద్మాలి వలె నాసి రెంటరెంటనే కదలివస్తున్న బాణాల సమాహారంతో శరజన్ముని (కుమారుని) నొప్పి పెట్టాడు. దీనితో కార్తికేయుడు రేగి భయంకరాకృతి దాల్చాడు. చాపవిద్యా ప్రావీణ్యంచేత అందంగానూ, కోపంచేత భయంకరాకారుడుగానూ కనిపిస్తున్నాడు (చాపప్రాంచిత విద్యామనోజ్ఞభయదాకృతియై) (ప. ప్ర: 86). రెండు, మూడు, నాలుగు మంచి వాడియైన బాణాలతో వాని కేతనాన్ని (జండాను), సారథిని, గుఱ్ఱాలతో సహా రథాన్ని కూల్చివేశాడు. ఇంకొక బాణంతో వాని ధనుస్సును తెగ్గొట్టి, కవచాన్ని కూడా ఒలిచివేశాడు. (ప: ప్ర: 87)

ధనువూం ముగ్రతనెత్తి వక్త్రిము వినూత్న క్రోధరోచిశ్ఛటల్
చినుకన్ స్యందన మన్యమెక్కి- శరపాళీ విస్ఫులింగమ్ము లే
సిన కన్గోసలు కింశుకచ్ఛవులు పుష్పింపం గుమారుండు చం
డ నిశాతాస్త్రమునన్ దదీయశిరమున్ ఖండించి బిట్టార్చె నన్.

(ప: ప్ర: 88)

విద్యున్మాలి ముఖము కోపంతో వినూత్నంగా ఎఱ్ఱటి కాంతులు వ్యాపించుకోగా వేరొక రథ మెక్కి ఇంకో ధనుస్సునెత్తి, అగ్నికణాలు కక్కే బాణాలు కుమారుడిపై కురిపించాడు. కుమారస్వామి కంటికొసలు మోదుగపూలు పూసినట్లు ఎఱ్ఱబడ్డాయి. ఆతనికి ఆ రకంగా కోపం వచ్చి ప్రచండమైన నిశితాస్త్రంతో విద్యున్మాలి శిరస్సును ఖండించివేశాడు.

విద్యున్మాలి శిరస్సును ఖండించిన తర్వాత అతని బంధువులు, పాతాళధ్వజుడు, మహిషుడు మూకుమ్మడిగా అనంతబలోపేతులై ఒకేసారి మహోగ్రమైన బాణాలను కుమారునిపై కురిపించారు (ష : ప్ర : 89). మాలి, సుకంతుడు, విద్యున్మాలి సహోదరులు మహిషునికి చేయూత నివ్వడానికి రథచక్ర రక్షకులుగా వచ్చారు. చుట్టూ అత్యంత బలోపేతులైన వీరలతో కూడుకొని మహిషుడు విజృంభించాడు (ష : ప్ర : 90). ఒక గొప్ప భుజబలంగలవాడు ఏపుగా పెరిగిన రెల్లుదుబ్బులను మంచిపదనుగల కొడవలితో చెక్కివేసినట్లు, దేవసైన్యాన్ని మహిషుడు నరికివేశాడు. ప్రక్కనే వాయువు దీన్ని చూసి మహోజ్జ్వలమైన కాంతులు గల బాణాలతో వాని పతాకాన్ని కూల్చి బాణాలతో కప్పివేశాడు. దీనికి వాడు మరింత ఉగ్రుడయ్యాడు (ష : ప్ర : 91). పెదవులపై చిన్ననవ్వు నవ్వి, వాయుదేవుడు వేసిన బాణాలన్నింటినీ చెండి, వాయువుయొక్క సారథిని, గుఱ్ఱాలను నేలకూల్చివేసి, రక్షకకవచాన్ని పగులగొట్టి, చిరత్నాలతో పొదిగించిన రత్నకుండలాలను పడగొట్టి, వాయువును నవ్వులపాలుజేసి, కంఠాన్ని ఖండింపగల సమర్థమైన అస్త్రాన్ని సంధించడానికి మహిషుడు ప్రయత్నిస్తున్నంతలోనే దేవసేనాధిపతి చూసి వెంటనే దాన్ని త్రుంచివేశాడు (ష : ప్ర : 92). క్రౌర్యంతో వాడు వాని కభిముఖంగా రథాన్ని అదిలించాడు. వాయువు కాస్త సిగ్గుపడి శౌర్యం తగ్గి కార్యముఖుడు కాలేక కొంచెం ఎడంగా జరిగాడు.

దేవతాసైన్యం భయంతో పారిపోగా, యముడు మహిషాసురుని ఎదుర్కొని వారికి ధైర్యమిచ్చాడు. (మ : ప్ర : 93)

పాతాళధ్వజుడు బిగ్గరగా అరుస్తూ తీవ్రమైన నిశితాయుధాలతో శరవణభవుని (కుమారస్వామిని) కప్పగా, వాటి నన్నింటినీ అవలీలగా విదిలించి, వాని గుఱ్ఱాలను, వింటిని, రథ చక్రాలను, సూతుని (సారథిని), పతాకాన్ని, వాడు తొడుక్కున్న ఒంటికకవచాన్ని వరుసగా పెగ్గొట్టి, వాని శిరస్సును చేతులు నేల తీసేటట్లుగా ఖండిం చేశాడు - భూమికి తృప్తిగా. 'చేతులు నేల బసన' అన్న నుడికారం భావోద్వేగాన్ని తెలియజేస్తోంది. 'ఓకి త్రిస౦' అన్న శబ్దంచేత కోయటంలోని సార్థ్యాన (స్పష్టతను) ధ్వనింపజేయటం జరిగింది. 'భూమికిం దృప్తిగా' అనటంవల్ల, దుర్మార్గులైన వారెవరైనా భూమికి బరువుగా ఎందుకు బతకాలి అంటూ ఉంటారు. ఒక దుర్మార్గుడు పోవడంతో భూమికి బరువు తగ్గి తృప్తి అయిందన్నమాట. చక్కటి నుడికారాలు, శబ్దప్రయోగాలు ఇక్కడ గమనించవచ్చు (మః ప్ర: 94). పాతాళధ్వజుడు చచ్చిన వెంటనే వాని బంధువులు, రాక్షస సైనికులు సందడి చేసుకుంటూ స్కందునిపై విరగబడ్డారు. స్కందుడు వారి కత్తులను, డాలులను చిందరవందర చేసి వారి నందరినీ పైలోకానికి అతిథులుగా పంపించాడు . (మ : ప : 95).

ముక్తాప్రవాళాతిముగ్ధ ప్రసగుద్దామ
ఝంపాతికంపముల్ జొంపు లొలుక
మాణిక్యరశ్మిచ్ఛటానీక బర్హి ధ్వ
జావేల్లనమ్ము లుజ్జ్వలము కాగ
తూర్ణభృన్మహేషాసమార్వీ సమాస్ఫాల
న ధ్వనిన్ మిన్ను ఘూర్ణమ్ము గాగ
స్యందనాంగభ్రమీచటులఘట్టనరావ
మంభోధరారవమ్మై చెలంగ

నిర్జర తన్నేతృ చతురతా నిభృత తురగ
వల్గనోద్యత్సురేశ్వర వాహినీ ప్ర
భగ్ని శతాంగమ్ము రాకాసి మొనల గుంపు
సుందరోగ్రమ్ముగా చుట్లు చుట్టి తిరిగె. (ష : ప్ర : 96)

ఇది కుమారస్వామి రథవర్ణన. రాక్షససేనను చంపిన తర్వాత ఆతని కోపభావం ఈ అందమైన రథచలనంమీద ఆరోపించబడింది.

ముత్యము, ప్రవాళము (పగడము)లతో పొదిగించబడిన అతి ముగ్ధమైన పంతలగుంపులు ఊగిసలాడుతున్నాయి. మాణిక్య కిరణ సమూహంతో కూడి రెపరెపలాడే నెమలిధ్వజము మరింత ఉజ్జ్వలమై ఒప్పారింది. మేరుపర్వతమనే మహాధనుస్సు నారినుంచి వెలువడ్డ ధ్వని ఆకాశమంతటా ప్రతిధ్వనించింది. అతివేగంగా తిరిగే స్యందనపు చక్రాల కమ్ముల ఘర్షణకు మేఘాలనుంచి ఉరుములు ఉద్భవించాయి. రథసారథి చతురతవల్ల సురసేనాపతి రథము గుఱ్ఱాల దూకుడుచేత రాక్షససేనల గుంపు చుట్టూరా సుందరంగానూ, ఉగ్రంగానూ చుట్లు చుట్టి తిరిగింది.

'ఇక్కడ సుందరోగ్రమ్ముగా చుట్లు చుట్టి తిరిగె'- అనటంవల్ల, ఒకేసారి సుందరంగానూ, ఉగ్రంగానూ ఎట్లా ఉంటుంది అన్న సందేహం రావచ్చు. ఈ దృశ్యం దేవతలకు సుందరంగా కనిపించింది. రాక్షసులకు ఉగ్రంగా కనిపించింది. భగవంతుని రథం భక్తిభావంతో చూస్తే అందంగా ఉంటుంది. సమాసంలో రజోగుణం, సంయుక్తాక్షరాలతో రచనలో చిక్కదనం, కోపభావం, పద్యంలో తూగు- తెనాలిరామకృష్ణుని అనుకరణ చేసిన పద్యం. 'త-గణాలు' ఎక్కువ వేస్తే రచనలో ఒక తూగు, ఒక లయ వస్తుంది. ఈ భ్రమణమంతా స్కందుని కోపమే రథమై, రాక్షస సేనావాహినిచుట్టూ అగ్ని వలయంగా పరిభ్రమిస్తున్నది. అందుకే పద్యమంతా దీర్ఘ

దీర్ఘ సమాసాడంబరమై సమాసాలుగా వలయాలుగా లయాన్విత ఛందంగా తిరుగుతున్నది.

నిర్జరసార్వభౌముడైన ఇంద్రుడు, కత్తితో భూమిని చెక్కినట్లుగా, దైత్యనాథుడైన తారకుని ఒళ్ళు తూట్లు చేశాడు. వరపుష్కల శక్తితో వజ్రశక్తిని ఎదుర్కొని తారకుడు మహాస్త్రాలతో ఇంద్రుని రక్షకకవచం పగులగొట్టి, ఒళ్ళంతా గాయాలు చేశాడు (ష: ప్ర: 97). అంతటితో ఇంద్రుని సారథి రథాన్ని ప్రక్కకు తోలుకొని వెళ్ళాడు. అసురపతి తారకుని వింటినారినుంచి వెలువడ్డ బాణాలను ఒక్కడూ ఎదుర్కొనజాలక దేవసైనికులు నమసిపోతున్నారు (ష : ప్ర : 98). ఏ దిక్కున శరజన్ముడైన కార్తికేయుని వింటినారి మ్రోగుతుందో ఆ ప్రక్కన రాక్షససేన తగ్గుతుంది. ఏ దిక్కున తారకుడు రేగునో ఆ ప్రక్కన దేవతల సేన తగ్గుతుంది (ష : ప్ర : 99). బాణుడు, యక్షపతి (కుబేరుడు) వారివారి సేనలను పురికొలుపుతూ తలపడ్డారు. అసురుడైన బాణుడు తీవ్రతరమైనటువంటి బాణాలతో కుబేరుని జండాను త్రుంచి, గుఱ్ఱాలను కూల్చివేశాడు (ష : ప్ర : 100). యక్షపతి రేగి ప్రచండమైన తీక్ష్ణాయుధాలచేత వాని పతాకాన్ని, గుఱ్ఱాలను వేగంగా కూల్చివేసి ఒక వెడల్పాటి బాణంచేత వాని రొమ్ముపై రంధ్రం చేశాడు. ఆ గాయంనుంచి వెలువడిన నెత్తురు వాగులాగా పారింది (ష : ప్ర : 101). బాణుడు కోపో ద్రిక్తుడై సుమారు 20 బాణాలు వరుసగా గుప్పించి యక్షపతి పతాకం, రథచక్రాలు, రక్షకకవచం ధ్వంసంచేసి రొమ్ముపై తూట్లు పొడిచాడు (ష : ప్ర : 102). యక్షుని చక్రరక్షకులు అర్ధచంద్రాకారంగల బాణాలతో బాణుని వింటినారిని త్రెంపినారు. ఇటువైపు యక్షపతి కూడా అన్యరథమెక్కి వచ్చాడు. పోరు జోరుగా సాగుతోంది (ష : ప్ర : 103). "పూర్వ మెన్నిసార్లు యుద్ధంలో వీనిని

పరాజయంపాలు చేశాను ! కాసింత అయినా సిగ్గులేక కవ్విస్తూ వస్తున్నా" డనుకుంటూ బాణుడు గదాయుధాన్ని ప్రయోగించాడు (ష : ప్ర : 104). అది మేఘంలోని మెరుపులు మెరిసినట్లు అగ్ని కణాలు కక్కుతుంటూ భయంకరమైన ధ్వనితో వస్తోంది. ఆ విధంగా వచ్చేదానిని స్వర్గవాహినీధవుడు (కుమారస్వామి) నడుమనే ధ్వంసం చేశాడు (ష : ప్ర : 105). శరవణభవుడు నరుక్కుంటూ వస్తుంటే ఏనుగు కుంభాలు తెగిపడి దొర్లుతున్నాయి. శత్రుపతాకాల కర్రలు (కామలు) గుంపులు గుంపులుగా పెళ్ళున విరుగుతున్నాయి. రథాలు, గుర్రాలు కిందపడి చాళ్ళై కనిపిస్తున్నాయి (ష : ప్ర : 106). మహిషాసురునివైపు పోతున్న తమ్ముని చూసి "బాణుడిచేత యక్షపతి అయిన కుబేరుడు చిక్కుపడ్డాడు. వీనిని నేను చూస్తాను, నీవు అక్కడికి వెళ్ళు"మని స్కందుడు చెప్పగా, "నేనే మహిషాసురుని తెగజూస్తా"నని తమ్ముడు విశాఖుడు వెనుదిరిగి చూడకుండానే అన్నకు సమాధాన మిచ్చాడు. (ష : ప్ర : 107).

స్కందుడు తమ్ముని సమాధానానికి నవ్వుతూ తన రథాన్ని రివ్వున ఆకాశానికి ఎగిరించి బాణుని దగ్గర వ్రాలి బాణుని ఎదుర్కొన్నాడు. దూరంగా వస్తున్న బాణుని తమ్ములు ఐదుగురినీ ఒక్కపెట్టుగా పసిపిల్లలు గవ్వలను మీటినట్లు వారి శిరస్సులను తెంచి కింద దొర్లేటట్లు చేశాడు స్కందుడు (ష : ప్ర : 108). తన కళ్ళెదుటే తమ్ములు ఘోర మృత్యువుపాలు కాగా బాణుడి కళ్ళవెంట నీరుకారింది. నిప్పులు గ్రక్కుతున్నంతగా కళ్ళెఱ్ఱబడ్డాయి. మంచి పదునైన అంబులను వింటినారినుంచి సంధిస్తున్నప్పుడు నారిధ్వని మిక్కుటంగా మ్రోగుతోంది. అలా ప్రయోగిస్తూ బాణుడు శరవణభవుని బాణపరంపరతో ముంచెత్తాడు (ష : ప్ర 109). అలా ముంచబడ్డ షణ్ముఖుడు ధనుస్సును కనుబొమల లాగా వంచుతూ వర్షాకాలపు మేఘాలనుంచి వడిగా మహావృష్టి

కురిసినట్లు నిశితమైన బాణవర్షం రాక్షసుని గర్వమణిగేటట్లు కురిపించాడు (ష : ప్ర : 110). మహోగ్రమైన ధ్వని చేస్తూ, తాటి చెట్టంత కల్లోలితమైన పెద్ద అలలు పొంగుతున్నట్టి సముద్రపు ఒడ్డున కూర్చున్నట్టుంది బాణునిస్థితి - కుమారస్వామి ముందు. అంతలో అసురేశ్వరుడైన తారకుడు వచ్చి బాణుని రక్షించాడు.

(ష : ప్ర : 111)

దక్షిణ దిక్పాలకుడైన యముడు దానవ సేనాధిపతి అయిన మహిషాసురుని రథమును అంబులతో కప్పివేశాడు. అయినప్పటికీ ఆ రాక్షసుడు జడివాన పడుతున్నప్పుడు కన్నులు మూసుకొని అట్టే నిలుచుకొని ఉండే దున్నవలె నిలబడ్డాడు. అందుకు యముడు మరింత అలిగి, అగ్నిని కక్కేటువంటిది, జగత్తునే పరిహరించేటువంటిది అయిన గదాయుధాన్ని ఊచి విసిరాడు. 'ఊచి' అనటంవల్ల చాచి కొట్టాడన్న మాట (ష : ప్ర : 112). మిక్కిలి వేగంగానూ, అత్యుగ్రమైన దావాగ్నిలాగా మండుతూ వస్తున్న దానిపై మహిషుడు రేగిపోయి ఐంద్రాస్త్రం వేశాడు. అది రేణువులు రేణువులుగా చెదరిపోయి కాలి విచ్చిపోయింది (ష : ప్ర : 113). విశాఖుడు కలువ పూలవంటి ప్రకాశించే కన్నులు గలవాడై అట్టే క్షణంసేపు నిలబడ్డాడు. రాక్షసుడు వికటాట్టహాసం చేస్తూ యముని రొమ్ముపై గదతో కొట్టి, మూర్ఛపుచ్చి తన రథంపై పెట్టుకొని పోతున్నాడు. ఇది విశాఖుడు చూశాడు (ష : ప్ర : 114). వెంటనే విశాఖుడు విచిత్రమైన అస్త్రాన్ని ప్రయోగించాడు. అంతటితో ప్రళయకాలపు గాలి సుళ్ళు సుళ్ళులాగా లేచి ఎండుటాకు పెనుగాలిలో కొట్టుకొని వచ్చినట్లుగా మహిషుని రథం, వెనుకవైపుకు పారుతూ వచ్చింది (ష : ప్ర : 115). "ఇదేమి తీరురా పరాస్కందీ (దొంగా)! ధృష్ట శుష్కపిశితాశి (ఎండిన మాంసం ముక్కలు తినేవాడా)! మూర్ఛపోయిన వానిని తీసుకొనిపోవడం వీరలక్షణ మవుతుందటరా!

విడుపుము. స్వర్గలోక సేనాపతి ఆజ్ఞప్రకారం నడచుకో" అని మహిషునితో విశాఖుడన్నాడు (ష : ప్ర : 116). మహిషుని రథం వెనుక వైపుకు పారుతూ వచ్చినప్పుడు మహిషునికి కళ్ళు బైర్లు కమ్మినాయి. "అసలు రథం ముందుకు పోయిందా? ముందుకు పోయిన రథం వెనక్కి- ఎట్లా వచ్చింది? మరి ఇటువంటి అస్త్రకళానైపుణ్యం కూడా ఉండటం కద్దా!" (ష : ప్ర : 117) అని మహిషుడనుకున్నాడు. అంతలోన విశాఖుని పలుకులు చెవిలో బాణం గుచ్చినట్లయి క్రోధాగ్ని చేత (మహిషునికి) కన్నుల సెగలు రేగినాయి (ష : ప్ర : 118). "నీవు నన్ను శాసిస్తావటరా గోచికట్టా! (బ్రహ్మచారి! - ఎగతాళిగా అనేమాట.) నీ విల్లు, నీవు- మూరెడున్నావో లేదో! నిన్ను నిలువునా నరుకుతాను పోగరుబోతా! నిలువు" మంటూ మహిషుడు జటిలమైన గాంధర్వ బాణం వేశాడు (ష : ప్ర : 119). ప్రయోగించినవాని రూపాలు అనేకం పుట్టడం గంధర్వాస్త్ర లక్షణం. వేలు, లక్షలకొద్దీ తనవంటి మహిషాసురులు పుట్టుకువచ్చి దేవసైనికు లందరినీ కణుపు కొట్టినట్లు కొట్టసాగినారు. దీనితో దేవసైన్యం చాలా చచ్చింది. కొంత చెదరిపోయింది, మరికొంత నలిగి నొచ్చుకొంది (ష: ప్ర: 120). ఇది చూసిన విశాఖుడు ఉగ్రుడై అమోఘమైన బ్రహ్మాస్త్రం వేయగా, వింటి నారిధ్వని మహోగ్రమై దశదిశలకు వ్యాపించింది. ప్రచండమైన గంధర్వాయుధాన్ని మాయం (నాశనం) చేసిందే కాకుండా, రాక్షసునికి గాయం చేసింది. మహిషుడు కూడా బ్రహ్మాస్త్రం సంధించాడు (ష : ప్ర : 121). ఆకాశమ్మున విద్యుత్తై, కార్చిచ్చై, బడబాగ్నియై, మిణుగురులై, చీకాకై, చివరికి చల్లారిపోయింది.

(ష : ప్ర : 122)

## విశాఖుడు మహిషాసురుని శిరస్సు ఖండించటం

స్కందానుజన్ము డుగ్రప్రభంజనుడు గా
నచలమై రాక్షసుం డట్టె నిలిచె
రక్షశ్చమూపతి రాళ్ళవానలు గాగ
ఘోరాబ్ధియై విశాఖుండు నిలిచె
ఇది కాదని విశాఖు డేసె నాగ్నేయ సౌ
పర్వ వాయవ్యైంద్ర వారుణములు
నలి శేగి దైత్యదంత ప్రభుం డుగ్రుడై
అన్నిటిం జదిపి బిట్టార్చి చెలగె

భగ్నఘోలుడై రౌద్రాస్త్రమున్ శ్రవోంత
కర్షి గుణలతాముక్త ముగ్రమ్ము విడిచె
కనులు మిర్మిట్లు గొల్పి రాక్షసుడు దూకె
రథము దగ్ధమై చనె క్షత్రరథ్యయతము. (ష : ప్ర : 123)

విశాఖుడు ఉగ్రప్రభంజను డయ్యాడు (అంటే విశాఖుడు ప్రచండంగా వీచే గాలి బాణాన్ని వేశాడన్నమాట). దానికి రాక్షసుడు చలించకుండా కొండలాగా అట్టే నిలిచాడు. రాక్షస సేనాపతి రాళ్ళవానలు కాగా (మహిషుడు వడగళ్ళవాన కురిపించే బాణం వేశాడు). దానికి విశాఖుడు గంభీరమైన సముద్రంలాగా నిలిచాడు. ఇట్లా కాదు చేయవలసిందని, విశాఖుడు ఆగ్నేయ, సుపర్వ, వాయవ్య, ఐంద్ర, వారుణాస్త్రాలు ప్రయోగించాడు. మహిషుడు వాటి నన్నింటిని ధ్వంసంచేసి చెలరేగాడు. విశాఖుడు కనుబొమలు వంచి ఉగ్రమైన రౌద్రాస్త్రాన్ని సంధించి చెవులదాకా వింటినారిని లాగి విడిచాడు. అది కనులు మిర్మిట్లు గొలిపేటంత ప్రకాశవంతంగా వస్తూ సారథి, గుఱ్ఱాలతో సహా రథాన్ని దగ్ధం చేసింది. రాక్షసుడు మాత్రం చటుక్కున క్రిందికి దుమికినాడు. ఆ రౌద్రాస్త్రం కనుల్లు

మిర్మిట్లు గొలిపేటంత ప్రకాశంగా ఉండంటే, ఆ కాంతి కంటితో చూడ్డానికి వీలు కానంత భరించరానిదిగా ఉంది అని భావం.

కత్తివాదర లన్న భిత్తికాతలముల
కోకనదచ్ఛవుల్ గుస్తరించి
హయగజ ప్రచయ వాహన పృష్ఠపీఠులు
కమనీయ రక్తరాంకవము లునిచి
ఛత్ర చామరముఖ క్షాత్రచిహ్నములందు
స్నిగ్ధపాటలపు వన్నియలు దిద్ది
భటకోటి చటుల తీవ్రవస్ఫార నేత్రాంత
రుచులందు సాంద్రతాస్ఫూర్తి లద్ది

వివిధ కిరణాళి కుంచెగా నవదరించి
వర్ణలేపనాలంక్రియాస్వాదు శిల్పి
అంబుజాప్తు ఁ భయసైన్యంబులందు
ఎరుపుకాంతి విచిత్రమగా మెరుగు లద్ది. (వ : ప్ర : 124)

ఇది సాయంకాలపు సూర్యవర్ణన. ఎఱ్ఱటి సూర్యకాంతి ఆ యా వస్తువులపై పడ్డప్పుడు ఎలా కనిపించిందో వర్ణిస్తున్న పద్యం. కత్తి అంచులనే గోడ ప్పై ఎఱ్ఱకలువపూలు కాంతులు గుమ్మరించినట్లుంది. గుఱ్ఱాలు, గజాల వీపులపై ఎఱ్ఱటి కంబళులు కప్పినట్టుగా ఉంది. ఛత్ర చామరాదులపై నునుపైన పాటల కాంతులు (లైట్ రోజ్ కలర్స్) అద్దినట్లుగా ఉంది. వీరులయొక్క ఎఱ్ఱబడ్డ కంటిచివర్ల కాంతులకు దట్టమైన ఎరుపుకాంతు లద్దినట్లుగా, సూర్యుడన్న చిత్రకారుడు తన కిరణాలనే కుంచెతో ఉభయ సైన్యాల్లో ఎఱ్ఱనికాంతితో పైరీతిగా రకరకాల బొమ్మలు గీశాడు.

ఈ వర్ణన ఒక అపూర్వమైన భావాన్ని ఆవిష్కరిస్తున్నది. సూర్యవర్ణన ఇలా చేసిన ఘట్టం తిక్కనగారి భారతంలో కాని,

విశ్వనాథవారి రామాయణంలోకాని తటస్థపడదు. ఈ కవికి శిల్ప చిత్రలేఖనాది కళలతో చక్కని పరిచయమున్నట్లుగా ఈయన ఇతర రచనలద్వారానూ, ప్రసంగాలద్వారానూ తెలుస్తున్నది.

యుద్ధభూమిలో ఇలాంటి వర్ణనలు చేయడం తిక్కనగారు ప్రవేశ పెట్టిన రమణీయ శిల్పాంశం. ఈ వర్ణనలు కాలాన్ని సూచించడమే గాక, యుద్ధ తీవ్రభావ సంఘర్షణను పాఠకుల మనస్సులు తట్టుకోలేని సమయాలలో వారికొక విశ్రాంతి (రిలీఫ్) కల్పించడంకోసం కూడా ఈ వర్ణనలయొక్క అవశ్యకత ఉన్నది.

యుద్ధవీరులకు కూడా అలుపు సొలుపు లుంటాయి. కనుక వాళ్ళు కొంచెం విశ్రాంతి తీసుకొని శక్తిని పుంజుకోవడానికి కూడా ఇది అవసరమే. ఇలా వర్ణనలను అనేక దృక్కోణాల్లో చేయటం మహాకవి సంప్రదాయంగా కనిపిస్తుంది. సూర్యకాంతిలో క్షణక్షణం వచ్చే మార్పును సూచించడం impressionism art. ఈ కళా శాఖ చిత్రలేఖనంలో వచ్చింది. అలాంటి పద్యమే ఇది.

రథం దగ్ధ మయిన తర్వాత వేరే రథ మెక్కి మహాపాసురుడు కోపోద్రిక్తుడై ఒక తీవ్రమైన బాణం వేశాడు. అది దూసుకుంటూ వచ్చి విశాఖుని వక్షస్థలాన్ని గండిపెట్టింది. దీనికి విశాఖుడు తన నేత్రాలను అగ్నిగోళాలలాగా త్రిప్పినాడు (వ : ప్ర : 125).

శరజుని తమ్ముఁ డుగ్రగతి నిశాచరు చాపము ద్రుంచి సూతు గూ
ల్చి రథము దూల్చి వాని మెయి చెట్టున పట్టలు తీసినట్లుగాన్
బెరడులు తీసి జ్యానినద మేదుర తీవ్రత వాని చుట్టునున్
పరిధులు చుట్టె స్యందనమునన్ గడు జ్యోతిరుదారవృత్తమై.

(వ : ప్ర : 126)

ఉగ్రత చెందిన విశాఖుడు నిశాచరుని (రాక్షసుని) చాపం త్రుంచి, సూతుని రథాన్ని ధ్వంసం చేసి, చెట్టు కొమ్మకు తూటలు తీసినట్లుగా వాని ఒళ్ళంతా తూణం (గాయాలు) చేసి, సాంద్రతరమైనట్టి, తీవ్రతరమైనట్టి వింటి నారిధ్వనులు చేస్తూ, వాని చుట్టూ తన స్యందనాన్ని వృత్తాకారంగా పరిధులు చుట్టుతున్నాడు. రాక్షసుని చుట్టూ విశాఖుని స్యందనం వృత్తాకారంగా తిరుగుతుంటే జ్యోతిర్వలయంలాగా ఉంది. (దీన్ని అలాతన్యాయ మంటారు.)

"ఇంతకు ముందు వేలయుద్ధాలు చేశాను, గూశాను. నా ధాటికి తట్టుకోలేక దిక్పతులందరూ పూర్వం మరణదుఃఖమనుభవించారు. ధూర్తుడు - వీడింతలేడు! అట్లాంటి నన్ను విరథుని చేసినాడు (ష : ప్ర : 127). మృత్యుదేవత కోరలవంటి వేయి అంచులుగల ఈ దండకం వజ్రాయుధాన్ని విరిచి తన్నినట్టిదిది" అని అనుకుంటూ మహిషుడు వేయి అంచులున్న ఆయసదండాన్ని విసిరాడు. అది విశాఖుని రథంపైకి ఎగసివస్తోంది (ష : ప్ర : 128). సారథి చూసి "కుమారా ! ఈ ఆయసదండమే ఇంద్రుని ఎన్నోసార్లు పడగొట్టింది. కాబట్టి నీ ధనుర్విద్యానైపుణ్యంతో ప్రబలమైన అస్త్రాన్ని విడువు" మన్నాడు (ష : ప్ర : 129). వీరుడు తుది ఘడియల్లో ప్రయోగించేదది. ప్రాణాపాయస్థితిలో ప్రయోగించేదన్నమాట. "సారథీ, మంచి మాట చెప్పావు - ఇక చాలు, ఇప్పుడే దీన్ని చూర్ణం (పొడి) చేస్తా"నని విశాఖుడు కామేశ్వరాస్త్రంతో ఆ ఆయసదండాన్ని దుమ్ము చేశాడు. బాణం పోయిన తర్వాత వింటినారి ధ్వని విన వచ్చింది. అంటే బాణం కాంతివేగంతో పోయిందని అర్థమవుతుంది (ష : ప్ర: 130). దీనితో మహిషుడు అదిరిపోయి "ఓ ధనుష్కళాగమ చతురా ! (ధనుర్విద్యయందు నేర్పరీ !) మహాపరాక్రమ వీరుడా ! నావద్ద ధనుస్సులేదు, అస్త్రంలేదు, స్యందనంలేదు. అసహయుద్ధం చేయ నీకు న్యాయమా!" అన్నాడు (ష : ప్ర : 131).

ఆ మాటకు విశాఖుడు నవ్వి "దుష్టుడా, తపోమూర్తులైనట్టి, లౌకిక మార్గానికి దూరంగా ఉండే ప్రశాంతులైనట్టి మునుల (కాళ్ళు, చేతుల)ను విరుచుకొని తినటం ధర్మము, నీకిత్వమటరా!" అన్నాడు (వ : ప్ర : 13). తనదాకా వచ్చినప్పుడు ధర్మాలు గుర్తుకొస్తాయి. ఇక్కడ పలుకబడి మన కిక్కడ గుర్తుకు వస్తుంది. కర్ణుని చంపేటప్పుడు శ్రీకృష్ణుడన్న మాటలు - 'నేను భూమిమీద ఉన్నాను. నీవు (అర్జునుడు)రథం మీద ఉన్నావు - విరథునిపై శూరులు బాణం వేయ'రన్న కర్ణుని మాటలకు (కర్ణపర్వం : 3-350) శ్రీకృష్ణుడు పలికిన పలుకులు ఇక్కడ ఒకసారి మననం చేసుకుందాం. 'కపటద్యూతములో ఓడిపోయిన పాండవుల పట్ల సభలో మీరు ప్రవర్తించిన తీరు, ద్రౌపది చీర లాగించేటప్పుడు, పెక్కురు యోధులు కలిసి అన్యాయంగా ఒక్క బాలుడైన అభిమన్యుని చంపేటప్పుడు ఏమైంది నీధర్మం?' అని శ్రీకృష్ణుడు కర్ణుని ప్రశ్నించాడు. [చూ. కర్ణపర్వం : 353-356] అలాగే ఇక్కడ కూడా మహిషుడు (విరథుడై) 'అసమయుద్ధం చేయ నీకు న్యాయమా' అని విశాఖుని ప్రశ్నించినప్పుడు 'మునుల కాళ్ళు చేతులు విరుచుకుతిన్నప్పుడు ఏమయిందీ ధర్మం?' అని విశాఖుడు మహిషుని తిరిగి ప్రశ్నించాడు.

మీ మొనగల వారిం బిలు
మీ మృత్యువు తొలగద్రోయు నెవ్వడో చూతున్
ఛీ ముష్కరాధమా ! నీ
వా మాకెరిగింతు ధర్మపథమున్ దున్నా ! (వ : ప్ర : 133)

"మీ మొనగలవారిని ఎవరినైనా పిలుచుకో- నీ మృత్యువును తప్పించువాడెవ్వడో నేను చూస్తాను ! ఛీ ! రాక్షసాధమా ! నీవా మాకు ధర్మమార్గాన్ని తెలిపేది, దున్నా !" అని విశాఖుడు ఛీ కొట్టాడు.

ఇది కర్ణపర్వంలోని తిక్కన శైలిని జ్ఞప్తికి తెస్తుంది - దుశ్శాసనుని చంపేటప్పుడు భీముడనే మాటలు కింది పద్యంలో గమనించండి :

ఏ నురము వ్రచ్చి నెత్తురు,
తేనియ యిదె త్రావెదం గదిసి నను గడిమిన్
మానుప దిక్కు గలిగినన్
రానిమ్మెలుగింపు మీ మొనంగలవారిన్. (కర్ణపర్వం : 3-212)

ఇక్కడ (ష : ప్ర : 133) 'మ'కార ప్రాసపై ఊనిక (స్ట్రెస్) ఉంది. 'నీ మొనగలవారిం బిల్వు' - ఉచ్చారణలో మకారంపై ఊనిక పెట్టి చదువుకోవాలి. అదే పద్యవిద్య అంటే.

ఆ విధంగా మహిషుణ్ణి విశాఖు డంటున్నంతలోనే ఇతరులతో యుద్ధం చేస్తున్న రాక్షససైనికులు ఆ పోరును అంతటితో ఆపేసి పెద్దగా ఆక్రందన చేస్తూ అందరూ ఒక్కుమ్మడిగా విశాఖునిపై విరగబడ్డారు (ష : ప్ర : 134). ఆ రాక్షససైనికులు గంధర్వము, వాయు బాణము, అగ్ని బాణము, అసుర బాణము మొదలైనవన్నీ వేశారు. వింటినారిధ్వని మిన్ను ముట్టేటట్లుగా విశాఖుడు వాటి నన్నింటిని కూల్చివేసి అందరినీ ప్రక్కకు దూరంగా నెట్టివేసి (ష : ప్ర : 135), "ఓరీ దుష్ట నక్తంచరులారా (రాక్షసులారా)! అతిసనాతనమైన వేదాల వైభవాన్ని ధ్వంసం చేయడంలో పరాక్రమ వీరులారా ! (అంటే చెడ్డపని చేసేదాంట్లో మాత్రం మొనగాళ్ళని భావం) ఓహో! మహిషుని శిరస్సు ఖండిస్తున్నాను, చూడండిరా !" అన్నాడు.

(ష : ప్ర : 136)

**శిఖరిణి :**

త్వరాకృష్టోర్వీభృద్ఘనధనురుదాత్తధ్వని నభోం
తరక్షోణీదిక్సీమ చెలగెను నక్తంచరభయం

కరంబై దీవ్యచ్ఛక్తి కవిసి మహోగ్రంబుగ నిశా -
చరస్ఫారాంశు శ్రీమకుటమగు శీర్షంబు నరకెన్.

(మ : ప్ర : 137)

వేగంగా ఆకర్షింపబడ్డ మేరుధనుస్సు నారియొక్క మహోన్నతమైన ధ్వని భూమ్యాకాశాది అన్నిదిక్కులకూ వ్యాపించింది. ఇది రాక్షసులకు మరింత భయంకరంబై వినిపించింది. విశాఖుడు మహోగ్రంబుగా దివ్యమైన శక్తిబాణంచేత పొదిగించిన బహువిధరత్న కిరణాలతో ప్రకాశిస్తున్న విశాలమైన కిరీటంగల మహిషుని శిరస్సును ఖండించివేశాడు.

ఈ 'శిఖరిణి' కుమారస్వామికి కూడా వాడిన వృత్తం (చూ. మ : ప్ర : 39 & మ : ద్వి : 132). వారిద్దరూ ఒకటే అని చెప్పడానికి కవి ఒకే వృత్తాన్ని ఇరువురికీ వాడినాడు. శక్తి ఒక అస్త్రం. స్వామి చేతిలో మాత్రం అది ఉంటుంది. స్వామే అది తొలుత సృష్టించాడు.

కటకాముఖాకృష్టపటుకలంబుకగరుత్
స్థగితదృశ్యావకజ్వాల లెగయ
హరిణాంకమండలోపరిమంజుకౌశేయ
సితవలాహకరథశ్రీలు బెరయ
ధ్వజరత్నచిత్రప్రభాపుంజరోదసీ
కృతశతశబలరోహితము లురల
నఖముఖోత్క్షిప్తహాటకనయనాంతదఘ్నాశు
గవిఘూర్ణితాసురారవము లులియ

చండవేగోద్భటమ్మై నిశాటవాహి
నీ మహాంభోధి మందరశైలమహీధ
రమ్ముగా సంచరించె నుగ్రమ్ము సుంద
రమ్మునై విశాఖుని శతాంగమ్ము బిట్టు. (మః ప్ర : 138)

ఇది రథం పరిగెత్తే వర్ణన. కుమారస్వామి రథవర్ణన అక్కడ (చూ. ప : ప్ర : 96) సీసంలో వర్ణించబడింది. ఇక్కడ విశాఖుని రథవర్ణన. మహిషుని చంపిన తర్వాత కూడా కోపోద్రిక్తతలోని తీవ్రత చల్లారిపోలేదు. ఆ తీవ్ర చలనమే ఈ పద్యం.

కవియొక్క చిత్తవృత్తి కూడా నాయకుని చిత్తవృత్తితో సమైక్యం పొందుతుంది. ఆ రసావేశమే తిక్కన ఆశ్వాసాంత పద్యాల్లో వాడుకొన్నది - ఆ కోపాన్ని తీర్చుకోవటంకోసం. (చూ. పాటిబండ 'మాధవశర్మ - ఆంధ్ర మహాభారతము' - ఛందః శిల్పము).

బాణప్రయోగాన్ని అభినయించే విశేషం కటకాముఖం. అలాంటి ముద్రచేత (బాణంయొక్క రెక్కలయందు నాటుకొన్న దృష్టి) ఆకర్షింపబడిన ఎక్కుపెట్టబడిన బాణంయొక్క చివర్లయందున్న రెక్కలయందు, ఈకలయందు నాటుకొన్న చూపులలోని అగ్నిమంటలు. చంద్రమండలంపై సన్నని తెల్లని మేఘాలు కప్పినట్లుగా రథం వేగంతో తిరుగుతున్నది. వేగంతో తిరగటంలో మేఘం చాటున చంద్రబింబంలాగా రథంలో విశాఖుడు కనిపిస్తున్నాడు. రథకేతనంయొక్క రత్నకేతనాలతో ఆకాశంలో అకాలంగా ఇంద్రుని ధనుస్సులను సృష్టిస్తున్నది. గోళ్ళ చివర్లనుంచి ప్రసరించే కాంతి నయనాంత కోపాగ్నులబంటిగా నున్నది. బాణాలయొక్క ప్రయోగంచేత రాక్షససైన్యంలో ఆక్రందనలు వ్యాపింపగా విశాఖుని రథం ప్రచండమైన వేగంతో రాక్షససేనా సముద్రాన్ని మందరపర్వతంలాగా మథించి వచ్చింది.

దేవాలయం గర్భగుడి రథాకారంలో ఉంటుంది. సీసపద్య రథవర్ణన స్వామిని రథంలో కూర్చొబెట్టి ఊరేగించినట్లుంటుంది. అందుకే అలాంటి పద్యాలు అందమైనవి.

రాక్షససేనాధిపతి మహిషుని మరణంవల్ల రాక్షసులు శోకంలో మునిగిపోయినారు. సాయంకాలపు చీకటి బ్రహ్మాండమైన విశ్వమంతా రాక్షసుల శోకధూమముల్లై వ్యాపించింది (ష : ప్ర : 139). స్వచ్ఛము, ప్రసన్నమైన, మృదువైన శబ్దం, అచ్ఛమైన జ్ఞానము, శాంతరసాకృతి గల్గిన దేవసైనికులు సంతోషంతో వెన్నెల రాక ముందే వాళ్ళు విడిది చేసిన శిబిరాలకు వెళ్ళారు (ష : ప్ర : 130). దేవతలకు - వెన్నెల, రాక్షసులకు - చీకటి.

## వెన్నెల :

యుద్ధంనుంచి వెళ్ళిన సేనలకు విశ్రాంతిదాయకంగా వెన్నెల వచ్చింది. అలాగే యుద్ధరసంచేత ఉద్రిక్తమైన పాఠకులకు మనో విశ్రాంతిగా ఈ ఘట్టం ఆరంభమవుతున్నది. ఈ ఘట్టం యుద్ధం ప్రారంభం కాకముందు రాత్రి - వెన్నెల వర్ణనతో పోల్చి చూసుకో దగింది. ఈ పోలిక అనుకూల సంవిధానకం.

విరిసిన వెన్నెలన్ త్రుటితభీకరహేతులు దంతిదంతముల్
నరికిన గుఱ్ఱపుం దలలు నవ్వెడు యోధుల రక్తవక్త్రముల్
విరిగిన తేర్ల దోచె బృథివీస్థలి శీర్షము తునిగినట్టి సుం
దరతర శిల్పమై సకరుణాపిజుగుప్సభయప్రదమ్ముగా.

(ష : ప్ర : 141)

విరిసిన వెన్నెలలో విరిగిపోయిన ఆయుధాలు, విరిగిన ఏనుగు దంతాలు, నరకబడ్డ గుఱ్ఱాల తలలు, రక్తసిక్తమైన మహాయోధుల ముఖాలు, విరిగిన రథాలు మొదలైనవి తల విరిగిపోయిన సుందర శిల్పాలవలె కరుణాజుగుప్సావహంగా, భయప్రదంగా కనిపిస్తున్నాయి. యుద్ధభూమిలో పడి ఉన్న మొండెములను, రథశిథిలాలను చూసి శీర్షము తునిగినట్టి సుందరశిల్పంవలె కనిపిస్తుందన్న ఉపమానం

ఎవ్వరూ వాడనట్టి నూత్నమైన ఉపమానం. కవి కంటికి అవి హంపిలో శిథిల శిల్పాలవలే కనిపిస్తున్నాయన్నమాట.

హంపిలో ఒక వెన్నెల రాత్రి తుంగభద్రానది ఒడ్డున నిలబడి హంపి శిథిలాలను చూస్తే ఎలా అనిపిస్తుంది ? స్మృతిలో ఉన్న గత వైభవం, వర్తమాన దుస్థితి-రెండూ ఘర్షణపడి చూసేవారి మనస్సులను సుడిపెడుతుంది. ఆ సుడిలో ఒక వలయం కరుణరసం, ఒక వలయం భయానకం, మరోవలయం బీభత్సం. ఇలా రసభావ శబలత అన్న సుడిలో చిక్కుకొని సహృదయుడైన ప్రేక్షకుడు నలిగి పోతాడు. ఇరవైరెండడుగులు ఎత్తుగల సుందరోజ్జ్వల శిల్పమైన యోగ నరసింహమూర్తి విగ్రహం హంపిలో చేతులు తెగిపోయి మనకు కనిపించిన దృశ్యాన్ని స్మరించి ఈ పద్యం చూసుకోవాలి.

## దేవసైన్య శిబిరంలో కుమార - విశాఖుల సంభాషణ

(రెండవరోజు యుద్ధానికి ముందు)

షణ్ముఖ, విశాఖులు రక్షణకోసం సైన్య శిబిరాలన్నీ తిరిగి వచ్చినతర్వాత, నిర్మలమైన ఆకాశం, తెల్లటి వెన్నెలలో నదిఒడ్డున తెల్లుతోటగా తోచే శిబిరంలో కూర్చున్నారు (ఈ పోలిక జన్మ వృత్తాంతం చెప్పటం). అన్నతో తమ్ముడు విశాఖుడు ఈ విధంగా అంటున్నాడు (ష : ప్ర : 142) - "తమ్ముడు చచ్చినాడు కనుక, ఆ రాక్షసుడు తారకుడు రేపు సంధికి వస్తాడని నీవు శాంతభావంతో ఆలోచిస్తుంటావు కాని, వాడు మాత్రం దారుణాస్త్రాలను ధ్యానించి రేపు యుద్ధానికి వస్తాడు." యుద్ధానికి వచ్చేముందు ఆయుధపూజ చేయడం ఆచారం. ఈ ప్రసంగంవల్ల తీవ్రమైన చర్చ జరిగినట్లు తెలుస్తుంది. అతుకులు లేకుండా కథ చెప్పడం నాటకీయ పక్కి (ష : ప్ర : 143). "నేనేమైనా చెప్తే నా మాటలను విని నీవు

నవ్వుకుంటావు. రాక్షసులపట్ల అంత మెతకగా సరళంగా ఎందు కుండాలి ? చేతినుంచి ధనుస్సు జారిపోయిందని తారకుని చంపకుండా వదిలేశావు" అని విశాఖుడు చేస్తున్న వాదం వందిమాగధుల పరివారం లేకుండా హఠాత్తుగా అమరలోక నాయకుడైన ఇంద్రుని రాకతో ఆగిపోయింది. ఇంద్రుని చూసి సోదరు లిద్దరూ లేచి నిలబడ్డారు. నవ్వడం భగవల్లక్షణం. గడచినయుద్ధాన్ని విశ్రాంతి సమయంలో చెప్పడం ఇక్కడి విశేషం. చేతిలో ధనుస్సు లేదని తారకుని చంపలేదు. రెండు చిన్న పద్యాలలోనే ఎంతో కథ చెప్పి నట్టుంది (ష : ప్ర : 144,145). అన్నదమ్ము లిద్దరిని ఇంద్రుడు తేరిపార చూసి కళ్ళనుంచి ఆనంద బాష్పాలు రాలగా భక్తితో వినమ్రము డౌతూ చూసి చూసి అట్టే ముందుకు వెళ్ళిపోయాడు. ఇక్కడ శబ్దం లేదు. అంటే ఇంద్రుని సంభాషణ లేదు. వట్టి మూకాభినయం (mere action).ఎంతో ఉన్నతంగా ఉంది. చాలా ఆర్ద్రంగా ఉంది ఈ సనివేశం (ష : ప్ర : 146). వెన్నెల, వెలుగు దివ్వెటి వెలుగులు తెల్లబడిపోగా మిలమిలమంటూ రత్నాలహారాలు మెరుస్తూ ఉండగా తిరిగి వెళుతూ ఉన్న ఇంద్రుని కనుమరుగైపోయేవరకు చూశారు. ద్వారందగ్గర నిల్చిన విశాఖుడు వెనుకకు తిరిగి వచ్చి అన్నతో అంటున్నాడు : (ష : ప్ర : 147)

**మ ధ్యా క్క ర :**

"ఇది చూచినావు గద ! కృప కిక నైన అడ్డు వేసెదవా ?
ముదుసలిరాకాసి ఎద్దు పోట్లడే యను మింత దాని
విద్రిచి వెన్కకు నెట్టి కొమ్ము విరిచి రొమ్మున గ్రుద్దలేవా !
ఇదె విన్ము ! నేను జంపెదనా ఈవు చంపెదా తేల్చి చెప్పు."

"ఇంద్రుడు వచ్చిపోయిన విధం చూశావు కదా ! నీ కృపను ఇకనైనా విడిచిపెడతావా ? ఆ రాకాసి ఎద్దు పోట్లడే అనుకో

అయితేనేం, దాన్ని విదిలించి వెనుకకు నెట్టి, కొమ్ములు విరిచి రొమ్మున గ్రుద్దలేవా ? ఇదిగో చెప్తున్నాను విను - ఆ తారకుడిని నీవు చంపుతావా, నేను చంపేదా ? ఏదో ఒకటి తేల్చి చెప్పు". మధ్యాక్కర వృత్తం చక్కటి తెలుగు నుడికారపు సంభాషణకు చక్కగా సరిపోతుంది. 'ఆ రాకాసి ఎద్దు పోట్లాడే అనుకో' అన్న దానిలో 'ఆ తారకుడు వరబలంచేత బలవంతుడే కావచ్చు - కాని, నీ శక్తిముందు ఆగలేడు కదా !' అన్న భావం ఉంది.

తమ్ముడు అన్న దానికి కుమారుడు నవ్వుతూ "తమ్ముడా, నీ ఉద్రేకము అమ్మను జ్ఞప్తికి తెస్తున్నది. నీ వన్నది నిజమే కాని, బ్రహ్మవరాన్ని గౌరవించవలసి వచ్చినది. ఇక రేపు నీవే చూస్తావు గదా !" అని విశాఖునికి సమాధానం చెప్పాడు (ష : ప్ర : 149). అన్నను చూస్తే తండ్రినీ, తమ్ముని చూస్తే అమ్మనూ చూసినట్లుంటుంది. సంభాషణలు భాసుడి నాటకంలోని సంభాషణలలాగా సాధారణంగా (Simpleగా) ఉంటాయి.

## రాక్షస శిబిరంలో తారకుడు శోకించటం

ఇటు రాక్షస శిబిరంలో తారకుడు బాణుడు తెలిపిన వార్తకు ప్రాణం కడగట్టిపోయి నేల వ్రాలబోయాడు. నేలవ్రాలబోతున్న రాక్షసాధిపతి అయిన తారకుని పట్టుకోడానికి బాణుడు మొదలైన రాక్షసనాయకులు వడివడిగా వచ్చారు (ష : ప్ర : 150). మహిషాసుర శవాన్ని తెప్పించి మొండెము, తల కలిపి, కనులు లొట్టలుపడేటంతగా కన్నీళ్ళు పెట్టుకొని బరువుగా వెనక్కి తిరిగి దుఃఖపడుతూ బొంగురు గొంతుతో తారకుడు చివరికి ఈ విధంగా అంటున్నాడు (ష : ప్ర : 151) : "ఆహా ! విధి ఎంత చెడ్డది ! ఇన్నాళ్ళూ నేను మోహాంధకారంలో ఉన్నాను - తన బాహుబలంతో ముల్లోకాలూ ఏలుతాడని, నన్ను అనుసరించే వాడితడేనని అనుకున్నాను

(మ : ప్ర : 152). "ఎవ్వని నీతిమార్గం నా మకుటస్థరత్నమై ప్రజ్వ లించిందో, ఎవ్వని బాహుపరాక్రమంవల్ల నా రత్నసింహాసనం నిర్మాణ మయిందో, ఎవ్వని ధనుస్సు ఈ అసురరాజ్యానికి పెట్టనికోట అయిందో, అట్టి నీవు ఈ గతి అయిపోగా అల్పమైన ఈ బ్రతుకేమిటి కింక తమ్ముడా !" (మ : ప్ర : 153). కోటగోడను ఎక్కుపెట్టిన చాపంగా ప్రాచీనులు పోల్చారు. మహిషాసురునితో పాటు కిరీటం, సింహాసనం, కోటగోడ అన్నీ పోయినట్లు బాధపడుతున్నాడు (మహిషాసురుని ధనుస్సే పెట్టనికోట- ఇది వక్రోక్తి).

కనుగోసలందు పెట్టని జీర రిపురక్త
నదికి గుర్తను మాట నవ్వుమాట
ధనురాగమప్రౌఢి త్రైదివాయుధధార
విరుగగొట్టిన మాట వెట్టిమాట
కనుబొమ్మముడులు సకలజీవు లను పుర్వు
లకు సుడు లనుమాట లాతిమాట
అసివారు బయళు లజాండకటాహస్థ
భూము లనెడి మాట పూతమాట

అను జగత్త్రయీనింద లేమని వినెదను
ఏ సమాధాన మిత్తునోయీ ! అనుజుడ !
ఛేదితాసుర భర్తృదక్షిణ కరాతి
దీర్ఘ దండాకృతిన్ నీవు ద్రెళ్ళియుంట. (మ : ప్ర : 154)

"నీ కనుకొసలలోని ఎట్టిచార శత్రురక్తనదికి గుర్తు అనే మాట నవ్వులమాట (కన్నుల్లో ఎట్టిచార కనిపిస్తేచాలు - శత్రు సైన్య మదంతటదే చచ్చేది); నీ ధనుష్కౌప్రౌఢిమతో స్వర్గలోక వజ్రాయుధపు అంచులను విరగ్గొట్టిన మాట వెట్టిమాట అయిపో

యింది; నీ కనుబొమ ముడులు పురుగులతో సమానమైన సకలజీవులకు సుడిగుండాలవంటివనే మాట వ్యర్థపు మాట అయిపోయింది (కను బొమ ముడులను కవి సుడులతో పోల్చాడు - 'పుర్వు' పదంవల్ల అవతలివాళ్ళు అల్పులుగా తారకాసురుడి భావన); బ్రహ్మాండ గోళాలన్నీ నీకు వాహ్యాళిభూములనేమాట వట్టిమాట అయిపోయింది - అనే ముల్లోకాల నిందలు నేనెట్లా వినాలి! ఏమని సమాధాన మివ్వాలి తమ్ముడా! పొడుగాటి దండంవంటి నా కుడిచేయి తెగినట్లు నీవు పడి ఉన్నావే!"

అలవు, చలంబు, నేర్పు, వివిధాస్త్రవిదుత్వము గల్గు దంట లీ
రలును మదీయ బాహువులరై అటు నిల్చియు చూచుచుండి పెం
గలి కొక పంటిక్రిందికిని కాని నిసుంగునకా! భవత్సఖున్
బలి యొనరించుకొంటి రిటు బాణుడ? ముండుడ! దండ! అంధకా!

(ప : ప్ర : 155)

"ఉపాయం (అలవు), పట్టుదల (చలంబు), నేర్పు, వివిధాస్త్ర కళానైపుణ్యం (వివిధాస్త్ర విదుత్వము) గల వీరులు, బాహుబల పరాక్రమ సంపన్నులై అక్కడ నిలిచి చూస్తూ ఉండి కూడా, ఒక పంటికిందికీ కూడా చాలని అల్పుడైన పసివానికా మీ సఖుని ఈ రీతిగా బలి పెట్టుకున్నారు! - బాణుడా! ముండుడా! దండా! అంధకా!" అన్నాడు తారకుడు.

పేరుపేరునా పిలవటం వారికి నామోషి కల్గించటంకోసం. తారకుడు గొప్ప రాజనీతిజ్ఞుడు. వారిని అనేమాటల్లో ఒడుపుతనం కనిపిస్తుంది. పొగడటం, తిట్టటం - రెండూ ఉన్నాయి. పొగడినట్లే ఉంది - తిట్టినట్లే ఉంది. మొదటి పాదంలో నాలుగు విశేషణాలు ఆరంభంలోనే వరుసగా ఉన్నాయి. చివరిపాదంలో నలుగురి పేర్లు చివర్లో వరుసగా ఉన్నాయి. ఇది గమనించదగ్గది. ఒక్కొక్కరికి

ఒక్కొక్క గుణం వర్తిస్తుంది. ఒక్కొక్కరికి నాలుగు విశేషణాలూ వర్తిస్తాయి. నా తమ్ముడు అనకుండా 'భవత్సఖున్' (మీ సఖుని) అనటంలో రాజనీతి వెల్లడి అవుతుంది. 'పంటిక్రిందికిని కాని నిసుంగునకా!' అన్న పోలిక పాత్రకు తగినట్లుగా ఉంది - రాక్షసుడు కాబట్టి.

"ఓరీ తమ్ముడా! మృత్యువు కోరలనే విరిచినానని నేను భుజం చరచినానుగాని, అది నా చేతినే కరచి విడిచిపెడుతుందని కలలో కూడా అనుకోలేదు (ప : ప్ర : 156). యముని వెన్నుతన్ని, అగ్నిదేవుని వేడిమి పోగొట్టి, స్వర్గపు పునాదులను కదిలించివేసినట్టి తమ్ముని రక్షించుకోలేకపోయాము" (ప : ప్ర : 157) - అంటూ వెక్కివెక్కి గొంతు ఆరిపోగా చెంప్రటుకలన్నీ ఇరువైపులా వ్రేలాడు తుండగా తారకుని కన్ను లెఱ్ఱబారి కమిలిపోయినాయి. బాణుడు తారకుని ఓదార్చి ఓదార్పు మాటలు చెప్పాడు (ప : ప్ర : 158). మనిషి నిస్సహాయస్థితి మరణం దగ్గర తెలుస్తుంది. మృత్యుదృష్టి ఉన్న మానవుని జీవనం (మతం) వేరు; మృత్యుదృష్టిలేని మానవుని జీవితం వేరు. ఇది నాస్తికదృష్టి. నిస్సహాయస్థితి అనుభూతి చెందినవాడు ఏనాటికైనా ఉత్తముడు. ప్రతిమానవుడూ ఇంతే అని అనుకునేవాడిది ఉత్తమ లక్షణం.

బాణుడు తారకుని ఓదారుస్తూ ఈ విధంగా అంటున్నాడు :
"మన్నీడా (రాజా)! నీ దగ్గర మారుమాట్లాడటానికి నేనెంతటి-వాడిని! మన సేనాధిపతి ముందెన్నిసార్లు ఆ వజ్రాయుధపు పన్నులు విరగ్గొట్టలేదు! అట్టి వాడిప్పుడు డిల్లుడయిపోయాడు. (ప : ప్ర : 159).

"దైవంబన్నది ఈ జయాపజయముల్ తార్కాణగా నున్న దీ
భావంబున్ పెడగ్రొక్కలేడు గద ఎవ్వండైన అస్మచ్ఛమూ
దేవుం డెన్నిజయమ్ములన్ దొడిగె త్వద్దివ్యాంఘ్రి పంకేరుహ
శ్రీవాల్లభ్య పదాంగదంబులుగ! నిన్నీ! నేటి కిట్లయ్యెడిన్."
(ప : ప్ర : 160)

బ్రాహ్మణుడు ఇంకా ఈ విధంగా అంటున్నాడు : "దైవమనేది ఈ జయాపజయాలు అనే ఉదాహరణలద్వారా - దైవముందని-నిరూపించబడుతోంది. విధికి విరుద్ధంగా ఎవ్వడూ నడుచుకోలేడు గదా ! మా సైన్యాధిపతి ఎన్ని విజయాలు సాధించి బొమ్మ పెండెములు నీ పాదాలకు తొడిగించలేదు ! (ఓడిన రాజు బొమ్మ గెలిచినరాజు కడియంపై చెక్కి కాలికి తొడిగే సంప్రదాయం ఉండేది). ఇస్సీ ! అట్లాంటి వాడిట్లయిపోయాడు."

అపజయంవల్ల దైవమున్నదనే జ్ఞానం వాడికి వచ్చింది. జీవితంలో మనం చేసినవన్నీ విఫలమవుతూవస్తే, విధి- ఉనికి బయటపడుతుంది. తక్కువస్థాయి ఆలోచనగలది మొదటి పాదం. రెండవ పాదం ఉన్నతస్థాయి ఆలోచన గలదిగా ఉంది. పద్య నిర్మాణంలో ఎగుడు దిగుడు లక్షణాలుండవు. వాక్యంలో సమత ఉంటుంది. ఎస్సర్టివ్ స్టేట్‌మెంట్. 'ఉన్నది' అనే క్రియమీద నొక్కుతున్నాడు. 'ఉన్నది' అనే క్రియ పాదం చివర్లో ఉండటం, దాని నిశ్చయాన్ని నొక్కి చెప్పటం. భావం, idea, emotion, thought వ్యక్తికి తెలియకుండా వ్యక్తిలోపల జరిగే ఒక స్పందన - దానికి ప్రతిస్పందిస్తుంది మనస్సు. ఆ ప్రతిచర్య ఆలోచన. ఆ ఆలోచనల అడుగున ఏదో అనుభూతి - అది కవికే తెలుస్తుంది. విశ్లేషణ చేసి చెప్పలేనిది. దైవం ఉనికిని ఆలోచన చేసేవాడు తాత్త్వికుడు. అనుభూతి చెందేవాడు కవి. ఊరకే పొందేవాడు మానవుడు. 'భావంబున్ పెడత్రొక్కుట' - చాలా విలువైనమాట. తమ్మిపడగ - బొమ్మ పెండెము, గండపెండేరం, కడియాలు, సింహలలాటాలు కవుల పాదాలకు వేసేవారు. తమ్మిపడగ-ఓడినరాజు బొమ్మను కడియంపై చెక్కి కాలికి తొడిగేవారు. 'ఇస్సీ' యతి స్థానంలో ఉంది. 'ఇస్సీ'-పై దీర్ఘం. నిట్టూర్పు దీర్ఘంగా విడిచాడు - ఇస్సీ - అని, 'నేటి కిట్ల

యోధిన్' అని తేల్చి చెప్పటం నిర్మాణ మార్మికత అని జగన్నాథ పండితు డన్నాడు.

బాణుడు తారకునికి మళ్ళీ ఈ రకంగా చెప్తూతున్నాడు - "నిన్ను దేవసేనాధిపతి స్కందుడు ఎదుర్కొని పోరు సలుపుతున్నప్పుడు నేను విశాఖుడు మమ్మల నందరినీ కట్టలు కట్టి విసరినట్లు అంబులతో దూరంగా విసిరాడు. అప్పుడు విధివశాత్తు ఈ అపాయం జరిగింది (ష : ప్ర : 161). కోపంతో తారకుని విశాలమైన కళ్ళ వెంబడి నిప్పులు గ్రక్కుతున్నట్లుగా ఎఱ్ఱబడ్డాయి. అది చూసి బాణుడు కన్నీరు కార్చి వినయంతో చేతులు జోడించి ఇట్లంటున్నాడు (ష ' ప్ర : 162) - "ఏకవీరుడా (రాజా) ! మమ్మలను కోపగించు కోకు. నే మే పాపమూ చెయలేదు. అంధకుడు, దండుడు, ముండుడు - అందరూ మునుపటి యుద్ధాలలాగే నీ ఆజ్ఞ ప్రకారం నడచుకొని ఒళ్ళు దాచుకోకుండా యుద్ధం చేశారు. ఇంతకాలానికి ఒక బిచ్చగాడి (శివుడు) శిశువు (విశాఖుని) చేత తలలు వంచుకునే పరిస్థితి కల్గినది (ష : ప్ర : 163). 'ఏకవీరుడా ! మము కోపగింపకువె, మే మే పాపముం జేయము, అంధకుడున్, దండుడు, ముండు డందరును...... నీయొక ఆనంబడి మేను దాపక సముద్యోగించిరి' (ష : ప్ర : 163) మొదలైన అందమైన తెలుగు మాటలు చక్కటి తిక్కన తెలుగుబడిని తలపిస్తున్నాయి.

'ఆ పసిపిట్టను (విశాఖుని) నులిమి చంపకుండా నీ పాదాలు కూడా చూడ' నని బాణుడు ప్రతిజ్ఞ చేయగా, పక్కనే ఉన్న దండాదులు ఈ మాట తమకు కూడా వర్తిస్తుందని అన్నారు. సాధారణంగా 'ఆ పని జరిగేవరకు నీ ముఖం చూడను - లేదా నీకు నా ముఖం చూపించను' అనేది తెలుగు నుడికారం. కాని ఇక్కడ 'నీ పాదాలన్నూ చూడను' అనటం బాణుడికి తారకునిపట్ల ఉన్న వినమ్రభావం వ్యక్తమవుతుంది (ష : ప్ర : 164). పొంగివస్తున్న

వీడుపును, దుఃఖాన్ని దిగమింగుకుంటూ తారకుడు ప్రేమభావంతో "బాణుని మీ దళాధిపతి (సేనాధిపతి)గా చెయ్యటానికి మీ కందరికీ ఇష్టమేనా?" అని అడగ్గా, అత్యంత సంతోషంతో అంధకుడు "మంచిదే ప్రభూ, అట్లే కానివ్వండి" అన్నాడు (ష : ప్ర : 165). "ఇట మీ స్నేహితుని (మహిషుని) మరణంవల్ల మనమంతా కటకట పడ్డాము. మనస్సులో క్రుంగిపోకుండా మీ పటిష్ఠమైన బాహు ప్రయత్నం చెయ్యండి-ఎందుకంటే జయ మటువైపు ఉన్నది కాబట్టి. మీరు మీ కులకీర్తిని మరచిపోకండి" అని నోచ్చరించాడు తారకుడు (ష : ప్ర : 166). మహిషుని శవాన్ని అక్కడినుంచి తొలగింపచేశాడు. ఒక్కసారి కళ్ళవెంబడి బాష్పాలు తొణికిస లాడాయి. అస్త్రమహిమలకోసం తారకుడు అస్త్రాలముందు పద్మా సనం వేసుకుని ధ్యానంచేస్తూ కూర్చున్నాడు. (ష : ప్ర : 167)

స్వాంతనేత్రమున విశాఖుడు రౌద్రమ
యాకృతి మహిషుపై నడరి చుట్టి
అడ్డుపడిన దితిజాధిపుల్ బాణాదు
ల నవల జోపుచు లావు మెరసి
సూతుచండుడు శక్తిరోపమ్ము సంధించి
తమ్మని నరకు దృశ్యమ్ము తోచె
తారకు నెడద క్రోధప్రదీప్తము ధ్యాన
మున కెడ చన దైన్యమూర్తి యగుచు

మనసుపై కుత్ససేయుచున్ మహిషు చంపి
న నిశితాస్త్ర మేమె యనుచున్ దలచుకొంచు
నంతుచిక్కక వాని పాపాత్మ శిరము
నరకి తమ్మనకును దర్పణమ్మొనర్తు. (ష : ప్ర : 168)

తారకుడు అస్త్రపూజ చేయాలని కూర్చున్నాడు. వానికి ధ్యానంమీద మనస్సు ఏకాగ్ర మవలేదు. అతడి కళ్ళలో తన

తమ్ముని విశాఖుడు చంపిన దృశ్యమే మెదలసాగిరది. విశాఖుడు రౌద్రాకృతి దాల్చి మహిషుని అడ్డుకొని రథం చుట్టిన విధము, అడ్డం వచ్చిన దైత్యనాయకులైన బాణాదుల నందరిని అవతలికి (పక్కకు దూరంగా) తోలి, పరాక్రమంతో మెరిసిన విధము, చండ ప్రచండుడైన విశాఖుడు శక్తిబాణం చాపానికి సంధించి తమ్ముని తలను నరికిన దృశ్యము తారకుని కళ్ళలో కనపడసాగింది. గుండె అంతా కోపంతో నిండిపోయినందువల్ల ధ్యానం చెయ్యడానికి ఎడబాటు (ఆటంకం) కావడంతో, తారకుడు దీనవదను డయ్యాడు. మనసులో చింతిస్తూ మహిషుని చంపిన నిశితాస్త్ర మేమిటో అని తలచుకుంటూ ఎటూ అంతు చిక్కక "పాపాత్ముడైన వాని(విశాఖుని) శిరస్సు నరికి తమ్మునికి తర్పణం చేస్తా"నని తారకు డనుకున్నాడు.

విశాఖుడు తన తమ్ముని చంపినందువల్ల పాపాత్ము డయ్యాడు- తారకుని దృష్టిలో. ప్రతివాడూ తాను ఇతరులను వంచించి, హింసించి చేసిన పాపాల గురించి అనుకోడు కాని, తనకు ఇతరులు చేసిన కీడు గురించి మాత్రం అనుకుంటాడు. అలాగే ఇక్కడ తారకుడూ అదే అనుకున్నాడు. ఇది లోకం నైజం.

తారకుడు మనసులో పైరకంగా ఏవేవో అనుకుంటున్నంతలోనే వందిమాగధులు మేలుకొల్పు పాట పాడ నారంభించారు. దుఃఖంతో ఉన్న తారకుడు వారికి సంజ్ఞ చేసి అవతలికి పంపించాడు. ఆలోగా తొలి తెలివెలుగులు మసకగా ప్రసరించాయి (మ: ప్ర: 169). అంటే ఉషోదయ మవుతోంది.

అక్కడ కుమారస్వామికి చేసిన కైవారం (మ: ప్ర: 20-26)- యోగశాస్త్ర దృష్ట్యా స్వామియొక్క భగవత్తత్త్వాన్ని కవి అద్భుతంగా చిత్రించాడు. కావ్య ధర్మాన్ని అనుసరించి ప్రతినాయకుడు, నాయకునికి కించిదూనంగా చిత్రించబడాలే తప్ప, అన్నివిధాల

పనికిరానివిధంగా చిత్రించకూడదు - అని ప్రాచీనకావ్య నిర్మాతలు ఏర్పరచిన గొప్ప సంప్రదాయముంది. ఈ పద్ధతుల ననుసరించి ఇక్కడ ప్రయత్నం చేయబడింది. కాని సందర్భం అనుమతించ లేదన్న మిషగా ప్రతినాయకగతమైన న్యూనత రమణీయంగా ధ్వనింపబడు తున్నది. గొప్ప ప్రజ్ఞావంతుడైన కవి కాకపోతే ఈ నిర్మాణ చాతుర్యం ఉండదు.

**సూర్యోదయం :**

దెసలగోడల తమోవిసరమున్ ప్రాకుడు
గిరి లేతగు తెల్పుగీర లూది
కొండకొమ్ములనుండి కోనలంబడి చెట్ల
గుబురులన్ జేగురుల్ దబకలార్చి
నిద్దంపుతమ్మికర్ణికలందు నపరంజి
మేల్మిపుప్పొడి వన్నె మెరుగు రాచి
నాసీరగతవాహనపు పృష్ఠవీథులన్
పరిగోలప్రేటులై చురుకులార్చి

ఖడ్గధారాగ్రవమదగ్నికణములాచు
క్రమమునన్ క్రియాలోకప్రకాశకముగ
తరణిబింబమ్ము ప్రాఙ్మహీధరశిఖావ
తంసమై వెల్గె శుద్ధచైతన్యమూర్తి. (ప : ప్ర : 170)

దిక్కుల గోడలమీద పట్టిన చీకటి అనే ప్రాకుడును గిరి లేలేతవైన తెలుపు గీరలను ఊదుతూ, పర్వత శిఖరాలనుంచి లోయలో, నున్న చెట్ల గుబురుల మీదుగా ఎఱ్ఱనిరంగులు తరంగితం చేస్తూ, అప్పుడే వికసిస్తున్న తామరపూల దుద్దులపై బంగారు పుప్పొడి వన్నె మెరుగులు పెడుతూ, యుద్ధరంగంలో ఉన్న వీరుల వాహనాల వీపులపై చెర్నాకోల దెబ్బల చురుకుల నంటిస్తూ

ఖడ్గధారలనుంచి అగ్నులను కురిపిస్తూ క్రమక్రమంగా కర్మలోకాన్ని ప్రకాశింపచేస్తూ సూర్యబింబం తూర్పుకొండపైన కర్ణభూషణం (చెవి ఆభరణం)లాగా కనిపిస్తూ శుద్ధచైతన్యమూర్తియై ఉదయించింది. తూర్పునుంచి సూర్యుడు శుద్ధచైతన్యమూర్తియై ఉదయించాడు.

ప్రాతఃకాలంలో సూర్యోదయమైనప్పుడు లేత ఎండ కాస్తుంది. ఆ ఎండ కాయడంలో క్రమపరిణామం ఇక్కడ చెప్పబడింది. అంటే ఎండలోని చురుకుదనం క్రమంగా అభివృద్ధి చెందడం ఇక్కడ చూడవచ్చు. ఆరంభంలో మసక చీకటిలో సన్నని గీతలు గీచినట్లుగా ఉంది. తర్వాత ఎత్తైన ప్రదేశమైన కొండలమీద మొదట ఎండపడి ఆ తర్వాత కోసలలోనూ, చెట్లపైనా పడటం క్రమవిన్యాసం. నాల్గవ పాదంలో సైనికుల వాహనాలమీద చెర్నాకోల దెబ్బ లాగ పడిందట. బలిసిన ఎండ చురుక్కుమనడం సహజమే కదా ! సేనల వాహనాల ప్రసక్తి రావడంవల్ల, సేనలు యుద్ధభూమిలో కెళ్ళాయని, యుద్ధ మారంభమయిందని భావం. శుద్ధచైతన్యమూర్తిగా సూర్యబింబాన్ని చెప్పటం సముచితమైన పోలిక. సూర్యుని వెలుతురువల్ల లోకమంతా ప్రకాశవంతం కావడం మాత్రమే కాకుండా, సకల ప్రాణులూ చైతన్యవంత మౌతాయి. క్రియా ప్రయోగం - కవిత్వంలో ముఖ్యమైనది. మొదటి పాదంలో 'ఊది, గీర' క్రియలవల్ల లేత ఎండ సన్నని గీతల మాదిరి వ్యాపించిందని ద్యోతకమవుతుంది. 'ప్రాఙ్మహీధర శిఖావతంసమై' అన్న ప్రయోగం గమనించదగ్గది. సూర్యుడు కొండలనుంచి మనకు కనపడినప్పుడు చెవికి పెట్టిన ఆభరణంలాగా - అంటే కుండలాలలాగా కనిపిస్తాడన్నది చక్కని పోలిక. 'క్రియాప్రకాశకముగ తరణిబింబం ...నెగ్గె' అనటంతో, లోకమంతా వారివారి పనులు చేసుకుంటున్నారు (active world)అని అర్థం కావడమే కాకుండా, రెండో రోజు యుద్ధం కూడా ఆరంభమయినదని తెలియజేసినట్లయింది.

(23)

# యుద్ధవర్ణన - స్యందనం

## ద్వితీయ దళం

## రాక్షససేన - అరిష్టవ్యూహం

ఇక్కడ రాక్షస సైన్యవర్ణన ప్రారంభమౌతుంది -

తురగఖురోద్ధూతధూళులు మిన్నుల
    దవశిఖాభ్రాంతిమంతములు గాగ
చలదవనీధరమ్ములు బరికాంద్రిశ భ
    యద బృంహితముల విన్నగలి పోవ
ముక్తాశుగమ్ముల మొత్తమ్ము నెక్కగా
    గాలిలో చన శతాంగముల పంక్తి
కేతనకింకిణీఘీంకార ఘోషలు
    భేరీరవమ్ములు భోరుకలుగ

అగ్నిభూధ్రమ్ము బ్రద్దలైనట్లు సెగల
కుతకుత మటంచు నుడుకుచు గొప్పరించు
భయదనిర్హ్రాదకీలికల్ వలె చలించె
నేల యీనినట్లి యసురనేత్ర చమువు. (ష : ద్వి : 1)

అశ్వసైన్యం వస్తోంటే అశ్వాల గిట్టలచేత ఎగురగొట్టబడిన ధూళులు ఆకాశంలో అగ్నిజ్వాలలు అనుకునేట్టుగా భ్రాంతి గొల్పుతున్నాయి. ఏనుగులపై వస్తున్న బరికాంద్రుడు పొడుస్తున్న అంకుశం ధాటికి ఘీంకారం చేస్తూ ఏనుగులు నడుస్తున్న కొండలవలే వస్తున్నాయి. గాలిలో విడిచిన బాణాల మొత్తంవలే రథాలు పంక్తులు పంక్తులుగా (వరుసగా) వస్తున్నాయి. అశ్వాలయొక్క ఘోషలు, జండాలకు కట్టిన చిరుగజ్జెల మ్రోతలు, వాద్యాల ధ్వనులు మారుమ్రోగుతున్నాయి. అగ్నిపర్వతం బ్రద్దలై కుతకుతమని పొర్లిన 'లావా'లాగా భయంకరంగా కాల్బలం వస్తోంటే రాక్షస సైన్యం నేల యీనినట్టుగా కనబడుతోంది.

ప్రథమదళం ప్రారంభంలో కుమారస్వామి సైన్యవర్ణనతో ప్రారంభమైంది. ఇక్కడ ద్వితీయదళం రాక్షససైన్య వర్ణనతో ప్రారంభమైనది. నాయక, ప్రతినాయకులయొక్క సమ తౌల్యం పాటింపబడింది. రామాయణంలో కూడా వాల్మీకి ఇద్దరినీ (రాముడిని, రావణుడిని) సమానంగా ప్రవేశపెడతాడు. కాని రావణుని బలహీనతను చూపుతాడు. కవి ఇద్దరినీ పక్షపాతం లేకుండా సమా నంగా చూస్తాడు.

ఈ పద్యంలో చతురంగబలాలు వర్ణించబడ్డాయి. మొదటి పాదంలో అశ్వబలం, రెండవ పాదంలో గజబలం, మూడవ పాదంలో రథబలం,నాల్గవ బలమైన కాల్బలం గీతపద్యంలో వర్ణించబడింది. నాల్గవపాదంలో వివిధరకాల వాద్యాల ధ్వనులు వర్ణించబడ్డాయి.

అశ్వసైన్యం వస్తోంటే ఆ ధూళులు ఆకాశంలో అగ్నిజ్వాల లాగా భ్రాంతిగొల్పుతున్నాయి అనటంవల్ల, ఇది భ్రాంతిమదలం కారం. భ్రాంతిజన్యమైన జ్ఞానం మిథ్యాజ్ఞానం. రాక్షస విజృంభణం, వారికి సంబంధించిన జ్ఞానం భ్రాంతి మాత్రమే. నాయకునివద్ద యథార్థజ్ఞానం. ఈ సైన్యంవల్ల అవతలివారికి ఏమీ అపకారం లేదనే భావం ఇమిడి ఉంది.

**తరువోజ :**

ఐదేసి వింద్లౌడమై రెండువేల అశ్వముల్ లక్ష మదాంధేభఘటలు
ఐదునూరులవేల్ శతాంగాళి అతిభయంకరమూలబలాళి మున్ముందు
పాదుకో సగ మొకవంతు వేఱ్ఱనొకవంతుగా అనుసారబల
మళ్లై నిలువ
ద్వాదశగవ్యూతిగ్యైర్ఘ్యము సగము పై శాల్యమున్ గల్గ
వాహిని దిద్దె. (ష : ద్వి : 2)

ఒక్కొక్క భాగానికి రెండువేల అశ్వాలు గల్గిన ధనుర్ధారులు ఐదు భాగాలుగా ఏర్పడినారు. బాగా మదించిన లక్ష ఏనుగులు, ఐదు

టక్కుల రథాల సమూహము సగభాగం ముందువైపు పొదుకొని ఉంది. మిగిలిన సగభాగం వెనుకవైపు ఆ విధంగానే అనుసరించి నిలబడింది. ఈ విధంగా ఇరవైనాలుగు క్రోసుల దూరం పొడవు, దానిలో సగం- అంటే పన్నెండు క్రోసుల దూరం వెడల్పుతో కూడిన వైశాల్యం గల (వైశాల్యము = పొడవు × వెడల్పు) సేనను దిద్దినాడు తారకుడు.

'గవ్యూతి' అంటే రెండు క్రోసుల దూరము. ద్వాదశ గవ్యూతి అంటే 12 × 2=24 క్రోసుల దూరము. క్రోసు అంటే కూత వినిపించే టంత దూరం. రెండు వేల దండముల పరిమితి 24 క్రోసుల దూరము = 2000 × 24 = 48000 దండములు. దీనిలో సగం వెడల్పు అంటే 24000 దండములు. మొత్తం సైన్యం వైశాల్యం=పొడవు × వెడల్పు= 48000 × 24000 చదరపు దండము లన్నమాట. ఇంత వైశాల్యంతో తన సేనను నిలిపినాడు తారకాసురుడు.

**ద్విపదలు :**

పక్షకక్షములు నిల్వన్ దండమట్లు
వక్షంబు రెండు విభాగముల్ సేసి
త్ర్యంగముల్ నాలుగు ప్రక్కలు గాగ
భంగించి మూడుగ భంగించి నిలిపి

ఇరుప్రక్కల పొడుగాటి దండంలాగా సైన్యాన్ని నిలబెట్టాడు. సేనను రెండు ప్రధాన భాగాలుగా విభజించాడు. త్ర్యంగములను - అంటే మూడు రకాల బలాలను (అశ్వ, గజ, రథ బలాలను నాలుగు భాగాలుగా చేసి, మళ్ళీ అందులో ఒక్కొక్క భాగాన్ని మూడు భాగాలు చేసి నిలిపాడు తారకుడు. దీన్ని బొమ్మద్వారా ఈ (ప్రక్క- పుటలోని) విధంగా చూపవచ్చు. మొదట సైన్యాన్ని ప్రధానంగా రెండు భాగాలుగా చేశాడు.




యుద్ధభూమిలో తారకుడు చేసిన సైన్యవిభాగం

పై బొమ్మల ద్వారా మొత్తం సేనను రెండు విభాగాలుగా విభజించాడు. అవి I, II అనుకోవచ్చు. I లోని మూడు రకాల అంగాలు A, B, C లుగా చూపబడ్డాయి. A, B, C అనే ప్రతిభాగం లోనూ నాలుగు ఉపవిభాగాలు (a, b, c, d)గా విభజించడమైనది. ప్రతి ఉపవిభాగంలోనూ తిరిగి మూడు శాఖలు (1, 2, 3) గా విభజించి చూపడమైనది. అదే విధంగానే II లో కూడా విభజించి సైన్యాన్ని తారకుడు నిలబెట్టాడన్నమాట.

## గర్భగీత చంపకము :

కుధరము లేన్గులున్ [1] రథపుగుంపులు సశ్వధురా క్రమంబుగా
పథికచమూపతి ప్రచురనాయకవర్గము సాగ రక్షణా
వధిగ నరిష్టమున్ మొనను బన్నెను గర్భపు మోహరమ్ముగా
రథికవరుండు తన్నిశిచరప్రభు డాహవనీతి వెల్గగా. (ప : ద్వి : 4)

కొండలవంటి ఏనుగులు, రథసమూహాలు, అశ్వసైన్యం, పదాతిదళం క్రమంగా నిలబెట్టి సేనాపతి మొదలైన వీరుల సమూహంతో సైన్యరక్షణగా 'అరిష్ట'మనే వ్యూహాన్ని పన్నినాడు తారకుడు. తారకుడు యుద్ధనైపుణ్యంతో గర్భవ్యూహం గల 'అరిష్ట' మనే వ్యూహాన్ని పన్నినాడు.

అరిష్ట వ్యూహంలో గజబలం, రథబలం, అశ్వబలం, కాల్బలం బయటివైపు ఈ క్రమంలో ఉంటాయి. గర్భవ్యూహం దీనికి వ్యతిరేక క్రమం (opposite order)లో ఉంటుంది. అంటే కాల్బలం ముందు. తర్వాత అశ్వబలం, రథబలం, గజబలం వరుసగా ఉంటాయి.

1. గర్భగీత : రథపుగుంపులు - నశ్వధురా క్రమంబు
చతురనాయకవర్గము సాగ రక్ష
మొనను బన్నెడు గర్భపు మోహరమ్ము
నిశిచర ప్రభు డాహవనీతి వెల్గ.

ఈ విచిత్రమైన పద్ధతిని చెప్పటానికే కవి గర్భగీత చంపకం వ్రాయడం. గర్భవ్యూహాన్ని ద్యోతకం చేయడానికి గర్భగీత చంపకాన్ని ఎన్ను కోవటంలో కవియొక్క ఛందశ్శిల్ప పరిజ్ఞానం అమోఘంగా వ్యక్త మవుతున్నది. బంధకవిత్వాన్ని కూడా ఇలా రసవత్తరంగా చెప్ప డానికి అవకాశముందని కవి నిరూపించాడు. ఈ పద్ధతి వాల్మీకి మహర్షి నుంచి ప్రతి కవీ చెప్పినదే.

అరిష్ట వ్యూహాన్ని తారకుడు పన్నగా చూస్తున్న రాక్షసులు ఆహా అని గట్టిగా అరుస్తూ తిరుగుతుండగా ఇదంతా షణ్ముఖుడు చూసి దీన్ని గమనిస్తున్న సోదరుడు విశాఖుని చూస్తూ చిరునవ్వుతో అంటున్నాడు (ష : ద్వి : 5): ధర్మనిర్వహణాకోసం ధరించిన దీక్షా సూత్రం విశాలమైన కవచానికి సంధింపబడింది. విశాలవక్షస్థలంపై తరంగాలుగా ముడులుపడ్డ ముత్యాలహారం, కుండలాలు గాలికి కదలాడుతున్నాయి. పూర్వకాలంలో ప్రతి ఒక్కరూ జంధెం వేసుకునే వాళ్ళు. జంధెం లేకుండా యజ్ఞం చేయడానికి వీలులేదు (ష : ద్వి : 6). ప్రకాశవంతమైన కుంకుమపువ్వు వర్ణం గలిగి మిక్కిలి ప్రకాశవంతమైన కాంతితో కూడిన ఎట్టిటి వస్త్రం నడుముకు కట్టుకున్నాడు స్వామి. సింహంవంటి నడుముపై ఎట్టని కాంతిమంతమైన సుకుమార వస్త్రం ప్రకాశిస్తుండగా (శ్రీ) గుహుడు (షణ్ముఖుడు) తమ్ముని చూస్తూ చిరునవ్వుతో ఈ విధంగా అంటున్నాడు : (ష : ద్వి : 7)

**మత్తకోకిలలు :**

యాతుధానుని వ్యూహవిద్య యహా! విలోచనపర్వమా
నీతి పాండితి యింత రొప్పునె! సిద్ధపారిపతంతకం
బీత డివ్విధి భోగజాతి జనించినట్టిది పక్షవ
వ్రాతి సర్పణమైన వ్యూహము గట్టి బంధురరీతిగా.

గర్భమునం దరిష్టము లోగియుండగ వచ్చెబో
వాశ్వఘటారథావళి ఈ క్రమంబుగ తోచుగా
విపరీతరీతి మదేభముల్; రథవాజులున్;
నట్టి క్రమం బరిష్టము పొల్చు రెండును జంటగా.
(ష : ద్వి : 8, 9)

ఆహా! రాక్షసుని వ్యూహావిద్య నేత్రోత్సవంగా ఉంది. ాండిత్యం ఇంతగా ఉంటుందా! ఈతడీ రకంగా సేనను న సర్పజాతికి సంబంధించినట్టి అత్యంత వక్రగమనమైన గా కట్టినాడు (ష : ద్వి : 8). లోపల ప్రక్కలకు నశిచే గల వ్యూహం. తిర్యగ్గమనం. గర్భంలో అరిష్టమనే ఒదిగేటట్లుగా అశ్వబలం, గజబలం, రథబలం-ఈ క్రమంలో ికి వ్యతిరేక పద్ధతిలో-అంటే గజబలం, రథబలం, అశ్వబలం, బయటి వైపుగా పొందుపరచిన 'అరిష్టవ్యూహం' రెండు ంటగా పొందుపరచబడి ఉన్నాయి. (ష : ద్వి : 9)

తారకుడు రాక్షస గురువైన శుక్రాచార్యుని మతం ప్రకారం ్యూహం తీర్చాడు. నీవు దేవగురువైన బృహస్పతి మతం సేనను తీర్చు విశాఖా! నీ పటుత్వ మెటువంటిదో గా!" (ష : ద్వి : 10) అన్నాడు షణ్ముఖుడు.

ార్తికేయుడన్న మాటలు విని విశాఖుడు అన్నతో ఁడు - "నీ హృదయ మార్దవం (మృదుత్వం) దాచి ే విధానాన్ని ఇప్పుడే చూస్తున్నాను - చూస్తావుగా" అని, ు నవ్వుతూ సేనను తీర్చటానికి వెళ్ళాడు (ష : ద్వి : 11). ాచరుడు (రాక్షసుడు) మొదట అశ్వబలంచేత దేవసైన్యాన్ని ించి హింసించి, ఏనుగుల బలంచేత వరుసగా క్రుమ్మించి దేవ సమూహమంతటినీ చాళ్ళుచాళ్ళుగా దున్నాలనుకున్నాడు" ాముడు (ష : ద్వి : 12) తలచుకుంటూ పోతున్నాడు.

**వృ ష భ గ తి :**

అనుచు తలచుచు రుషోచ్ఛలితుండయి చని కను త్వరగతి ఖేచర
గణము కన్నులు విప్పుకొని కనగా పన్నె మొన నత్యద్భుతముగ.
(ష : ద్వి : 13)

## దేవసేన - సర్వతోభద్రవ్యూహం

విశాఖుడు కోపంతో కంపితుడై రాక్షససమూహమంతా గుర్తుపట్టించుకొని చూస్తూండగానే త్వరితంగా దేవసేనను అత్యద్భుతంగా తీర్చిదిద్దినాడు.

**స్ర గ్ధ ర :**

గంధాంధానేక పాగ్రంబు రథతురగగర్భ ప్రచండంబు పాదా
తాంధోపృష్ఠంబుగా గ్వ్యూచముపు నిలిపి ఆశావిభాగంబులన్ తీ
వ్రాంధంబౌ సర్వతోభద్ర మను మొనను పన్నెన్
తదీయాంత వీథిన్
గ్రంథించెన్ దుర్జయాఖ్యం బహులముఖజగన్మండల వ్యూహజాతిన్.
(ష : ద్వి : 14)

ప్రచండమైన రథాలను, గుఱ్ఱాలను నిలిపి పదాతి దళాన్ని పృష్ఠభాగంలో-అంటే పైభాగంలో బయట నిలిపి చిక్కనైన 'సర్వతోభద్రము' అనే వ్యూహాన్ని దేవసైన్యంతో పన్నినాడు విశాఖుడు. దానికి వెనుకగా 'దుర్జయము' అనే అభేద్యమైన వ్యూహాన్ని నిర్మించాడు.

దీన్ని చూసి దిక్పతులంతా ఆశ్చర్యనిమగ్నులయ్యారు. సహస్రనేత్రుడైన పృత్రారి(ఇంద్రుడు) ఆ వ్యూహాన్ని చూసి వాయుదేవుతో ఈ విధంగా అంటున్నాడు : (ష : ద్వి : 15)

**మత్తకోకిలలు :**

రుద్రాకృతి మోహరమ్ము శిరోభరమ్ముగ [1]సర్వతో
భద్రమున్ గ్రథియించి షడ్విధి వాహినుల్ గను అష్టరా
శ్రితంబుగ దుర్జయంబను వ్యూహగర్భము పన్నె నీ
భద్రమూర్తి యదెంత నిర్మితిస్వాదువో ! గ్రహించితే.

ఊచుచుండ దల మాతరిశ్వుఁ డహో ! అలంకృత శబ్దమై
ఏచె నీమొన సుందరార్థసహిష్ణువై మన దిక్పతుల్
తోచకుండగ గర్భమందున మార్చి సోదరయుగ్మకం
బీ చమూముఖ సీమ నిల్చె నిదెట్టి రక్షణభారమో !

(ష : ద్వి : 16, 17)

"రౌద్రాకారంగా శిరోభారంగా 'సర్వతోభద్ర' [1] మనే వ్యూహాన్ని రచించి షణ్ముఖాలుగా వాహినిని (సేనను) తీర్చి శ్రేష్ఠమైన 'దుర్జయ' మనే వ్యూహాన్ని గర్భంలో పన్నినాడు భద్రమూర్తియైన విశాఖుడు. అదెంత అందమైన నిర్మాణమో గ్రహించావా !" (ష : ద్వి : 16). వాయువు ఇంద్రుడు చెప్పిన దానికి తల ఊపుతూ ఈ వ్యూహం సుందరాకారంతో కూడినది. మనం దిక్పతులందరమూ కనబడకుండా గర్భంలో మనల్ని ఉంచి ఈ సోదరు లిద్దరూ ఈ సేన ముఖభాగంలో నిలిచారు. ఇదెలాంటి రక్షణభారమో !" అని బదులుపలికాడు (ష : ద్వి : 17).

ఇంద్ర, వాయుదేవుల సంభాషణ, డప్పులు మొదలైన వాద్యాల చప్పుళ్ళతో ఆగిపోయింది. చలించే సేనల పాదాల తాకిడికి భూమి దద్దరిల్లింది. సైనికుల ఆయుధాలు తళతళ వెలుగులు

1. ఈ వ్యూహనిర్మాణ విషయము అర్థశాస్త్రమునందున్నది: భారతమునందును. షణ్ముఖాలుగా వాహిని తీర్చుట రాజనీతిశాస్త్ర దృష్ట్యా షణ్ముఖాల కర్థం. (కుమారభారతి : పుట. 126).

జిమ్ముతూ మెరుస్తున్నాయి (ష : ద్వి : 18). భయంకరమైన అరుపులు, రోషంతో కదలిస్తున్న భుజాలు, కోపపు చూపులు, వింటి అల్లెత్రాళ్ళయొక్క భయంకరమైన శబ్దాలతో యుద్ధప్రారంభ వాతావరణం చెలరేగింది. (ష : ద్వి : 19)

**జలోద్ధతము :**

ధరావలయు మీఁ అధర్మపు తపః
ఖరోగ్రత వినాశ కాక నిలుపన్
మరుంగుగ ధరించు మండనము కూ
బరాగ్రపు సితాతపత్ర మెగయన్. (ష : ద్వి : 20)

**అశ్వగతి :**

లోచనవీథికి యానవిలోలత సుంతయునున్
దోచగనీక చరించు విధుంబు నినుం డన వే
గాచిత తీవ్రత నొప్ప రథాంగయుగమ్ము పతా
కా చరణాయుధ చిహ్నితకాల[1] నిదానముగా.

(ష : ద్వి : 21)

**షట్పది :**

కాళులు సాచుచు గాలి చరించు హయాళులు నీరూపకాలచ్ఛతే
జోలురదూర్మి విలోల ద్పశావలనాలసితంబులుగా చెలగన్
జ్వాలాపరంజ్యోతి లీలాకుమారత దాలిచి వచ్చున యన్నట్లునై
ఖేలాస్ఖలత్ రథచాలనన్ స్కందుడు తేలుచు చేరి

యుపర్బుధునిన్ : (ష : ద్వి : 22)

## కుమారస్వామి రథవర్ణన :

రథానికి అలంకరింపబడ్డ సితచ్ఛత్రం (తెల్లగొడుగు). భూదేవత అధర్మ ఆతపంవేత మండిపోకుండా ఆమె శిరస్సుపై పట్టినట్లుగా ఉన్నది : (ష : ద్వి : 20)

1. నిదానము - ప్రతీక.

కంటికి ఏమాత్రమూ గమనం కనిపించకుండా నడిచే సూర్య చంద్రులలాగా చక్రాలజంట తీవ్రవేగంతో భ్రమింపగా, కాలప్రతీక అయిన కుక్కుటము పతాకముపై మెరుస్తుండగా (ష : ద్వి : 21), కాళ్ళు దీర్ఘంగా చాచి దూకే గుఱ్ఱాలు గూపంక్తీస అచ్ఛమైన కాలసముద్రంమీద అలలు దూకుతున్నట్లు ఉండగా, జ్వాలారూప మైన పరంజ్యోతి లీలగా కుమార రూపాన్ని ధరించి వస్తున్నట్లు క్రీడామాత్రంగా జూకే రథగమనంమీద స్కందుడు తేలుతూ అగ్నిదేవుని దగ్గరకు వచ్చాడు. (ష : ద్వి : 22)

ఇక్కడ వర్ణనకు, ప్రథమ దళంలో (ష : ప్ర : 1) ఉన్న వర్ణనకు చాలా భేదం ఉంది. అక్కడి వర్ణనలో దైవభావం స్పష్టంగా ఉంది. ఇక్కడి వర్ణన దైవత్వ ప్రతీకదృష్ట్యా వర్ణింపబడుతున్నది. ఆ ప్రతీకలు రథానికి కట్టిన తెల్లగొడుగు, గుఱ్ఱాలు ఇత్యాదులు.

## అగ్ని రాయబారం

మధురాక్కర :

నీవు హవ్యభుజ్ఞిచయ సందీప్తాననుం డౌదువును
నీవు దేవదూతవు కాన నిశిచరాగ్రేసరుతో
నా వచనరీతి చెప్పి శాంతించునేమో చూచి ర
మ్మా వల కలదేకద ! సంప్రహార హింసావ్యావృత్తి.

(ష : ద్వి : 23)

అగ్నిని రాయబారిగా పంపించడంకోసం శాంతమూర్తి అయిన కుమారస్వామి చెప్పే ఘట్టం ప్రారంభ మవుతున్నది.

"నీవు హవ్యములచేత ప్రకాశించే ముఖంగలవాడవు, దేవ దూతవు కాబట్టి, రాక్షసేశ్వరునితో - శాంతించునేమో (సంధికి వస్తా డేమో) - నా మాటగా చెప్పిరమ్మా ! వింటే సరే, వినకపోతే

హింసావృత్తి (యుద్ధం) ఎలాగూ తప్పదు కదా !" అని స్కందుడు అగ్ని దేవునితో చెప్పాడు.

వాక్య విన్యాసంలో పై మూడు పాదాలకు, నాల్గవ పాదానికి తేడా ఉంది. 'ఆవల కలదేకద ! సంప్రహార హింసావ్యావృత్తి' అనే వాక్యం prosoic గా ఉంది. లౌకిక వాక్య విన్యాసంలాగా ఉంది. ఈ వాక్య నిర్మాణం యుద్ధపై ముఖ్యాన్ని ధ్వనిస్తున్నది. పై మూడు పాదాలూ నాల్గవ పాదానికి భిన్నంగా ఉన్నాయి- శాంతిని కాంక్షిస్తున్నాడు కనుక. ఈ ఫలం (effect) సాధించడంకోసం మధురాక్షర వ్రాయబడింది.

దూతగా అగ్నినే ఎన్నుకున్నాడు - అగ్ని దేవదూత కనుక. యజ్ఞయాగాదులు చేసేటప్పుడు ఆ హోమం ద్వారా అర్పించినది తాను ముందుగా అందుకొని దేవదూతలకు అందిస్తాడు. అక్కడ హోమం చేసేవానికీ, దేవతలకూ మధ్యవర్తిగా ఉన్నాడు అగ్ని. ఇంద్రుడు శివుని దగ్గరకు కూడా అగ్నినే పంపించాడు. శివవీర్యాగ్నిని మోయడానికి కొంతకాలం అగ్ని మాధ్యమంగా ఉన్నాడు. అందుకే కుమారునికి 'ఆగ్నేయు'డని కూడా పేరు (చూ. కుమార జననం). ఇక్కడ కూడా స్వామి అగ్నిని మధ్యవర్తిగా పంపిస్తున్నాడు.

అగ్ని భగవంతునికి, మానవునికి మధ్య వంతెన కట్టేవాడు. జాతవేదుడు. పుట్టినవాడి జాతకం తెలిసినవాడు. సకల జీవరాసుల జాతకం తెలిసినవాడు. ఇవతలి ఒడ్డు ఈ లోకం. అవతలి ఒడ్డు ఆ లోకం. సంకేతంగా, ప్రతీకగా సకల మతాల్లో అగ్ని ఏదో ఒకరూపంగా ఆరాధింపబడుతున్నాడు. అగ్ని ద్విభాషి. అగ్నికి రెండు ముఖాలు. భగవంతునితో సంస్కృతంలో, మనతో తెలుగులో మాట్లాడతాడు అనవచ్చు. అంతే సంస్కృతం దేవభాష, మిగతావి మానవ భాషలు అని కాదు. అగ్ని భగవంతునికీ, మనిషికీ మధ్య

వర్తిగా ఉంటాడని మాత్రమే దీనిభావం. ఆయనకు రెండు ముఖాలని చెప్పుకున్నాం. ఒకటి భౌతికమైన ముఖం - ఊర్ధ్వముఖం; మరొకటి దేవతాముఖం. దేవతలకు ముఖం - అధోముఖం. ఒకటి మనల్ని చూస్తుంటుంది. ఇంకొకటి తన్ను చూస్తుంటుంది.

అగ్ని కుమారస్వామి తాత్త్విక స్వరూపం చెప్పటం రాయబారం.

కుమారుని మాటలు విని అగ్ని నాలుగు కన్నులు వినయభావమనే నదిలో స్నానం చేసినట్లు తోచగా (అంటే ఎంతో వినయం కన్నుల్లో కనబడిందన్నమాట), మృదువైన గాలికి తన బంగారు కెంట్రుకలు కదలాడేటట్లు తల ఊపి రథాన్ని ముందుకు సాగించాడు (ష : ద్వి : 24). అగ్నికి రెండు ముఖాలు. అందుకే 'నాలుగు కనులు వినయభావ స్నపనమున దోఁగ' అన్నాడు కవి.

దూరమునన్ గనన్ రిపు లెదో తపనీయకనత్తటిత్ప్రభా
స్ఫారము గాగ శూన్యవిటప వ్రజవీధి జ్వలించు తీక్ష్ణ దు
ర్వారచల త్ప్రవృత్తికదవజ్జ్వలనాకృతి రానురాను బం
గారు శతాంగమై కనుల కాంతులు చిమ్మెను రోహితాశ్వమై.

(ష్వ : ద్వి : 25)

దూరంగా ఏదో వేడి అయినట్టి పెద్దగా వాడి మెరుపులాగా కనిపించింది రాక్షసులకు. ఎండిపోయిన చెట్లు కాలుకుంటూ- అంటే అడవిని కాల్చుకుంటూ-వచ్చినట్లుంది. ఆ విధంగా వచ్చే కార్చిచ్చు ఆకృతి రానురాను ఎఱ్ఱని గుఱ్ఱాలతో (రోహితాశ్వమై) కూడిన బంగారు రథమై రాక్షసుల కళ్ళకు కనిపించింది.

ఇక్కడ అగ్ని రథాన్ని బంగారు రథంతో పోల్చడం సముచితంగా ఉంది. సర్వం బంగారుమయం అగ్ని. 'కనిపించెను,

అనకుండా 'కాంతులు చిమ్మెను' అనటం ద్వారా, కన్నులు మిరుమిట్లు గొలిపినట్లు ద్యోతకమవుతోంది. దూరంగా వస్తున్న రాక్షస సేనకు మొదట మెరుపులాగా కనబడి, తర్వాత రానురాను బంగారు రథమై కనిపించేటట్లు చిత్రీకరించటం చాలా అందంగా ఉంది.

దండనాథుండు వచ్చు రథమ్ముపైన
అస్త్రసంధాన మొనరించునట్టి వారి
సన్న నాపినన్ వృషభరాట్ చటులకంఠ
రవభయంకరమ్ముగ నగ్నిరథము వచ్చె. (ప : ద్వి : 26)

వస్తూ ఉన్న అగ్ని రథంపైకి విల్లెక్కుపెట్టిన వారిని రాక్షస సేనాధిపతి సంజ్ఞచేసి ఆపించాడు. బాగా మదించిన ఎద్దు భయంకరమైన రంకె వేసిన శబ్దంతో అగ్ని రథం అక్కడికి వచ్చింది. వేదంలో అగ్నిని వృషభంతో పోల్చారు. ఆధునికంగా చెప్పాలంటే బాగా స్పీడుగా వచ్చే కారుకు సడన్ బ్రేకు వేస్తే వచ్చే కీచుశబ్దం లాగా ఇక్కడ ఎద్దు రంకె వేసినట్టుగా ఉంది అనటం.

"ఓ అసుర సేనాపతీ! మీ ప్రభు దర్శనంకోసం నేను అమరదౌత్యం మోసుకొని రాయబారిగా వచ్చాను" అని అగ్ని అన్నమాటలకు రాక్షససేనాపతి అయిన బాణుడు రాక్షసరాజు అయిన తారకుడి దగ్గరకు తీసుకొనిపోయాడు. అగ్ని తారకుడిని చూసి ఈ విధంగా అంటున్నాడు : (ప : ద్వి : 27).

**ద్విపద :**

ఓయి రాక్షసరాజ ! ద్యోచమూనాథు
రాయబారని తదర్థభణితి వినుము. (ప : ద్వి : 28)

"ఓయీ రాక్షసరాజా ! దేవసేనాపతి అయిన కుమారస్వామి రాయబారిని నేను - అతని ఉద్దేశం, అతని వాక్యార్థం విను" అని తారకునితో అన్నాడు అగ్ని.

యుద్ధం కనుక పరిచయం క్లుప్తంగా చేసుకున్నాడు అగ్ని. అందుకే సందర్భానికి తగినట్టుగా ద్విపద వ్రాయబడింది. దీనిలో తూకం వేసినట్టు ఉంది. పొల్లుమాట- అనవసరమైనమాట-ఉండదు.

**మధ్యాక్కరలు :**

'కాలము సర్వకారణము కాలవ్యతీతుండు లేడు
చాలనినాడు నిర్జరులు జర్జరితులునై నొగిలిరి
చాలమి యిపుడు నీ వంతు' స్వామి శాంతుండిటుల్ వచించె
'ఏల వృథాస్మయముబడి యెసగెదు పగ విడు' మంచు.

మనము హ్రాపీకరథమ్ము మరి దాని వేగమ్ము నాగి
కనుసీతి యెప్పెడు దెరువు కారుణికుడ ! ఇందరేల
కన నీ కొరకు చావగావలె కడుడెప్పరం బిది ఎదిరి
నిసు చావ డాతడు కాలవిధి కతీతుండు దైత్యపతి !

బ్రతుకన చివ్వలున్ విప్లవమ్ములు నింతటి యసదె
మతి నెన్నుమా శాంతిమార్గమర్యాద సుఖమ్మన బొమ్ము
ఆతనిరథము కాలచిహ్నమా కుమారతానిత్యు
డతడు చావనివాని చంప యత్నించు వాడెంతవాడు ?

(ప : ద్వి : 29, 30, 31)

ఇంకా అగ్ని ఈ రీతిగా చెప్తున్నాడు : "'అన్నింటికీ కారణం కాలం. కాలానికి వ్యతిరేకంగా ఎవ్వడూ పోలేడు. బలం చాలనినాడు దేవతలు వ్యథలు పడ్డారు. ఆ బలం చాలనితనం ఇప్పుడు నీ వంతు. వృథాగా ఎందుకు గర్వపడతావు ? - పగ విడిచిపెట్టు'మని శాంతి

యుతుడైన స్వామి చెప్పాడు (ష : ద్వి : 29). మనస్సు కోర్కెల రథంపై ఎక్కి పరిగెత్తే స్వభావం గలది. ఇంద్రియాలను అదుపు చేసుకొని ఒప్పుదల అయిన నీతి మార్గం చూడు కారుణికుడా (దయ గలవాడా)! ఇంద రెందుకు నీ కోసం చావాలి? ఇది ఎదురైన గట్టి విపత్తు. అతడు కాలాతీతుడు. అతడు చావడు - నా మాట విను రాజా! (ష : ద్వి : 30). జీవితంలో దుష్టకార్యాలు ఎంత నీచమైనవో నీ మనసులో ఆలోచించుకో. శాంతి,మర్యాద పాటించు. సుఖంగా ఉండు. కుమారస్వామి రథం కాలానికి చిహ్నం. అతడు నిత్యకుమారరూపుడు. చావనివానిని చంపడానికి ప్రయత్నించే వాడెంత వెఱ్ఱివాడు ?"
(ష : ద్వి : 31)

అగ్ని రాయబారానికీ, విశాఖుని రాయబారానికీ తేడా ఉంది. విశాఖుని రాయబారంలో రాజనీతి ఉంటుంది. దాని మెలకువలు ఉంటాయి. అగ్ని రాయబారం ఆధ్యాత్మికంగా ఉంటుంది. అగ్ని కుమారతత్త్వ వ్యాఖ్యాత. కుమారతత్త్వమంటే భగవత్తత్త్వమే. కుమారస్వామిలో ఉన్న రాజనీతిని విశాఖుడు వ్యాఖ్యానించగా, తత్త్వస్వరూపాన్ని అగ్ని వ్యాఖ్యానిస్తున్నాడు. భగవంతుడు కాలానికి అతీతంగా ఉంటాడని బోధిస్తాడు తారకునికి. భగవంతుడు ఆది, మధ్య, అంతరహితుడు; అతని రథం కాలచిహ్నం అన్నాడు. అతని రథానికి కుక్కుట (కోడిపుంజు) ధ్వజముంటుంది. అది కాల చిహ్నం. కాలజ్ఞానం దాని పేరు. కాలానికి యజమాని అతడు. కాలంపై పెత్తనం కలవాడు. కాలం పై ఉన్నాడు స్వామి. కోడిపుంజు కూత మానవునికి తెల్లవారు జామున మెలకువ రావడానికి పనికి వస్తుంది. ఇది బాహ్యార్థం. అంతరార్థమేమంటే మానవుడు ఎప్పుడూ మెలకువగా ఉండాలి. అంటే భగవత్ చింతనంలో ఉండాలి. మెలకువగా లేకపోతే అజ్ఞానం ప్రవేశించి మాయలో పడిపోతాడు. మాయలో పడిపోకుండా నిత్యమూ మెలకువగా ఉండటంకోసం

కోడిపుంజు కూత. శివరాత్రినాడు మేలుకోవాలి అనడం కూడా దీనికే. అజ్ఞానం పారద్రోలాలి - జాగ్రత్తగా జ్ఞానంతో మెలకువగా ఉండమని అర్థం- నిద్ర మేలుకొమ్మని మాత్రమే కాదు. 'కుమారతా నిత్య'మన్నాడు అగ్ని. కుమారత్వం నిత్యంగా గలవాడు. భగవంతు డెప్పుడూ కొత్త రూపంగానే ఉంటాడు. పాతబడే లక్షణం ఉండదు. అదే నిత్య కౌమారం. మానవుడు తయారుచేసిన వస్తువులు పాతబడతాయి. భగవద్రూపం అలాంటిది కాదు. నిత్య నూతనంగా ఉంటుంది. అందుకే అగ్ని కుమారస్వామిని 'కుమారతా నిత్య'మన్నాడు. బాల్యం లేదు, వృద్ధాప్యం లేదు. 'చావనివాని చంప యత్నించు వాడెంతవాడు?' అనటం ద్వారా, అతనికి చావు పుట్టుకలు లేవు - అని సూచించినట్టయింది. దానికి అతీతంగా భగవంతు డుంటాడు.

ఇక అగ్ని కుమారస్వామి తత్త్వాన్ని ఆవిష్కరిస్తున్నాడు. స్వామే ధనుస్సట !

**ప ద్య ము :**

స్నాయత్ సౌమ్యయజన వేదీశ్రీ
స్తాయంబా ధనుసు క్రియాదృష్టిన్
ఆ యగ్రాంతము లహో శ్రేతాగ్నుల్
భూయోథర్వణము గుణోగ్రంబా. (ప : ద్వి : 82)

ప్రాచీన వేదవిద్య ప్రతిరూపంగానూ యోగమార్గంగానూ వ్యాఖ్యానింపబడింది. ఈ రెండు దృష్టులతో వ్యాఖ్యానిస్తున్నాడు అగ్నిదేవుడు.

ఈ వృత్తంలో కుమారస్వామి ధనుస్సును గురించి కవి చెప్పాడు. సౌమ్యయాగం ఒక యజ్ఞం. సౌమ్యయాగ వేదిక

ఆతని ధనుస్సు. ఆ ధనుస్సు చివరి రెండు కొనలూ, ల_స్తకమూ (పిడి) - త్రేతాగ్నులు (గార్హపత్యం, దక్షిణాగ్ని, ఆహవనీయం అని మూడగ్నులు). ఆ ధనుస్సుయొక్క నారి అథర్వణ వేదం.

యజ్ఞ వేదిక నాలుగు వేదాలు. అథర్వణ వేదమంటే క్షత్రియుడు. మిగతావి బ్రాహ్మణుడు. శత్రువులను చంపడానికి మారణ మంత్రాలుంటాయి. అందులోనూ మునుల సృష్టి అది. 'అది నాల్గవ వేదం. క్రమేణా దాన్ని రాజుల కిచ్చారు మునులు' చాలా విచిత్రమైనట్టి, అపూర్వమైనట్టి విషయాన్ని 'పణవం'లో రచించాడు కవి. పణవశిల్పం. అది ఒక రకమైన ఢక్కా. అర్ధచంద్రాకారం. చివరి రెండు కొనలు ఉబ్బెత్తుగానూ, మధ్య పల్లంగానూ ఉంటుంది. దీన్ని పణవ ఛందస్సుకు అన్వయింపచేసి ధనురాకారాన్ని చూపవచ్చు. మధ్యలో పల్లం సూచించడానికి నాలుగు లఘువులు ల_స్తకం చివరి రెండువైపులా ఉబ్బెత్తులను సూచించడానికి రెండు చివరల మూడేసి గురువు లున్నాయి.

U U U I I I I U U U
స్నాయత్ సౌమ్యయజన వేదశ్రీ

బొమ్మలో 1, 2, 3, 4 భాగాలను గమనించండి.

1. బొమ్మలోని వక్ర రేఖ (1) అగ్నికుండాలను వేరుచేయు గోడలు.
2. సామిథాగ్ని కుండము - వృత్తాకారము - గార్హపత్యాగ్ని
3. ఇష్టిక - వృత్త - త్రికోణాకారము - దక్షిణాగ్ని
4. చతురస్రాకారము - ఆహవనీయము

ఆధర్వ వేదము క్షత్రియుడు- యాగరక్షకుడు కాబట్టి. యాగము ధనురాకారము కాగా నారి యాగరక్షకమగు క్షత్రియరూపమైన అథర్వవేద మనబడినది. ఇంతేకాక యాగము చేయించు పురోహితులలో నొకడు రక్ష - యాగవాటికాద్వారము చెంత నిలిచి, లోని కర్మ కాండకు విఘ్నములు రాకుండ చూచు పనిపేరు క్రియ (దీన్నే కవి 'క్రియాదృష్టిన్' అన్నాడు పద్యంలో). క్రియాదృష్టి అనగా యాగక్రియాదృష్టి- అదే స్వామి ధనుస్సు.

(కుమారభారతి : పుట 130).

నాల్గు నారు పదియున్ బదురెండు పదునారు
రెండు దళముల నీ రేజపట్క-
సుందరమై ధనుస్సు వెలుంగు ; నవి యూరు
గారుడ గోమేధి కాశ్మ గర్భ
శోణాశ్మ హారినీల సురుచిర పుష్యరా
గ చ్ఛటా చ్ఛవు లథః క్రమమునుండి
క్రమమై రొప్పు సకలశబ్ద చారుతా
నిధు లవి కాంచన స్నిగ్ధమైన

దండమున నిన్న చూడలేదా ! ? మరీవు
చూడుమిా నేడు మనసెల్ల చొక్కిపోవు
తద్ధనూరూప మిద్ది అధ్యాత్మ దృష్టి
కనుము శత్రుతాగ్రస్తమా మనసు వీడి. (ష : ద్వి : 33)

ధనుస్సును ఇప్పుడు ఆధ్యాత్మికమైన యోగవిద్య సంబంధంగా చెప్తున్నారు. ఆ ధనుస్సు ఆరు కమలాలు కలది - ఆరు కమలాల వర్ణములకు (రంగులకు) ప్రతీకాప్రాయంగా రత్నాలు కూడా చెప్ప బడ్డాయి. ఇవి మూలాధారంనుంచి క్రమక్రమంగా ఆజ్ఞాచక్రందాకా చెప్పబడినాయి.

“ఆరు కమలాలకు మూలాధారం నాలుగు దళాలు. 1. మూలా ధార చక్రం, 2. స్వాధిష్ఠానచక్రం, 3. మణిపూరక చక్రం, 4. అనా హత చక్రం, 5. విశుద్ధ చక్రం, 6. ఆజ్ఞా చక్రం. ఈ ఆరు కమలాలు (1) గరుడ రత్నం, (2) గోమేధిక రత్నం, (3) అశ్మ గర్భమణి (అశ్మసారమణి), (4) శోణమణి, (5) హరినీల రత్నం, (6) పుష్య రాగ మణుల సమూహపు శోభతో ప్రకాశిస్తున్న బంగారు ధనుస్సును (కాంచనస్నిగ్ధ దండమును) నిన్న నీవు చూడలేదా! నేను చూసాను మరి - నీ మనస్సంతా పరవశించిపోతుంది. ఆధ్యాత్మిక దృష్టికి కనిపించే ఆ ధనుస్సుయొక్క రూప మిది. శత్రుత్వ మనస్తత్త్వం విడిచిపెట్టి ఆ ధనుస్సును ఆధ్యాత్మికదృష్టితో చూడు” అంటున్నాడు అగ్ని.

ఆరు కమలాల రంగులకు ప్రతీకగా ఆరు రత్నాలు చెప్ప బడ్డాయి. ఈ ఆరూ షట్చక్రాలు. (1) మూలాధార చక్రం (గుద స్థానంలో ఉంటుంది), (2) స్వాధిష్ఠాన చక్రం (జననేంద్రియ స్థానంలో ఉంటుంది), (3) మణిపూరక చక్రం (నాభిస్థానంలో ఉంటుంది), (4) అనాహత చక్రం (హృదయస్థానంలో ఉంటుంది), (5) విశుద్ధ చక్రం (కంఠస్థానంలో ఉంటుంది), (6) ఆజ్ఞాచక్రం (భ్రూకుటి స్థానంలో ఉంటుంది). స్వామి ధనుస్సు మేరుదండం. వెన్నుపాము ఆకారంగా ఉన్న దండం మేరుదండం. యోగదండం వెన్నుపాములాగా ఉంటుంది. కుండలినీ శక్తిని స్వాధీనం చేసుకున్నవారు దానిని పొందు

తాను. అంత శక్తి ఉంటుందని భావనాశబ్ద ఉత్పత్తి శాస్త్రం- యోగ శాస్త్రం చెబుతుంది. మూలాధారంనుంచి ప్రాణవాయువు షట్చక్రాలను ఛేదించుకుంటూ వస్తుంది. వెన్నుపాములోని బంగారు ద్రవ్యాన్ని 'బంగారు దండం' (కాంచన స్నిగ్ధమైన దండము) అంటారు. కాంచన స్నిగ్ధమైన దండం అనటంలో తాత్పర్యమిది. ఆ ద్రవమే మేధగా ఏర్పడుతుంది. స్వామియొక్క నిర్గుణస్వరూపం ధనుర్దండంలాగా వర్ణింపబడింది - యోగశాస్త్రపరంగా తెలియజేయబడింది. కనుబొమల నడుము భృకుటి స్థానమే ఆజ్ఞాచక్రం. అందులో స్వామి ఉంటాడు.[1] యోగి ఆజ్ఞాచక్రంలోకి వస్తే అపూర్వశక్తులు స్వామి యిస్తాడు. కావ్యం చివరి కమలాన్ని (షష్ఠకమలాన్ని) రెండు దళాలుగా విభజించడం ఆజ్ఞాచక్ర స్ఫూర్తిని ధ్వనింప చేయటానికే.

> లస్తక మనాహత మయి ప్రశస్తకోటి
> గ్రంథులన్ మార్చి దృఢబంధి తమ్మధిజ్య
> మైన చూడలేవోయి దైత్యపతి, నీవు!
> చండ సుందర ధర్మవీరుండతఁడు. (ష : ద్వి : 84)

ధనుస్సుయొక్క పిడి (లస్తకం = ధనుర్మధ్యభాగం = పిడి)ని పట్టుకొని వింటినారిని దృఢమైన బంధంతో సంధించినప్పుడా నీవు చూడలేవా! అతడు ప్రచండమైన సుందర ధర్మవీరుడు.

ధనుస్సుయొక్క లస్తకం పట్టి బాణాన్ని సంధించేటప్పుడు ఎడమ చేతితో పట్టుకొన్న బాణపుకొస హృదయ స్థానానికి తగులుతుంది. అనాహత చక్రం హృదయస్థానమందే ఉంటుంది.

---

1. చూ. Description of the six centres: "The serpent power" P. P. 317 - 427

ఐంద్ర వారుణాగ్నేయ వాయవ్య గగన
సూక్ష్మ ప్రకృతి మన స్తత్త్వ సుందరమ్ము
చాపదండ మ్మధః క్రమాచరణ దృష్టి
వల్లి మ్రోసిన సృష్టి సర్వము చలించు. (ష : ద్వి : 35)

ధనుర్దండము కిందినుంచి చూస్తే ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, వాయువు, ఆకాశములనే పంచభూతములతో కూడుకొన్న సూక్ష్మమైన సుందరమైన ప్రకృతి మనస్సుకు గోచరిస్తుంది. స్వామి తన వింటినారిని మ్రోయిస్తే సర్వసృష్టీ చలించిపోతుంది.

కిందినుంచి చూస్తే చక్రంలో పంచభూత శక్తులుంటాయన్నమాట. స్థూలరూపాన్ని అనుసరించి తాత్త్వికాంశం గురించి చెప్పటం. కుమారస్వామి ఎక్కడో లేడు-నీలోనే ఉన్నాడు. షట్చక్రాల్లో అష్ట దిక్పాలకుల అంశలతో చక్రాలు ఏర్పడ్డాయి. ఒకవ్యక్తి తన తనడునికని తాను విశ్వసించకపోవడం నాస్తికత. ఇంద్రధనుస్సు సృష్టికి చిహ్నం. నీలము, లోహితం (ఎరుపు) అనే రెండు రంగులూ సప్తవర్ణాలుగ అటూ యిటూ చివర్లో ఉంటాయి. ఈ రెంటి మధ్యలో మిగతా రంగులు ఉంటాయి. శక్తి వర్ణం లోహితం (ఎరుపు). శివుడు తెలుపు (అవర్ణం). శివుడు నీలలోహితుడు. అవర్ణం, సవర్ణం ఆయనే.

| కమలాలు | దళములు | రత్నములు | తత్త్వములు |
|---|---|---|---|
| ఆరు | నాలుగు | ఆరు | ఐదు |
| 1. మూలాధారం | 1. మూలాధారం | 1. గరుడం | 1. ఇంద్ర |
| 2. స్వాధిష్ఠానం | 2. స్వాధిష్ఠానం | 2. గోమేధికం | 2. వరుణ |
| 3. మణిపూరకం | 3. మణిపూరకం | 3. అశ్మగర్భం | 3. అగ్ని |
| 4. అనాహతం | 4. అనాహతం | 4. శోణం | 4. వాయువు |
| 5. విశుద్ధం | | 5. హరినీలం | 5. ఆకాశం |
| 6. ఆజ్ఞ | | 6. పుష్యరాగం | |

**మధ్యాక్కర :**

గుణవల్లి, (మోసినన్ వచ్చు గొమరారు [1]నుద్గాతృకంఠ
నినదవీణానాదమంజు నిభృతమధురసౌమ్యఫణితి
(పణయినై విన్న శాత్రవత ? భైషజ్య మాభిచారా ద్య
గణిత హింసాథర్వమంత్రకఠినవాక్కార్య మ్మెసంగు.
(ప : ద్వి : 36)

స్వామి వింటినారి మ్రోగించేటప్పుడు వచ్చే ఇంపైన ధ్వని - నిశ్చలమైన వీణానాదంనుంచి వచ్చే మధుర సౌమ్యమైన వీణానాదం లాగా ఉంటుంది-భక్తునికి ప్రేమతో వింటే. శత్రువుకేమో, అథర్వణ వేదంలోని మారణమంత్రంలాగా వినిపిస్తుంది.

ఆత్మశత్రుత్వ మిది నాస్తికాధ్వ మేడ?
నీవు కశ్యపబ్రహ్మవంశావనీజ
శేఖరీభూత సత్ఫలశ్రీ(తయీ వి
రాజమానసుసంవిద(గణి విదేడ ? (ప : ద్వి : 37)

ఇది నిజంగా ఆత్మశత్రుత్వం. నాస్తికమార్గ మెక్కడ ! కశ్యప బ్రహ్మ వంశంలో పుట్టి చిటారికొమ్మన ఆరముగ్గిన పండువైనట్టి, ప్రకాశవంతమైనట్టి, వేదాల జ్ఞానస్వరూపుడవైన నీవెక్కడ ?

తన ఉనికికి మూలభూతమైన పదార్థం లేదని నమ్మడం నాస్తికత్వం. Self existenceను నమ్మకపోవడం. ఆత్మశత్రుత్వమంటే తనకు తాను ద్రోహం చేసుకోవడం. ఆత్మలో మూలాధార మిద్ది అని ఘోషిస్తున్నా దానికి విరుద్ధంగా నడుచుకోవడం ఆత్మశత్రుత్వం.

1. ఉద్గాత = సోమగాయకుడు

**మధ్యాక్కర :**

కుహూవున ద్వీపిరాట్ప్రముఖఘోరజాంతవపంక్తి చూడ
గహనాంధువున కూలి లోన కాలాహు లుండ లతాంత
కుహరమ్ము గన్ జిక్కి దుఃఖకుల్యయై దూరపు పండ్ల
విహరించు నాశ జీవించు విధి మూర్ఖుడట్లగుగె నీవు ? !
(మ : ద్వి : 38)

అమావాస్య కటిక చీకటిలో ఘోరమైన పెద్దపులుల సమూహం చూడగా లోతైన బావిలో పడి లోపల కాలసర్పములుండగా తీగెల కొనలు పట్టుకొని దుఃఖంతో కుములుతూ జీవించే ఆశతో ఉండే మూర్ఖుడిలాగా నీవు ప్రవర్తిస్తావా ? !

కుహూవు అంటే గాఢాంధకారం. ఏ చంద్రకళ లేని అమావాస్య. కటికచీకటిలో జీవితం గడపడం లాంటిది నీవు చేస్తున్న ప్రయత్నమని తారకునికి బుద్ధి చెప్పటం.

అయ్యయొ పారజూడుము మహాబలుడౌ అనుజుండు నిన్న నే
మయ్యెనో యన్నమాట ముఖమందున నిల్వగ జూచి తారకుం
డియ్యెడ కేగుదెంచి కనలెక్కగ జేసితి మూర్ఖ ! నీమెయిన్
గయ్యలుకోసెదన్ క్షతముఖంపుటరుంధతి [1] వైతి దుష్టుడా !
(మ : ద్వి : 39)

“అయ్యో ! బాగా పారజూడు. మహాబలవంతుడైన తమ్ముడు నిన్న ఏమయినాడు!” అన్న అగ్ని మాటలకు తారకుడు అగ్నిని ఈ విధంగా అంటాడు - “మూర్ఖుడా ! చాలా మాట్లాడినావు ! నీ శరీరాన్ని కయ్యలుగా కోయగలను. దెబ్బతగిలిన గాయం పైన అరుంధతి వేస్తావా దుష్టుడా!”

1. గాయములకు వేసి కట్టు ఓషధీవిశేషం.

అరుంధతి = ఓషధీవిశేషం. 'అరుంధతి' అన్న పదం అథర్వణ వేదంలోనిది. తారకాసురుడు వేదవేత్త అని చెప్పడానికి ఇది వాడబడింది. అగ్నికి ఈ సంగతి తెలుసు కాబట్టే, తారకుడిని 'త్రయీ విరాజమాన సుసంపిదగ్రణివి' అన్నాడు (ష : ద్వి : 37). ఇక్కడ తారకుడు అగ్నిని 'మూర్ఖ' అంటున్నాడు. అగ్ని అన్నాడు పైన (ష : ద్వి : 38) 'మూర్ఖ' అని. తాత్త్వికంగా అన్నాడు అగ్ని. ఇక్కడ ఒకనికి (అగ్నికి) లోకం తెలియదు; ఇంకొకనికి (తారకునికి) పరలోకం తెలియదు.

దాసేరుండవు నిన్ను జంపెడి వృథానైన్యంబు మాకేటికిన్ ?
ఛీ ! సాధీయసు లీ యనార్యవిధి దుశ్శీలాత్మ ! ఆత్మీయమున్
మీ సేనాపతి వోలె చెప్పికొన రీ నిన్ బ్రహ్మాస్త్రమ్మునన్
గాసింబెట్టి భవత్ప్రమూధర తిరస్కారమ్ము గావించెదన్.
(ష : ద్వి : 40)

తారకుడు ఇంకా ఈ విధంగా అంటున్నాడు - "దాసుడవైన నిన్ను చంపే వృథానీచత్వం మాకెందుకు ? ఛీ ! దుశ్శీలాత్మా ! గొప్పవాళ్ళు ఇలాంటి నీచమైన రీతిగా మీ సేనాపతివలె సొంతం గురించి చెప్పుకోరు. ఈ పనికి పూనుకొన్న నిన్ను బ్రహ్మాస్త్రమున బంధించి మీ సేనాపతిని తిరస్కరిస్తాను.

"అసలు కే దిక్కులేదు. ఔరా అగ్ని ! నీకు, నీ స్నేహితులకు, మిమ్మలను అణచిపెట్టిన నాకు మారాడునా గర్వాత్మా ! చూడు"మని బ్రహ్మాస్త్రంతో బంధించి కట్టి అగ్నిరథాన్ని తోలినాడు తారకుడు. (ష : ద్వి : 41).

విశాఖుడు రాయశారిగా వచ్చినప్పుడు తన కిరీటాన్ని పడగొట్టాడు. దానికి తారకుడిప్పుడు ప్రతీకారం తీర్చుకున్నాడు - అగ్నిని బంధించి,

వచ్చినట్టివాని బ్రహ్మాస్త్రబంధమ్ము
తాకి తొలగజేసి ద్వాదశారు
ణాక్షు కుహరవీథి యంగారకగ్రహ
మన్ని ముక్కలైనయట్లు మెరయ. (ప : ద్వి : 42)

బ్రహ్మాస్త్రబంధంతో వచ్చిన అగ్నిని తాకి బంధం తొలగించాడు - షణ్ముఖుడు. ఎట్టుని పన్నెండు నేత్రాలు అంగారకగ్రహం పన్నెండు ముక్కలైనట్లుగా మెరిశాయి. తారకుడు తన మాటను ధిక్కరించడమే కాకుండా అగ్నిని అస్త్రబంధం చేసినవానికి అంతగా కోపం వచ్చిందని తాత్పర్యం. దీని ఫలితం తరువాతి పద్యంలో కనిపిస్తుంది.

## యుద్ధం :

ఘనవిద్యుల్లతికాచలచ్ఛటులమై కంపింప భూతావళుల్
కనకస్యందన ముప్పతం బెగసి చక్రశ్రీప్రహరంహస్సు ద
ర్శన తీవ్రావిరతభ్రమీవిధురమై రౌద్రాతితేజః ప్రచం
డ సితాంతోగ్రత సుళ్ళుసుళ్ళు తిరిగన్ దైత్యాళి దిగ్వీథిగా.
(ప : ద్వి : 43)

ఘనమైన విద్యుత్ తీగ మెరుపు మెరిసేటట్టు, పంచభూతాలు కనిపించేటట్టుగా కుమారస్వామి బంగారు రథం ఆకాశంలోకి లేచింది. రథచక్రాల కుండలు మిక్కిలి వేగానికి ఎడతెరిపిలేకుండా గిఱ్ఱున తిరుగుతున్నాయి. ప్రచండమైన రౌద్రతేజస్సు రాక్షస సమూహంపై ఉగ్రంగా సుళ్ళుసుళ్ళు తిరిగింది. (దైత్య సమూహంపై రథం సుళ్ళు సుళ్ళుగా తిరిగిన ఫలితం తరువాతి పద్యంలో కనిపిస్తుంది.)

బంగారురథం ఆకాశంలోకి ఒక్కుదుటున లేచింది. ఒక ఘనమైన విద్యుత్ తీగ - కంటికి బెదురు కలిగించేటట్లుగా మెరిసింది. పంచ భూతాలు వణికాయి. రథచక్రాలు highest speed నందుకున్నాయి. 'క్షిప్ర' మన్నా వేగమే, 'రంహస్సు' అన్నా వేగమే. ఒకే అర్థం కల్గిన రెండు పదాలు కవి ఎందుకు వాడినట్టు? అత్యంత వేగాన్ని రథచక్రాలు అందుకున్నాయనడానికి ఒకే అర్థంగల రెండు పదాలు వాడబడ్డాయి- 'పరుగోపరుగు'అన్నట్టుగా. 'Superlative degree'- ఇచ్చే అర్థాన్ని ఇస్తుంది ఈ జంట పదం (క్షిప్రరంహస్సు). కోపం వచ్చినప్పుడు విష్ణుచక్రం తిరిగిన వేగం. ఇలా శబ్దాన్ని భావించాలి.

ఒక మోటార్ సైకిల్ sudden గా top gare వేస్తే, ఆ బండి ఏ విధంగా పైకి లేస్తుందో, ఆ విధంగా కుమారస్వామి తన రథాన్ని ఆకాశంలోకి అంత వేగంతోనూ ఎగిరించాడన్నమాట. 'రౌద్రతేజస్సు' అనేమాట ప్రత్యేకార్థంలో వాడబడింది. వాటిని సాధారణంగా ఎప్పుడూ వాడితే వాటి తీవ్రత మనం అనుభవించలేము. నారాయణ తత్త్వం శాంతతత్త్వం. రౌద్రభావం ఆరోపించుకొని నరకుణ్ణి చంపాడు. రౌద్రమే ఒక తేజస్సుగా రౌద్రప్రవాహరూపం సుళ్ళు సుళ్ళుగా తిరిగింది. ఆయన కోపానికి రెండు ప్రమాణాలు ఇక్కడ - రథం భూమిమీద ఉంది. పైకి లేచింది మెరుపులాగా. అది ఒక ప్రమాణం. నిట్టనిలువుగా పైకి లేవడం. అప్పుడు ఆ రథచక్రాలు గిఱ్ఱున తిరిగాయి. తారకాదుల కలా కనబడింది. చక్రభ్రమణమే ఇక్కడ సుడి. ఈ రెండు ప్రమాణాలచేత ఆయన కోపాన్ని కవి సూచించాడు. భావప్రకటన ఇది. కవి ప్రయోగించిన శబ్దం రసాన్నో, అనుభవాన్నో ధ్వనిస్తుండాలి. వాచ్యముఖంగా చెప్పడానికి వీలులేదు. వ్యంగ్యంగానే చెప్పాలి. రసభావాన్ని వర్ణించినపుడు కవి ప్రతిభ బయటపడుతుంది.

మరకతాశ్మ పుబాహుపురుల హస్తపుగుంపు
తునిగి చెదరి తమ్మితూండ్లు గాగ
రక్తసిక్తములు వక్త్రిముల పంక్తులు లోచ
నపు గెంపు తోడి కెందామరలుగ
మేదోవసాపుంజమేదురబిసములన్
పాలిమావు ముక్కల తెలినురుగయి
వలయీకృతోగ్రవిస ఫరచాపచ్ఛట
సురిగాలి కెరటంపు విరుపు గాగ

ప్రబలదైత్యచక్ర సరోవరమ్ము కలిగి
షణ్ముఖమదాంధ సింధురేచ్ఛావిహార
కలితచలితమై నాల్గుదిక్కులకు విరిగె
చావనట్టిది వాహనశక్తి కొలది. (ష : ద్వి : 44)

కుమారస్వామి ధాటికి మరకతమణులచే అలంకరింపబడ్డ రాక్షస వీరుల బాహువులు వారి దేహాలనుంచి తెగి తామరతూడులలాగా చెదరిపోయినాయి. ఎఱ్ఱకళ్ళతోటి రక్తసిక్తములైన రాక్షసుల తల కాయల గుంపులు ఎఱ్ఱ తామరపూలలాగా కనిపిస్తున్నాయి. బాగా మజ్జతో కలిసిన రాక్షసుల ఎముకల సమూహం - దట్టంగా తెల్లటి ముక్కలు నీటిలో తెలినురుగయి కనిపించింది (మాంసం, ఎముకలు కుండలో ఉడికేటప్పుడు - మొదటిసారిగా ఉడికేటప్పుడు - ఎముకల నుంచి తెల్లని నురుగు వస్తుంది. తర్వాత ఉడుకు ఉడికేటప్పుడు ఆ నురుగు రాదు. మొదట వచ్చేదే తెలినురుగు). అత్యంత వలయా కారంగా వంచిన ధనుస్సునుంచి వచ్చే బాణసమూహం సుడిగాలి కెరటమయింది. ఈ విధంగా 'ప్రబలమైన దైత్యులు' అనే సరో వరంలో షణ్ముఖుడనే మదించిన ఏనుగు ఇచ్ఛావిహారంగా తిరుగుతూ ఉంటే చావునుంచి తప్పించుకొన్నట్టి కొందరు రాక్షససైనికులు వారి వాహనశక్తికొద్దీ నాలుగు దిక్కులకూ చెల్లాచెదరై పోయారు.

(చాలామంది రాక్షసులు చచ్చారని భావం. చావనట్టి కొంతమంది సైనికులు మాత్రం దిక్కులకు పరుగెత్తారని తాత్పర్యం.)

సంస్కృతో పోలిక - ఏనుగుకు తామరతూడులను పీకివేయడమంటే దానికి మహాసరదా. అందులోనూ మదించిన ఏనుగు. ఏనుగు సరోవరంలో పడి తామరతూడులు పీకేసినట్లు పీకేశాడు రాక్షససేనను షణ్ముఖుడు. కోపప్రకటన బాగా వ్యక్తమవుతున్నది. ఒక సద్గురువు మానవులలోని 'నేను' అనే అహంకారాన్ని తొలగించే ప్రకరణం బోధిస్తున్నప్పుడు, ఆయన సరోవరంలోని తామరతూడులను పీకివేస్తున్నప్పుడు ఏనుగు పొందే ఆనందం అనుభవిస్తాడట. అంత ఉత్సాహంగా ఉంటాడు. ఈ పోలికను వేదాంతంలో చెప్తుంటారు. [1] అదిగో అలాంటి చక్కటి పోలికనే ఇక్కడ కవి తీసుకొన్నాడు.

షణ్ముఖుడు చేస్తున్న స్వేచ్ఛావిహారాన్ని బాణుడు మొదలైన నాయకులు చూశారు. తీవ్రకోపాతిశయంతో షణ్ముఖునికి ఎదురుపడ్డారు. వాళ్ళు వేసిన మహాస్త్ర బాణాలు మండుతూ ఆకాశంలో అగ్నుల కోపచిహ్నాలుగా చెలరేగాయి (ష : ద్వి : 45). కోపాగ్నులకు గుర్తులు ఆకాశంలో అగ్నులు. దీన్ని విశాఖుడు చూసి అగ్ని చెంతకు పోయి 'షణ్ముఖుని యథేచ్ఛా విస్తృతవిహారం దుష్టరాక్షసరాజు తారకుడు అగ్నిని బంధించి అవమానించిన ఫలితం. శత్రువులు వస్తున్నట్లు ఉన్నారు. ముందు నీవు పద - అగ్రభాగాన నేను ఉంటా'నని చెప్తాడు (ష : ద్వి : 46). అవమానం యొక్క రియాక్షన్ (ప్రతిచర్య) ఆ కోపం. మహానుభావుల మనస్సులు కుసుమాలలాగా ఎంత కోమలమో, పర్వతంలాగా అంత కఠోరంగా కూడా ఉంటాయి.

1. శ్రీ గురు శివప్పస్వామి 'పారమార్థశరధీ షట్పదిగ్రంథవు' (కన్నడం).

షణ్ముఖుడు పంపించిన ధాయుబారం శాంతభావానికి గుర్తు. అది అతని కోమలమైన మనస్సును తెలియజేస్తుంది. తారకుడు వినలేదు. ఇప్పుడు ఫలిత మనుభవిస్తున్నాడు. ఇది షణ్ముఖుని కర్కశత్వాన్ని తెలియ జేస్తుంది. అందుకే గొప్పవాళ్ళు ఎంత శాంతంగా ఉంటారో, అంత కఠోరంగా కూడా ఉంటారు.

గర్భవ్యూహంలో అగ్ని కలిసిపోయిన తర్వాత దేవసేనసంతా ఒకసారి చుట్టు చుట్టి ప్రచంచ రౌద్రుడవుతూ ప్రజ్వలంగా చలిస్తూ కర్కశంగా జ్యాటంకారం చేసి విశాఖుడు కాపుదలగా నిలిచాడు (ష : ద్వి : 46). నారిధ్వనిలో ఆ కోపభావం ఇమిడి ఉంటుంది. జ్యాటంకారం కుమారస్వామికి Supporting గా ఉంది – 'నీ వెనుక నే నున్నా'నని.

కర్ణాభ్యర్ణతల స్ఫుర్శమ్ముగ గుణాకర్షంబు గావించి యు
త్కీర్ణ స్ఫూర్జథుమండ ఘోషణ భయోద్వేగంబు లైరమ్మదా
కీర్ణప్రోజ్జ్వల దీపితాస్త్రచయ సంక్షిప్తిన్ ధనుస్సంవి దు
త్తీర్ణుల్ బాణుడు దండుడున్ చెలగి రుద్వేల స్ఫురచ్ఛౌర్యులై.
(ష : ద్వి : 48)

ధనుర్విద్యలో నిపుణులైన బాణుడు, దండుడు అత్యంత శౌర్యవంతులై చెలరేగి ప్రజ్వలితంగా ప్రకాశిస్తున్న అస్త్ర సమూహంతో చెవిదాకా వింటినారిని లాగి విడువగా పిడుగుల సముదాయపు ఘోషణం భయంకరమైన ఐరమ్మదాగ్ని (మేఘాల్లో ఉండే అగ్ని) విరజిమ్మబడింది.

కాంచిన షణ్ముఖాంబకపు కాంతి వియత్తల దఘ్నచండమై
కాంచన చాపదండమున కన్నులు వెల్గెడునట్లు ద్వాదశ
ప్రాంచిత రుక్మపుంఖ వివిధాస్త్రము లుజ్జ్వలియించె మండలా
కుంచిత కాలకంఠగళ ఘూర్ణ విషోగ్ర భయంకరాగ్నులై.
(ష : ద్వి : 49)

ద్వాదశాస్త్రములున్ ద్విపద్ధతిగ చీలి
ఆరుగా నేగి రజ్జుయుగ్యములు, సిడము
కామలన్; రథరథకులన్; ఖండములుగ
జేయ బాణదండుల తూల్చి శీఘ్రము నేగి. (ప : ద్వి : 50)

బాణ, దండులు పరాక్రమించింది షణ్ముఖుని చూశాడు. చూశాక అతని నేత్రాల కాంతి ఆకాశందాకా (ఆకాశబంటి = దప్పు ప్రయోగం) ప్రచండమై, కాంచన (బంగారు) చాపదండమున కన్నులు వెలిగేటట్లు 12 చేతులతో 12 ధనుస్సులతో ఒప్పారి వివిధాస్త్రాల పరంపరతో ఉజ్జ్వలించి వలయాకారంగా వంచబడ్డ ధనుస్సులనుంచి భయంకరమైనట్టి ఉగ్రమైన విస్ఫులింగాలు కక్కుకుంటూ బాణాలు వస్తున్నాయి (ప : ద్వి : 49).

ఆ పన్నెండు బాణాలు రెండు రకాలుగా చీలిపోయినాయి. అంటే ఆరు బాణాలు ఒకవైపు, మరో ఆరు బాణాలు మరొకవైపుగా వెళ్ళాయి. అలా వెళ్ళి పతాకాలను, వాటి కామలను, గుఱ్ఱాలను, వాటి పగ్గాలను (తాళ్ళను), రథ రథికులను ఖండఖండాలుగా చేశాయి. ఇలా చేసి బాణదండులను అణగద్రొక్కి తారకుని దగ్గరకు వేగంగా వెళ్ళిపోయాడు షణ్ముఖుడు. (ప : ద్వి : 50)

దృష్టుల్ రుద్రత మండగా దితిరుహాదేష్టన్ విలోకించి రుట్
కృష్టిజ్యానినదార్భటిం జెలగి వహ్నిస్పర్శనాద్యస్త్రముల్
ముష్టిందూసి ధ్వజమ్ము; చాపతురగమ్ముల్ స్యందనక్షత్తలన్
రిష్టి ప్రుష్టిగ వర్మశీర్షకములన్ జెండాడి ఉన్మత్తుడై.
(ప : ద్వి : 51)

చూపులు కోపంతో మండగా తారకుడిని చూసి వింటి నారిని గట్టిగా లాగగా మహత్తరమైన ధ్వని రేగింది. 'అగ్నిబాణం'

మొదలైన శూణాలను ముష్టితో బిగించి విడిచి వాని (తారకుని) జండాను, వింటిని, గుఱ్ఱాలను, రథరక్షకుడిని, రక్షకకవచాన్ని, కిరీటాన్ని ఉన్మత్తుడై చెండాడి తారకుకిని విరథుడిని చేశాడు షణ్ముఖుడు.

టకార ప్రాస ద్వారా తారకుడిని గజిబిజిగా చేసినట్టు అర్థమవు తుంది. 'రిష్టివ్యష్టిగ' అన్నది దీనికి మరింత దోహదం చేసింది. ఇలాగ శబ్దమే భావాన్ని సూచిస్తుంది.

విరథున్ జూచుచు కోపపున్ నగవునన్ వీరాభ్యమిత్రీణ ! స
న్నుర కాండీర ! అసూర్క్షణం బొనరుపన్ యోచింతు ? సాంద్రప్రష్టిక
స్ఫురణం జూచితె బుద్ధి తెచ్చుకొను పోపో శుష్కమాంసాశనా !
సరథోరశ్ఛద చాపమార్గణ శిరస్త్రాణాంఢ్యవై రమ్మురా !
(మ : ద్వి : 52)

విరథుడైన తారకుడిని చూస్తూ కోపంతో నవ్వుతూ షణ్ముఖుడు "వీరాభ్యమిత్రీణ ! నన్నురా, దుర్మార్గుడా అవమాన పరుస్తావు ? ఇప్పుడు ఏమయిందో చూశావా ? బుద్ధి తెచ్చుకో, పోపోరా ! ఎండిన మాంసం తినేవాడా (శుష్కమాంసాశనా) ! రథం, రక్షకకవచం, ధనుస్సు, అస్త్రాలు, శిరస్త్రాణం-వీటిసహితుడవై రమ్మురా" అన్నాడు. వీరాభ్యమిత్రీణ అంటే వీరులకు ఎదురు వచ్చేవాడా అని. అంటే వీరుడు కానివాడా అని ఎగతాళి ఉంది. కోపపు నవ్వు - ఇది తిక్కనగారి నవ్వులాంటిది.

భగవంతునికి కోపం వస్తే మానవుని జీవితం ఎంత అల్పంగా ఉంటుందో అన్న తాత్త్వికభావం ఇక్కడ తెలుస్తుంది. 43వ పద్యం దగ్గర వచ్చిన కోపభావ వేగం, దాని ఫలితం ఇంతవరకు వచ్చిన దన్నమాట. అగ్నిని అవమానం చేయటం ద్వారా స్వామిని అవమానించడం, దాని ఫలితం తారకుడు అనుభవించాడు. యుద్ధ

వర్ణన చాలా చక్కగా చేశాడు కవి. యుద్ధమంటే తిక్కనే మనకు ప్రమాణం. తర్వాత విశ్వనాథ. ఆ తర్వాత తృతీయ స్థానాన్ని ఈ కుమారభారతి కావ్యంలో చూడవచ్చు.

నిరథుడైన తారకుడిని చూసి సరథుడవై రమ్మని షణ్ముఖుడు చెప్తున్నంతలోనే, ముందుగు సేనలను పురికొలుపుకుంటూ వడివడిగా వచ్చి తన శక్తికొద్దీ మంచి పదునైన దెబ్బై బాణాలను వరుసగా వేశాడు (ష : ద్వి : 53). 'నిన్న మృదువైన అమాయకమైన శిశువులాగా ఉండి, నేడు షణ్ముఖుడయి తేజస్వంతమైన ప్రచండ కోపభావంతో వచ్చాడు. వీనిచేత ఓడటం కూడా మేలే అవుతుంది' అనుకున్నాడు తారకుడు (ష : ద్వి : 54). నిన్న శిశువులా ఉండి నేడు రౌద్రరసాకృతి ధరించి వచ్చాడనుకోవడం, అంతలోగా సిగ్గు కలిగి, తమ్ముని చంపినది గుర్తుకొచ్చి రోషం తెచ్చుకొని తారకుడు- 'ఛీ! దురాత్మ డితణ్ణి చీల్చి చండాడతాను' అని వేరే రథమెక్కి వచ్చాడు : (ష : ద్వి : 55).

అతడు దివిజచమూపతి, దండముండులు
వంద, డెబ్బదియు, నరువదియు నేబ
దిగ కలంబకము లుద్దీప్తినేయగ వెంట
మూలానుసారబలాళి రేగ
తారకాక్షాంధకాద్యసురపతుల వెన్క
కదిసి తోమరకుంతకణపశక్తి
పరశుకర్పణఖండివాలహాటకప్రాస
ప్రాసితదండవరాహకర్ణ

సకలదండాయుధోగ్రవర్షము కురియుచు
నూపుచేనిపై శలభపంక్తులను బోలి
షణ్ముఖుని పైన మూగిరి చటులశౌర్య
సారులై భుజాశక్త్యహంకారు లగుచు. (ష : ద్వి : 56)

తారకుడు, దైత్యసేనాపతి అయిన బాణుడు, దండ, ముండులు కలిసి ఒక్కసారిగా నూరు, వెయ్యి, అరవై, యాభై బాణాలు వేయగా, వాళ్ళ వెంట మూలానుసారబలానికి సంబంధించిన సేన కూడా షణ్ముఖునిపైకి చెలరేగింది. తారక, అంధక మొదలైన అసురనాయకులు వెనుకనుంచి తోమరము, కుంతము, కణపము, శక్తి, పరశువు, కర్పణము, భిండి, వాలము, హాటకము, ప్రాసము, ప్రాసితము, దండము, వరాహము, కర్ణము మొదలైన అన్నిరకాల ఆయుధాలతో వర్షం కురిసినట్టుగా కురిపించారు. భుజశక్తి సంపన్నులైన రాక్షసకుమారులందరూ ఒక్కసారి షణ్ముఖునిపై నువ్వుల చేనుపై మిడతలు గుంపులు గుంపులు పడినట్టుగా మూగినారు.

బలాల్లో-1. మూలబలం, 2. అనుసారబలమని రెండు రకాలు. మూలబలం చివరి క్షణంలో వస్తుంది. మూడవపాదం ఉత్తరార్ధం నుంచి నాల్గవపాదం చివరివరకు రకరకాల ఆయుధాల పేర్లు ఇవ్వబడ్డాయి.

షణ్ముఖునిపై ఒక్కసారిగా రాక్షసవీరులందరూ గుమికూడిన దాన్ని ఇంద్రుడు చూసి సేనాగ్రప్రాంతంలో ఉన్న విశాఖుని దగ్గరకు చేరి వినయంతో 'విశాఖా అటు చూడు. దుష్టరాక్షససమూహం సోదరుని కష్టపెడుతుంది. నీవు అచ్చటకు పో. ఇందరం మేమిక్కడ ఉన్నాం కదా' అన్నాడు. (ష : ద్వి : 57).

ఇంద్రునికి విశాఖుడు సమాధానం చెప్తున్నాడు-'నీవు రాజువు. నీ మాట మీరటం దోషమే. కాని మా సేనాపతి అయిన షణ్ముఖుని చాపపటుత్వం నీవు ఎరుగనిదా ఏమి ? కాకపోతే ఆతని (షణ్ముఖుని) ఆజ్ఞ చాలా గట్టిది. నన్ను ఇక్కడే ఉండమని అతడు నిలిపినాడు'. (ష : ద్వి : 58).

శ్రావ్యంబై ధ్వనియించు నల్లదిగో గర్జాశింజినీవల్లి దృ
ష్టివ్యాపారనిరోధకం బగయజోచ్ఛ్వేన్ కేతనాంశుచ్ఛటల్
భవ్యేష్వాసనదుర్నివారనిగమ ప్రాంచత్కళాశిల్పి ఈ
అవ్యుత్పన్నులు భ్రష్టరాక్షసుల నేల్గూలుగన్ మదోన్మత్తులై.

(ప : ద్వి : 59)

"అదిగో వింటి అల్లెత్రాడు శ్రావ్యమై ధ్వనిస్తున్నది. పతాక వస్త్రం ప్రకాశిస్తూ మన దృష్టిని నిరోధించేటంతగా రెపరెపలాడుతోంది. శోభాయమానమైన దుర్నివారమైన (నివారించడానికి సాధ్యం కాని) శివ ధనుష్కళాశిల్పి అయిన మన్మఖుడు మదోన్మత్తులై అవివేకులైన ఈ రాక్షసులను ఏల్లాడుతాడు (నరుకుతాడు)".

ఇంద్రుడూ, విశాఖుడు మాట్లాడుకుంటున్న సందర్భంలో వింటి నారిధ్వని వినిపిస్తుంది. యుద్ధభూమిలో ధనుష్టంకారంచేత సందేశం. ధనుష్టంకారమే ఒక సందేశం. ఇదంతా తనకేమీ భయం లేదని చెప్పడం. 'భవ్య ఇష్వాసనదుర్నివారనిగమ ప్రాంచత్కళాశిల్పి' అని ఉంది. 'నిగమము' అంటే వేదం. ధనుర్విద్య అనేది వేదం. ఆ కళలో ఆయన నిపుణుడు. ఇది చాలా అందమైన పద్యం. సంయుక్తాక్షరప్రాస అయినా ఆ ఒత్తులలోని క్లిష్టత మనకు కానరాదు. అన్న మీద ఎంత నమ్మకం! భక్తిభావమాధుర్యంతో అన్నమాట. ఆ మాధుర్యం ధ్వనింపజేయడం - చాలా అందమైన వాక్యనిర్మాణం. పద్యరచనలో ఒక రకమైన సంస్కృతి ఉంది. సంస్కృతికి పరకాష్ఠ యిది. పద్య రచనలో మంచి తీర్పు.

"క్షుద్రమైన విస్తారమైన మూకల నంతటినీ కనుపు గొట్టి (ముక్కలుగొట్టి) పాతిపెట్టి, ఒంటికి చెమట కాకుండా ఆతడు (మన్మఖుడు) వస్తాడు. నీవు వాత్సల్యంతో చెప్పుతున్నావు అంతే కాని" అని విశాఖుడు ఇంద్రునికి సమాధాన మిస్తాడు

ఆ మాటకు ఇంద్రుడు ప్రీతిజెంది అక్కడినుంచి పోతాడు (ష : ద్వి : 60). ఇక్కడ 'కనుపు గొట్టు' ప్రయోగంద్వారా చెరకు కనుపులు గొట్టినంత సులభంగా రాక్షసమూకలను షణ్ముఖుడు కొట్టగలడని ద్యోతక మవుతోంది.

ధనువున కంతటన్ గనులు తామరతంపరగాగ నిట్లు దా
రోకని చటులాగ్ని కీలల నరుంతుదముల్ వమియించునేమి ! నా
గసు గల పద్మపద్మమున గాలోకని తైజసదుర్నివార తీ
క్ష్ణ నిశితమార్గణచ్ఛటలు ఖండితముల్ బొనరించె వానినిన్.

(ష : ద్వి : 61)

స్వామి ధనుస్సు కంతటా కన్నులు. సప్తపద్మాలు ఆ ధనుస్సులో ఉన్నాయి. కనులన్నీ తామరతంపర అయి విజృంభించగా భయంకరమైన మంటలు క్రక్కుతున్నట్లుగా బాణాలనుంచి మంటలు వస్తున్నాయి. నివారించడానికి వీలుకాని (దుర్నివార)అత్యంత తీక్ష్ణమైన బాణాలు పద్మపద్మంనుంచి విజృంభించి మిడతలలాగా తనపై మూగిన రాక్షసమూకల బాణాలన్నింటిని (చూ.ష : ద్వి : 59) ముక్కలు ముక్కలుగా ఖండించి వేశాడు షణ్ముఖుడు.

ఒగి విద్యుత్పరివేగలంఘనముగా నొప్పన్ శతాంగంబు ని
ల్వ్వగ నష్టంబుగ మూలలన్ జెనటి చాళుల్ దున్నె ఖండంబులై
నొగులన్ సేన గుణాంబుభృన్నినదసంఘాతంబు నాపాత తీ
క్ష్ణగరుద్వేగ మహాస్త్రదగ్ధమయి రక్షస్సేన చీకాకుగా.

(ష : ద్వి : 62)

షణ్ముఖుడు శత్రుసేనను ఛిన్నాభిన్నం చేసిన విధానాన్ని కవి వర్ణిస్తున్నాడు. తన రథాన్ని విద్యుత్ వేగంతో శత్రుసైన్యంపై దూకించాడు. సేన మీదుగా తన రథాన్ని నిలువుగా పోనిచ్చాడు.

మళ్ళీ అడ్డంగా పోనిచ్చాడు. ఈ విధంగా సైన్యాన్ని నిల్వుగా, అడ్డంగా, మూలగా దున్నిపారేశాడు. ఆ దెబ్బకు సైన్యం ముక్కలు ముక్కలై నొగిలింది. షణ్ముఖుని వింటినారి ధ్వని అనే ఉరుముచేత అకస్మాత్తుగా సంభవించిన ఈ పరిణామానికి రాక్షససైన్యం, మంచి వాయువేగానికి మేఘాలు చెదరగొట్టబడినట్టుగా ఛిన్నాభిన్నమై పోయి, ఆ మహాస్త్రవేగానికి దగ్ధమయిపోయింది.

ఈ వర్ణనద్వారా వ్యవసాయంలో నిపుణుడైన రైతు చేసే మెట్టసేద్యం జ్ఞప్తికి వస్తోంది. బయలు పొలాన్ని రైతు ముందుగా నిలువుగా వరుసగా మడక (నాగలి) దున్నుతాడు. మొత్తం చేనంతా దున్నిన తర్వాత, ముందు దున్నినదానికి అడ్డంగా దున్నుతాడు. దీన్నే 'ఇరసాలు' (< ఇరచాలు) అంటారు. ఇట్లా చేయటంవల్ల భూమి మొత్తంలో ఏ మాత్రం గడ్డ (gap) లేకుండా మట్టి తిరగబడుతుంది. ఆ తర్వాత గుంటుకను మూలగా పోస్తాడు. మూలగా చాలు ప్రక్కన చాలుగా వరుసగా పొలాన్నంతా గుంటుకను తోలుతాడు. అప్పుడు మొత్తం భూమి ఏమాత్రం వెలితి (gap) లేకుండా తిరగబడటమే కాకుండా, నేల మెత్తగా సేద్యమైపోతుంది. ఈ పద్ధతిలో కార్తికేయుడు తన రథాన్ని రాక్షస సైన్యంపై నిల్వుగా, అడ్డంగా, మూలలుగా దున్నినాడని కవి వర్ణించాడు. ఇది చక్కటి అందమైన వర్ణన.

ఇలాంటి వర్ణన తిక్కన ఉత్తరగోగ్రహణంలో చేశాడు. అయితే అక్కడ మెట్టసేద్యం మాదిరి కాకుండా, అర్జునుడు మొదట సైన్యాన్ని రెండుగా చీల్చాడు. తర్వాత అడ్డంగా వెళ్ళి నాలుగు పాయలుగా చేశాడు. ఆ తర్వాత మూలలుగా వెళ్ళి సైన్యాన్ని అనేకమైన చిన్నచిన్న ముక్కలుగా చేశాడు. తిక్కన పద్యానికి పైది అనుకరణ పద్యమే అయినా, కవి ఇక్కడ ఇంకా కొంచెం

ముందుకుపోయి అసలైన మొట్టసేద్యాన్ని తలపించేటట్లుగా 'చెసటి చాళుల్ దున్నె' అన్నాడు.

తిక్కన పద్యం గమనించండి :

బల మెల్లన్ నెర రెండుపాయలుగ శుంభద్వేగుడై చొచ్చి యా
వలగా నష్టము వచ్చి, నాలుపుగ దుర్వారోద్ధతిం బోయి; మూ
లల నానాశకలాకృతిం బొరయ లీలాయాన దుర్దాంతుడై
వలయంబుల్ సని, చించి చిక్కువరచున్ వైకల్య సంపదిర్మై.
[శ్రీమదాంధ్ర మహాభారతము : విరాట : 5-48]

ఆ రకంగా కార్తికేయుడు రాక్షస సైన్యంలో వీరవిహారం చేసేటప్పటికి రాక్షసబలం ఏ గతి పట్టిందో కింది పద్యంలో చూడండి :

కుంభసంధింబడి గ్రొచ్చి వాలమునుండి
చన పత్రి కూలుచు చచ్చె కరులు
పై కేగు ముంగాళ్ళపైననే ఖండింప
చాపకట్టుగ బడు సైంధవములు
అక్షాగ్రకీలకా రూక్షఖండన చేత
చక్రముల్ దూసిన స్యందనములు
సెలకట్టె కొరతవేసిన నట్లె నిలువగా
సారథిన్ హెచ్చరించగ రథికులు

కూలు సిడములు దున్నెడు గొడుగు కాము
లును వడిం జిట్లు బండికండ్లును దొరంగు
నట్టె హారాలు పడియెడు చుట్టపులును
కలిగి పీనుగుపెంటలై కలగె చమువు. (వ : ద్వి : 63)

కుంభస్థలాలపై పడ్డ బాణాలు తోకలనుంచి బయటికి వస్తోంటే తుప్పకూలుతూ ఏనుగులు చస్తున్నాయి. పై కెగురుతున్న గుర్రాలను

ముంగాళ్ళనే ఖండింపగా చాపకట్టుగా పడిపోతున్నాయి గుఱ్ఱాలు. బండి ఇరుసుకు ఉండే బండి చిల్లలను కోపంతో ఖండించగా చక్రాలు విరిగి రథాలు కింద పడ్డాయి. బాణంతో పైనుంచి(తలపైనుంచి) క్రింద వరకు నిలువుగా దిగబడేటట్లు కొరతవేయగా అలాగే నిలబడ్డ సారథులను రథికులు హెచ్చరిస్తున్నారు. జండాలు కూలిపోయాయి. గొడుగుకామలు విరిగిపడుతున్నాయి. రథచక్రపు కుండలు వేగానికి చిట్లిపోతున్నాయి. ఏనుగులపై వేసే అంబారీలు (కూర్చోవటానికి వేసే పీటలు) విడివడిపోతున్నాయి. చక్రపుపట్టీలు (కమ్ములు) ఊడి పోతున్నాయి. ఈ విధంగా రాక్షససేన నాశనమై పీనుగుపెంటలై పోయింది.

విల్లులన్నీ ఫెళఫెళమని విరిగిపోయాయి. రక్షక కవచాలు పగిలి చిటపటమని వార్లుతున్నాయి. బాగా ఎండిన అడవి అగ్నికి కాలి పోయినట్లుగా రాక్షసమూలబలమంతా నాశనమైపోయింది.

(ష : ద్వి : 64)

ఎరచి కొనంగ వేఱొ నొక గృధ్రము చాపగుణోగ్రరావమున్
సరకుగ సేయకే ఎరక చాచి గుభాలున వ్రాలి ఫేనకం
ధర పిశితంపు ముక్కగొని తాను వియత్పథమేగ కాకబం
ధురతతి యడ్డగింప నట దుర్భరమౌ కలహమ్ము రేగెడున్.

(ష : ద్వి : 65)

భూమిమీద శవాల గుట్టలు ఎప్పుడైతే పడతాయో, కాకులు, గద్దలు చుట్టుకొని మాంసాన్ని పీక్కుతినడం సహజం. అలాంటి సంఘటన ఒక విచిత్రమైన పద్ధతిలో చూపబడింది.

ఒక గద్ద ఎంతో ఆసక్తితో మాంసాన్ని (ఎరచి) తీసుకోవ డానికి చాపనారి ధ్వనిని కూడా లెక్కచేయకుండా రెక్కలు చాచు

కుంటూ వచ్చి గుభాలున వ్రాలి మాంసపు ముక్క తన నోటితో కరచుకొని ఆకాశానికి ఎగిరిపోగా అక్కడ కాకులగుంపు దానిని అడ్డగించింది (ఆ మాంసపు ముక్కను పెరుక్కోవడానికి). అక్కడ దుర్భరమైన కలహం చెలరేగింది.

ఇక్కడ పాఠకునికి ఒక సందేహం రావచ్చు. మాంసపుముక్కలు గుట్టలుగుట్టలుగా పడి ఉంటే ఆ చిన్నముక్కకోసం కాకులు పెంపర్లాడ వలసిన పనిఏమి అని. అయితే క్రింద భూమిమీద భయంకరమైన ధ్వనులతో యుద్ధం జరుగుతున్నది.ఆ ధ్వనులను లెక్కచేయకుండా ఒక గద్ద మాంసపుముక్కను ముక్కుతో కరచుకొని పైకి పోయింది.అన్ని పక్షులూ కిందికి వ్రాలడానికి తెగబడలేదని చెప్పవచ్చు. ఈ గద్ద మాత్రం 'చాపగుణోగ్ర రావమున్ సరుకుగ సేయకే......పిశితంపు ముక్కగొని' పోయిందని కవి స్పష్టంగా చెప్పనే చెప్పాడు. ఇంకో రకంగా చెప్పాలంటే, మొదటిసారిగా మాంసపుముక్కను గద్ద నోటిలో చూశాయి. దానికోసం అవన్నీ కాట్లాడుతున్నాయి. ఇక్కడ ప్రతీకాప్రాయంగా పై విషయాన్ని చెప్పటం జరిగింది. అదో శిల్పం. గద్ద - కుమారస్వామి; కాకులు - రాక్షసులు.

రాక్షససైన్యంనుంచి వెలువడ్డ రక్తం నది అయిపారింది.

**మనోజ్ఞ :**

మెరకగు నేన్గు శవాల మెట్ట యతిరించుచున్
విరుగుచు దూకి రథాంగవీథి భ్రమియామనో
హరముగ చుట్లు రచించి అల్లన పిండికాం
తరములు దూరుచు ఫేనతన్ బయి కుబ్బుచున్.

(ప : ద్వి : 66)

**మే ది ని :**

బురబురమంచు శస్త్రముల పొళ్ళ పొంగుచున్ తీ
వ్ర రయమునన్ హయచ్ఛటల వాలపాళి వింజా
మరలు సిడమ్ములన్ బలిమి మట్టి త్రోసికొంచున్
ఝురులుగ పారె నస్రము నిశాటసైన్యమందున్.

(ష : ద్వి : 67)

రాక్షససైన్యం శవాలనుంచి కారుతున్న రక్తం నదులుగా పారుతోంది. మెట్టప్రాంతంనుంచి వచ్చేరక్తం ఏనుగు శవాలను దాటుకొని దూకుతోంది. అలా దాటేటప్పుడు ఏనుగు శవాలు అడ్డం కావడంతో రక్తప్రవాహం కొంతసేపు విరిగిపోయి ముందుకుదూకి రథాలు పడిఉన్న ప్రాంతంలో రథచక్రాల కుండలచుట్టూ మనో హరంగా చుట్లు తిరిగి ముందుకు పోతూ ఉంటే, రక్తంపై పొంగే నురుగుపైన కాలిపిక్కల మాంసపుముక్కలు (పిండీకాంతరములు) కొట్టుకొనిపోతున్నాయి. (ష : ద్వి :) బాణాల ధాటికి బురబురమని, రక్తం చిమ్మి మిక్కిలి వేగంగా ప్రవహిస్తూ గుఱ్ఱాలతోకలను వింజామరలు, పతాకాలను బలంగాత్రోసుకుంటూ రక్తం నదులుగా రాక్షససేనలో ప్రవహించింది. (ష : ద్వి : 67)

రథచక్రపు కుండలచుట్టూ రక్తం తిరిగేటప్పుడు మనోహరంగా చుట్లు చుట్టి తిరిగింది అనటం అందంగా ఉంది. అందుకే ఇక్కడ కవి మనోజ్ఞ వృత్తం వ్రాయటం.

మేదిని (ష : ద్వి : 67) చంపకమాల లక్షణాన్ని కొంత కలిగి ఉంటుంది. నడకలో అంతా చంపకమాల లక్షణం ఉంది. చివరికి expectation (అపేక్ష) దెబ్బతింటుంది. దీనివల్ల ఒక ఎఫెక్ట్ కలుగు తుంది. చివరి గణం విరిగిపోవడమంటే రాక్షసుల మనసులో బాధను

సంకేతించడంకోసం మేదినీవృత్తం గైకొనబడినట్లుగా మనం గ్రహించవచ్చు.

ఇదంతా రాక్షసేశ్వరుడైన తారకుడు చూసి ఒళ్ళంతా కళ్ళు చేసుకున్నాడు. కళ్ళలో నిప్పులు కురిశాయి. కర్కశంగా (కఠినంగా) వింటిని మ్రోయించి మహత్తరమైన శస్త్రాలతో నూరు ధనుస్సులు గల రథాన్ని చండవేగంగా ముందుకు దూకించాడు (ష : ద్వి : 68). వేగంగా శత్రురథమైన షణ్ముఖుని రథందగ్గరకు చేరి "ఓరీ ! ఆరు మొగవా ! పెద్దగా చేశావు. గుద్దుకు ఒక తల చొప్పున ఎగిరి పోతావు - ఇదిగో గోళ్ళతో మొగ్గలను గిల్లినట్లు గిల్లుతాను" అని తారకుడు (ష : ద్వి : 69) నారిని లాగి అంబులగుంపుతో షణ్ముఖుని రథంపై గప్పి ముంచెత్తినాడు. పన్నెండు కన్నులకూ అస్త్రాలతో గంతలు కట్టి, ఆగ్నేయాస్త్రం తీసుకొని షణ్ముఖుని కుక్కుట కేతన వస్త్రాన్ని నుగ్గుచేసి, గుఱ్ఱాలయొక్క వాగెలను (కళ్ళానికి కట్టే పగ్గాలు) నరికి, రథసారథి చేతులపై (ష : ద్వి : 70), వక్షస్థలంలో (ఎదపైన) నిశితమైన బాణపరంపరతో పొడిచి కఠోరంగా రక్తం చిందించాడు. ఆ తర్వాత రథికుడైన కుమారస్వామి ముంజేతులకు, భుజాలకు,కపోలభాగానికి చండతీక్ష్ణమైన శస్త్రాలతో గాయం చేయగా శరీరంపై రక్తం ప్రవహించింది (ష : ద్వి : 71). అలా రక్తం ప్రవహింపచేసి తారకుడు షణ్ముఖునితో "ఓరీ ! శిశువా ! నేనంటే పూర్తిగా తెలియదు నీకు. దిక్పతులను ప్రచండంగా అణచిపెట్టిన తీవ్రమూర్తిని. అగ్నికంటే తీక్ష్ణమైన వాణ్ణి నేను. అలాంటి నన్నురా, పసికూనా, ఇట్లు చేస్తావు (ష : ద్వి : 72) ఓరీ నన్నెవడను ! కున్నావురా ! నిన్న కళ్ళు తెరిచావో లేదో ! నీ దేవు (ఇంద్రు) నడుగు. దిక్పాలకులనే అష్టదిగ్గజాల కుంభస్థలాన్ని నా ముష్టి దెబ్బతో కొట్టాను (ష : ద్వి : 73)" అన్నాడు. 'నిన్న కళ్ళు తెరిచావో లేదో' అనే మాట తీరు - తెలుగుమాట తీరు అలా ఉంటుంది.

నీ వయస్సు కనీసం నా సర్వీసంత లేదన్నట్టుగా ఉంది. పలానా వాడినడుగు, నా సంగతి తెలుస్తుందని తెలుగువాడు మాట్లాడే వైఖరి- ఇది 'నీ దేవునడుగు' అన్నచోట కనిపిస్తుంది.

షణ్ముఖుడు తన పన్నెండు కనుబొమ్మలు ముడిచి "ఏమి చేసితివని నీవు ఇట్లా వదరుతున్నావు ?" అని వింటినారిని శ్రవణవీథి దాకా సాగలాగి (చెవులదాకా లాగటంవల్ల బాణవేగం పెరుగుతుంది), నిశితబాణం విడిచేటంతలో వెంటనే సైన్యానికి వెనుకగా ఉన్న సేననంతటినీ ఉసికొట్టుకొని ముందుకు వచ్చాడు ముండనాముడు. ఇది షణ్ముఖుడు చూసి,'తొలి ముద్దవు నీ'వని బాణం వేశాడు. దాన్ని దైత్యపతి అయిన తారకుడు నడుమనే త్రుంచివేశాడు. షణ్ముఖుడు నవ్వుతూ వాడి అయిన బాణాలు వేస్తోంటే (ష : ద్వి : 75), బాణుడు మొదలైనవారు గుమికూడి వివిధాస్త్ర మహాయుధాలు వానకాలం లోని వర్షధారలాగా ఆతనిపై కురిపించారు (ష : ద్వి : 76). జడివాన లాగా స్వామిని ముసురుకున్నారు.

> మౌర్వీ ఘోషము పింగలన్ జెలగి శుంభద్వీకమస్ఫూర్తిమ
> ద్గర్వాంధోగ్రము సర్వదిగ్వలయ దగ్ధస్ఫారచండంబుగా
> దుర్వారంబయి షణ్ముఖశ్రవణపంక్తుల్ సొచ్చె ఓహో ! విశా
> ఖౌర్వాగ్నిధ్వని నాకు చోదనముగా నౌనంచు చింతించుచున్.
>
> (ష : ద్వి : 77)

అంతలో మదించిన గర్వంతో మిక్కిలి ప్రకాశవంతమైన విక్రమరూపుడు చేసిన వింటినారిధ్వని (మౌర్వీ ఘోషము) తన వెనుక (షణ్ముఖుని వెనుక) చెలరేగగా, నివారించడానికి వీలులేనట్టిదై (దుర్నివారంబయి) సర్వదిఙ్మండలాలకు అత్యంత ప్రచండంగా వ్యాపించింది. ఆ ధ్వని షణ్ముఖుని చెవులకు సోకింది. "ఓహో !

ఇది విశాఖుని బడబాగ్ని ధ్వని - నన్ను ప్రేరేపించేదిగా ఉంది" అని అనుకున్నాడు షణ్ముఖుడు.

పై రెండు పాదాల్లో ఉన్న బరువైన కూర్పు, బరువైన బంధం క్రింది రెండు పాదాల్లో లేదు. యతిస్థానాలు, ఆ సమాసాలు వాటివల్ల మంచి బరువు వచ్చింది. సంయుక్తాక్షరాల ప్రాస సుకుమారంగా ఉంటుంది. సంగీతం (music) వినబడుతుంది. ఇక్కడ షణ్ముఖునికి విశాఖుడు ప్రోత్సాహమిస్తున్నాడు. విశాఖుడు వెనుక నుంచి ధ్వని చేశాడు. అతనికి పరవాలేదనే ధ్వని.

ఉద్యద్భీషణ ఫాలభాగమున కోపోద్రిక్తవహ్నిచ్ఛటా
మాద్యద్ధూమలతా వితానరుచిరంబై భ్రూకుటీభంగముల్
భేద్యద్యోచరశత్రుఖండన మహాబీభత్సరూపుండు స
ర్వద్యావాపృథివీభరమ్ముగను మౌర్వీన్ మ్రోసి చూపమ్ముగా.
(ష : ద్వి : 78)

బాణాదులు జడివానలాగా షణ్ముఖుని ముసురుకున్నారు. భయంకరమైన ఉద్రిక్తమైన కోపాగ్ని ఉదయిస్తున్న ఫాలభాగం (పణ =నొసలు) మధ్యలో పొగలు వ్యాపించి ముడిచిన కనుబొమ్మలు కలిగి శత్రువులైన రాక్షసులను ఖండనంచేసి బాధపెడుతున్న మహాభయంకర రూపం దాల్చిన షణ్ముఖుడు, ఆకాశం, భూమండలం సర్వమూ నిండి వ్యాపించేటట్టుగా కర్కశంగా వింటి నారిధ్వని ప్రయోగించాడు (ష : ద్వి : 78).

వర్షణమేయ దిగ్వలయ భాగము పీతవినీల రోహిత్రో
ద్ధర్షణవారివాహములు తారొకని స్వర్గజ పీసలెండ సం
ఘర్షణచండధారల నికామతటిత్ప్రటు వజ్రపాత సం
కర్షణఘోరపూ ప్రళయకాలమహోగ్రత తెచ్చిపెట్టగన్.
(ష : ద్వి : 79)

అలా సారథ్వని ప్రయోగించి వారుణాస్త్రం వేయగా ఆ ప్రాంతం అన్ని దిక్కులా పసుపు, నీలం, ఎరుపు రంగులు కల మేఘాలు ఒకదాని నొకటి త్రాకి వాటినుంచి అధికమైన మెరుపులు మెరిసి పిడుగుల వర్షం దట్టంగా కురుస్తూ ఘోరమైన ప్రళయకాలపు మహోగ్ర వాతావర ణాన్ని తెచ్చి పెట్టింది.

తిరుగన్ జ్యా మొరయించి రిష్టిగ మరుద్దివ్యాస్త్రమున్ వైచినన్
ఖరఝంఝుల్ ప్రళయోగ్రముల్ చటుల నిర్ఘాతోగ్రనిర్ఘోష భీ
కరముల్ సుళ్ళుగ నద్రిపాటన సమగ్రంబుల్ రజశ్చక్రముల్
తిరిగెన్ ఛాదిత భూనభోంతర సమిద్వీధి ప్రచండంబులై.

(మ : ద్వి : 8(1)

వెంటనే మళ్ళీ వింటినారి ప్రయోగించి బలంగా దివ్యమైన పవనాస్త్రం వేయగా ఉగ్రమైన ప్రళయకాలపు వడగాడ్పులు (ఖరఝంఝులు), ఉగ్రమైన భయంకరమైన ధ్వనులతో కూడిన మెరుపులు, పిడుగులు సుళ్ళుగా కొండలను చీలుస్తూ సమస్తమైన దుమ్ము, ధూళి- భూమ్యాకాశం మొత్తం అంతా కప్పబడి వ్యాపించి వలయాలు వలయాలుగా తిరిగింది. ముక్కలు ముక్కలుగా విడిపోవటం ద్వారా సుడిగాలుల విన్యాసం తెలుస్తుంది.

కురిసిన పిడుగుల వర్షానికి, భూమ్యాకాశమంతా ధూళి వ్యాపించినదానికి, రాక్షస సేనలో ఏమి జరిగిందో ఈ క్రింది పద్యం చెబుతోంది -

ప్రళయాంధకార ధారాచ్ఛట కనలేక
తమ్ము తామె యసుల గ్రుమ్ముకొంచు
ఈదగాడ్పులతోడి వృష్టిధారల నాని
సకలాంగములు బిరుసుకొని చచ్చి

ఘోళఘోళార్భటులతో పిడుగుతండము రాలి
నిలువుగ మోడ్చి మొద్దులయి నిలిచి
సుడిగాడ్పున నెగిరిపడి బిళ్ళబీటుగ
పరియలై చితికి రూపరుచు చెదరి

విరుగు సిడములు పొళ్ళయి నురుము లగుచు
శీర్ణమౌ స్యందనాంగముల్ శితము లాయు
ధములు లుంగలౌ హయములన్ తతము జడిసి
పొట్ట లుచ్చిన పొలమయ్యె చెట్టపౌజు. (ప : ద్వి : 81)

భూమ్యాకాశ మంతటా ప్రళయాంధకారమైన ధూళి వ్యాపించ డంతో ఏమీ కనబడక రాక్షసులు తమలో తామే బాణాలతో పొడుచుకుంటున్నారు. ఈదురగాలులతో కూడిన వర్షధారలకు నాని దేహంలోని అన్ని అవయవాలూ బిగుసుకొని చచ్చారు. ఘోళఘోళ ధ్వనులతో పిడుగుల సమూహం రాలి నిలువుగా మోడి శవాలు మొద్దులుగా నిలిచాయి. సుడిగాలులు ఎగిరిపడి శరీరం బీటలుగా చీలిపోయి చితికి రూపు లేకుండా చెదరిపోయాయి. ఉరుములు పడి జండాలు విరిగిపడుతున్నాయి. రథచక్రాలు బద్దలైపోయాయి. వాడిగల ఆయుధాలు కూడా తునాతునక లయ్యాయి. బలసిన గుఱ్ఱాల సమూహం మొత్తం చెదరిపడింది. ఈ విధంగా పొట్టలు పగిలి పోయిన పంటచేను బోసిపోయినట్లుగా రాక్షససేన మొత్తం చెదరి పోయింది.

ఈదురుగాలుల చలికి బిగుసుకొని చచ్చారనన్న విషయం చాలా సహజంగా ఉంది. రాక్షససైన్యం మొత్తం బాణపు దెబ్బకు కాకుండా బాణప్రభావంతో వీచిన పెనుగాలులకు, వడగాడ్పులకు, ఉరుములకు, పిడుగుల దెబ్బకు చచ్చింది అని చెప్పటం ఇక్కడి ప్రత్యేకత.

దీన్ని చూసి బాణుడు పెట్రేగిపోయి సూర్యాస్త్రం వేశాడు. సూర్యాస్త్రశక్తికి దట్టమైన చీకటి చీల్చివేయబడి వెలుగులు పొడుచు కొని వచ్చాయి (ష : ద్వి : 82). గాలివాన వెలిసింది. కూలిపోయిన గుడిసెలు, వంగిన చెట్లు, విరిగిన చెట్లు, చీలిపోయిన చెట్లు, మునిగి పోయిన జంతువులు ఉన్నట్టి పల్లెవలె పడి ఉన్న రాక్షససేనను చూశాడు బాణుడు (ష : ద్వి : 83). 'నా నాయకత్వంలో ఇంతపని అయినది గదా' అని మనసులో దుఃఖిస్తూ 'ఛీ ! నా మొగ మెట్లు రాజుకు చూపాలి ? చావో, జయమో తేల్చుకోవలసిందే' నను కున్నాడు బాణుడు. (ష : ద్వి : 84)

ముప్పాతిక మువ్వీసము
తుప్పున చచ్చినది సేన తోచదు నాకన్
రొప్పింత వీని నెత్తురు
దొప్పల ద్రాగ కెటులుండుదు నటం చెంచెన్. (ష : ద్వి : 85)

రాక్షససేన ముప్పాతిక భాగం తుప్పున చచ్చింది. వానలో ఏమీ తోచదు. బాణుడు పెద్దగా అరుస్తూ 'వీని నెత్తురు దొప్పలతో (ఆకులు కట్టిన దొన్నె = గిన్నె ఆకారం) త్రాగకుండా ఎట్లా ఉటాను?' అనుకున్నాడు. [1]

ముండుడు గుర్తు తెలియకుండా చచ్చాడు.(చూ. ష : ద్వి: 72)- తొలి యుద్ధపు నీవని బాణం వేశాడు షణ్ముఖుడు - ఆ ముండుడు ఇప్పుడు తెలియకుండా చచ్చాడు. అంటే వాడెప్పుడూ చచ్చాడో

1 అర్థవైచిత్రి కనిపిస్తుంది. కారణం ప్రాస (ద్విత్వపకారం). యతిప్రాసలు mental discipline కలుగజేస్తాయి. వచనకవిత్వంలో శిల్పం లోపించ డానికి కారణం ఇదే. దేనికదే విడిపోయేదాన్ని ఛందస్సు ఒక క్రమంలో పెడుతుంది. ఛందస్సు మన మనస్సును ఊహింపజేస్తుంది. ఛందస్సు మనస్సుకు భావోన్ముఖమైన శిక్షణను కల్పిస్తుంది.

రాక్షసు లెవరూ చూసుకోలేదన్నమాట.) దండుడు, అంధకుడు వస్తున్నారు. 'ప్రభు వెక్కడ ? అతడు రాకమునుపే శత్రువైన షణ్ముఖుని ఖండిస్తా'నని బాణుడు రథాన్ని వేగంగా తోలించాడు (ష : ద్వి : 86). దండాంధకులు వచ్చి రథం ప్రక్కన చేరి ఒకవైపు బాణుని రథ రక్షకులుగా నిలిచారు. బాణుడు వింటినారిని ఎగలాగుకొని (గుణోగ్ర నిర్ఘోష మెసగ జేసికొంచు) తీవ్రమైన అస్త్రాలను సంధించి విడిచి షణ్ముఖుని మూపు పైన, ఱొమ్ము పైన, భుజాల పైన, ముంజేతి పైన నాటుకునేటట్లు చేశాడు (ష : ద్వి : 87). 'నిర్ఘోష మెసగ' అంటే ఒక అర్థం. 'ఎసగ జేసికొంచు' అంటే ఇంకొక అర్థం. నిర్ఘోష మెసగ అనడానికి, ఎసగ జేసికొంచు అనడానికి క్రియాప్రయోగంలో తేడా ఉంది. ఎసగజేసికొంచు అన్నప్పుడు, లేనిశక్తిని కూడగట్టు కోవడాన్ని చెబుతోంది.

ఉజ్జ్వలులై బాణుడు - షణ్ముఖునికి; దండుడు - సారథికి; అంధకుడు - స్యందనానికి (రథానికి) గురిచూసి పెట్టుకున్నారు. ముగ్గురి బాణాలూ ఒకేసారిగా వస్తున్నాయి. వాటి లక్ష్యాలను చూసి షణ్ముఖుని పన్నెండు కళ్ళు అగ్ని మంటలలాగా మండుతున్నాయి. (ష : ద్వి : 88)

రుద్రుడు మండలాకృతిగ రూక్షమహాధ్వనమ్ము వంచి ని
ర్నిద్రుడు యోగి తా తపము నిశ్చలతం గొనగా తనూనసాంద్
భద్రము మండలావరణ భావన చేసినయట్లు చుట్టు రూ
క్ష ద్రఢిమంబు వప్రమును గట్టె ధనంజయ రౌద్రసంతతిన్.
(ష : ద్వి : 89)

తన పన్నెండు నేత్రాలూ అగ్నిగోళాలలాగా మండగా, రుద్రుడై షణ్ముఖుడు వలయాకారంగా శివధనుస్సును వంచి (బాణం లాగి విడిచేటప్పుడు విల్లు ఎంత వలయాకారంగా వంగుతుందో అంత

వేగంతో బాణం పోతుంది) నిద్రపోనట్టి యోగి తాను నిశ్చలంగా ఉంటూ తన చుట్టూ భద్రమైన అగ్నివలయాన్ని భావన చేసినట్లుగా ప్రచండమైన ఫిరంగిధ్వని చేస్తూ రౌద్రమైన ధనంజయ (అగ్ని) బాణంతో తన చుట్టూ అగ్నివలయాన్ని కట్టుకున్నాడు.

తంత్రోపాసనతో అగ్నిమండలాన్ని సృష్టించుకున్నాడు - షణ్ముఖుడు. ఉత్తర హరివంశంలో నాచన సోమనాథుడు బాణాసురుని కథలో వేదమంత్రశక్తుల యుద్ధాన్ని వర్ణించాడు. అలాగే ఇక్కడ కూడా అగ్నిమండల నిర్మాణం మంత్రశాస్త్ర సంబంధమైన విషయం.

"ఎప్పుడు వప్రము (అగ్నివలయం) కట్టాడు! ఎప్పుడు తమ ధనుస్సులు (బాణుని, దండుని, అంధకుని ధనుస్సులు) నరకబడ్డాయి!" అని అనుకుంటూ విషయం తెలుసుకొని వాళ్ళలో వాళ్ళు అరచు కొంటున్నారు. ఆశ్చర్యంనుంచి మళ్ళీ తేరుకొని ముగ్గురూ విశేషంగా కనుగ్రుడ్లు త్రిప్పుతూ షణ్ముఖునిపై బాణాలు గుప్పించారు. (ష : ద్వి : 90)

ఇంతలో మహావక్త్రుడు, లోహజంఘుడు, అసిలోముడు, కూర్మకంఠుడు, విద్యుజ్జిహ్వుడు, ఖరణాసురుడు, పింగళాక్షుడు మొదలైన రాక్షసనాయకులను కలుపుకొని (కూడగట్టుకొని) తారకుడు - సేనాపతి అయిన బాణుడు మొదలైనవాళ్ళతో పోరాటం సలుపుతూ నిమగ్నుడై ఉన్న కుమారస్వామిని ఖండించ డానికి వెనకవైపునుంచి వచ్చి దూరంగా పోయి ప్రక్కకు తిరుగు తుండగా, వాళ్ళను స్వామి చూసి నవ్వుకొని తేరును (రథాన్ని) వెనుకవైపుకు గదిమి వాళ్ళూ, వీళ్ళూ (తారకాదుల గుంపు, బాణా దుల గుంపు) కూడా కనబడేచోట ఒక మూలలో నిలిచి అంబుల సమూహాన్ని వాళ్ళపై వెదజల్లినాడు. (ష : ద్వి : 91)

రెండు గుంపులూ కనబడేటట్టుగా రథాన్ని తోలుకొనిపోయి ఒక angle లో (కోణంలో) నిలిచాడు షణ్ముఖుడు. ఒక ప్రత్యేకస్థానంలో చెప్పబడుతున్న క్రియ లవి.

వేయివింట్ల వెన్క విబుధసేనాగ్రమ్ము
నన్ ప్రచండ ముఖమునన్ విశాఖు
డుండె రిపులు వెనుక కొదిగి రా వీలుతే
నట్టి యెడ నిలిచె షడాననుండు. (ష : ద్వి : 92)

వేయి ధనుస్సుల దూరంలో వెనుకప్రక్క విశాఖుడు దేవ సేనకు ముందు నిలబడ్డాడు. శత్రువులు వెనుకకు పొంచి రావడానికి వీలు లేనట్టి చోట షణ్ముఖుడు నిలిచాడు. యుద్ధసైన్యాన్ని - పై పద్యంలో 91లో చెప్పినదానినే - వివరిస్తుం దీ పద్యం (ష : ద్వి : 92). 'విబుధసేనాగ్రమ్ము నన్ ప్రచండ ముఖమునన్' - 'నన్' - యతిస్థానం. రూక్షణంగా, ప్రచండంగా విశాఖు డున్నాడని - విరుపుచేత ఒక దూకుడును చెప్పటం జరిగింది. విశాఖుని తీవ్రత ఎంతటిదో తెలుస్తుంది.

ఉగ్రగంపశ్యుడు ద్వాదశాంబకుడు వ్యూఢోరస్కుడున్ జానుదే
శగ్రాహార్గళ దీర్ఘబాహుడు ధనుస్సంవిత్ సమస్త ప్రభుం
డుగ్రాఘాధిక రౌద్రు డాత్త గుణవల్ల్యుద్భూత నిర్హ్రాద ధూ
తాగ్రాభ్రస్థలు డాసురాళి హనన వ్యాపారుడై పొల్చుచున్.
(ష : ద్వి : 93)

శత్రువులకు తేరిచూడరాని శివునివంటివాడు, పన్నెండు నేత్రాలు కలిగి విశాలమైన దృఢమైన వక్షస్థలం గలవాడు, మోకాళ్ళదాకా పొడవుగల బాహువులు గలవాడు, ధనుర్విద్యా పరిపూర్ణుడు, సమస్త జీవరాసులకు ప్రభువైన షణ్ముఖుడు రుద్రుడై అత్యధికమైన వింటినారి ధ్వనులతో విడువబడ్డ బాణాలతో రాక్షసులను చంపుతున్నాడు.

పద్యం ఎత్తుగడ గమనించదగ్గది. ఉగ్రంపశ్యుడు అంటే శివుడు. లనేత్రం గలవాడు - అంటే షణ్ముఖుడు రుద్రుడైపోయాడన్న ాట. పద్యం ఎందు కక్కడ మొదలవుతోంది?- నిలబడటంలోని ౹గిమ. భారతీయ శిల్పంతో పరిచయముంటే తప్ప, శిల్పం అర్థం దు. ఎల్లోరా నరసింహస్వామి మొదలైన విగ్రహాలు నిలబడ్డ పనుంచి ఈ పద్యం ఎత్తుగడ పుట్టింది. పద్యం ప్రాసస్థానం, మీాద ౹రిదూకుతున్నట్లు అనుభవాన్ని కలిగిస్తున్నది. అంటే షణ్ముఖుడు తువులమీాద లంఘించడాన్ని ఎత్తుగడ ధ్వనిస్తున్నది. భారతీయ ల్పాలు రౌద్రరసమూర్తులు. పద్యమిలా ప్రారంభంకావడం శిల్పం- ానుదేశ గ్రాహర్గళ దీర్ఘబాహుండు', 'ధనుస్సంపిత్ సమస్త ప్రభుం ంగ్రాక్షాధిక రౌద్రుడు','ఆత్తగుణ వల్ల్యుద్భూత నిర్హ్రాదభూతాగ్రాభ లుడు' అని ఆ సమాసాల కల్పనంచేత ఒక భయంకర లక్షణం ల్పించబడింది. ధనుర్విద్యకు అధిదేవత 'War God' కుమార ్వామి అంటారు. నారిధ్వనిచేత పైనున్న ఆకాశాన్ని ఇంకా పైకి ెట్టినాడు.

వాయవ్యంబులు వారుణంబులు లసత్ పర్జన్య పైతామహా
గ్నేయంబుల్ శివదేవతాకములు లక్ష్మీనేత్ర దైవత్యముల్
స్థాయచ్చాప యుగాంత లస్తకపటు జ్యావల్లికోద్భూతముల్
ప్రాయోథర్వ నిశాత మంత్ర నిచయార్థ క్రౌర్యముల్ చల్లగన్.
(ష : ద్వి : 94)

దీర్ఘమైన చాపాగ్రాలకు బిగించిన నారినుంచి లస్తకాన్ని (వింటి మధ్యభాగమైన పిడి) పటుత్వంతో పట్టుకొని అథర్వవేదంలోని మంత్రాలు చదివి నిశితమైన వాయవ్య, వారుణ, వర్ష, ఆగ్నేయ, నారాయణాస్త్రాలు మొదలైన అనేక రకాల అస్త్రాలు అథర్వ వేదంలోని మారణ మంత్రార్థ తీవ్రములైన ఆయా మహాస్త్రాలను రాక్షససేనపై షణ్ముఖుడు ప్రదజల్లాడు.

అస్త్రాలు వేయటం కాదు - 'చల్లు' అనే క్రియచేత సైతు గింజలను పొలంలో వెదజల్లినభావం స్ఫురిస్తున్నది 'ఖ్యావల్లిక - ఉద్ఘాతముల్' - ఉద్ఘాత శబ్దంచేత భావించవచ్చు - బాణాలు ఎంత వేగంగా నారినుంచి వెదజల్లబడ్డాయో. అథర్వంలో మారణ మంత్రాలున్నాయి.ఆ మంత్రాల ప్రభావంచేత ఆ బాణాలు ప్రజ్వరిల్లి రాక్షసుల పాలిట ఎంత క్రూరంగా బయలుదేరాయో 'మంత్ర నిచయార్థ క్రౌర్యముల్'(చల్లగన్)'అనే సమాసంచేత వ్యక్తమవుతుంది.

అవి తీవ్రేషువులో మహాస్త్రతతులో ఆభీల తేజశ్శుశుతాం
శువులో మంత్రములో ఎరుంగకయె చచ్చెన్ సేన సర్వాస్త్ర సం
ఘవివేక ప్రతిభావిచక్షణుడు రక్షస్స్వామి తత్ప్రాతికూ
ల్య విధిజ్ఞుండయి త్రిప్ప లేడు నిశితాస్త్రాళి ప్రచండోద్ధతిన్.

(ష : ద్వి : 95)

అవి తీవ్రమైన బాణాలో, మహాస్త్ర సమూహాలో భయంకరమైన అగ్ని కణాల వర్షమో, మంత్రములో అర్థం కాకుండానే రాక్షస సేన చస్తున్నది. సర్వ అస్త్రాలనూ ప్రయోగించే సమర్థుడై ప్రతిభావిచక్షణుడైనట్టి రాక్షసరాజు తారకుడు ఆ ప్రాతికూల్య విధానం తెలిసికూడా స్వామి అస్త్రాలను నివారించలేకపోతున్నాడు.

దైవప్రాతికూల్యంలో మనం ఏమీ చేయలేమని చెప్పటం ఇక్కడ గుర్తించదగ్గది. తారకాదులగుంపు వేర్వేరు దిక్కులనుంచి ఒకేసారి స్వామిమీద పడకుండా వారందరినీ సమర్థంగా ఎదుర్కొవడమే కాకుండా, వాళ్ళను గుక్కతిప్పుకోకుండా చేశాడు.

బాణం వేయడానికి లక్ష్యశుద్ధి (గురి), మిక్కిలి వేగము, దృఢమైన ముష్టితో నారిని లాగటం, ఎట్లా కావాలో ఆ విధంగానే అస్త్రం వేయడానికి-నిశ్చలమైన ధ్యానం, భక్తి కావాలి(ష : ద్వి : 96).

కాబట్టి ఎడమనే విరిగిపోయిన అస్త్రంకూడా సైనికులను చంపు తున్నది. ఆయుధానికి పదునైన రంపపుపళ్ళ అంచులు ధూళి అయి రాలిపోయికుండా రాక్షస సైన్యాన్ని బూడిద చేస్తున్నవి(ష: ద్వి:97). ఇత డెవ్వడో మాంత్రికుడే ! మహేంద్రజాలికుడై వరుసగా వేసిన అస్త్రాలకు సైన్యం మొత్తం చచ్చి, బాణుడు, దండుడు, అంధకుడు, తారకుడు మొదలైనవాళ్ళు, వీసం (1/16వభాగం) సేన మాత్రం చావకుండా నిలిచిపోయారు.

సుకుమారమైన కేసరాలలాగా రెప్పల వెంట్రుక లున్న లోచనములు-స్వామి కళ్ళు- కృపామధువును స్రవించినట్లు ఉండగా, అప్పుడే తామరపూల రేకుల కాంతులు వెదజల్లుతుండగా ముఖమంతా నవ్వుల వెన్నెల కాంతులు వ్యాపింపగా చూస్తున్న షణ్ముఖుని బాణుడు చూసి మండిపడ్డాడు (ష : ద్వి : 99). షణ్ముఖుని చూసి బాణుడు మండిపడి ఆగ్నేయాస్త్రానికి వాయుబాణం తోడు కాగా సంధించాడు. ఆతనికి పార్శ్వరక్షకులు (దండాంధకులు) సహాయపడుతూ విజృం భించారు. ఇంకొకవైపున కోపంతో తారకాదులు ఉగ్రాత్ములై విజృంభించారు (ష : ద్వి : 100).

ద్వాదశదీర్ఘ బాహుపరివర్తిత షట్ దృఢ చాపమూర్తియై
ఆ దెస మూడు నీ దెసగ నవ్విధి మూడు ముఖాల చూచుచున్
మోదెను తీవ్రచండ శరపుంజముచే కని బాణు డార్చుచున్
వే ధృత ముష్టిదఘ్న శరవృష్టి గుఱాలకువాళముల్ పడన్.

(ష : ద్వి : 101)

చెండెను పార్శ్వరక్షకులు చెక్కిరి వాగెలు తారకుండు కో
దండగుణ ద్వయీ త్రుటనధర్మ యుగమ్మును తూల్చి వుచ్చి షట్

ఖండమ్ములై ధనుస్త్రయము గూలె మహాముఖ లోహజంఘు లు
ద్దండత సారథిం బొదివి తత్కశ తూల్చి రుదగ్రమూర్తులై.
(ష : ద్వి : 102)

ఇది చూసిన షణ్ముఖుడు గురిచూసి కోపంతో పన్నెండు దీర్ఘమైన బాహువులతో దృఢమైన ఆరు ఉగ్రధనుస్సుల నెత్తి ఆవైపు మూడు ముఖాలతోనూ, ఈవైపు మూడు ముఖాల తోనూ చూస్తూ, తీవ్రమైన ప్రచండమైన శరసమూహాలతో మోదినాడు. ఇది చూసి బాణుడు అరుస్తూ వేగంగా గుప్పెడుకొద్దీ బాణాలు ధరించి బాణవర్షం కురిపించి గుఱ్ఱాలజీన్లు పడగొట్టాడు (ష : ద్వి : 101). పార్శ్వరక్షకులు గుఱ్ఱాల పగ్గాలు నరికారు. తారకుడు రెండు బాణాలు ప్రయోగించాడు. ఆ రెండు బాణాలను ఆరు ముక్కలుగా చేశాడు షణ్ముఖుడు. ఆ ముక్కలు స్వామిచేతిలోని మూడు ధనుస్సులను విరగ్గొట్టగా, రాక్షససేనానులు సారథిని ఆక్ర మించారు. వెంటనే షణ్ముఖుని తేరు (రథం) అదుపుతప్పిపోయింది- [గుఱ్ఱాల పగ్గాలు తెగిపోయినందువల్ల] (102).

అంతగా అరచి మొత్తుకొని బాణాలు వేసినా, కుమారస్వామి గుఱ్ఱాలజీన్లు మాత్రం పడగొట్టగలిగాడు బాణుడు. ఆరు ధనుస్సులు పట్టుకొని పన్నెండు బాహువుల నేర్పరచుకొని మూడు ముఖాలతో ఆ వైపు, మరో మూడు ముఖాలతో ఈ వైపు చూస్తూ యుద్ధం చేస్తున్న షణ్ముఖుని ఆకార వర్ణన ఒక మంచి శిల్పం.

అదుపు తప్పి తూలుతున్న రథాన్ని చూసి 'సారథీ, గుఱ్ఱపు పగ్గాలు సరిజేసుకో. ఆ రాక్షసులపని నేను చూస్తా' నంటూ ఆరు అస్త్రాలను ప్రయోగించి రథాన్ని బాణసమూహంతో కైవారం (చుట్టుగోడ) కట్టాడు - షణ్ముఖుడు (ష : ద్వి : 103). ఇలా రథం చుట్టూ బాణసమూహంతో కైవారం కట్టడంవల్ల శత్రువులు

కై వారాన్ని దాటుకొని రావడానికి లేదా ఛేదించడానికి కొంత సమయం పడుతుంది. ఆ లోగా సారథి పడిపోయిన గుఱ్ఱపు జీనులను, తెగిపోయిన పగ్గాలను మళ్ళీ సరిజేసుకొని గుఱ్ఱాలకు తగిలించవచ్చు. అందుకే 'రథమును శాణచయముచేతి పరిధి చుట్టె' అన్నాడు కవి. ఇదే అదనని రాక్షసనాయకులు వేగంగా తమతమ రథాలను నడిపి సంతోషంతో ఆక్రమించడానికి ప్రయత్నం చేయడానికి శత్రువుముందుకు రావడాన్ని చూసి, షణ్ముఖుడు మారుతాస్త్రం (వాయుబాణం) వదిలాడు. దాని దెబ్బకు రాక్షసులు అర్ణమర్లయి దిక్కులకు చెల్లాచెదురుగా దూరమై పడ్డారు. 'ఛీ!' అని తారకుడు తీవ్రంగా విజృంభించాడు : (ప : ద్వి : 104)

దూసెను బ్రహ్మనామకము తూల సురాళులు గర్భ వ్యూహర
శ్రీసమతా విభగ్నముగ చేరి విశాఖుడు తీక్ష్ణశింజినిన్
మ్రోసెను రక్షణావధిగ మ్రోసిన షణ్ముఖు నారి మ్రోతతో
డాసెను తేరు నస్త్రమును డాసిరి దైత్యులు క్రోధమూర్తులై.

(ప : ద్వి : 105)

తారకుడు తీవ్రంగా విజృంభించి బ్రహ్మాస్త్రం వేశాడు. గర్భవ్యూహమంతా చెడిపోయేటట్టుగా తూలిపోయి దేవతలు విశాఖుని చేరారు. విశాఖుడు తీక్ష్ణంగా వింటినారిని రక్షణావధిగా (రక్షణ కల్పించడానికి) మ్రోగించాడు. ఈ విధంగా విశాఖుడు చేసిన నారిధ్వని - షణ్ముఖుని నారి మ్రోతను సమీపించింది. దైత్యులు క్రోధంతో రథంపై తలపడ్డారు.

వచ్చె తదస్త్ర ముద్ధవిడి వహ్నిముఖామరు లెల్ల భీతులై
ముచ్చముణుంగ షణ్ముఖుని మోమున నవ్వులమువ్వ నవ్వదల్
చెచ్చెర మూగ దాని తన చేతిని సాచి గ్రహించె కన్నులన్
విచ్చి కనుంగొనన్ దితిజవీరులు తారకు డద్భుతంపడన్.

(ప : ద్వి : 106)

ఆ బ్రహ్మాస్త్రంనుంచి ఒకముక్క విరిగిపోయి వస్తోంది. ఆ అభిముఖులైన (ఎదురుగాఉన్న) అమరులందరూ మిక్కిలి చెందారు. షణ్ముఖుని ముఖంలో నవ్వుల మువ్వల ధ్వ వ్యాపించగా, ఆ బ్రహ్మాస్త్రాన్ని తన చెయ్యిసాచి అందుకున్న దీన్ని చూసిన రాక్షసవీరులు గుడ్లప్పగించుకొని చూస్తున్నా తారకుడు ఆశ్చర్యపడ్డాడు.

సారమతి వ్యపేతమగు జంతుత రూపు ధరించినట్టి ని
న్నోరి పిశాచమూర్తి ! విను మొక్కక్షణమ్మను చాలు చం
తారక ! కాని చంప నిను నమ్మిన వారల నెల్ల చీల్చి త
న్మారణహోమమున్ గనుల దన్పి నినుం బరిమార్తు కష్టుడా
(ప : ద్వి :

"ఓరీ ! బుద్ధిలేని జంతుత్వం రూపుగొన్న దుష్టపిశాచమా విను - నిన్ను చంపడానికి ఒక్క క్షణము చాలు తారకా ! చంపను. నిన్ను నమ్మిన వారినందరినీ తుదముట్టించి, ఆ హోమాన్ని నీ కళ్ళకు చూపించి ఆ తర్వాత నిన్ను చంపు కష్టుడా (అల్పుడా) !" అన్నాడు షణ్ముఖుడు.

'కష్టుడా !' అన్న సంబోధన సమయ సందర్భోచితంగా తారకుడు పూర్వం మునులను కష్టపెట్టి హింసించాడు. అందుకు ఫలంగా ఇప్పుడు వాడు కష్టపడుతున్నాడు. కష్టాలపాలవుతున్నాడు.

షణ్ముఖు డన్న మాటలకు రక్షఃపతి తారకుడు 'ఏడ్చినా అంటూ దివ్యాస్త్రం సంధించాడు. అంతలోగా బాణుడు వంద బాణాలు వేశాడు. ఆ యా రాక్షసనాయకులు వేలకొద్దీ కనకనవ బాణాలు వేయగా, వాళ్ళందరి బాణాలూ కార్తికేయుడు ఛిన్నాభి చేసి (తునకలు తునకలుచేసి), బాణుని రథాశ్వాలను (గుఱ్ఱాల కేతనం (జండా) మొదలైన వాటిని కూల్చి వేశాడు (ప : ద్వి : 1

తీవ్రకోపం చెందిన చక్రరక్షకులు (అంధకుడు, దండుడు) వర్షాణా రౌద్రమైన గాంధర్వ బాణాలను వేయగా, షణ్ముఖుడు విజృంభించి అన్నిటినీ అనాయాసంగా అవలీలగా నివారించాడు. పావురం రంగుతో తెల్లగా ప్రకాశిస్తున్న మనోజ్ఞమైన షణ్ముఖుని రథాశ్వాలను కఠినంగా చంపడానికి విరథులైన ముగ్గురు అసి, గద, తోమరములనే ఆయుధాలు వేయబూనినారు. ముగ్గురూ మూడు రకాల ఆయుధాలు (అసి, గద, తోమరం) వేశారు. షణ్ముఖుడు పలకలతో (ఆయుధాలతో) శత్రుబాణ వర్షాన్ని దూరంగా కొట్టాడు. తారకుడు కోప తీవ్రతతో బాణం వేయబూనినాడు. తారకాదులను ఐదు కోదండము లతో (ధనుస్సులతో) ఎక్కడ నిల్చినవారి నక్కడే కదలిరానీకుండా కట్టేశాడు గాంగేయుడు (కుమారస్వామి). ఇంతలో శాఖుడు, దండుడు, అంధకుడు - వీళ్ళు ముగ్గురు రథం కాడినెక్కి నొగలమీద చేరుకొని సారథిని తుదముట్టించాలని అనుకున్నారు.

(ష : ద్వి : 109)

ఊపునన్ వచ్చి యెగిరి వాయుపథమందు
అచటనే మండి త్రివిధకీలాకులముగ
మాడి షణ్ముఖాగ్నేయాస్త్ర మహితశక్తి
వ్రాలి రథిపుసు చూడ నింగాలములయి. (ష : ద్వి : 110)

సారథిని తుదముట్టించాలనుకొని ఊపుతో ఆకాశంలోని కెగిరారు. అలా ఎగిరినవారు అక్కడి కక్కడే షణ్ముఖుని ఆగ్నేయాస్త్రంయొక్క గొప్పశక్తిచేత మాడి బొగ్గయి రాలిపోయారు - తారకాసురుడు చూస్తూ ఉండగానే.

## మధ్యాక్కర :

ఎదురుగా నిల్చి చిట్టడవి కోనవంక తటమ్మునందు
ముదురు బొడిదచెట్టు విటపముల్ సాచి నిల్వ నభస్య

భిదురపాతము నంది తలను ్రీలుచు మూడు పంగలుగ
మొదలంట మాడినయట్లు ముప్ఫురు రూపరి పడగ. (ప: ద్వి: 111)

చిట్టడవిలో లోయగుండా పోగోవంక ఒడ్డున కుదురుగా నిటారుగా పెరిగి, బాగా కొమ్మలు సాగి ప్రబలిన గాడిదచెట్టుపై వర్షాకాలంలో పిడుగుపడి తలనుంచి క్రిందివరకు మూడు పంగలుగా చీలుతూ మొదలుతో సహా మాడిపోయినట్లు, దండకుడు, అంధకుడు; బాణుడు ముగ్గురూ రూపాలు లేకుండా చెదరి కిందపడ్డారు.

వాళ్ళు ఎలా చనిపోయారో image ద్వారా చెప్పడం. Image చేత యిదొక ప్రతీక. దృష్టాంతంచేత వారి అనాథమృతిని చెప్పటం.

తనవాళ్ళు ముగ్గురూ మాడి బొగ్గయిపోవటాన్ని చూసిన తారకుడు ఒకింత సేపు బాధపడి, కోపోద్రిక్తుడై దెబ్బతిన్నప్పుడు పడగ విప్పుకొని మీదకు వచ్చే పెద్ద త్రాచుపాములాగా చూసి మంచి గురితో విచిత్రమైన బాణాలను గుప్పిళ్ళతో వేస్తూ షణ్ముఖుని వక్షస్థలంపై గండి చేసి, ఆ వక్షస్థలపు రక్తం కళ్ళతో చూసి తృప్తిపడ్డాడు (ప : ద్వి : 112). బాణప్రయోగంలోని వేగాన్ని చెప్పటం జరిగింది.

రుంద్రసూర్తిమదుగ్రుడై మెరసి 'వీరుండైన రక్షించుకో
తంద్రాపేతుడవౌచు' నంచని మహాస్త్రంబేయగా చూచి తా
నైంద్రాస్త్రమ్మున ఖండఖండములు సేయన్ రేగి ముక్కోపుడు తత్
చంద్రచ్ఛందము త్రెంపికొంచు జనియెన్ సాపర్వ విభ్రాంతిగా.
(ప : ద్వి : 113

తీవ్రకోపంచేత తారకుడు ఉగ్రుడై విజృంభించి 'వీరుడవయి జాగ్రత్తగా రక్షించుకో' అంటూ మహాస్త్రం వేశాడు. ఇది స్వామి

చూసి దానిని ఐంద్రాస్త్రంతో (ఇంద్రశాణంతో) ముక్కలు ముక్కలు చేశాడు. అందులోనుంచి ఒక ముక్క మాత్రం చెలరేగి దేవతల కాశ్చర్యం గొలిపేటట్లుగా చంద్రహారాన్ని (వేయిపేటల ముత్యాలహారం) త్రెంపుకుంటూ పోయింది.

ఆ హారం ఎటువంటిదో, దాని ప్రత్యేకత ఏమిటో కింది మధ్యాక్కరలో వివరించబడింది.

### మ ధ్యా క్క ర :

హరినీల నాయకరత్నమై జిల్గుపులిగోళ్ళచేత
నొరపై నొకొకజంట నడుమ నొప్పార కురువిందముఖ్య
సురుచిరరత్నముల్ మిగుల శోభించు వేసరుల్ హార
మరుత పెట్టెను తల్లి తనకు నభిషేకవేళ నట్టిదది.

(ప : ద్వి : 114)

ఇంద్రనీలరత్నమయమై వాడి అయిన పులిగోళ్ళు మధ్య గలిగి ప్రతి జంటకూ నడుమ మనోహరమైన పద్మరాగమణులు ఒరపై చేర్చి శ్రమపడి పొదిగించి తయారుచేసిన వేయిపేటల ఆ ముత్యాల హారాన్ని దేవసేనాధిపతిగా తనను అభిషేకించే వేళలో తన తల్లి మెడలో వేసినట్టిదది.

అలాంటి హారాన్ని తారకుడు త్రెంపినాడు. కనిష్కుడి నాణెములపై యిలువేల్పు (కుమారస్వామి) ముద్ర మెడలో పులి గోళ్ళు ఉన్నాయి. అలాంటి శిల్పాలు ఉన్నాయి. దాన్ని అనుసరించి ఈ పద్యం వ్రాయబడింది. చిన్నపిల్లలకు పులిగోళ్ళు పతకాలు వేయడం మనకు ఈనాటికీ అలవాటుగా ఉన్నది.

ముత్యాలన్నీ ముక్కలు ముక్కలుగా చెదరిపోయినాయి. యుద్ధభూమిలోని అగ్నికణాలలాగా తళుక్కున ప్రజ్వరిల్లి మెరుస్తూ

వాడి అలుగుల కిరణాల కాంతి గలిగినట్టి పులిగోళ్ళతో కూడినట్టి ముత్యాలహారం చెల్లాచెదురయిపోయింది. (ప : ద్వి : 115)

**సుగంధి :**

పింగళాక్ష లోహజంఘు పీనకూర్మకంఠులున్
పొంగి స్యందనమ్ము ముల్కులన్ నిషంగసంహతిన్
భంగముం బొనర్చి వారవాణ మూడ్చి శంఖ శు
భ్రాంగముల్ తురంగపాళి నార్చి యేర్చి పొంగినన్.
(ప : ద్వి : 116)

పింగళాక్షుడూ, లోహజంఘుడూ, బలిష్ఠుడైన కూర్మకంఠుడూ విజృంభించి స్యందనపు కడెంచిల్లలను (బండిచిల్లలను) పడగొట్టి వారవాణాన్ని - అంటే ఆపాదమస్తకం వేసుకునే కవచాన్ని - ఊడగొట్టి శంఖంవలే శుభ్రమైన తెల్లనైన అశ్వాలను గాయపరచి తమలో తాము పొంగిపోయారు.

సుగంధివృత్తపు నడక గంతులు వేస్తున్నట్లు ఉంటుంది. ఆ నడకలో అల్పమైనవాడు చిన్న విషయానికి పొంగిపోయే గంతులుంటాయి. గంభీరపునడక కాదు. హుందాతనం ఉండదు. అల్పలక్షణం ధ్వనించడంకోసం సుగంధివృత్తం ఉపయోగించబడింది.

పవిపతన విజృంభిత విరోట్టనుపు త్రో
టీగరుత్ చటులరుట్ తీవ్రతలును
కోపవిహ్వలసటాటోపనృసింహుని
భిదురధిక్కృతనఖావేల్లితములు
మహితపురత్రయోన్మాథనోన్మద ధను
ర్జ్యాటంకృతిభ్రమత్ చటులతలును
మహిషశుంభనిశుంభమారణక్రీడా స
మాశ్లోదభయదనృత్తాణిశయత

కరువునందు బోయగా సమావిర్భూతి
నందినట్టి రుద్రతాతిశయత
కేవలక్రుధానుభావమ్ము ద్వాదశా
క్షి, కరములను దాల్చి చేరినట్లు. (ష : ద్వి : 117)

వజ్రాయుధపుదెబ్బకు విరాట్స్వరూపుడైన కృష్ణుడి - విష్ణువు-వాహనమైన గరుత్మంతుడు కోపోద్రేకంతో తన ముక్కు, రెక్కలు కదలించిన తీవ్రతలు; వజ్రాయుధాన్ని మించిన పదునుగల వంపు లున్న గోళ్ళు కలిగి కోపంతో నిండిఉన్నట్టి నరసింహుడు హిరణ్యకశిపుని చంపాలన్న సంభ్రమము; త్రిపురాసురసంహార సమయంలో శివుడు వెలయించిన మహత్తరమైన ధనుస్సుయొక్క జ్యాటంకారపు మ్రోతలో ఉన్న కాఠిన్యం (త్రిపురాసురసంహార సమయంలో భూమిని రథంగానూ, సూర్యచంద్రులను చక్రాలుగానూ, వేదాలను గుఱ్ఱాలుగానూ, మేరుపర్వతాన్ని ధనుస్సుగానూ, ఆదిశేషుడిని వింటినారిగానూ, విష్ణువును తన బాణంగానూ చేసుకొని పరమ శివుడు రుద్రుడై విజృంభించినట్లు పురాణకథ); మహిషాసుర, శుంభ, నిశుంభులను రాక్షసులను సంహరించేటప్పుడు దేవియొక్క సమాహ్లాద భయంకరమైన నాట్యము - ఇవన్నీ ఒక మూసలో పోసుకొని రౌద్ర భావం రూపం ధరించినట్లుగా షణ్ముఖుడున్నాడు. కేవలం కోప భావం పన్నెండు కళ్ళు, పన్నెండు చేతులు ధరించి వచ్చినట్లుగా ఉంది ఆ రూపం.

కుమారస్వామి కోపవర్ణన ఇక్కడ చక్కగా చేయబడింది. పౌరాణిక ప్రతీకలు ప్రస్తుతావసరానికి కవి ఇక్కడ వాడుకోవటం సందర్భోచితంగా ఉంది. ఇంద్రునిపై ధ్వజమెత్తినప్పుడు శ్రీకృష్ణుని కోపం, హిరణ్యకశిపుని సంహార సమయంలో నరసింహామూర్తి కోపం, త్రిపురాసుర సంహార సమయంలో ప్రచండమైన శివుని కోపం,

శుంభ నిశుంభుల సంహార సమయంలోనూ, మహిషాసుర సంహార సమయంలోనూ దేవి ప్రదర్శించిన కోపం - మొత్తం ఇవన్నీ ఒక మూసలో పోసుకుంటే ఎంత చండప్రచండంగా రౌద్రభావం ఆవిర్భవిస్తుందో మనకు చెప్పనలవి కాదు. ఒక్కొక్క ఘట్టంలోని కోపమే ఎంతో తీవ్రత కల్గినది. అలాంటిది అన్ని ఘట్టాలలోని కోపాలూ కలబోసుకున్నాడు - అనటంలో షణ్ముఖుడి కోపం పరకాష్ఠకు పోయింది. అదీగాక ఆ కోపం 12 నేత్రాలు, 12 చేతులు ధరించి వచ్చింది అనటంద్వారా, ఈ కోపభావాన్ని ఒక్కసారిగా పన్నెండు నేత్రాలలో చూసేటప్పటికి ఎంత తీక్ష్ణంగా చూస్తాడో, ఆ తీక్ష్ణతారౌద్రభావాన్ని పాఠకునికి అందించడంలో కవి సఫలీకృతుడైనాడు.

పుష్కలావర్త కాంభోధర వ్యూహమ్ము
ఘళఘళార్భటులతో బిట్టు పిడుగు
లురలునో; కాలకాసరకంఠఘంటాఘు
లంఘులస్వైర వేల్లనచయమ్ము
మీటెంచునో; యన వృతమండలీకృత
షడ్ధనుశ్శింజినీస్వరము మ్రోసె
అభ్రవృక్ష కిసలయా తామ్ర హయముల
తో పింగళాక్షు నుద్ధాతు డమ్యౌ

లోహజంఘుని శిరము వెల్లువగ నెత్రు
చిమ్మ యెగసిపడియె కత్తి జివ్వనట్టి
తాళఫలఖండ మట్లు రత్న మకుటమ్ము
తోడ కూర్మకంఠుని తల త్రుళ్ళిపడియె. (ష : ద్వి : 118)

ప్రళయకాలపు మేఘాల సమూహాలన్నీ ఘళఘళ ధ్వనులతో పిడుగులు పడుతున్నవా అన్నట్లుగా, యముని మహిష (ఎనుబోతు)

ఘంటల ప్రళయనాదంతో కూడిన వాయు ప్రకంపనాలు వస్తున్నాయో అన్నట్లుగా మండలాకారాలుగా (వలయాకారాలుగా) చేసిన షణ్ముఖుని ఆరు ధనుస్సులనుంచీ ఆరు అల్లెత్రాడులను ఒకేసారి మ్రోగించిన ధ్వనివల్ల ప్రళయకాలపు భయంకరమైన శబ్దంలాగా ఉంది. ఎండిన మామిడి చిగురుటాకులాగా ఎఱ్ఱగా ఉన్న తన గుఱ్ఱాలతో సహా పింగళాక్షుడు ఎగురగొట్టబడ్డాడు (ఎగిరిపడి చచ్చాడు). నెత్తురు చిమ్మి వంకలై పారేటట్లు లోహజంఘుని శిరము (తల) ఎగిరి క్రిందపడింది. కత్తితో జివ్వగా తాటికాయలు ముక్కలు ముక్కలై ఎగిరిపడ్డట్టుగా కూర్మకంఠుని తలకాయ ఎగిరిపడింది.

ఆరు ధనుస్సుల యొక్క అల్లెత్రాళ్ళు ఒకేసారి మ్రోగడంవల్ల ఆ మ్రోత (ధ్వని) - ప్రళయకాలపు మ్రోత లక్షణంగా చెప్పటం. ఉపమానం కవి చెప్పే విషయానికి మానాన్ని (కొలతను) అందిస్తుంది. దానిచేత ఆ లక్షణాన్ని ఊహించి భావించవచ్చు. ఉపమానం మన అనుభవంలో లేని విషయాన్ని అనుభవంలోకి తెస్తుంది. ఉపమేయాన్ని మన అనుభవంలోకి తెచ్చిపెడుతుంది. ఆరువింట్ల నారి ధ్వనులు ప్రళయకాలపు మేఘాల గర్జనలాగా ఉండటమే కాకుండా, ఎడతెరిపి లేకుండా ఉరుములతో కూడిన పిడుగులు పడినట్లుంది. బాణం ఎక్కుపెట్టి లాగేటప్పుడు ధనుస్సు వృత్తాకారంగా (గుండ్రంగా) అవుతుంది. అంటే బాణానికి వేగం అత్యధికంగా వస్తుంది- వృత్తాకారంగా లాగిన tension (తలతన్యత) వల్ల. అందుకే కవి 'వృతమండలీకృత షడ్ధనుశ్శింజినీస్వరము మ్రోసె' అన్నాడు. పింగళాక్షుడు ఎగిరిపడ్డాడు. ఇది తెలుగు నుడికారం. దీనికి సంస్కృతీకృత రూపమే (పింగళాక్షుడు) 'ఉద్ధూతుడు' అయ్యాడన్నది. పింగళాక్షుడు, లోహజంఘుడు, కూర్మకంఠుడు-ఈ ముగ్గురూ ఎగిరిపడి చచ్చారక్కడ. ఈ ముప్పేరుగా పడ్డ వ్యర్థప్రయాసను చెప్పడానికే పైన 'సుగంధివృత్తం' (ప: ద్వి: 116) రచన చేయటం.

పదునైన కత్తితో వడి తాటిచెట్లపై
నుండి క్రిందకు గెలలూడ నరుక
పడి వడిన్ పైకెగసెడు కాయలను బట్టి
గెలల కాళ్ళను దన్ని ఫలము లూడ్చి
ముచ్చికల్ తీయక హెచ్చుటాకట తీవ్ర
వేగాన నరకుచున్ బీల్చి ముంజె
ఆకలి తగ్గినయంత ముచ్చిక లూడ్చి
చివ్వుచున్ నడిమికి చెండుకొంచు

గరువుపొలములందున్న తాళ్ళ విరివిగుంపు
తోపులన్ గోపబాలకుల్ తొడరి రేగి
తాటికాయల నరకుచు నాటలాడి
నట్లు కనుపట్టెను దితిజాధిపతుల. (ష : ద్వి : 119)

షణ్ముఖుడు రాక్షసనాయకులను గోవులు కాసే పిల్లలు తాటికాయలను నరికినట్లు నరుక్కుంటూ పోతున్నాడు.

పదునుగల కత్తితో తాటిచెట్లపైనుంచి బలంగా తాటికాయల గెలలను ఊడిపోయేటట్లు నరకగా - కిందపడి పైకెగసి పడుతున్న కాయలను కాళ్ళతో తన్ని (అదిమి) పట్టుకొని వాటినుంచి నంజులు తీసి మిక్కుటమైన ఆకలిచేత బొప్పి తీయకుండానే తింటూ వేగంగా చీల్చి నరుక్కుంటూ పోయినట్లుగానూ, ఆకలి తగ్గిన తర్వాత తాటి నంజుల బొప్పిని (తొక్కను) తీసి చివ్వుతూ నడుమభాగానికి నరుకుకుంటూ ఇసుక పొలాల్లో విరివిగా గుంపులు గుంపులుగా ఉండే తాటి తోపులలో గోపబాలకులు తాటికాయలను నరుక్కుంటూ ఆటలాడినట్లుగానూ రాక్షసనాయకులను షణ్ముఖుడు ముక్కలుముక్కలుగా నరికిపారేశాడు.

స్వామి రాక్షసులను నరుక్కుంటూ వెళ్ళాడు. అది ఆయనకు న పనిగా అనిపించలేదు. పశువుల కాపర్లు తాటికాయలను ని తింటూ ఆట్లాడినట్లుగా ఉంది. ఆయాసం లేకపోవటమే డా ఆట్లాడుతున్నప్పుడు ఉన్నంత ఉత్సాహంగా రాక్షస కులను చీల్చి చెండాడినాడు.

ఇందరిని నరుకుతుంటే తారకు డేమి చేస్తున్నట్టు అని పాఠకునికి గానం రావచ్చు. అందుకే షణ్ముఖుడు వాడి నేమి చేశాడో క చెప్తున్నాడు కవి.

కుధరకార్ముకమున తారకుని రవంత
బెసకనీయక కట్టి తద్వీపుల దైత్య
పతుల తలపండ్ల రణసీమ బలియొనర్చి
అధిపు డటు చూడంగ కళ్ళప్పగించి. (ష : ద్వి : 120)

తన మేరుపర్వతం - ధనుస్సుతో షణ్ముఖుడు తారకుని రవంత కూడా కదలనివ్వకుండా కట్టిపడేసి, ఆ రాక్షస నాయకుల యల నన్నిటినీ ఖండించివేసి యుద్ధభూమికి బలిచేశాడు - రాక్షస తారకుడు గుడ్లప్పగించుకొని చూస్తూ ఉండగానే.

ఇక్కడ యుద్ధనైపుణ్యం షణ్ముఖునికి బాగా ఉన్నట్టుగా ుడమే కాకుండా, కవికి యుద్ధరచన చేయటంలోగల నిశితమైన, క్రమైన బుద్ధికుశలత మనం మెచ్చుకోదగ్గది.

### మధ్యాక్కరలు :

వ్వ చిరుత రేక లాననముల మూగ షడాననుడనె
వ్వించితివి నాదువింట చెలికాండ్రడ చుట్టాల నేమి
తవ్వితి తలకెత్తికొగ తాళుము రణమేల యనగ
వ్వితి వపహాసముం బొనర్చితి వేమయ్యె ? తుదకు.

(ష : ద్వి : 121)

చిరునవ్వుల రేఖలు పన్నెండు మోములలో తొణికిసలాడు తుండగా షణ్ముఖుడు తారకునితో అంటున్నాడు - "రణమెందుకు - వద్దని చెప్పితే దానికి నవ్వి అపహాస్యం చేశావు. కడపటి కేమయింది ? ! నా ధనుస్సు చేత నీ చెలికాళ్ళను (స్నేహితులను), చుట్టాలను చివ్వింప (ఖండింప) చేశావు కదా !"

విశాఖుడు రాయబారం వెళ్ళిన సందర్భంలో అత్యంత ధర్మసూక్ష్మమైన విషయాలు చెప్పగా విని తారకుడు నవ్వుకొన్నాడు. ఆ విధంగా అపహాస్యం చేసిన విషయాన్ని గుర్తు చేశాడు షణ్ముఖుడు. అక్కడ విశాఖుడు తారకునితో "ధర్మసూక్ష్మాన్ని చివ్వి చూపించాను - (అనగా) సారాంశం తీసి చెప్పాను. ఇంతగా చెప్పింది నవ్వడానికేనా ! నా చెప్పిన ఈ మాటను తలలో పువ్వుగా దాలుస్తావో ? లేక కాలరాస్తావో నీయిష్టం" అన్నాడు. అక్కడ విశాఖుడు ధర్మసూక్ష్మాన్ని చివ్వినట్లు చెప్పాడు. తారకుడు వినలేదు. అందుకు ఇక్కడ షణ్ముఖుడు రాక్షసులను చివ్వినాడు. ఆ రాక్షసుని నవ్వుకు ప్రతిగా ఇక్కడ షణ్ముఖుని చిరునవ్వు 12 ముఖాలలో వెలిసింది. అక్కడ ద్విత్వ 'వ'కార ప్రాస ఉంది (పం : క : 25). ఇక్కడ కూడా 'వ'కార ప్రాసే ఉంది. రాయబార ఘట్టంలోని పద్యాన్ని ఒకసారి గమనించండి.

నవ్వుటకేమి దేనినయినన్ మరి నవ్వగవచ్చు ధర్మమున్
చివ్వితి మేల్మి తీసితని చెప్పితి నింతగ నింత చెప్పుటల్
నవ్వుల కయ్యెనా ? సరియె నాకచమూపతి మాట చెప్పితిన్
పువ్వుగ దాల్తువో తలను ? పొమ్మని కాళుల మట్టగింతువో ?

(రాయబార నిర్వహణం : పం : క : 65)

మహిష్మఖుడు తారకునితో ఇంకా ఈవిధంగా అంటున్నాడు :

**మధ్యాక్కర :**

విన వీ వదెంత చెప్పినను తంగలీ ! మూర్ఖతావధివి
వినుమిప్డు జెప్పెద - ఏల ? వృథ చత్తువయ్య నాచేత ?
మని పదికాలాలపాటు మహి నేలుకో మహేంద్రాది
గణబాంధవముచేత గడప కాల్మోపు లక్ష్మి నడ్డకుము.

(మ : ద్వి : 122)

"ఓ అవివేకుడా ! ఎంత చెప్పినా కూడా (రాయబారంద్వారా) వినలేదు కదా ! మూర్ఖమనస్సు గలవాడవు. ఇప్పుడు కూడా చెప్పుతున్నాను. వృథాగా నాచేత ఎందుకు చస్తావయ్యా ! మహేంద్రుడు మొదలైన బంధుసమూహంతో కూడుకొని పదికాలాల పాటు రాజ్యపరిపాలన చేసుకో. గడపమీద కాలు మోపుతున్న లక్ష్మీదేవికి అడ్డంగా కాలుచాపి అడ్డుపడవద్దు."

తారకునికి ఇంకోసారి అవకాశమిస్తున్నాడు స్వామి. ఈ అవకాశం మూడవది, కడపటిది. మొదట విశాఖుని రాయబారంద్వారా సంధికి వస్తాడేమో చూశాడు. తర్వాత మహిషాసురుని మరణానంతరం యుద్ధం మధ్యలో(రెండోరోజు ప్రారంభంలో) అగ్ని రాయబారం ద్వారా చూశాడు. ఇప్పుడు స్వామి స్వయంగా తానే చెప్తున్నాడు. ఇన్ని అవకాశాలు ఇచ్చాడు. ఎంత దుర్మార్గునికైనా భగవంతుడు కొన్ని అవకాశాలు ఇస్తాడు. అవన్నీ తన కృషి- తన బలం వల్లనే తనకు విజయాలు కలుగుతాయి, అనుకుంటాడు ప్రతిమానవుడూ. పెరిగే అంతవరకూ పెరగనిస్తాడు భగవంతుడు. మనిషి చేష్టలనండి, లేదా పాపమనండి - అది పండిన తర్వాత, టప్పని తుంచివేస్తాడు ఒక్కసారిగా భగవంతుడు. అప్పుడు విధి తనకు అన్యాయం చేసింది అనుకొంటాడు - మానవుడు. తాను చేసిన దురాగతం గురించి మాత్రం అనుకోడు.

ఇక్కడ స్వామి తారకునికి మూడవ అవకాశం ఇచ్చాడు యుద్ధం మానమని.

**మధ్యాక్కర :**

భ్రష్టమనస్కుడై యనియె రాక్షసాధిపు డుగ్రుడగుచు
దుష్టుడా ! సకలబంధువులతో యమ్ము చెరగి పోసితి ని
కృష్టపుం బ్రదుకింక నాకు నేలరా ? చచ్చిన చత్తు
కష్టశిక్ష విధించినావు కనుల ముందటె చంపి చెలుల.

(ష : ద్వి : 123)

షణ్ముఖు డన్న మాటలకు ఉగ్రుడవుతూ రాక్షసరాజు అయిన తారకుడు భ్రష్టమనస్కుడై (మనస్సు చెడినవాడై) ఈ విధంగా అంటాడు - "దుష్టుడా ! సకలబంధువులను, చెలికాళ్ళను నాశనం చేశావు. ఇంక నాకు మాత్రం నికృష్టపు బ్రతుకు ఎందుకు ? చస్తే చస్తాను కాని, నా కళ్ళముందరే నా వాళ్ళనందరినీ చంపి, కష్టమైన శిక్ష విధించినావు."

**మధ్యాక్కర :**

జీవించినన్నాళ్ళు నేను జీవించబోనురా నిసుగ
జీవించితిని దివ్య చాపశిక్షావశీకృత దశ ది
శావృత స్వచ్ఛాభ్రఫలక సల్లిఖిత యశో కథాను
భావుండనై నాకమెల్ల వాహ్యాళిభూములు గాగ.

(ష : ద్వి : 124)

ఎంతకాలమో నేను జీవించబోనురా పసికూనా ! నేను స్వర్గలోకమంతా వాహ్యాళి (విహార) భూములుగా చేసుకొని తిరిగినాను. దివ్యమైన ధనుర్విద్యా నైపుణ్యంచేత దశదిశలూ నా యశస్సు (కీర్తి

కథలుగా వ్యాపించి స్వచ్ఛమైన బంగారు ఫలకలలో చిత్రించబడ్డది."

ఈ పద్యంలో తారకుని పాత్రకు న్యాయం చేకూర్చాడు కవి. తారకుడు తాను బ్రతికిన వైభవాన్ని స్వామికి చెప్పాడు. అతని మహావీరలక్షణం ఇక్కడ చెప్పబడింది.

పై నాలుగు పద్యాలు మధ్యాక్కరలు (121, 122, 123, 124) వరుసగా ఉన్నాయి. రెండు మధ్యాక్కరల్లో స్వామి సంభాషణ ఉంది. తర్వాతి రెండు మధ్యాక్కరల్లో తారకుడి సమాధానం ఉంది. మధ్యాక్కరలు మంచి సంభాషణకు బాగా ఉపయోగపడతాయని ఇంతకుముందే చెప్పుకున్నాం. స్వామి ప్రశ్నలు పై రెండు 'మధ్యాక్కర'లలో అడిగాడు. తారకుడు కూడా (కింది) రెండు మధ్యాక్కరలలోనే సమాధానం చెప్పటం - ఇక్కడ గమనించ వచ్చు. అంతే కాకుండా ఒక ప్రధానమైన పాత్రకు - నాయకునికి ఏ విధమైన ప్రాధాన్యం ఇచ్చాడో, అంతే ప్రాధాన్యం ప్రతినాయకునికి ఇచ్చాడు - కవి. రెండు పాత్రలూ సమతులం (balance) అయ్యాయి.

## కుమారస్వామి తారకాసురుని సంహరించటం

సాంధ్యరాగారుణచ్ఛవుల నిశాభంగ
కాంతిమత్ పంకజకర్ణికా మ
నోజ్ఞజీర్ణచ్ఛదద్యుతులు గిఱ్ఱున తిరు
గాడినట్టులు సుడిగాడ్పులందు
కురువిందచితకాంచన రథాంగపటలి ప్ర
వాహాపుటావర్త భ్రమణ వోలె
ఉన్నట్టులుండి దైత్యునితేరు పై లేచె
తద్రూప్యచటులతాస్పదంబు గాగ

(32)

బాణునిశిరస్సుపై వ్రాలి పైకియంచు
పడి పటపటధ్వనులు చేసి పతులు దండ
లోహజంఘాదుల కరముల్ త్రుంచుకొంచు
వాని రుషవోలె దూకె షణ్ముఖుని పైకి. (ష : ద్వి : 125)

ఎప్పుడైతే స్వయంగా తాను చెప్పినదాన్ని కూడా తారకుడు వినలేదో, షణ్ముఖుడు తన రథాన్ని వెంటనే పైకి లేపాడు. ఆ రథం వాయుపథంలో లేవడం ఈ విధంగా ఉంది.

సంధ్యాకాలపు ఎఱ్ఱనికాంతిలో పద్మంలో ఉన్న దిమ్మ (దిమ్మ = పద్మం మధ్యభాగం) యొక్క పసుపుకాంతులతో సమానమైన మనోజ్ఞమైన పండుటాకులు సుడిగాలుల్లో గిఱ్ఱున తిరుగుతున్నట్లుగానూ; కురువింద (పద్మరాగమణులు) మణులు పొదిగించిన ఆ బంగారు రథచక్రాలు ప్రవాహపు సుడిలాగా - ఉన్నట్లుండి దైత్యుని (తారకుని) రథంపైన స్వామి భృకుటి (కనుబొమల) ముడులలాగా చక్రాలు గిఱ్ఱున తిరిగాయి. రథం బాణుని శిరస్సుపై రాలి పటపటధ్వనులు చేస్తూ ఆ చక్రాల అంచులు పడి దండుడు, లోహజంఘుడు మొదలైన రాక్షసుల చేతులు త్రుంచు కొంటూ స్వామి కోపంలాగానే ఆతని రథంకూడా పైకి లేచింది.

ఇక్కడ స్వామి రథవర్ణన అత్యంత సుందరంగా ఉంది.రథంపైకి లేచేటప్పుడు ఆ చక్రాల అంచులధాటికి రాక్షస శవాల చేతులను ఖండించుకొంటూ పైకి లేచింది. స్వామి కోపం ఎంతగా పెరిగిందో అంతపైకి రథాన్ని లేపినాడు. 'ఉన్నట్లుండి రథం పైకి లేచిం'దనటం వల్ల బుల్లెట్ మోటారు సైకిలుకు ప్రారంభంలోనే హాయర్ గేర్ వేసినట్లు - అంటే ఉన్నట్లుండి టాప్ గేర్ వేసినట్లు - రథం ఉవ్వెత్తున పైకిలేచింది. పండుటాకులు సుడిగాలిలో గిఱ్ఱున తిరిగినట్లు

రథచక్రాలు గిఱ్ఱున తిరుగుతున్నాయి. దీన్నిబట్టి రథం వేగమెంత హెచ్చుగా ఉందో మనం భావించుకోవచ్చు.

శ్రీగంధకిసలయ శ్రీబంధురములైన
అప్సరో మృదుల దివ్యకపోల
పాళి నిజచుబుకమూల మాంచి తదీయ
లోచనత్రాసముల్ చూచునట్లు
అఖిల దిఙ్నాథ రత్నాంశు చుంబిత నిజ
చరణస్థలీగత స్వర్ణపీఠి
నిజచమూనాథ శీర్ణితమైన హోత్ర మం
డలవృత సవనశాలల చయమ్ము

వర్ణ లేఖితాభావోపపన్నముగను
ఆలిఖిత చిత్రచారు శతాంగ మట్టె
కృతదితిజనాథ కీర్తి మూర్తివలె భగ్న
మన్నది షడాననకృత తీవ్రాస్త్రకృప్తి. (ష : ద్వి : 126)

షణ్ముఖుని రథం ఆతని కోపంలాగానే పైకి లేచింది. దాని ఫలితంగా తారకుని రథం దగ్ధమయింది. దగ్ధమయిన తారకుని రథంలో ఎలాంటి చిత్రాలు చిత్రింపబడి ఉండేవో తెలిపే సుందరమైన వర్ణన యిది.

శ్రీగంధపు చెట్ల చిగుళ్ళలాగా అందమైన దివ్యమైన అప్సరల మృదువైన చెక్కిళ్ళకు తారకుడు తన గడ్డమును ఆనించి - వాళ్ళ బెదురు కన్నులను చూస్తున్నట్లుగానూ, అష్టదిక్పతులు తమ కిరీటాలతో తలలు వంచి తారకుని పాదపీఠానికి నమస్కరిస్తున్నట్లుగానూ, తన సేనానాయకులచేత ధ్వంసం చేయబడ్డ ఆశ్రమాలలోని యజ్ఞశాలలూ, అందమైన రంగులతో భావసంపన్నంగా తీర్చబడిన

చిత్రాలతో అలంకరించబడ్డ తారకుని రథం - వాడు సంపాదించిన కీర్తిరూపంలాగే షణ్ముఖుని చాపాస్త్రానికి ఖండింపబడి భగ్నమని అట్టే మాడిపోయింది.

ఇది ఒక Series of Painting. రథంమీద చిత్రంలో ఆకాశ మంతా దశదిశలా ఆ కీర్తి చెక్కబడింది అన్నదానికి పోలిక యిది. చిత్రంలో రంగు, రేఖలలో లేఖకుని భావం సుసంపన్నం కావాలి. నీటితో కూడిన రథం - వాడి యశ్శశరీర రథం - మాడిపోయింది. శరీరానికి ప్రతీక రథం. జీవుని శరీరం రథం. దాంట్లో కూర్చున్నవాడు దేవుడు. జీవుడు కల్పించుకొన్నరథం. ఆ పోలికలో ఒక వైదిక ప్రతీక ఉంది. ఆ కీర్తి నాయకునికి చెందుతుంది. ఊహ కందని శక్తి - అందమైన వర్ణన యిది.

ఎగిరి దూకెడు నక్తంచరేశు జల్లి
పెండెము మహేంద్రు బొమ్మతో వెల్గెడునది
అచలకార్ముకమూర్వి చిట్టాడినట్టి
గన్నెరాకమ్మునన్ బొడిగాగ రాలె. (ష : ద్వి : 127)

ఆ రథంనుంచి ఎగిరి దూకుతున్న తారకుని కాలి అందెను షణ్ముఖుడు ధ్వంసం చేశాడు. ఆ అందె మహేంద్రుని బొమ్మకల పెండెము. (తన హారాన్ని తెంపిన ప్రతీకారానికి తారకుని జల్లి పెండ్యాన్ని ధ్వంసం చేశాడు కుమారస్వామి).

మహిషాసురుని మరణానంతరం తారకుని ఓదారుస్తూ బాణుడు 'తమ సైన్యాధిపతి అయిన మహిషాసురుడు ఎన్నో విజయాలు సాధించిపెట్టి తన పాదాలకు, తన అన్న అయినట్టి, దైత్యాధిపతి అయినట్టి తారకుని పాదాలకు గండపెండెములు తొడిగిన సంగతి' తారకునికి చెప్పాడు (చూ. ష : ప్ర : 160). ఓడిన రాజు బొమ్మను

కడియంమీద చెక్కించుకొని దాన్ని కాలికి గండపెండెంగా వేసుకునేవాళ్ళు. ఈ సంప్రదాయం ఉండేది. ఇక్కడ తారకుడు తనచేత ఓడిపోయినట్టి మహేంద్రుని బొమ్మను కడియంపై చెక్కించుకొని దాన్ని కాలి అందెగా తొడుక్కొని ఉన్నాడు. దాన్ని ఇప్పుడు షణ్ముఖుడు పొడిపొడి చేశాడు. షష్ఠకమలం ప్రథమదళం (160)లో ప్రసక్తికి వచ్చిన కాలి అందె ఇప్పుడు యుద్ధభూమిలో ధ్వంసమైనది. ఈ విధంగా భావుకులైన పాఠకులు కావ్యంలోని పూర్వాపరాలను సమన్వయం చేసుకొని భావించాలి. దీన్నే కావ్య నిర్మాతలు 'నిర్మాణశిల్పం' అన్నారు.

చిత్తళికనుండి సెలకట్టె చేత లాగు
టయును లక్ష్యశుద్ధిని చూచుటయును లేక
ఐదు సింగాణులను వీడె నంతె గాని
అమ్మహాధనువున కెదురాట యెట్లు ? (ష : ద్వి : 128)

షణ్ముఖుడు అమ్ములపొదినుంచి బాణాన్ని ఎప్పుడు లాగుతాడో, ఎప్పుడు గురి చూసి వదులుతాడో కంటికి కనపడదు. అయిదు ధనుస్సులను (సింగాణులను) వదలిపెట్టా డన్న మాటే తప్ప, ఆ ఉన్న ఒక్క ధనుస్సుకు ఎదురు నిలబడటం ఎవడి సాధ్యం !

'చిత్తళిక నుండి సెలకట్టె(బాణం) చేత లాగుటయును లక్ష్యశుద్ధిని చూచుటయును లేక' - ఆ ప్రదర్శించే ధనుర్విద్య అవిజ్ఞేయంగా ఉంది. తెలియనితనాన్ని చెబుతోంది శబ్దం. తారకుడొక్కడే ఉన్నాడు కనుక, ధర్మంగా ఒక్క ధనుస్సే వాడాడు స్వామి. అయినప్పటికీ ఆ మహాధనుస్సు ముందర ఎదుర్కొని నిలవటం కష్టం.

ఛీ ! యీనాటికి నా కొకం డెదురుతీర్చెన్ శత్రువై నిన్ననే
కాయంబెత్తిన దుష్టబాలకుడు డాకాల్ జల్లిపెండెమ్ము వీ.

డా యిట్లై అరవుళ్ళు సేయుటని రుట్ చండుండు బ్రహ్మ ప్రదం
బౌ యుగ్రంబు గదన్ మహోగ్రుడయి వ్రేయన్ క్షత్త
వీక్షించుచున్. (ష : ద్వి : 129)

పిల్లవాడి చేతిలో ఓడిపోవటం చిన్నతనంగా ఉంది అను కున్నాడు తారకుడు. 'ఛీ! ఇన్నాళ్ళకు నా కొకడు శత్రువై ఎదురుతిరిగాడు. నిన్నగాక మొన్న పుట్టిన ఈ పసివాడు శత్రువై ఎదురు రావటం మరీ అవమానం. ఈ బాలకుడు నా ఎడమకాలి అండెను పిండిచేయటమా !' అని తారకుడు మండిపడుతూ ప్రచండుడై బ్రహ్మ దత్తమైన భయంకరమైన గదను మహాభయంకరంగా వేశాడు. దీన్ని కుమారస్వామియొక్క రథసారథి చూస్తూ అంటాడు.

ఈ బ్రహ్మదత్తమైనట్టి భయంకరమైనట్టి గదను విసిరాడు తారకుడు. ఇది ప్రాణాపాయదశలో చివరగా ఉపయోగించుకునే ఆయుధం. ఇక్కడ మనం ఒక విషయాన్ని గమనించవచ్చు. షష్ఠ కమలం ప్రథమదళంలో కూడా మహిషాసురుడు కట్టకడపట ప్రాణా పాయస్థితిలో ఆయసదండం విశాఖునిపై విసరడం 128వ పద్యం దగ్గర జరిగింది. ఇక్కడ - అంటే ద్వితీయదళంలో కూడా - 129వ పద్యం దగ్గరే తారకుడు కుమారస్వామిపై బ్రహ్మదత్తమైన గదన విసిరాడు. ఇద్దరి పరిస్థితీ ఒక్కలాగానే ఉంది. సమయం కూడా ఇంచు మించు ఒక్కటే. ఇలా పద్య సంఖ్య- మహిషాసురునికి 128, తారకా సురునికి 129 కావడం, కవి కావాలని కల్పించాడో లేక కాకతాళీయమో కాని, మొత్తంమీద ఈ విషయం భావుకుడైన పాఠకుడు గమనించదగ్గది.

తారకుడు బ్రహ్మదత్తమైన గదను విసరడం స్వామి సారథి చూసి స్వామితో "ఆయుష్మంతుడా ! వీనికి ఇది అమేయమైనట్టిది బ్రహ్మ వరంచేత లభించినట్టిది. వాని ప్రాణప్రదమైనట్టిది ఈ గద

యుధం. బలంగా పిడికిలికొద్దీ ఉగ్రమైన ప్రబలాస్త్రాన్ని వేసి అది (ఆ గదాయుధం) వృథా అయ్యేటట్లు చూడు" అన్నాడు (ష : ద్వి : 130). ఈ గదాయుధం వీని ప్రాణమని అనటంవల్ల, ప్రాణాపాయదశలో వేసేదది అని అర్థమవుతున్నది. ఇంకే అస్త్రానికీ సాధ్యం కానప్పుడు చివరి క్షణంలో వేసేది.

బ్రహ్మవరదత్తమైన ఆ గదాగమనం (రాక) ఎలా ఉందో చూడండి :

కుత్కీలయుగము ఢీకొన్న వేళల పెళ్ళ
లై లేచిపో శిఖరాగ్ర భాగ
ములు జనించెడు రవమ్ములవోలె ధ్వనిత కాం
చన కింకిణుల భీషణధ్వనులను
ప్రళయప్రభంజనావర్త ప్రచోదిత
బాడబేరమ్మదజ్వాల లేచి
మండలాకృతిరయ చండమై పెనుసుళ్ళు
గా వచ్చునటు స్ఫులింగము లురలుచు

మేరువున గల్గు కోపాన సూరగమన
రుద్ధికై యట్టె వింధ్యమ్ము రూక్ష వేగ
మున చివాలున విన్ను లేచిన విధాన
చండమై వచ్చు తద్గదాదండము గని. (ష : ద్వి : 131)

ఆ గదాదండం వస్తోంటే - రెండు పర్వతాలు ఢీకొంటే విరిగి పోయి పైకి లేచే శిఖరాగ్ర భాగాల(కొండపై భాగాల) నుంచి ఉద్భవించే ధ్వనులలాగా బంగారు గజ్జెల భయంకరమైన ధ్వనులు వస్తున్నాయి. ప్రళయకాలపు గాలికి సుళ్ళుసుళ్ళుగా రేగిన బడబాగ్ని మేఘాల గుండా జ్వాలగా లేచింది. ప్రచండమై వేగంగా వలయాకారంగా పెద్దపెద్ద సుళ్ళు తిరుగుతూ నిప్పులు కక్కుతుంటూ వస్తోంది. మేరు

పర్వతంపై కోపించి వస్తున్న సూర్యగమనాన్ని అడ్డుకోవడానికోసం వింధ్యపర్వతం అట్టె చివాలున (వెంట వెంటనే) ఆకాశానికి లేచి నట్లుగా, ఆ గదాదండం ప్రచండమై వస్తూండటాన్ని చూశాడు కుమారస్వామి.

**శి ఖ రి ణి :**

> త్వరాకృష్టోర్వీభృద్ధను ధనురుదాత్తధ్వని నభోం
> తర క్షోణీదిక్సీమ చెలగె ఫణీంద్రశ్వసన భీ
> కరంబై ప్రాక్క్షీరోదధిమథన సంఘట్టనరవ
> స్ఫురచ్చండంబై శక్తిధరుడు గుణంబుం దివిసినన్.

(ష : ద్వి : 132)

మేరుపర్వత ధనుస్సును శక్తిధరుడు (కుమారస్వామి) వేగంగా నారిని లాగి విడిచినపుడు గొప్ప బ్రహ్మాండమైన ధ్వని భూమ్యాకాశాలన్ని దిక్కులకు వ్యాపించింది. మేరుపర్వత ధనుస్సుకు నారిగా ఉన్నది ఆదిశేషుడు. ఆ ధనుస్సుయొక్క నారిని- అనగా ఆదిశేషుడనే సర్పాన్ని - లాగినపుడు ఆ సర్పరాజుయొక్క శ్వాస - బుసబుసలతో కూడుకొని, పూర్వం పాలసముద్రం చిలికేటప్పుడు (మథించేటప్పుడు) వచ్చిన శబ్దంలాగా ప్రచండమైన ధ్వని ప్రకంపిస్తూ చెలరేగింది.

> శివఫాలాక్షమువంటి యగ్రమును రాశీభూత సంవిత్ క్ష్ణుత
> చ్ఛవిమత్ శక్తిని దూసి కన్నున మహాశౌర్యమ్ము నేత్రాంచల
> స్థవిరస్ఫార మహారుణాబ్జ దళసాంద్ర త్విట్ప్రకాశమ్ము కా
> దివిజోత్కంపనమై తళత్తళలు చిందెన్ జ్యావిముక్తంబుగా.

(ష : ద్వి : 133)

శివుని ఫాలనేత్రంవంటి అగ్రభాగం కలది, కుప్పగా పోసిన జ్ఞానవైశిత్యంగల శక్తి (బాణం) కన్నున దూసి, మహాపరాక్రమం -

కన్ను కొనలు ఎఱ్ఱని కలువ రేకుల కాంతితో ప్రకాశించగా దేవతలకు కూడా భయంకరమగునట్లు శక్తి తళత్తళ కాంతులతో నారినుంచి బయటకు దూకింది.

(సంవిత్ = జ్ఞానం) కుప్పగా పోసినట్టి జ్ఞానస్వరూపుడు స్కందుడు. ఆ జ్ఞానమే ఆయన శక్త్యాయుధం. శక్తి బయటికి వచ్చినప్పుడు ఉన్న విధానం చెప్పటం జరిగింది. శక్త్యగ్రభాగం (శక్తి కొనభాగం) శివుని ఫాలనేత్రంలాగా ఉంది. అంటే అంత తీక్ష్ణమైన జ్వాలలాగా ఉంది అని భావం. శివుని మూడవ కన్ను తెరిస్తే భస్మమే. అందులోని అగ్ని అలాంటిది.

కింది పద్యంలో రాక్షసుడు శక్తిహతుడై భూమిమీద పడటం చెప్పబడింది.

**క్రౌంచ పదము :**

దంతురసంధ్యా హల్లక కాంతుల్ దళితము లగుచు
నదములుగ భూభృ
త్ప్రాంతప్రపాతక్షోణి నితంబాగ్రముల దబకలయి తరగలుగానై
కుంత విభిన్న స్వర్ద్విషు వక్షః కుధరకుతలమున కురిసి నసృక్స్రో
తోంతరముల్ దగ్ధాసుర రాజ్యాయత విశిఖవితతు లగుచు వెలుంగెన్.
(ప : ద్వి : 134)

సంధ్యాకాంతులు సెలయేళ్ళై కొండల శిఖరాలపై, నడుమ భాగాలపై, పార్శ్వభాగాలపై అలలు అలలుగా ప్రవహించినట్లు శక్తిచేత చీల్చబడిన తారకాసురుని వక్షస్థలంనుంచి నెత్తురుధారలు ఓడికలు కట్టాయి. ఆ దృశ్యం తగలబడిపోతున్న రాక్షసరాజ్యం యొక్క అగ్నిజ్వాలలలాగా ఉన్నది.

తారకుడి శరీరం కొండతో పోల్చబడింది. వాడి ఎదపై సరిగ్గా నట్టనడుమ శక్తి బాణం దూసుకుపోయింది. అందులోనుంచి రక్తం ప్రవాహాలుగా కారుతోంది. ఆ రక్తప్రవాహం కొండల నడుమ లోయలోని సంధ్యాకాంతులు పడిన సెలయేళ్ళ ప్రవాహంతో పోల్చబడింది. నదీప్రవాహంపై సంధ్యాకాంతులు పడితే ఆ నీరు ఎట్లాగా కనిపిస్తుంది. సంధ్యాకాంతులు - అంటే ఎట్టిటి కాంతులు - వ్యాపించిన నదీప్రవాహంతో తారకుడి రక్తప్రవాహం పోల్చబడింది. అంత భారీ శరీర మతనిది.

శక్తి తొలిచిన పెద్దక్రౌంచగిరి రంధ్ర
మట్లు కాన్పింప వక్షమ్ము నందు గండి
క్షితజవేశంత మందు రాక్షసశవమ్ము
బోరగిలి తోచె సాష్టాంగము పడినటు. (ష : ద్వి : 135)

శక్తిబాణంచేత తారకుడి వక్షస్థలంపై పడ్డ రంధ్రం పూర్వం స్వామి క్రౌంచపర్వతానికి చేసిన పెద్ద రంధ్రంలాగా కనిపిస్తున్నది. ఆ గాయంనుంచి కారుతున్న రక్తం చిన్న సరస్సులాగా అయింది. ఆ రాక్షసుని శవం రక్తపుమడుగులో స్వామికి సాష్టాంగనమస్కారం చేస్తున్నట్లుగా బోర్లపడింది.

శక్తిబాణం దూసుకుపోయి తారకుడి శరీరంలో చేసిన గండి క్రౌంచపర్వతంలో చేసిన పెద్ద రంధ్రంలాగానూ, దాన్నుంచి కారిన సరస్సులాగానూ ఉంది అనటంవల్ల, తారకుడి శరీరం ఎంత పెద్ద శరీరమో స్పష్ట మవుతుంది. 'సాష్టాంగము పడినట్లు బోరగిలి తోచె' అనటంవల్ల, తారకుడు చచ్చేముందు స్వామికి సాష్టాంగ నమస్కారం చేస్తూ కిందికి పడిపోయాడు. ఇక్కడ తారకాసురుడు శక్తిని అడ్డుకునే ప్రయత్న మేమీ చేసినట్లు వర్ణించబడలేదు. స్వామి శక్తిని దూయటం, వీడు చావటం ఒకేసారి జరిగినట్లు చెప్పడంలోని

తాత్పర్య మేమిటంటే, పరమేశ్వరుని దివ్యశక్తిముందు ఎవ్వడూ నిల్వలేడన్నది ధ్వనిస్తున్న తాత్పర్యాంశం.

ఆ సాష్టాంగపడ్డ శవాన్ని తన కృపాదృష్టితో భగవంతుడు స్నానం చేయిస్తున్నట్టుగా కింది పద్యం వర్ణిస్తున్నది.

కనకగిరీంద్ర కార్ముకశిఖావలనమ్ము సితాంబుజ ప్రభా
వినత వివర్తి చారుతరవృత్తము గడ్డపుగర్తదేశమం
దనిచి ప్రసన్న దృక్పుటల నుర్వి నసృక్ఝరి తేలు తారకే
శుని ఘన కాయముం దనుపుచున్ నిలువన్ గని వచ్చి దిక్పతుల్.

(ష : ద్వి : 136)

స్వామి తన ధనుస్సుయొక్క వంపుగా ఉన్న అగ్రంపై తెల్ల కలువపూల కాంతులు సుడి తిరిగినట్టుగా ఉన్న బొట్టగల గడ్డమును ఆనించి ప్రసన్న దృష్టులచేత తారకుని శవాన్ని తనుపుతూండగా దేవతలు వచ్చి స్వామిని స్తుతించారు.

## కుమారస్వామిని ఇంద్రాది దేవతలు స్తుతించడం

**కవిరాజ విరాజితము :**

జయ జయ రత్న సుసంగతకంకణ ! స్వర్ణకిరీట దృషత్ ప్రసరా !
జయ జయ కుండల సంఘటితారుణ సాంధ్య కటస్థల చారుతరా !
జయ జయ స్వర్ణవిశాలనగేష్వసశక్తి విఖండితశత్రువరా !
జయ జయ పేబుతశాసనకారణజన్మ ! జగద్ధితశాంతికరా !

(ష : ద్వి : 137)

"జయము జయము రత్నకంకణాలు ధరించినవాడా ! బంగారు కిరీటంనుంచి రత్నకిరణాలు ప్రసరిస్తున్నవాడా ! జయము జయము నీ కుండలాలనుంచి సంధ్యాకాంతులవంటి అందమైన ఎఱ్ఱటి కాంతి

కిరణాలు ప్రసరిస్తున్నవాడా! జయము జయము విశాలమైన మేరు పర్వత ధనుస్సు - శక్తి బాణంచేత శత్రువును ఖండించినవాడా! జయము జయము ధర్మసంస్థాపన కోసం పుట్టిన కారణజన్ముడా! జగత్ హితమును, శాంతిని కోరేవాడా!"

ఆ విధంగా స్తుతిస్తున్న దిక్పతులను దయ అనే వెలుగులతో చూసిన స్వామిని చూసి భక్తితో ఇంద్రుడు అత్యంత వినయంగా ఈ విధంగా స్తుతిస్తున్నాడు : (ష : ద్వి : 138)

గ్లామండలార్ధ ఫాలత్రిపుండ్రాంతర
 మ్మలయందు కుంకుమబొట్టు మెరయ
నవనవశ్వేతకైరవకోమలములైన
 మూపులన్ గుండలమ్ములు నటింప
స్నిగ్ధకుముద్వతీముగ్ధ మంజులమైన
 డాచేయి కేకిచూడము స్పృశింప
కోసకన్గవచూడ్కి కుండలముఖల్పై
 నళులాచు మంకన లంచు వ్రాల

దక్షిణకరమ్ము శక్తిమంతమ్ము గాగ
భక్తమానసవీథుల పరిఢవిల్లు
భావ్యమంజులరమణీయ బాలమూర్తి
ఆపదలయందు నాకు తోడౌనుగాక. (ష : ద్వి : 139)

"అర్ధచంద్రాకారంగా ఉన్న లలాట స్థలంలో మూడు విభూతి రేఖల మధ్య కుంకుమబొట్టు మెరుస్తూ ఉండగా; తెల్లకలువ మొగ్గల లాగా భుజాగ్రాలపై కుండలాలు నటింపగా; స్నిగ్ధమైన కోమలమైన కలువతీగలాగా ఉన్న ఎడమ చేయి నెమలియొక్క శిఖను (జుట్టును) స్పృశిస్తూ ఉండగా; కంటి చివర్ల చూపులు తుమ్మెద లవుతూ ఝుంకెనల్లనుకొని కుంతలాల ముఖులమీద రాలినట్లుగా ఉన్నాయి.

కుడిపోయి శక్తిసంతమైనది. భక్తుల హృదయాలలో ప్రకాశించే కోమలమైన రమణీయమైన బాలరూపంలో ఉన్న బాలసుబ్రహ్మణ్యం ఆపదలలో నాకు తోడ్పడుగాక !" అని స్తుతించాడు ఇంద్రుడు.

ఆ విధంగా గద్గదకంఠుడై స్తుతిస్తూ ఉన్న ఇంద్రుని కళ్ళనుంచి ఆర్ద్రతతో కూడిన బాష్పాలు పొంగి వస్తుండగా కుమారస్వామిని హత్తుకొని కౌగిలించుకున్నాడు. అఖిల దేవతలూ చూసి స్వామిని ఆర్ద్రతతో - నిండుభక్తితో భజించారు. (ష : ద్వి : 140)

## ప్రకృతి జగత్తును అలంకరించడం

(ఇతిహాస పు ముగింపు)

దీనితో కావ్యం ముగిసింది. ఈ ముగింపును కవి ఒక ఇతిహాస రీతిలో వర్ణించటం ఎంతో ప్రశంసనీయంగా ఉంది.

కోమరారు కెంజాయ కుంకుమంబు నలంది
పునుగును మృగమదమ్ము ను ఘటించి
తరళేందు ఖండంపు టురుముగ్గులను దీర్చి
సంధ్యయున్ మునిమాపు శశియు వరుస
నవధర్మ సంస్థాపన మ్మొనర్చినయట్టి
స్వామికై కాశ్యపీశైవలోక
పర్యంత పథము శోభనముగా తీర్ప కాం
చన కింకిణుల రథచలన మొప్ప

దితిజవాహినీపతి సాగ దిక్పతులును
అఖిలనాకవాహిని వెంటనంటి చనగ
విరులు ముత్యాల వరుసలై మెరయునట్టి
తారకలబాటలో జవోద్ధతి తలిర్ప. (ష : ద్వి : 141)

అంతట సంధ్యాకాలం అయింది. గబగబా స్వామి దర్శనార్థమై వచ్చినట్లు మునిమాపు వచ్చింది. దానువెంటనే చంద్రుడు కూడా

గబగబా వచ్చాడు.ఒకే వాక్యంలో ఈ మూటినీ చెప్పటంలోని శిల్పం ఒకదాని తర్వాత ఒకటి వ్యవధానం లేకుండా రావడాన్ని ధ్వనించడం. భగవద్దర్శనార్థం ప్రకృతి పడే తొక్కిసలాట. (అభిషేకపర్వంలో స్వామి అభిషేకం జరిగిన స్థలం చంద్రతీర్థం. అది కూడా వెన్నెలలోనే జరిగినట్లుగా అక్కడ చెప్పబడింది. కనుక చంద్రుడు విజయి అయిన స్వామి దర్శనార్థం గబగబా రావటంలో ఆశ్చర్యమేముంటుంది!) ఈ మూడూ రావటానికి సంబంధించిన వర్ణన యిది.

స్వామి ధర్మసంస్థాపనం చేసి తిరిగి స్వస్థానమైన స్వర్గానికి వెళ్ళిపోతున్నాడు. ఆ రథమార్గాన్ని సంధ్యాకాలం తన కుంకుమ కాంతితో అలికింది (కళ్లాపు చల్లింది). మునిమాపు వచ్చి పునుగు, కస్తూరి చల్లింది. చంద్రుడు వచ్చి ముత్యాలముగ్గులు పెట్టాడు. ఈ మార్గం-కాశ్యపి ప్రాంతం (యుద్ధం జరిగిన స్థలం - భూమి) నుంచి శైవలోక పర్యంతమూ ఈ విధంగా తీర్చబడింది. ఆ బాటలో బంగారు మువ్వల చప్పుళ్ళతో రథం నడుస్తున్నది. సకలదేవతాసైన్యంతో దిక్పతులు అతని వెన్నంటి నడుస్తున్నారు. పోయిపోయి ఆ రథం పువ్వులు, ముత్యాల హారాలు వ్రేలాడగట్టిన చాందినీలాగా ఉన్న తారకలబాటలో అదృశ్యమైపోయింది.

జగత్తును అలంకరించడమైనది. ఆకాశమనే అలంకరణలో నక్షత్రమండలంలో కలిసిపోయింది. అందమైన ఇతిహాసపు ముగింపు. అద్భుత పద్ధతి. దైవ - మానవ సంబంధాన్ని చెబుతుంది ఇతిహాసం. ఇతిహాసపు ముగింపు - మంగళమైన కావ్యం వాచ్యం కాకుండా వ్యంగ్యం కావాలి. ఈ ముగింపు మహానుభావుడైన శ్రీకృష్ణదేవ రాయల (ఆముక్తమాల్యద) కావ్యాంతంలాంటిది. ఆ పద్యం ఒక్కసారి గమనించండి :

లలనచే నిష్ఠతో లాజలు వేల్పించి,
శార్ఙ్గి మెట్టించెను సప్తపదులు,
తెరవ గూడి యరుంధతీదర్శనము జేసె,
బ్రహ్మరుద్రాది గీర్వాణికోటి
యర్పించు నడుగుర లనుకంప గైకొని
యనిచె బ్రసాద భాజనుల జేసి,
యాత్మపట్టణమున కరిగి దోడ్కొని విజ
యంబు సేసెను మహోహర్ష మొప్ప,

సహ్యకన్యాతటోద్యాన చందనద్రు
కుంజముల నీలకుంతల గుస్తరించి
కంతుసామ్రాజ్య మేలించి కరుణ చిత్త
మొలయ జగముల పాలించుచున్నవాడు (ఆముక్త : 7 - 71)

షష్ఠకమలం (ప్రథమదళం - 1) ప్రారంభంలో కుమారస్వామి రథం ఆకాశంనుంచి కిందికి దిగివచ్చింది. ఈ వర్ణన (ష : ద్వి : 141) పైకి పోవటం. అక్కడేమో (ష : ప్ర : 1) అవతరణం - అవరోహణం. ఇది (ష : ద్వి : 141) ఆరోహణం. ఇతిహాసం ఈ రెంటినీ కలిపి ముడివేసే అద్భుతప్రక్రియ. ఈ కావ్యం కూడా ఇతిహాసం. జగత్ చక్రభ్రమణాన్ని - అవరోహణ ఆరోహణాల గతిని అద్భుతంగా వర్ణించే ప్రక్రియ ఇతిహాసం.

పై పద్యం తరువాత ఉన్నది ఒకే పద్యం. ఈ చివర పద్యం మహాభ్రమణాన్నే చిత్రిస్తున్నది.

అచ్చరపిండులాస్య సమయశ్వసనోద్భుతముల్ దుకూలపుం
గుచ్చళులై తదీయపదకూజిత కాంచనకింకిణీధ్వని

ప్రోచ్చలితంబు లంచచయముల్, విదళించిన రెక్కగుంపులై
విచ్చె సుధాంశుకాంతులు పవిత్రము నూత్నము నచ్ఛధర్మమై.
(మ : ద్వి : 142)

స్వామి పై రీతిగా అదృశ్యుడైనంత ఆయన కరుణచేత స్థాపించిన ప్రశాంతమైన ధర్మంలా విశ్వమంతా వెన్నెలవాకలో మునిగిపోయింది. ఆ వెన్నెల వర్ణన ఈ పద్యం.

అప్సరసలు నాట్యం చేసే సమయంలో గాలికి రేగి ఎగిరి పడుతున్న వారి చీరల కుచ్చెళ్ళలాగా వెన్నెల కిరణాలు గుంపులు గుంపులుగా లోకంమీదికి దాడిచేశాయి. ఆ అప్సరసల పాదాల కున్న బంగారుటందెల గజ్జెల చప్పుళ్ళు నాట్యగతికి అనుకూలంగా మ్రోగు తున్నాయి. ఈ ధ్వనులను, వారి పాదగతిని అనుకరిస్తూ హంసలు రెక్కలు కొట్టుకొంటూ నగుస్తున్నాయి. ఆ రెక్కలనుంచి జారిపడిన ఈకలలాగా వెన్నెల ఉంది. ఈ విధంగా పవిత్రమైన అచ్ఛమైన ధర్మంలాగా వెన్నెల వచ్చింది.

కావ్యారంభం ఈ వెన్నెలతోనే జరిగింది.

శ్రీ శివాతనూజాత విరించిముఖ ప
యోరుహానిషణ్ణ సితమృదుజ్యోతి, హంస
పై నధివసించి వాహ్యాళి వచ్చినట్లు
రమ్యచంద్రిక నెక్కి శరత్తు వచ్చె. (ప్ర : క : 1)

అందమైనటువంటి చంద్రిక (వెన్నెల)నెక్కి శరత్కాలం విహారంగా లోకంలోకి వచ్చింది. ఎలా అంటే, సరస్వతీదేవి హంసమీద ఎక్కి లోకంలోకి వచ్చినట్టుగా వెన్నెల నెక్కి శరత్కాలం వచ్చింది.

క్రౌంచపు డొక్కలో శితశరమ్ము న స్వామి పోనర్చినట్టి రం
ధ్రాంచిత మార్గముంబడి ప్రయాణములన్ భువి కేగుదెంచె రా
యంచగముల్, శరత్సమయమయ్యెనటంచు వచింపగా, మరుత్
సంచలితాప్సరస్సిత ధృతాంశుకముల్ బలె ముగ్ధమూర్తులై.

(ప్ర : క : 2)

శరత్సమయ మయింది అని చెబుతున్నట్టుగా హంసలు వచ్చాయి. గాలిలో లేగిన అప్సరసల చీరల కుచ్చెళ్ళలాగా హంసలు గుంపులు గుంపులుగా వచ్చాయి.

విశ్వము 'సర్వం ఖల్విదం బ్రహ్మ'. సర్వమూ బ్రహ్మ స్వరూపమే. ఆనందంనుండి పుట్టి, ఆనందమందు పెరిగి, ఆనందంలోనే లీనమైపోతుంది - సమస్త విశ్వమూ అని ఉపనిషత్తులో మంత్రా లున్నాయి. ఈ వెన్నెల ఆ మంత్రానికి సంబంధించినది.

ప్రారంభందగ్గరే కావ్యం ముగింపు కూడా. ఈ ప్రారంభాంత సమన్వయం మహాయోగి జీవిత సదృశమైనది. సృష్టి కూడా ఒక అవ్యక్తమైన మహాగర్భంనుంచి వ్యక్తమై తిరిగి ఆ గర్భంలోకే వెళ్ళిపోతుంది. ఈ వెన్నెల ఆ మహాగర్భవర్ణన. సృష్టి - ప్రళయాలకు ఒక ముడి భారతీయ మహేతిహాసం. ఈ విశ్వ చక్రానికి పట్టా ధర్మం. ఆ ధర్మమే ఇక్కడ వెన్నెలగా రూపించబడింది. అందుచేత కావ్యం వెన్నెల్లో పుట్టి, వెన్నెల్లో పెరిగి, వెన్నెల్లో పెద్దదై (కుమార జననం, అభిషేక పర్వం-మొ), తిరిగి వెన్నెలలోనే లీనమవుతున్నది. ఆ వెన్నెల స్వామియొక్క తనూకాంతి (శరీర కాంతి) - అది మనలను, జగత్తును రక్షించుగాక! అన్నది కావ్యాంత తాత్పర్యం.

* * *

# ఉపయుక్త రచనలు


అల్లీసాహెబు (పైగంబరు & శివప్ప, బూద్యాళు) : 'పరతత్త్వ కావ్యము' (ఏడవ ముద్రణ) శ్రీ ఆదిసద్గురు నిలయం, బళ్ళారి (1977).

కవిత్రయము : 'ఆంధ్ర మహాభారతము' తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు (1987).

కాటమయ్య, జానగాని : 'జానపదులలో ఉప్పర ఆట'-జానపద ప్రాయోగిక విశ్లేషణ, అనంతపురం (1990).

కోటీశ్వరరావు, తుమ్మపూడి : 'ఈశావాస్యోపనిషత్తు' (భాష్యారవిందము) మలయకూట ప్రచురణలు, అనంతపురం.

,, : 'ఆముక్తమాల్యదా సౌందర్యము' మలయకూట ప్రచురణ, అనంతపురం (1971) (1984).

,, : 'కుమారభారతి (పీఠిక)', మలయకూట ప్రచురణ, అనంతపురం (1980).

,, : 'జానపద కవిత - ప్రతీకాత్మకత' సుందరం (సం.) భాష: జానపదం, తెలుగు సాంస్కృతిక సమితి వ్యాస సంకలనం, మైసూరు (1981).

| | |
|---|---|
| కోటీశ్వరరావు, తుమ్మపూడి | : 'సంవిధానక చక్రవర్తి', ద్వారకామాయి ప్రచురణలు, మలయకూటము, అనంతపురం (1988). |
| ,, | : 'శ్వేతపద్మము', మలయకూట ప్రచురణ, అనంతపురం (1990). |
| ,, | : 'ఎఱ్ఱన్న, నాచన సోమన్నల కవితా తారతమ్య పరిశీలన', తెలుగు అకాడమీ, హైదరాబాదు (1991). |
| ,, | : 'సాలభంజిక' (ముద్రణలో), ద్వారకామాయి ప్రచురణలు, మలయకూటము, అనంతపురం. |
| చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం | : 'శిల్పప్రభావతి', శిల్పి ప్రచురణలు, అనంతపురం (1980). |
| తిరుమలరావు, సర్దేశాయి | : 'సాహిత్య తత్త్వము - శివభారత దర్శనము', అనంతపురం. |
| దొరసామిశర్మ, రావూరి | : 'అప్పకవీయ భావప్రకాశిక' (ద్వి. ము), త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్టణము, మదరాసు(1970). |
| నన్నెచోడుడు | : 'కుమార సంభవము', తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు (1968) (1987). |
| నాగయ్య, జి. | : 'తెలుగు సాహిత్య సమీక్ష' (1&2 భాగాలు), నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి (1983) (1985). |

నారాయణరెడ్డి, సి. : 'ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయములు : ప్రయోగములు', ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు, మచిలీపట్టణము (1967) (1977).

పూజారక్ష శిక్షకరు, బి. ఎస్. : 'సర్వజ్ఞమూర్తియ వచనగళు' (కన్నడం), పి. సి. శాబాది మఠ బుక్ డిపో, గదగ్.

బ్రహ్మానంద, హెచ్. ఎస్. : 'కావ్యశిల్పం', స్రవంతి, డిసెంబరు (1973).

,, : 'తెలుగు సాహిత్య విమర్శ : పాశ్చాత్య ప్రభావం', అక్షర ప్రసార ప్రచురణ, అనంతపురం (1984).

,, : 'తెలుగు సాహితికి నన్నయ ఒరవడి', అక్షర ప్రసార ప్రచురణ, అనంతపురం (1986).

,, : 'శిష్టసాహిత్యంలో జానపద ధోరణులు', అక్షర ప్రసార ప్రచురణ, అనంతపురం (1991).

మస్తాన్ రెడ్డి, చేరెడ్డి : 'భారత పద్యశైలి', ఆశాలతా ప్రచురణలు, నరసరావుపేట (1989).

మాధవశర్మ, స్ఫటికబండ : 'ఆంధ్ర మహాభారతము-ఛందశ్శిల్పము', అభినవభారతి, హైదరాబాదు (1966).

మాధవశర్మ, పాటిబండ : 'తిక్కన కవితావైభవం', యువభారతి (1976).

ముద్దప్ప, ఇరిగేపల్లి : 'పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి కావ్యానుశీలనము', లలితా ప్రచురణలు, అనంతపురం (1987).

రఘునాథశర్మ, శలాక : 'భట్టారక భారత భారతి', ఆనంద వల్లీ గ్రంథమాల, అనంతపురం (1982).

రామకృష్ణమాచార్య, నండూరి : 'తిక్కన భారత దర్శనము' (ద్వి. ము), సికింద్రాబాదు (1979).

రామకృష్ణయ్య, కోరాడ : 'ఆంధ్రభారత కవితా విమర్శనము', మద్రాసు (1929).

రామరాజు, బిరుదరాజు : 'పారమార్థిక గేయములు'- తెలుగు జానపదగేయ సాహిత్యము, స్వీయ ప్రచురణ, హైదరాబాదు (1958) (1978).

రామలింగారెడ్డి, కట్టమంచి : 'కవిత్వ తత్త్వవిచారము', ఆంధ్ర విశ్వకళా పరిషత్తు (పంచమ ముద్రణ), వాల్తేరు (1973).

వేంకటరామ నరసింహం కాకర్ల : 'సాహిత్య దర్శనం'

శివప్ప, బూదాళ్ళు : 'పారమార్థ శరధీ షట్పది గ్రంథవు' (కన్నడం)
శ్రీ ఆది సద్గురు నిలయ, బళ్ళారి (1980).

శివప్ప, బూదాళ్ళు : 'పరతత్త్వ కావ్యవు', శ్రీ ఆదిసద్గురు నిలయ, బళ్ళారి (1980).

శ్రీకృష్ణదేవరాయలు : 'ఆముక్తమాల్యద', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు (1967) (1984).

శ్రీరామమూర్తి, కొర్లపాటి : 'ఈశ్వరార్చన కళాశీలుడు', రమణశ్రీ ప్రచురణ, గుంటూరు (1974).

సంపత్కుమారాచార్య, కోవెల : 'తెలుగు ఛందో వికాసము', (ద్వి. ము), తెలుగు అకాడమి, హైదరాబాదు (1990).

సత్యనారాయణ, విశ్వనాథ : 'రామాయణ కల్పవృక్షము' (1970).

సుందరం, ఆర్వీయస్ : 'భాష : జానపదం', తెలుగు సాంస్కృతిక సమితి వ్యాస సంకలనం, మైసూరు (1981).

సుప్రసన్నాచార్య, కోవెల : 'సహృదయ చక్రము', వ్యాససంకలనం, స్వీయ ప్రచురణ, వరంగల్లు (1986).

సుబ్రహ్మణ్యం, జి. వి. (సం.) : 'మార్కండేయ పురాణం (పీఠిక)', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ (1984).

హనుమంతప్ప, ఆదవాని : 'తత్త్వగేయాలు - బ్రహ్మసారం' స్రవంతి, జనవరి (1982).

ంమంతప్ప, ఆదవాని : 'మన ఆచారాలు - అంతరార్థాలు'
స ప్తగిరి, జూలై (1983).

,, : 'నీతిబోధక త త్త్వగేయాలు'
స్రవంతి, ఏప్రిల్ (1985).

,, : 'కుమార భారతి - కుమార జననం'
భారతి, ఏప్రిల్ (1985).

,, : 'కుమార భారతి - రాయబార నిర్వహణం'
తెలుగు, జూన్ (1989).

,, : 'జటాయుఃఖండము - విశ్వనాథవారి నూత్న పవిత్రభావ శిల్పం',
తెలుగు, మార్చి (1989).

,, : 'కుమారభారతి - అభిషేకగాథ'
భారతి, అక్టోబరు (1990).

,, : 'బుద్ధన్న కవితాబుద్ధి'
భారతి, జనవరి (1990).

## ని ఘ ం టు వు లు

తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు (సీ. పి. బ్రౌన్)

శ బ్ద ర త్నా క ర ము

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

## ఆ ం గ్ల ం

rawala, V. S. : 'Ancient indian Folk cults'
Prithivi Prakasam, Varanasi
(1970).

Agrawala, V. S. : 'Vision in Long Darkness' [The thousand Syllabled Speech] Banaras (1963).

Ananda Coomara Swamy : 'The Transformation of Nature in Art' Munsiram Manoharlal (1974).

Hanumanthappa, A. : 'Bhakti Movement: Tattvas in Telugu and Kannada' Folklore (in Print).

" : 'Mystic Elements in Telugu and Kannada Tattvas' (in Print).

Hears, H. : 'Indian Serpent Lore' Bharatiya Publishing House, 7, Malakganj, Delhi - 7.

Shyama Sastri : 'Artha Sastra'

(Sir) Woodrofee, John : 'The Serpent Power' Ganesh & Company, Venkatanarayana Road, Madras - 17.

" : 'Tantra Raja Tantra'

# KUMAARA BHAARATI DARSANAM


| | |
|---|---|
| పుట్టుక | : జూలై పదిహేను, 1953 |
| పుట్టింది | : నింబగల్లు |
| ఊరు | : గార్లదిన్నె |
| విద్యార్హతలు | : ఎం. ఏ., పిహెచ్. డి. |
| ప్రస్తుత వృత్తి | : రిసర్చి అసోసియేట్ (యు. జి. సి.), ఆంధ్రభారతి, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం |
| ముద్రితమైన ఇతర రచనలు | : కొన్ని పద్యఖండికలు, గేయఖండికలు, పరిశోధనావ్యాసాలు, జానపద, భాషా సాహిత్యాలలో ముప్పైకి పైగా. |
| ఇతర ముద్రిత గ్రంథాలు | : తెలుగుమీద కన్నడ భాషా ప్రభావం, గిరిజన కథల్లో గిరిజనాంశాలు. |
| ముద్రణలో | : బుద్ధన్న కవితాబుద్ధి. |


---


FOR COPIES

Kartikeya Publications

5-29, Engineering College

A N A N T A P U R - 515 002